సంపాదక వర్గము

ప్రధాన సంపాదకుడు :

శ్రీ కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేమూల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

---

# విషయసూచిక

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౪ } మన్మథ సంవత్సరము చైత్రి—వైశాఖ మాసములు } సంచిక ౧

# శుభాశంసనము

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి :: అరుణాశ్రమము

సీ॥ పులిసీటిమావిపిందెలమూట తొలిసారి
చల్లఁగా వచ్చి నట్టిల్లు చేరె,
సుధుంతా సుప్రతినిధు లైన చెఱకుల
ముదిగడల్ సన్నని ముక్కలయ్యె,
కెవ్వసియమ్మగా వేప పూగుత్తెల
ఘుమఘుమ లింట్లలో గుబురుకొనియె,
సనగుండ్లుంబులు నారికేడమ్ములు
సనఁటిపండ్లును సమాయత్త మయ్యె,

నవనాట్యయమును ప్రీణనమ్ము నగుచుఁ
తెలుఁగు సంపద లెల్ల మూర్తిభవింప
నను గె నమ్మాంబుప లై 'ఉగాదిపుష్పు'
నంతరాను మాంధ్ర ఘత్రున్రిడా యందికొనుము

సాహిత్యామృతపాన తృప్తమగు నీ స్వాంతంబులన్ భావ సం
దోహమ్ముల్ సరిక్రొత్తరూపముల నుద్భూతమ్ములై మంగళ
వ్యాహారమ్ముల మేళవించుచు జగద్భద్రమ్ములై యాంధ్ర స
త్సాహిత్యప్రథ మస్మదాబ్దమున విశ్వవ్యాప్తముం జేయుతన్ ॥ ౨

దినదినగండముల్ దొలఁగి తీయని యీ మన తెల్గుబాస ప్రా
క్తనముఁ బవిత్రమై క్రమయుతం బయి వ్యాకరణానుబద్ధమై
తనరుచు సర్వమానవ హితమ్ముగ నూత్నమహోదయస్థితిన్
గని రసికానుమోదమును గాంచుత, ధర్మము నిర్వహించుతన్ ॥ ౩



# మన్మథవర్షోత్సవము

రచయిత: విద్వాన్ పాలెపు వేంకటరత్నం.

౧

తే॥ మానసము నాఁ చనదది యసామాన్యభావ
భావన ప్రకృతి వీణాళికీ సరసహాస
నగా మధురకాంతి 'మన్మథ' హాయనాది
వగ ముహూర్తాన శుభదమై వఱలుగాత.

౨

మ॥ తెలుఁగుం దేశపు భాగ్యదీపికల తెం
ద్రీభూత సత్కాంతితో
వెలుఁగం జొచ్చిన నీ మహోదయమునన్
విశ్వప్రభాధిక్యమా
కళలన్ కావ్యసుధావిలాసముల శృం
గారోల్లసద్భావమున్
జల నాట్యామలగాన వాహినుల స
చ్ఛోభల్ వెలారించుచున్

3

సీ॥ కలికి కోయిల స్వతంత్రతులమైతి మని పాడు
తెలుఁగు లేమావిమోకల వసించి
గండుతుమ్మెద తేనె కమిచి త్రాగుచు నాంధ్ర
పౌరుష ఝంకృతిఁ బరిఢవించు
వలిగాడ్పుబుడుత మల్లెల సౌరభము మోచి
తెలుఁగుల మృదుభావములను జూపు
చెఱకు వేములకు నేర్పఱచు కూరిమిలోన
సుఖదుఃఖసమతావిశుద్ధి వెలయు

రామలీలోత్సవారంభ రమ్యబుద్ధి
యాంధ్రి పరతత్త్వచింతన సవధరించు
భవ్య మన్మథనామ సంవత్సరాది
నాంధ్రవిభుతా ప్రమేయ సంప్రాప్తి చెలఁగ.

౪

మ॥ సరసాలాప విభాసురం బయి; మనోజ్ఞానంద సంధాయియై
పరిషద్గౌరవభాజనం బయి; మహాప్రాబంధికాహ్లాదియై;
ధరణీనాథ పరివృద్ధమై; మధుసుధాధారానిభం బైన మా
వరసాహిత్య కళావిలాసతతి సంపన్నంబుగాఁ గ్రాలుతన్.

౫

సీ॥ తన సఖుండౌ వసంతుని గూడి శుకపిక
శారికాతతి యనుసరణఁ జెలఁగ
సురసాలవీథిని శుకవాహనం బెక్కి
యించువింటిని సంతరించి కేల
మలయానిలుఁడు హసాదులఁ దెల్పఁగాఁ జూత
సుమ మంజరీ బాణ మమరఁబట్టి
శింజానమధుకరపుంజటాంకృతి పాంథ
హృదయవేదన పెం పెసఁగఁ జేయ
తన పురాశక్తి తీంద్రింప ధరణిజముల
కధిక సంతోష మొసఁగుచు హాయిగఁ దన
పేరి వత్సరమున సుఖాధారుఁ డగుచు
'మన్మథుఁడు' తెల్గుప్రజకు సంపత్తి నిమ్మత॥

# మన్మథా!

భమిడి సత్యనారాయణ శర్మ

శ్రీ నవనాయకు స్తోలువఁ - జెన్నలరారెడి మన్మథం బిదే
మానవకోటిఁ గావ ననఁ - మానము మానఁగవచ్చె నాంధ్ర సం।
తానములార! సంపదల - తావలమై వలనొప్ప నిప్పుడే।
పూనిన భక్తి మ్రొక్కులిడి - పూజ లొనర్పుఁడు తెన్గుతల్లికిన్ 1

తరుణము దాఁటకుండ ఘన - ధర్మనిగూఢిని నాంధ్రరాష్ట్రమున్
మురిపిము దీఱ నీ దయను - మూఁడవయేఁడునఁ దప్పదప్పఁగాఁ
జరణము లూఁడఁ గాంచెదము - చాలును మాకది! చల్లచల్లఁగన్
జరిగె జయాబ్దమున్ జయము-సాత్త్విక శక్తుల కిచ్చి మన్మథా! 2

ఉన్మదవృత్తిఁ ద్రిమ్మరెడి - యూరును పేరును లేని మూర్ఖులన్
మన్మథ! నీ వడంచి బహు - మానపురస్సర దివ్యతేజముల్
సన్మతు లిమ్ము! ఆంధ్రభువి - సజ్జను లేమిటఁ బన్నమొందకే
మున్మును గాఁచి ప్రోవు మిదె - మ్రొక్కెద మమ్మరో దివ్యవర్షమా!

ఏడులు రెండు రాష్ట్రమున - కేఁగె నటంచును నాంధ్రు లందఱే
వాడను గన్న నేఁడు నిను - వాడని భక్తిని బూజసేయుచున్
వేడుచు నున్నవార లిఁక - వేగమ వారికిఁ బుష్కలంబుగాఁ
గూడును గుడ్డలిచ్చి కడుఁ - గూర్మి దలిర్పఁగఁ బెంపు మన్మథా! 4

జన్మలు శాశ్వతంబె? భువి - సార్థకనామము గాంచి వర్షముల్
కన్మొన మూసినంతటనె - కాలములోన విలీనమై కదా!
మున్మును పెక్కుజన్న వని - ముద్దుల మన్మథ! నీ వెఱుంగవే?
విన్మఁక సర్వదేండ్లపయి - వేడ్కను నిన్ను భజింపనెవ్వరో! 5

ఈ మహి నాక్రమింపఁ గను - నీర్ష్యలఁ బెంచుచుఁ గూర్చి కొండఁగా
నామ విశీర్ణ బుద్ధి పటు - సుస్వర దారుణ మారణాస్త్రముల్
భూమిని జాపఁ జుట్టి తన - పొట్టను బెట్టుక పోవుచుండు, మున్
హేమవిలోచనుం డకట! - యీల్గఁడె యజ్ఞవరాహమూర్తిచే 6

"ఆటము బాంబు"లంచు నటు-"హైడ్రొజె"నంచును గ్రూరమారకుల్
మాటకుమాటకున్ జనులు- మ్రాన్పడ, భీతిని గొల్పునట్టి యా:
ర్భాటముమాన్పి మన్మథ! సు - రాసురకోటులఁ బ్రోచు రీతిఁ బో
రాటము లెల్లఁ దీర్ప నిఁక-రమ్ము సుశాంతిపతాక దాల్చుచున్ 7

దుర్ముఖి "చీని" యంబరము-త్రుళ్ళఁగఁ మాన్ప సముద్రవీచిపై
నర్మవికార చేష్టలను - సల్దిశ ముంపఁగఁ దొంగిచూచు, నా
మర్మము గాంచి వేగ మది - మా కిఁక మీఁదట దాఁపరింపకే
ధర్మ సమంచితంబుగ న - ధర్మ మణంచుము నీవు మన్మథా! 8

పూవిలుకాని నామమును -బొల్పుగఁదాల్చిన దివ్యకీర్తి కిం
దావల మౌదుకాదె! కదుఁ - దత్పరతన్ భువి శాంతిదూతవై
యే విలయంబు లేక ప్రజ - లిద్ధర నొద్దిక ప్రేమబద్ధులై ।
జీవన మొందఁజేయు మిదె - జెహ్వారులాలుసుగొంచు మన్మథా! 9

సర్వేషాం సమస్త మంగళానిభవంతు

---

శ్రీరామాయ

# మన్మథనామ సంవత్సర ఫలములు

శ్రీ భమిడి సత్యనారాయణ శర్మగారు.

వర్షప్రవేశ లగ్నకుండలి.

| | | | |
|---|---|---|---|
| గు కే | ల | కు | ర చ |
| | రాశి | | బు (వ) |
| | | | శు |
| | శ (వ) | | రా |

జగల్లగ్న కుండలి.

| | | | |
|---|---|---|---|
| గు కే | కు | ర ల | బు శు |
| | రాశి | | శు (వ) |
| | | | |
| | శ (వ) | | చం రా |

| | | | |
|---|---|---|---|
| శ గు రా | | ల | |
| | నవాంశ | | బు |
| | | | |
| ర శు చం | | కు | కే |

| | | | |
|---|---|---|---|
| ల గు రా | శ కు | ర | శు |
| | నవాంశ | | |
| చం | | | |
| | | బు | కే |

తత్కాల గ్రహసంపత్తిః .—

ఉ: భాద్రా ౨ - అర్కః
ఉ: భాద్రా ౨ - చంద్రః
భరణి ౪ - కుజః
శతతారా 3 - బుధః (వక్రీ)
పునర్వసూ 3 - బృహస్పతిః
ధనిష్ఠా ౨ - శుక్రః
విశాఖా 3 - వక్రీ శనిః
మూలా 3 - రాహుః
ఆర్ద్రా ౧ - కేతుః

తత్కాల గ్రహసంపత్తిః ,—

అశ్వినీ ౧ - రవిః
పూ॰ షాఢా ౧ - చంద్రః
కృత్తికా ౪ - కుజః
ఉ, భాద్రా ౪ - బుధః
పూ, భాద్రా ౨ - శుక్రః
విశాఖా ౨ - వక్రీ శనిః
పునర్వసూ 3 - గురుః
మూలా 3 - రాహుః
ఆర్ద్రా ౧ - కేతుః

— మన్మథ సంవత్సర ఫలము —

# శ్రీ మదాంధ్ర దేశ వ్యవహారములు

భమిడి సత్యనారాయణశర్మ



ఈ సంవత్సరము నవనాయకులలో అష్టను శుభులు, ఒక్కఁడుగ్ర శుభుఁడు. ఇరువురు పాపగ్రహములగుటచే మొత్తముమీఁద శుభాధిపత్యములు హెచ్చుగ వచ్చుటచేతను శుక్రుఁడు రాజై మంత్రి గురుండగుటచేతను, వారిరువురు పూర్ణశుభులగుటచేతను దేశమునందు శాంతియు ధర్మవిజయము కలుగును. అయినను భార్గవుఁడు రాక్షసగురుఁడై బృహస్పతి దేవగురుఁ డగుటచే, పరిపాలకులయందుఁ దఱచుగ నభిప్రాయభేదము లంకురింపకమానవు, దానికిఁ దోడుగ నాంధ్రరాష్ట్రాధిపతియగు శనివర్షప్రవేశలగ్నరీత్యా భాగ్యరాజ్యాధిపతియై యుచ్చస్థానమునందుండి వక్రించుటచే "తుంగభే వక్రీ నీచబలః" అను కాళిదాస వచనమననుసరించి రాష్ట్రపాలనా విధానమునందుఁ గొంతయలజడియు నశాంతియుఁ దప్పవని సూచించుచున్నది. వర్షలగ్నాధిపతికూడ వర్షప్రవేశ సమయమునకు నీచాంశను బొందియుండుటచేఁ బ్రతిపక్షములు విజృంభించి రాష్ట్రమునందుఁ గల్లోలములు లేఁగలవు. అట్టి ప్రతికూల వాతావరణము తొలినుండి ప్రారంభమైనను, క్రమక్రమముగా శ్రావణాధిక భాద్రపదమాసములు వచ్చునప్పటికిఁ గాలసర్పయోగముకూడ పట్టుటచేతను గొంతయుద్రేకస్థితి నొంది, కార్తీకశుద్ధ పూర్ణిమ మొదలుకొని యుచ్చస్థాయిని జెలరేఁగి కార్తీకబహుళామావాస్యకు వృశ్చికమునందుఁ జాతుర్గ్రహకూటము, సూర్యగ్రహణము కలుగుటచే రాజకీయ, భౌతిక విప్లవములకుఁ బ్రబలతరములగు సూచనలు కాన్పించుచున్నవి. బృహస్పతి మంత్రియై యతిచారవక్రాది దోషములు కలిగియుండుటచే దేశమునందు శాంతిప్రతిష్ఠలు శ్రావణమాసము మొదలుకొని క్రమక్రమముగాఁ దగ్గి కార్తీక బహుళమునందు గాలివానలు సస్యనష్టము మున్నగునట్టి యనర్థములకుఁ దావొసంగఁ గలవు. కావున పాలకులును మంత్రివర్గమును బ్రశాంతచిత్తములతోఁ బరస్పరసహకార[illegible] వ్యవహారములతోఁ [illegible] నవచ్చునట్టి ప్రతిపక్ష[illegible]

లను జాగరూకతతోఁ దొలఁగింప సమకట్టవలెను. శ్రావణాధిక భాద్రపదమాసములలో మంత్రివర్గమునకు మిగుల నొత్తిడి కలుగు సూచనలు కాన్పించుచున్నవి. శ్రావణబహుళ ౧౪ మంగళవారము మొదలు నిజభాద్రపద బహుళ ౧ ఆదివారమువఱకు సింహాంగారకదోషము, శ్రావణ శు ౧ బుధవారము మొదలు అధికభాద్రపద శు ౧ గురువారమువఱకు గురుమౌఢ్యమియు శ్రావణ శు ౧౧ శనివార ప్రభృతి నిజభాద్రపద బహుళ ౩ మంగళవారపర్యంతము శుక్రమౌఢ్యము కలిగియుండుటచే దేశమునం దనావృష్టియు సస్యపీడయుఁ గలుగును. కార్తీక బహుళ ౪ ప్రాంతమున, అనఁగా ది 3-12-55 తేదీ మొదలు 14-12-55 తేదీలోఁగా నాంధ్ర దేశమునందును దూర్పు సముద్రతీరమునందును, చెన్నపట్నము మొదలు కన్యాకుమారి వఱకుఁ గల ప్రాంతమునందును తుపానుసూచనలు కాన్పించుచున్నవి. వర్షప్రవేశలగ్నమునకు ధనపంచమాధిపతి యగు బుధుఁడు వర్షప్రవేశకాలమునకు వక్రించియుండుటచే నప్పుడప్పుడు పాలకులయందును మంత్రివర్గమునందును, ప్రమాదకరము లగు భిన్నాభిప్రాయములు ప్రబలుచుండుటచేఁ గొంతద్రవ్యనష్టముగాని కీర్తిభంగముగాని వాటిలు సూచనలు కలవు. అయినను బుధుఁడు మిత్రగ్రహము లగు రవిశుక్రమధ్యగతుఁ డగుటచే హిందూదేశనాయకుఁడును ప్రధానమంత్రియు నగు దేశనాయకునిచే నయ్యవి సవరింపఁబడుటయు, వర్షప్రవేశలగ్నాధిపతి యగు శుక్రుఁడు బుధున కధిమిత్రుఁడు కూడ నగుటచే జవహర్లాలుగారి జాతకమునకు రాజ్యాధిపతికూడ శుక్రుఁ డగుటచేత నాయాలోపములు పైవారిచే సవరింపఁబడుచుండును. మొత్తముమీఁద మార్గశీర్ష శుద్ధపూర్ణిమకు దేశమునందు మరల శాంతి నెలకొని క్రమక్రమముగా సంవత్సరాంతమునకు దేశాభ్యుదయము చేకూరఁగలదు.

## భారతవర్ష వ్యవహారములు.

జగల్లగ్నాధిపతి శనియై ప్రధానమంత్రి నామరాశ్యధిపతికూడ శని యగుటయు రవి మేష ప్రవేశకాలమున కుచ్చయందు వక్రించుటచే దేశనాయకులు చేయు శాంతిప్రయత్నము లంతగ ఫలించు నని తోఁచుటలేదు. కాని జగల్లగ్న ప్రవేశకాలమునకు లగ్నమునందుఁ శుక్రుఁ

డును ద్వితీయయందు బుధుఁడును, విక్రమస్థానమునందు రవి యుచ్ఛయం దుండి పంచమమందు బృహస్పతి ధనలాభాధిపతియై లగ్నమును, లగ్నాధిపతి యగు శనినిగూడ చూచుచుండుటచే నీసంవత్సరము రష్యా అమెరికా దేశములకు హిందూ దేశాధినాయకునిద్వారా కొంత సన్నిహితసంబంధ మేర్పడు సూచనలు కాన్పించుటయేకాక హిందూ దేశమునకు రష్యా అమెరికాల పరిపూర్ణ సహాయము కలుగఁగలదు. హిందూదేశనాయకు లాచరించెడి ప్రయత్నములు మాత్రము స్వాభిమా త్తోడను, ప్రశాంతముతోడను కొనసాగింపవలసియున్నది. జగల్లగ్నాధిపతియు హిందూదేశాధిపతియు నగు శని వక్రించియుండి షష్ఠస్థానమున కధిపతి యగు బుధునికి నీచయు షష్ఠాష్టకస్థితియు నొకరొకరికి కలిగి శని రవి బుధులకుఁ బట్టుటచే నీసంవత్సరముకూడ కాశ్మీరు సమస్యలుగాని, తదితర సమస్యలుగాని పరిష్కార మయి యిరువురికి సుహృద్భావ మేర్పడు నట్లు తోఁచుట లేదు. మ్లేచ్ఛగ్రహ మగు రాహువు 14-12-55న తేదీని హిందూదేశాధిపతి యగు శనితోఁగూడి ప్రధానమంత్రి యగు జవహరలాలు నామరాశ్యధిపతికూడ శనియై యీ గ్రహములతో జగల్లగ్నప్రవేశకాలమునకు షష్ఠాష్టకము పట్టుటయు, బుధుఁడు 14-12-55 తేదీకి రవిశనులకు ద్వితీయమం దుండుటయు, శనికి రాహుసంబంధము కలిగి జగల్లగ్నప్రవేశరీత్యా బుధుఁ డష్టమాధిపతి యగుటచే, ప్రధానమంత్రిపై మఱియొక విఘాతచర్య డిశంబరు ఒకటి లగాయతు పదునాలుగు లోఁపుగ జరుగు సూచనలు కలవు. నవంబరు 29 మొదలు డిశంబరు 15 లోఁగా వాయువ్యదిశయందు భూకంపాది దోషములు కాశ్మీరు ప్రాంతమునందు యుద్ధభయము, ప్రజానష్టము సూచింపఁబడుచున్నవి. జగల్లగ్నాధిపతియుఁ దద్రాజ్యాధిపతియు షష్ఠాష్టకమును, జగల్లగ్నాధిపతితోఁ దత్పంచమాష్టమాధిపతియునగు బుధునకు షష్ఠాష్టకమును, జగల్లగ్నాధిపతి యగు రాహువునకు ను, తద్రాజ్యాధిపతి యగు కుజునకుఁగూడ షష్ఠాష్టకముపట్టి యీరీతిగ షష్ఠాష్టకత్రియము సంభవించుటయు, జగల్లాగ్నాధిపతియు హిందూదేశాధిపతియునైన శని భాగ్యమునం దుచ్చస్థుఁడై వక్రించుటంజేసియు, దేశమునందు నీచ శక్తులు కొన్ని చెలరేఁగి శ్రావణమాసము మొదలు కార్తీక

మాసాంతము వఱకును మిగుల నలజడి కలుగఁ జేయుటయే కాక డిశంబరు 3 తేదీ మొదలు 14వ తేదీలోఁగా భూకంపాద్యుపద్రవములు కాని రాజకీయ విప్లవముగాని యుద్ధభయములుగాని కలుగు వాతావరణము రేకెత్తును. కావున పాలకులు ప్రశాంతచిత్తులై కమంగడు మెలఁకువతో రాజ్యతంత్రమును కను గలిగి ప్రవర్తింపఁ జేయవలెను. రష్యా దేశాధిపతి యగు శుక్రుఁడు హిందూ దేశాధిపతియగు శనికి మిత్రుఁడై నందున రష్యాదేశమునకును హిందూదేశమునకును సుహృద్భావమేర్పడవచ్చును. కాని యీ శనిశుక్రులు పరస్పరకోణగతులై యుండుటచేఁ దాత్కాలిక శత్రుత్వము చెందుటవలన జాగరూకతతో హిందూ నాయకులు రష్యాతోఁ బ్రవర్తింపవలెను. ఇటు బృహస్పతితోడను, అటు శుక్రునితోడను, పరస్పరకోణములం దుండుటయు, ఉచ్చరవితో హిందూ దేశాధిపతి సమసప్తక స్థానమునం దుండుటయు, అటు నాంగ్ల దేశాధిపతి యగు కుజుని తోడను, ఇటు పాకీస్థాను కధిపతి యగు బుధుని తోడను షష్ఠాష్టకము కలిగియుండుటచేతను, మొత్తముమీఁద నైదు గ్రహములతో నొక్కశని సమన్వయము చేసికొనవలసియుండుటచేతను, ఉచ్చయందు వక్రించి యుండుటచేతను, అత్యంత జాగరూకతతో విదేశవ్యవహారములు నడిపింపవలసిన గురుతరబాధ్యత మనదేశనాయకులపైఁ గలదు. లేనిచో ననేకవిషపరిస్థితులకుఁ దావాసంగుటయే కాక హిందూదేశ మీవఱకు గడించిన ప్రతిష్ఠకు భంగము వాటిల్లకలదు. ఈ సంవత్సరము మన దేశమునకుఁ బరీక్షావత్సర మనవచ్చును.

## — వి దే శ వ్య వ హా ర ము లు —

ఈ సంవత్సరమంతయు నమెరికా కధిపతి యగు బృహస్పతిరాశి త్రయసంచారము కలిగి వక్రాతిచారాగిదోషయుక్తుఁ డగుటయు, నను కారణములచే నా దేశమునందలి పరిపాలనా విధానమునందు (శ్రావణ శు ౧౫-అనఁగా 3 వ ఆగష్టు మొదలు క్రమక్రమముగా నలజడి ప్రారంభమై డిశంబరు మాసాంతమువఱకు నుద్రేకస్థితికి వచ్చుసూచనలు కలుగుచున్నవి. అమెరికాలోని పాలకుల మానసికవ్యవస్థ నియతమైన పద్ధతులపై నుండక తఱచు నాందోళనము చెందుచుండును. ది 2-12-55 మొదలు 14-12-55 లోపున బ్రెజ్‌లు, మెక్సికో, సా

ఫ్రాన్సిస్కో ప్రాంతములందు భూకంపాది దోషములచే, ప్రజానష్టము కలుగు సూచనలు కాన్పించుచున్నవి. ఇంగ్లండు దేశమున కధిపతి యగు నంగారకుఁడు జగల్లగ్నాధిపతితో షష్ఠాష్టకమందుండుటచే నింగ్లండు నందుఁగూడ నశాంతిసూచనలు కాన్పించుచున్నవి. రాజ్యాంగ విధానము నందుఁ గాని విదేశవ్యవహారములందుఁగాని సరియగు సమాధానమునకు వచ్చు సూచనలు కనుపట్టుటలేదు. జర్మనీ దేశమునకుఁ గూడ నంగారకుఁ డధిపతియగుటచే నా దేశము మూలమునఁ గొంత యలజడి యశాంతి బ్రిటనుకుఁ గలుగు సూచనలు కనుపట్టుచున్నవి. రష్యా దేశమున కధిపతి యగు శుక్రునకు, చతుర్థ కేంద్రమునందుఁ గుజుఁ డుండుటచేఁ గొంత యిరువుర మధ్యను సుహృద్భావ మేర్పడు సూచనలు కలవు. హిందూ దేశాధిపతియు జగల్లగ్నాధిపతియు నగు శనితోఁ, కుజునకు షష్ఠాష్టకము పట్టుటచే నీ రెండు దేశముల మధ్యను భిన్నాభిప్రాయము లేర్పడుట కవకాశములు కలవు. కావున పరస్పర సుహృద్భావ మత్యవసరము. కార్తీక బహుళామావాస్యకు సూర్యగ్రహణంబును రాహువు వృశ్చికమునందు నీచయు, శనిరవులతో సంబంధము చంద్రసంబంధము కూడ కలుగుటచే మహమ్మదీయ దేశము లగు, పాకిస్థాను, ఆఫ్ఘనుస్థానము, ఇరాను, ఈజిప్టు మున్నగు దేశములందు మిగుల ప్రమాద పరిస్థితులు, యుద్ధ సూచనలు కాన్పించుచున్నవి. చీనా, కొరియా దేశములందుఁ గూడ ప్రబలమగు యుద్ధవాతావరణము కార్తీకబహుళపాడ్యమి మొదలు కార్తీకబహుళామావాస్య-అనఁగా డిశంబరు 1 మొదలు 15వఱకు వివిధ దేశములందు నశాంతి యుద్ధవాతావరణము లేర్పడుచుండుటయు, ప్రకృతికూడ నుద్రేకస్థితియందుండుటయు సంభవించుటచే నెల్లరుఁ బ్రశాంతచిత్తము కలిగి దైవారాధనము, పరస్పరస్నేహ సుహృద్భావములతో నుండినచో జగల్లగ్నము నందు శుభుఁడైన శుక్రుఁడుండుటయు, బృహస్పతి చూచుటయుఁ గలుగుటచే నన్ని విషమపరిస్థితులుఁ జక్కఁబడఁగలవు

సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు.

శ్రీ శ్రీ శ్రీ

# చింతామణి

## నామసంజ్ఞానిర్వచనము.

రాంభొట్ల లక్ష్మీనారాయణ, P. O. L.

ఆంధ్రభాషకుఁ గల వ్యాకరణములలో సత్యుత్తమస్థానము నలంకరించిన యాంధ్రశబ్ద చింతామణియందలి సంజ్ఞల సార్థకతను బరిశీలించుట యిందలి ముఖ్యవిషయము. ఆంధ్రశబ్దచింతామణికర్త సంస్కృత వ్యాకరణానుసారముగఁ గొన్ని ప్రత్యేకసంజ్ఞలను గల్పించి తత్ప్రయోజన మా వ్యాకరణమున ఫలించె నని తలంచినట్లు తద్వ్యాకరణానుభవమువలన విదితమగుచున్నది. అట్లు తలంచుటయు వైయాకరణుల సంప్రదాయ మనఁదగును.

### నామము.

చింతామణి వ్యాకరణమున నిదియొక సంజ్ఞ. చింతామణికర్త సంజ్ఞాప్రకరణమున, 'ప్రాతిపదికం హి నామ' అని సూత్రించి యున్నాఁడు. సంస్కృత వ్యాకరణమున సుప్ప్రత్యయ విరహితమగు శబ్దస్వరూపమునకుఁ బ్రాతిపదిక మను సంజ్ఞ విధింపఁ బడినది. "అర్థవదధాతు ర ప్రత్యయః ప్రాతిపదికం" అని పాణినీయ వ్యాకరణము. సుబంతములు శబ్దము లనియు సుబ్విరహితములు ప్రాతిపదికము లనియుఁ, బై నిర్వచనముచే స్పష్ట మగుచున్నది. మఱియుఁ గృత్తద్ధిత సమాసాంత పదములుగూడ ప్రాతిపదికములు గావచ్చుననియు నందుఁ గలదు. అట్లే చింతామణికర్తయు, సంస్కృతవ్యాకరణమున రూఢ మయిన 'ప్రాతిపదిక' సంజ్ఞను విడనాడి, దానికి బదులుగ 'నామ' అను పదముఁ గల్పించెను. అనఁగాఁ జింతామణి సూత్రములం దుపయోగింపఁబడు 'నామ' పదము ప్రాతి పదికార్థమున నుండు నని గ్రహింపఁ దగును.

ఈ రచనా విధానము సరసముగనే యున్నది. స్వతంత్రించి వ్యాకరణమును వ్రాయువారు సంజ్ఞలనుగూడ స్వతంత్రించి సృజించు

కొనుటయే యుత్తమపద్ధతి. కాని యీ సంజ్ఞల సార్థకతను గమనించుట ప్రకృత విమర్శనీయాంశము.

ఆంధ్రశబ్ద చింతామణియందేపు సూత్రములలో 'నామ'పదము ప్రయోగింపఁ బడెను. చింతామణికి వ్యాఖ్యానములు, వివరణములు, ననుగాములు నగు గ్రంథరాజములందా 'నామ' పదము విభిన్నరీతుల నుద్ఘాటింపఁబడినది. గమనింపుఁడు.

1. త్రైపవిభక్తిక సంజ్ఞావర్ణా ష్టింటాన్యావయో భవంతీహ, టల్వాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసేచ. ఇది చింతామణి సూత్రము. ఇందు, 'నామ్నాం-ప్రాతిపదికములకు' అని యర్థము వివరణమునఁ గలదు. ఇది యుచితమే. టల్వాదిప్రాతిపదికములకు విభక్త్యాదులు పరమయిన టింటాన్యాదులు వచ్చును. ఉ॥ నీరు+లో=నీటిలో ఇల్లు+కి=ఇంటికి, ఇచ్చట, నిరు, ఇల్లు' అనుపదములను ప్రాతిపదికములుగనే గ్రహింపవలెను. వికృతిపదములలో సామాన్యముగఁ బ్రాతిపదికరూపము ప్రథమైకవచనరూపమును బోలియుండును.

నీరు—ప్రాతిపదికము, నీరు—ప్రథమైక వచనము.

ఇల్లు—ప్రాతిపదికము, ఇల్లు—ప్రథమైక వచనము.

సుబ్లోపమునఁ బ్రథమాంతములు ప్రాతిపదికములను బోలియుండుట యిందలి సాంప్రదాయము.

2. 'స్వంతాన్నామ్నః కుజోన్నైర్బహువచనే' అను సూత్రము రెండవది. బహువచనము పరముం దుండఁగ విధింపఁబడు 'కుజ్' ప్రత్యయము ప్రాతిపదికమునకు సంబంధించునుగాన నిచ్చటి నామపదమునకుఁ బ్రాతిపదిక మని యర్థము సముచితమే. ఉ॥ కొలను+లు కొలఁకులు.

3. 'ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' ఇది మూఁడవసూత్రము. ఈ సూత్రమునందునను నామపదము ప్రాతిపదికముగ గ్రహింపఁబడినది. ఉ॥ మిన్ను+న=మింట.

4 'నామ్నః కవర్ణకస్స్యాత్స్వార్థేస్యాదుత్వమపి పరే తస్మిన్'.

ఉ=పొలఁతి+క = పొలఁతుక. ఈసూత్రమున నామపదము ప్రాతిపదికార్థమునఁ గలదా యను ప్రశ్న జనింపవచ్చును. కవర్ణకవిధానము ప్రాతిపదికమునకా ? లేక శబ్దమునకా ? యను సందేహము కలుగును. పొలఁతి యను పదము సంపూర్ణశబ్దరూపము. దానిపై స్వార్థమున కవర్ణకమును, తదాకారమునకు నుత్వమును విధింపఁబడుచున్నవి. దానంజేసి 'పొలఁతుక' యను రూపము నిష్పన్న మయినది. కాన నిచటఁ బ్రాతిపదికత్వము నశించె నని యనుమానము జనించును. కాని యట్లు సందేహింపఁబడ లేదు.

'అనుక్త మన్యతో గ్రాహ్యం' అను న్యాయమునుబట్టి, యిచటి నామపదము ప్రాతిపదికార్థమున విధింపఁబడెను. కావున సంస్కృతవ్యాకరణమునఁ బ్రాతిపదికకే యే లక్షణములు నిర్వచింపఁబడెనో యవన్నియు నిందు సమగ్రముగ ననువర్తింపఁబడు నను నాశయము చింతామణికర్తకుఁ గలదు. కావున 'పొలఁతి'పదము ప్రాతిపదిక మేగాని శబ్దము గాదు. 'కృత్తద్ధిత సమాసాంతములు ప్రాతిపదికము లగు 'నను సంస్కృతవ్యాకరణపద్ధతి యిచట ననుసరింపఁబడెను. ఇచటి వర్ణకము స్వార్థమున విధింపఁబడిన తద్ధితప్రత్యయము. కానఁ బ్రాతిపదికత్వార్థ మనిర్బాధము.

5. "అపిసంయుక్త సమాప్తో భూయోంతే లుః
ప్రదృశ్యతే నామ్నాం" చింతా - సూ. 78. (అజంత)

ఈ సూత్రోదాహరణములందు రెండు బహువచన ప్రత్యయము లున్నవి. ఒకటి సంయుక్తలుకారము (ళ్లు) మఱియొకటి యసంయుక్త లుకారము (లు) ఇందు సంయుక్తలుకారము (ళ్లు) తొలుత నామమును (ప్రాతిపదికమును)నాశ్రయించినది. నీరు+ళ్లు=నీళ్లు అనురూప మయినది. పిమ్మట యసంయుక్తము చేరిన 'నీళ్లులు' అనురూపము నిష్పన్న మయినది. ఇయ్యది చింతామణివ్యాఖ్యాతల సమన్వయపద్ధతి.

ఇచ్చట 'నీరు' అను ప్రాతిపదికము 'లు' అను బహువచన ప్రత్యయముతోఁగూడి 'నీళ్లు' అను శబ్దస్వరూపమును దాల్చి, తన ప్రాతిపదికత్వమును విడనాడుకొన్నది. అట్టి సమయమున మరల 'లు' అను ప్రత్యయము ప్రాప్తింపఁ బూర్వపదమునకు నామత్వసిద్ధి యెట్లు! నామము గానిచో నీ సుబుత్పత్తి యెట్లు సమకూరును ? సూత్రమందలి నామపదమునకు సార్థక్య మెట్లు? "నామ్నా మంతే భూయః లుః ప్రసజ్యతే" అను వ్యాఖ్యాన మెట్లు సంగత మగును! సూత్రమందలి "సంయుక్త సమాప్తోపి" అను లుకారవిశేషణమే నామపదమునకుఁ గల ప్రాతిపదికత్వార్థమును ద్రోసిరాజనుచున్నదిగదా! కాన నీ సూత్రమందలి నామ పదమునకు సుబంత మను నర్థము చెప్పక తప్పినది కాదు.

కాన నీసమన్వయపద్ధతి చింతామణిసూత్రాశయమునకు విరుద్ధము. అందుచేఁ బూర్వాపరసూత్రప్రణాళికను గమనించిన యీ సూత్రమున నామపదము నిరర్థక మని తోఁచుచున్నది. ఈ సూత్రము తరువాత విధింపఁబడిన 'కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్స్యాత్'' అనుసూత్రముతోఁ గలిపి 'నామ్నాం కేషాంచి దుదన్తానాం...' అని సూత్రమును సవరించిన చింతామణిసూత్రాశయము సార్థక మగును. ఉదంతము లగు గొన్ని ప్రాతిపదికములకు 'న' అను విభక్తి ప్రత్యయము పరమయిన 'ఉన్' అనుదానికి లోపము వచ్చును' అను నర్థము స్ఫుట మగును. విభక్తిపరత్వము ప్రాతిపదికములకే సహజముగాన నీసూత్రమున నామపదముఁ జేర్చుటయు నుచితమే.

'విభక్తి పరమగుచుండ' అను నర్థమును బట్టి పూర్వమందలిది ప్రాతిపదికమే యగును గాన మరల నామపదము సూత్రములో నేల యను శంక జనింపవచ్చును. స్పష్టప్రతీతి కట్లుచెప్పె ననుట మొదటి సమాధానము. నామ పదమునకు సార్థకతను నిలుపుట రెండవ ప్రయోజనము. పూర్వ సూత్రమున విభక్త్యంత రూపములను గూర్చిన ప్రసంగ ముండుటచే నట్టివానిని నిషేధించుట మూఁడవ ప్రయోజనము.

మఱియు 'అపి సంయుక్త' సూత్రమున నామపదము లేకున్నను తత్సూత్ర సాధ్యము లగు నుదాహరణముల కెట్టి యడ్డంకియుఁ గానరాదు. మొనళ్ళులు, నీళ్లులు, వింఢ్లులు, పండ్లులు, అను నుదాహరణములు బహువచన ప్రత్యయముమీఁద బహువచన ప్రత్యయము గల రూప ములు. మొదటి బహువచనము పూర్వ సూత్రముచే నిష్పన్న మయి యుండఁ దిరుగ నీ సూత్రముచే నీ విశేష రూపము విధింపఁ బడినది. ఇది విశేష రూప మనుటకు 'సూత్రమందలి 'ప్రదృశ్యతే' యను పదమే సాధకము. ఇందు నామ పదమునకుఁ బ్రయోజనముగాని, తదభావ మున లోపముగాని లేదు. కావున ని నామపదము నుత్తరసూత్రముతో సమన్వయించిన సరసమును సప్రయోజనము నగును.

చింతామణియభిప్రాయమును గ్రహించినవాఁ డగు చిన్నయ సూరి తన వ్యాకరణమున నొకానొకచో "నామంబు బహువచనాంత తుల్యంబు బహువచనంబు నెనయు" అని సూత్రించి నామపదసార్థ క్యమును నిలఁబెట్టెను. కాని చింతామణి సూత్రమందలి నామ పదమును మాత్రము పూర్వవ్యాఖ్యాతలను బట్టి యీసూత్రమందే యుంచు కొనెను.

6. "కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోపఇష్యతే
హ్యేషు, ప్రథమైక వచనమాత్రే వికృతౌ నాంతాదయోపి
కథ్యంతే"

చింతామణి — హలంత — సూ 23.

ఈ సూత్రమునఁ గవిభల్లటుఁ డను నొక యాంధ్రవైయాకరణుని మతము నిరూపింపఁబడుచున్నది, ఉకారలోప మిందుఁ బ్రధానకార్యము. ఆ లోపము ప్రాతిపదికమాత్రమునకా ? లేక సుబంతమునకా ? యను నది ప్రశ్న. ఉదాహరణములనుబట్టి చూడ నీ లోపము సంపూర్ణశబ్దము లకే విధింపఁబడినట్లు తెలియుచున్నది. ప్రాతిపదికములందు లోపము

విధించఁబడినట్లు కానరాదు. మఱియు, "ప్రథమైకవచన మాత్రే" యను సూత్రస్థపద మీ లోపము ప్రాతిపదికములకుఁ గాదని స్పష్టము చేయుచున్నది కాన నీసూత్రమందలి "నామ్నాం" అను పదమునకు 'సుబంతములకు" అని యర్థము చెప్పకతప్పదు,

అహోబలపతి తన వ్యాఖ్యానమున, 'కన్దెఱచి, యని యుదాహరించెను. కన్నును + తెఱచి ద్వితీయకుఁ బ్రథమాదేశము: కన్ను + తెఱచి ద్విత్వలోపము, "కను + తెఱచి, పైసూత్రముచే నుత్వలోపము కన్దెఱచి. ఇట్లు ప్రథమైక వచనమున కుత్వలోపము నిర్ణయింపఁబడినది. ఈ ప్రణాళికను బట్టి చూచిన "నామపదమునకు" చింతామణికర్త నిశ్చయించిన ప్రాణపదికత్వార్థము సన్నగిల్లిన దనక తప్పదు.

అహోబలపతి యీసూత్రవ్యాఖ్యానమున నామ పదమున కర్థమును వివరింపకపోయినను, 'వాత్మ్యాస్మదోర్ద్రుతస్య' అను సూత్ర వ్యాఖ్యానమునఁ గవిభల్లట సూత్రము ప్రాతిపదిక విషయ మని మాత్రము వ్రాసెను. వాని యుదాహరణములు మాత్రము సుబంతములకే కాననగుచున్నవి. ఇయ్యది పరస్పరవిరుద్ధము

శ్రీ॥ శ్రీ వఝ్జల చిన సీతారామస్వామి శాస్త్రిగారు తమ సంహితా సర్వస్వమున "నామ్నాం=సుబంత పదములయొక్కయు" నని స్పష్టముగ నిచ్చటి నామ పదమునకు సుబంత మని యర్థమును వివరించిరి. మరియు నహోబలపతి నామ పదమునకుఁ ప్రాతిపదిక యని యర్థమును జెప్పె నని యధిక్షేపించిరి.

మఱియు, "ప్రథమైక వచన మాత్రే = ప్రథమైక వచన సామాన్యమందు, ప్రథమైక వచన సదృశములు మున్నగు ప్రథమైక వివిధ వచనములం దని యర్థము. క్రియాపదముల తుదిని నిల్చు పురుషబోధక ప్రత్యయములు ప్రథమాంత సర్వనామముల తుదివర్ణములే యగుటం జేసియవి సాక్షాత్తుగఁ బ్రథమా విభక్తులు కాకున్నను, ప్రథమా

సదృశము లనఁదగునుగాన వాని సంగ్రహమునకై మాత్రశబ్దము ప్రయుక్తమయ్యె నని గ్రహింపవలయును" అని వ్రాసి, మాత్రపదమునకు స్వారస్యమును వివరించుచు, నామములనఁగా సుబంతములే యను నర్థమును పోష మొనర్చిరి,

ఇంకను "కవిభల్లట" మతమున ప్రథమా మాత్రిక వచనమందే యుల్లోప మగు ననియు 'సు' అనుదానికే యుల్లోప మను నిర్ణయము లేకుండుటచే 'రాముల్, వనముల్, బాలుర్, ఎల్లర్, చూడర్జనులు; వత్తుర్జనులు, మున్నగు రూపములు సాధ్యములగు" ననియును వివరించిరి. మాత్రపదమును చిత్రవిచిత్రముగ నొకచో నానార్థము నను, నొకచో సాదృశ్యార్థమునను, మఱియొకచో నవధారణార్థము నను నన్వయించి స్వసిద్ధాంతమును ప్రకటించిరి.

ఈ మతభేదములను బరికించిన నామపద ముభయరూపమున వ్యాఖ్యానింపఁబడియు నుదాహరణములపట్ల సుబంత మను నర్థమును స్ఫురింపఁజేయుచున్నది. ఇట్లు విభిన్నాశయములకు మూలాధార మగు నీ సూత్రమును బరిశీలించుట యవసరము. ఈ సూత్రమునకుఁ బూర్వాపరసూత్రము లన్నియు సర్వనామశబ్దసాధనపరములు. తన్మధ్యమున నీ యుల్లోపశాస్త్రప్రసంగము సూత్రప్రణాళికకు విరుద్ధముగ నున్నది.

హలంతప్రకరణమున 'దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్' అనుసూత్రము మొదలుగఁ దొమ్మిదిసూత్రములు సర్వనామ శబ్దరూపసాధకములు గలవు. పిమ్మటఁ గవిభల్లట సూత్ర మున్నది. తరువాతి మూఁడు సూత్రములును సర్వనామశబ్దసాధనమాత్రపరములు. కవిభల్లటసూత్రము సర్వనామేతరశబ్దసాధనప్రయోజనము. ఇట్టి సూత్రమున కీచోట ప్రయోజనము మృగ్యము.

పాణినిసూత్రములందువలె నిందు పూర్వాపరసూత్రముల నుల్లంఘించు పద్ధతి కానరాదు. ఆన్యావృత్తము లన్నియుఁ బ్రత్యేకనిష

యములను సమగ్రముగ సూచించుచున్నవి. కాన నీ సూత్రము ప్రత్యాఖ్యానయోగ్య మనఁదగును. ఈసూత్రమందలి విషయము చింతామణిమతము కా దని యీసూత్రమందలి కవిభల్లట పదము సూచించుచున్నది. ఇయ్యది లేసంతమాత్రమున రూపసాధనప్రక్రియలో నెట్టి కొఱతయుఁ జూపట్టదు. సూత్రమునకు విషయము లగు నుదాహరణము లన్నియుఁ బ్రకారాంతరసాధ్యము లగును.

'చూడర్జనులు, వత్తుర్ఘనులు, సహింతూరో, కన్దైఅచి, చన్గుడిచి, విల్వ్రాని, కిల్ద్రావి, పేర్వాడి, గోర్మోసి, కన్దోయి, చన్దోయి, అను రూపములు కవిభల్లట సూత్రమున కుదాహరణములు. ఇందు, చూడరు, వత్తురు, సహింతురు, అను మూఁడు పదములు క్రియాత్మకములు. వీనియందలి యుత్వలోప మథర్వణ మతమునఁ గలుగ వచ్చును. చింతామణి చెప్పని విషయమును వివరించుట యథర్వణుని యాశయము గదా! "కుత్రచి ద్రేఫగస్యస్యాదుతో లోపః ప్రయోగతః" అని యథర్వణాచార్యుని కారిక. ఈ కారికచేఁ బై రూపములే గాక. పేర్వాడి, గోర్మోసి, మున్నగు రేఫాంత రూపము లన్నియు సాధ్యము లగును. మిగిలిన పదము లన్నియు "క్వచిద్భవే త్సమాసేపి ప్రాణి మాత్రస్య సంశ్రితిః" అను కారిక యందలి 'అపి' శబ్దస్వారస్యమున సాధింపఁ బడును. కాన రూపసాధనమునఁ బ్రయాస ముండదు.

అజంత ప్రకరణమున నుత్వలోపమును విధించు సూత్రముల సన్నిధినుంచుటయు నంత సమంజసముగఁ దోఁపదు. ఈ సూత్రార్థమే దురూహ్యముగ నున్నది. కవిభల్లట సూత్రార్థము:-

కవిభల్లటైః=కవిభల్లటుఁ డను వ్యాకర్తచే, క్రియాణాం=క్రియాపదములకు, నామ్నాంచ=శబ్దములకు, ఉల్లోపః=ఉకారలోపము, ఇష్యతే=ఇష్టమగుచున్నది (అంగీకరింపఁ బడుచున్నది) ఇదియొక వాక్యమునకు వ్యాఖ్యానము. చింతామణి సంజ్ఞాప్రణాళికానుసారముగ

'క్రియా, నామ' శబ్దములకు 'ధాతు, ప్రాతిపదిక' ము లను నర్థమును జెప్పవలెను. ధాతు ప్రాతిపదికములలో నుల్లోప విధానమునఁ గలుగు ప్రయోజనము కానరాదు. యథాతథముగఁ గ్రియా శబ్దములను నర్థమును గ్రహింత మన్న కొన్ని సందేహములు గలుగుచున్నవి. వాని యందీ యుల్లోప మెచ్చటఁ గలుగును ? ఆది మధ్యాంతములలోనే యుత్వమునకుఁ గలుగును. అంత్యమం దని చెప్పుట కాధారము లేదు. పూర్వాపర సూత్రములనుండి యనువృత్త్యపకర్షల ద్వారా గ్రహింత మన్న లోప పదమే పూర్వాపర సూత్రములందును గానరాదు. ఇట్లున్న దీ మొదటివాక్యము.

ఏషు=ఈ లోపస్థలములందు, వికృతౌ=వికృతిభాషయందు, ప్రథమైకవచనమాత్రే=ప్రథమైకవచనమందే, నాంతాదయోపి కథ్యంతే=నాంతాదులుగూడఁ జెప్పఁబడుచున్నవి, ఇది రెండవ వాక్యవ్యాఖ్యానము.

'ఏషు' అను పద మిదంశబ్దసప్తమీ బహువచనాంతరూపము. ఇదంశబ్దము పురోనిర్దిష్టవస్తువు నెఱింగించును. యచ్ఛబ్దపరామృష్ట మగును. ఇచ్చట నేదియుఁ గానరాదు. వీనియం దనఁ గా వేనియం దని శంక జనించుచున్నది. క్రియలు నామము లని సమాధానమును జెప్పవలెను. అప్పుడు క్రియానామములం దని యర్థము స్ఫురించును. లోపమునకు స్థానభూతము లగుటంజేసి వానిని స్మరింపక తప్పదు. ఇంక, 'వికృతియందుఁ బ్రథమైకవచనమందే' అనుపదములకు సమన్వయ మెట్లు ? పోలిందు. వచన వ్యత్యాసము నంగీకరించి. 'వికృతి పదము లయి, ప్రథమైకవచనము లయిన లోపస్థలము లగు క్రియానామములందు' అని యర్థమును నిర్ణయింతము. 'నాంతాదయోపి=నాంతాదులుగూడ' ఈ పదము దేనితో సమన్వయించును. కథ్యంతే=చెప్పఁబడుచున్నవి. ఏ మని? ఏవి? వీనికి సమాధానము తెలియదు. విధేయ మేదియో కానరాదు. నాంతాదులు

కూడ నని ప్రత్యేకించుటకు ముందే యంతశబ్దము లైన విధింపఁబడిన వా? అదియును లేదు. ఆదిపద మన్నియంతములను బోధించుచుండ 'నపి' పద మేల? దానిప్రయోజన మేమి? ఇంతకుఁ బై రెండువాక్యముల నన్వితము లై 'దశమాసాః షడపూపాః' అన్నట్లున్నవి. కాన నియ్యది ప్రత్యాఖ్యాన యోగ్య మనుటలో ననౌచితి కానరాదు.

లేదా, విభక్తి వచన వ్యత్యాసములను జూడక భావార్థ మొకటి కల్పించిన నీ సూత్రమున కీ క్రిందిరీతి నర్థమును జెప్పవచ్చును. కవిభల్లటుని మతప్రకారము క్రియాపదములందును, శబ్దములందును, ఉకార లోపము కలుగును. ఆ లోపము వికృతిపదములకే వచ్చును. ప్రథమైక వచనమందే కలుగు, ర్వాంతల్వాంత శబ్దములకే కలుగును. కొన్ని యెడల నాంత శబ్దములకుఁగూడ రావచ్చును. ఆదిశబ్దము సమయానుసారముగ వినియోగించు కొనుట కుపయోగించును. ఇట్లు భావమును గల్పించిన కవియాశయము నెఱవేఱినట్లు తోఁచును. ఉదాహరణములలో 'ము-లు-ను.' అంతము లగు శబ్దములే యుల్లోపమునఁ గనఁబడుచున్నవి. మఱి యే యంతశబ్దము కనఁబడిన నాదిశబ్ద ముండనే యున్నదిగదా.

ఈ తీరున సమన్వయము కాని రచన చింతామణి కర్త దనుట కంటె దీనిని విడుచుట సమంజస మని తోఁచెడిని. పైనుదహరించిన యథర్వణుని కారికలను గమనించి, యీ యార్యావృత్తము నెవ్వరో రచించి యుం దుంచి యుందురు. లేదా ముందుగ నిట్లున్న యథర్వణుఁడు దానిని మార్చి యుండును. అంతియు కాని యిది చింతామణి కర్తృవిరచితము కా దని తోఁచును.

వ్యాకరణసాంప్రదాయమును జక్కఁగ నెఱింగిన చిన్నయసూరి తన బాలవ్యాకరణమున నీ సూత్రమునకు సరి యగుదానిని సూత్రించుట లేదు. తా నుదాహరణముల నాధారముగఁ గొని నూతనమార్గము నవలం

బించెను. బాలవ్యాకరణము నత్వలోప విధాయకసూత్రము లాఱు కలవు. అందు మొదటిది 'బహువచనము పరమగునపుడు డ-ల-ట-ర లయుత్వమునకు లోపము". రెండవది 'ఋ వర్ణకంబు పరంబగునప్పుడు నున్న మీఁది త-గ-డ లయుత్వమునకు లోపము. ఈరెండును నీ కవిభల్లట సూత్రవిషయములు కావు. మూఁడవది పదమధ్యంబుల 'న-ల-డ-ర' లయుత్వలోపము. అదియుఁ బ్రకృతసూత్రమునకు విషయము కాదు. అబ్బ రాని సూత్రము, చుక్వరకరువర్ణసూత్రమును ప్రత్యేకవిషయ బోధకములే.

పదాంతంబులయి యసంయుక్తంబయినను-లు, రు ల యుత్వం బునకు లోపంబు బహుళంబుగా నగును." అను సూత్రి మీఁకవి భల్లట సూత్రవిషయమునకు సరిపడుగునట్లున్నది. కాని యీ సూత్రి మందలి స్పష్టత దానియందేమియుఁ గానరాదుగదా.

ఇఁక నీసూత్రమునకు శ్రీ చినసీతారామస్వామిశాస్త్రిగారి వివర ణమును వారిసర్వస్వమునుబట్టి పరికింతము. "ప్రథమైకవచనమాత్రే= ప్రథమైకవచనసామాన్యమందు, ప్రథమైకవచన సదృశములు మున్న గు వివిధ ప్రథమైకవచనములందలి యర్థము. క్రియాపదముల తుదిని నిల్చు పురుషబోధక ప్రత్యయములు ప్రథమాంత సర్వనామముల తుదివర్ణములే యగుటంజేసి యవి సాక్షాత్తుగఁ బ్రథమా విభక్తులు కాకున్నను బ్రథమాసదృశము లనఁదగునుగాన వాని సంగ్రహమునకై మాత్రశబ్దము ప్రయుక్తమయ్యె నని గ్రహింపవలయును" అని వివరించి మాత్రశబ్దప్రయోజనమునుగూడ నుద్ఘాటించిరి. మాత్రపదమున కప్ర సిద్ధమగు సాదృశ్యార్థమును గల్పించి యిట్లు రూపసాధన ప్రయత్న మును గావించుట యతని యఘటితఘటనాసామర్థ్యమును వెల్లడిం చునేగాని యుక్తియుక్తము శాస్త్రీయము కానేరదు.

మఱియు నీసూత్రము ముఖ్యోద్దేశము "నేను తాను శబ్దముల ప్రథమైకవచనములం దుల్లోపముఁ గావించుటయే" యని వివరించి యహోబలు నధిక్షేపించిరి. యుష్మదస్మచ్ఛబ్ద ముల్లోపము గావించు తలంపు గల కవి యిట్టి విధిని సూత్రమును రచించునా? కాని ప్రాధాన్యమును దెల్పి మిగిలినవాని యప్రధానతను వెలువరించునుగదా! కాన నేదో యొక రూపమును సాధింపుతలంపున నిట్టి వక్రమార్గము నవలంబించుటయు నంత యుక్తిసహముకాదు.

7. "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నాం"

"నామ్నాం తత్పురుష సమాసే యా షష్ఠీ సా ద్వితీయా తుల్యాస్యాత్, రాముని గుణములు, రాముగుణములు, రాములగుణములు, కవినేర్పు, విష్ణురాణి, ... ఇత్యాదులు. అని యహోబలుని వ్యాఖ్యానము. ప్రాతిపదికలకుఁ జెప్పు తత్పురుషసమాసమందలి యేషష్ఠికలదో యది ద్వితీయాతుల్య యగు నని కాని, సుబంతములకుఁ జెప్పు తత్పురుషసమాసమందలి యేషష్ఠికలదో యది ద్వితీయాతుల్య యగు నని కాని యర్థమును జెప్పవలెను. తత్పురుషసమాసము ప్రాతిపదికములకగునా? లేక సుబంతములకగునా యనునది ప్రశ్న. ప్రాతిపదికములకగు నని చెప్పుట యశాస్త్రీయము. సుబంతములకగు నని చెప్పుట పునరుక్తము, ప్రయోజనశూన్యము. కాన నీసూత్రమందలి నామపదము వ్యర్థము, నిరర్థకము.

సర్వస్వాకారులుమాత్రము, తత్పురుషసంస్థితా=తత్పురుషసమాసమందున్న, నామ్నాం=ప్రాతిపదికలపై వచ్చు, షష్ఠీ=షష్ఠీవిభక్తి, అని సమన్వయించి యిచ్చటి నామపదమునకుఁ బ్రాతిపదిక యని యర్థమును వ్రాసిరి.

విభక్తిప్రత్యయములు ప్రాతిపదికలపై వచ్చుట వ్యాకరణ

సాధారణ మైయుండ నిట నా యభిప్రాయమును బునరుక్తము గావింప నామపదమును వ్యాకరణకర్త ప్రయోగించుట నిరుపయోగము కాదా! ఇట్టి వాక్యసమన్వయముగూడఁ బ్రయాసపాధ్య మగును గదా!

ఇంతకు నిట నామపదము సర్వస్వాకారుల మతమునఁ బ్రాతిపదికము. అహోబలుని మతమున నస్పష్టము.

కాన నీ సూత్రమందలి నామపదము నుత్తరసూత్ర మగు "ఇదుపోత్త మోత్త మానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి" అను సూత్రముతోఁ గలిపి సమన్వయించుట యుత్తమము. బహువచన ప్రత్యయము పరమం దుండ నికారమున కుకారదేశము విధింపఁబడుచున్నది. కాన నీ సూత్రమునకు విషయము లగు పదములు ప్రాతిపదికములే యగును. గాని సుబంతములు కానేరవు. సుబంతము లయిన నాఁడు సూత్రమున 'బహువచనే' అను పదప్రయోగ మనవసరము గదా! కావున నామపద ముత్తరసూత్రముతోఁ గలుపుట సముచితము.

ఇట్లు చింతామణి సంజ్ఞ లందలి నామ పదమునకుఁ బ్రాతిపదిక యను నర్థమే రూఢముగాని సుబంత మను నర్థము రూఢముకాదు. అట్లు వ్రాయఁ బడియున్న వానియం దా యా పట్ల సరిదిద్దుట యుత్తమము. ఇఁక మిగిలిన వ్యాకరణములం దీ పద స్వరూపమును దిలకింపుఁడు. కారికావళియం దీ పద మెనిమిదిచోట్లఁ గలదు. కాని యర్థము సుబంత మనియే తెలియుచున్నది. కావున నాతనిదృష్టి సామాన్యార్థమున నామపద ముపయోగింపఁబడియున్నట్లున్నది.

బాల సరస్వతీయమున మాత్రము కొన్నిచోట్లఁ బ్రాతిపదిక మనియు, మరికొన్ని స్థలముల సుబంత మనియు వ్రాయఁ బడినది. బాలవ్యాకరణమున మాత్రము నామపదమనినఁ బ్రాతిపదికమనియర్థము రూఢముగ నున్నది. సుమారుగ పదునొకండు సూత్రములలో నామ

పదముగలదు. ఒక్కచోటఁ దప్ప మిగిలిన స్థలము లన్నింటియందును నామపదము ప్రాతిపదికార్థముననే వాడఁ బడినది. బాలవ్యాకరణ కర్త చింతామణి యాశయమును సరిగ గ్రహించిన వాఁ డగుటం జేసి మూలానుకూలముగనే తనసూత్ర ప్రణాళికను సాగించెను. "నామయుష్మ దస్మ దర్థంబులందుం బ్రథమ మధ్యమోత్తమంబు లగు" క్రియా —సూ 11.) అని యొక సూత్రమును వ్రాసెను.

ఈ సూత్రమునందు నామపదమునకుఁ బ్రాతిపదిక యని యర్థము చెప్పుటయు సమీచీనము. సుబంతము లని యర్థము చెప్పుట కూప సాధనప్రక్రియా విరుద్ధము. యుష్మదస్మచ్ఛబ్దములు సుబంతములు కావా? ప్రాతిపదికము లయిన యుష్మదస్మచ్ఛబ్దము లని విశేషణార్థ మును గల్పింత మన్నఁ బ్రథమ మధ్యమోత్తమములలోఁ బ్రథమపురుష మే యర్థమున వచ్చు ననెడి శంక మిగులును. 'నామ మనఁగాఁ బేరు' అని యర్థమును గల్పించి సకలవస్తు వాచిశబ్దములకుఁ బ్రథమపురుష మగు ననిన, యుష్మదస్మచ్ఛబ్దవాచ్యము లగు వ్యక్తులుగూడ సకల పదార్థాంతర్భూతము లే యగునుగదా! కావున నీసూత్రములో నామపదము ప్రాతిపదికార్థమును విడుచుటయేగాక ప్రకృత కార్యవిరుద్ధము నగు చున్నది. అనన్యసామాన్య మగు సూత్రపద్ధతిలో వ్యాకరణమును రచించిన పండితుఁడు, ప్రాచీనవ్యాకర్తల మతముల నామూలచూడముగ నాకళించిన మనీషి చిన్నయసూరి యిట్లు వ్యర్థము విరుద్ధము నగు "నామ" పదమును సూత్రమునఁ బ్రయోగించునా యని సర్వులకు సందేహము గలుగక తప్పదు. నిపుణముగ నిరీక్షించిన నీసూత్రమున నామపదము ప్రమాదపతితముగాని కవిస్వబుద్ధికృతము కా దని తోఁచెడిని. ఇచ్చటి నామపదమునకు బదులుగ 'అన్య' పదము చిన్నయ సూరిచే వ్రాయఁబడియుండును. "అన్యయుష్మదస్మదర్థంబులందుం బ్రథ

మమధ్యమోత్తమంబు లగు'' అని సూత్ర ముండును. ఇట్లుండుటయే రూపసాధనమున కనుగుణము. అన్యార్థమునఁ బ్రథమపురుషమును, యుష్మదర్థమున మధ్యమపురుషమును, నస్మదర్థమున నుత్తమ పురుషమును వచ్చు నని యర్థము స్ఫుటమగును. ఇట్లన్య పదప్రయోగము చిన్నయసూరి రచనాపద్ధతి కనుకూల మనుట కాతని యీక్రింది సూత్రమును దిలకింపుఁడు. "అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు''. ఈ సూత్రమందలి యన్యపద మెట్లు సార్థకమో ప్రకృతి సూత్రమందలి యన్యపదముగూడ నట్లే సార్థక మగును. అంతేగాక "నామం బనఁగాఁ బ్రాతిపదికము'' అనెడి స్వసిద్ధాంతము సార్థక మగును. చింతామణి యాశయము నిర్దుష్టముగ నెఱవేఱును.

ఇచ్చట బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానమును వ్రాసినవారి యభిప్రాయములను బరికింతము. సర్వస్వకారులు, గుప్తార్థప్రకాశికాకారులు, పేటికాకర్తలు మున్నగువా రందఱును యుష్మదస్మద్భిన్నము లగు మిగిలిన పదము లన్నియు నని సర్వశబ్దసాధారణముగ నామశబ్దమున కర్థమును వివరించిరి. ప్రకృతలక్ష్యసాధనమున కా యర్థ మనుకూల మగునేకాని నామపదసార్థకతమాత్రము లభించినట్లు తోఁచదు.

ఇట మఱియొక వాదము కలదు. నామ మనఁగాఁ బ్రాతిపదిక మనియే యర్థముగదా! ప్రాతిపదికము ప్రథమార్థసాధారణ మగును గదా! 'ప్రాతిపదికార్థమాత్రే ప్రథమా' అని పాణినీయము. కానఁ బ్రథమార్థము వచ్చిన దని చెప్పుదురు. పై వాద మంతయు సమంజసమే. కాని ప్రథమార్థ మనఁగాఁ బ్రథమావిభక్తి యని గదా యర్థము. ప్రథమావిభక్త్యర్థమునఁ బ్రథమపురుషము వచ్చును అని వాక్యము. ప్రథమపురుషము ప్రథమావిభక్తిలోనే వచ్చునా? మఱియొకవిభక్తి యున్నచో

రాదా! "రామునిచే వాలి చంపఁబడెను" ఈ వాక్యమునఁ బ్రథమపురుషము రాలేదా? నీవు, నేను, అనునవి ప్రథమావిభక్తులు కావా? వానియందు మధ్యమాదులు రాలేదా? కానఁబై వాద మవ్యాప్త్యతివ్యాప్తి దోషదూషిత మగుచున్నది. ఇంతకు నిచటఁ బ్రథమాదివిభక్తులను నిర్ణయించుట కవి యాశయము కాదుకదా. కాన "నామ" పదమునకు బదులుగ 'అన్య' పదము సముచిత మని తోఁచెడిని.

ఇంక ఆంధ్రభాషానుశాసనకర్తలు నామ మనఁగాఁ బ్రాతిపదిక మనియే నిర్వచించిరి. ఆంధ్రభాషా వికాసమును వ్రాసిన శ్రీ సోమయాజిగారు "నామశబ్దము చింతామణియందుఁ గేవల ప్రాతిపదికము" అని స్పష్టముగాఁ బ్రతిపాదించియున్నారు.

ఇట్లు వ్యాకర్తలు, విమర్శకులు చింతామణియందలి 'నామ' పదమునకుఁ బ్రాతిపదిక సుబంతార్థములను సమయానుకూలముగ వెలువరించిరి. కాని చింతామణియాశయము మాత్రము ప్రాతిపదికార్థమున నే రూఢము. కాన 'నామ' పదమునకుఁ బ్రాతిపదిక మనియే యర్థమును రూఢ మొనర్చుట సముచితము, సరసము, సప్రయోజనము.



# శ్రీ మద్రామాయణము-మానవత్వప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణ శర్మ.

## దశరథుడు

గతవ్యాసమునందు మానవు నానందము గొలుపునవి మూఁడు విషయములు గలవని శ్రీ వాల్మీకి మహర్షి పేర్కొనుటను గూర్చి రచించియుంటిని. అందు మొదటిది కామము. ఇయ్యది రెండు విధములుగఁ బరిగణింపఁ బడుచున్నది. సృష్టి కంతకును బ్రధాన మగు కారణము కామమే. కామముచేతనే మానవుఁడేకాక సర్వవిధ జంతుజాలములును సంచరించుచున్నవి! అయ్యది ప్రాణికోటి కంతకును ముఖ్యమగు సంచలనము నొసంగునట్టియు, నానందము గూర్చునట్టియుఁ బటిష్ఠ మగు నొక శక్తి యనుటకు సందియము లేదు. అంతియకాక నచేతనపదార్థములుగూడ నొక యణువుతో మఱియొకటి హత్తునట్లుగఁ జేయునట్టి యాకర్షణశక్తి (Cohesive force) యనినంగూడ దప్పుకాదు. లోహాదులను మారణ మొనరించు వైద్యులు పాప మొనరింతురని వారికిఁ బ్రాయశ్చిత్తములు విధింపఁ బడినవి. దేవవైద్యు లగు నశ్వినులు దుర్బ్రాహ్మణులుగఁ బరిగణింపఁ బడి వారికి యజ్ఞములందు హవిర్భాగము లర్పించుటకుఁగాను యజమాని ప్రాయశ్చిత్తము గల్పించుటకునై యాశ్వినపశువు నుపాలంభము సోమయాజి యొనరింపవలె నని "తస్మా దశ్వినౌ దుర్బ్రాహ్మణౌ" "ఆశ్వినం ధూమ్రములలామ మాలభేత యో దుర్బ్రాహ్మణ స్సోమం పిపాసే దితి" యని వేదము విధించుచున్నది. కావున నీ తీరున నీ విశ్వ మంతయుఁ గామశక్తివలన సృజింపఁ బడి సంచరించుచున్నది. అందువలన నయ్యది యథర్వవేదమునందుఁ బ్రధానశక్తిగఁ గూడ గుర్తింపఁ బడి యా యథర్వ శిఖనుండి యుపబృంహణము గావింపఁ బడిన యశ్వమేధమూలమునను ననంతరము పుత్రకామేష్టివలనను దశరథుఁడు సంతానము బడయఁ గలిగెను. అట్టి

పవిత్రతర ప్రభావసంపన్న మగు కామదేవుని బిడ్డయే "కామధుక్"నం బహు నోక విలక్షణ మగు ధేనువై వశిష్ఠజమదగ్న్యాదులకు సమస్త వస్తుసముదాయమును బ్రదుకుచుండె నని మనకు రామాయణము బోధించుచున్నది. అట్టి విశిష్టజ్ఞానశక్తిని దనయంశలేశ మగు మానవునకుఁ గూడ నీశ్వరుఁడు ప్రసాదించెను. కాని మనుజుఁడు దన యల్పజ్ఞానమువలనను, నజ్ఞానమువలనను దాని పవిత్రతఁ జెడఁగొట్టి యా మహత్తర శక్తిని దన భోగములకొఱకు వినియోగించుచున్నాఁడు! "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" యని భగవంతుఁ డుద్ఘోషింపుచుండ నధర్మములకై పరవినాశమునకై, యాత్మేంద్రియ సంతర్పణమునకై, కేవల తుచ్ఛాభినివేశములకై కూడఁ బలువిధముల మానవుఁడే ధర్మము నుల్లంఘించి యా యపూర్వ దైవశక్తిని దుర్వినియోగ మొనరించుచున్నాఁడు! జంతువులు గాని పక్షులు గాని, వృక్షలతాగుల్మాదులు గాని యచేతనములుగాని యా దివ్యఫలమును యుక్తముగ ననుభవించి ఋతు, కాల, దేశ, పాత్రముల ననుసరించి ప్రవర్తింపుచుండ జ్ఞానవిశిష్టుఁ డగు మనుష్యుఁడు మాత్రము తన యిచ్ఛవచ్చిన తెఱంగున నా కామశక్తిని దప్పుకొనఁ జూచుట యే మానవ సంఘమునందు సంఘర్షణమునకును, నీతిబాహ్యతకును, పతనమునకును హేతువుగఁ గన్పట్టుచున్నది. శ్రీ మద్రామాయణమునందు వాల్మీకి ప్రకృతినంత విపులముగ వర్ణించుటకుఁ బ్రధానకారణము మానవునకు నీతి గఱపుటకే యని నా యభిప్రాయము. అట్టి యుత్తమ సృష్టివైభవము నొసంగెడి దివ్య ప్రభావమును దుదకు మానవుని యవివేకమువలనఁ గేవల విలయ మొనరించెడి మారణయంత్రముగఁ దయారుసేసికొనుటవలన దశరథ, వాలి, రావణాదు లే తీరున దుర్గతి పాలైరో వాల్మీకి వర్ణించుటయే కాక నకామము దూషిత మగునేని యందువలనఁ గ్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబు లుద్భవించి కామముతోఁ గలసి యరిషడ్వర్గమై మనుజు నే తీరున నవి బాధించునో శ్రీమద్రామాయణ మాఱుకాండములందు నా షడ్వర్గమువలనఁ లోకమునకుఁ గలుగు హానిని నిగ్రహ,

యుక్తమై ధర్మబద్ధ మగు కామము వలనఁ గలుగు లాభమును వాల్మీకి రసవత్తరకవితా వైభవముచే నిరూపించెను. దూషిత కామము వలననే క్రోధాదు లుత్పన్న మగుచుండు నని శ్రీకృష్ణ భగవానుఁడు గీతలయందు "కామాత్సంజాయతే క్రోధః" ఇత్యాదిగా నిర్వచించెను. మానవ తత్త్వ మేతీరున పరిణమించు చుండునో మానవుఁ డెటుల వర్తింపవలెనో సువిపులముగ మనకు రామాయణము బోధించుటను గ్రహించిన మన పూర్వులు మనకు దైనందిన జీవితమునం దుపయోగించునట్టి గ్రంథ రాజముగ నద్దానిని బరిష్కరించి నిత్యమును బారాయణ మొనరింపఁ దొడంగిరి.

ఇఁక రామాయణమునందు వాల్మీకిమహర్షి మానవుఁ డన నెట్టివానిగ నిర్వచించెనో కొంచెము విచారింతము. "Man is a thinking animal" అని పాశ్చాత్త్య తత్త్వశాస్త్రవేత్తలు పరిగణించిరి. అంతమాత్రమున నయ్యది సమగ్ర మగు నిర్వచనము కాఁ జాలదు. శ్రీమద్రామాయణమును బాగుగ నవగత మొనరించుకొనిన భర్తృహరి మానవుని నాలుగు విధములుగ విభజించి యందు మనుజులలో దేవతలను, మనుజులలో మనుజులను, మనుజులలో రాక్షసులను మాత్రమే వర్ణించి యింక నందొక నాల్గవజాతికూడ గలదనియు "యే తు ఘ్నంతినిరర్థకం పరహితం తే కేన జానీమహే"యని యట్టి యపూర్వ కార్యధురంధరు లగు చతుర్థజాతిని వర్ణించుటకుం దగిన శబ్దజాలము తనకుఁ జాల దని చెప్పి యట్టివారి నభివ్యక్తీకరించుట కీ కలియుగ కవితాధురంధరులకు వదలిపెట్టెను! కావున శ్రీ మద్రామాయణము నందలి మానవజాతి మూఁడువిధములు మాత్రమే యని తేఁలగలదు. అందు మానవులలో సామాన్యుఁ డగు వానినే వాల్మీకిమహాకవి తన కావ్య నాయకునిగ సవరించుకొని యున్నాఁడు! అటు లనుటచే సామాన్య మగు మనుజుఁ డనినఁ దన కేది లాభమో, యేది నష్టమో, పెరవాని కేది లాభమో యేది నష్టమోకూడ బాగుగ గుర్తింపఁ గలవాఁడె మానవుఁ డని రూఢిపడుచున్నది. ఏలయనఁ దదితర మృగ పక్షి వృక్షా దులుగూడ నాలోచన కలిగి యుండకపోలేదు. తుదకు వాల్మీకి జాలు

అప్పలుగూడ నాలోచింపఁ గలవని నిర్ణయించియున్నాఁడు "విష్టభ్యా హమిదం కృత్స్నవ్యాప్య తిష్ఠామి భారత" యని భగవానుఁ డుద్ఘోషించుటచేఁ బ్రతివస్తువునం దీశ్వర చైతన్యము కలదు. ఎచ్చట నీశ్వర చైతన్యము కలదో యచ్చట నెల్లమానసేంద్రియము గూడ నుండినది. అటులఁ గానిచో నొకపదార్థమును మనము సేవించిన మన మనస్సున కుల్లాసంబును వేఱొక పదార్థమును దింటిమేని వికారాది దోషములును గలుగు టేల సంభవించును? కావున మనస్సులేని పదార్థ మీ సృష్టియందు లేదు ప్రకృతియం దంతటను షడింద్రియములు గలవని "మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి" యని గీత చెప్పుటచేని యింద్రియపంచక మన్నిటియందును మానసేంద్రియముతోఁ గూడఁ గలసియున్నదని చెప్పుటకే సీత భూమినుండి యుత్పన్నమయ్యెననియు ద్రౌపది యగ్నినుండి పుట్టెననియు మనకు వాల్మీకి వ్యాసాదులు సూచించిరి. కాని యీ, యా, యచేతన పదార్థములుగాని, స్థావరజంగములుగాని వానివాని యింద్రియస్ఫూర్తిని మానవునివలెఁ దమ కరచరణాద్యవయవములచే నిరూపింపఁ జాలవు. అట్టి యద్భుతశక్తి దైవము మానవునకే ప్రసాదించెను. దానికిఁ గారణ మాతఁడు కోట్లకొలఁది జన్మలయం దాచరించిన తపఃఫలమని మన యార్షమత సాంప్రదాయజ్ఞులు చెప్పుదురు. కాకున్న నొక బొగ్గు కణమునకును నొక వజ్రమునకును వస్తుసామగ్రియం దేమియు భేదము గాన్పింపదు. కాని వజ్రమునందలి తేజము, కాఠిన్యము, గౌరవము మున్నగు వానికిఁ గారణమైన విశిష్టశక్తి యెచటనుండి వచ్చెను? అయ్యది భూగర్భమునందో మహాసముద్రమునందలి యగాధగర్తమునందో పడియుండి చిరకాలము తప్తమగుటచే నట్టి ప్రభావము నావజ్రము సంపాదింపఁ గలిగెను. భానుకర తప్తమగు క్షుద్రనీరము మింటి కెగసి దివ్యవారిగ మారుట మనము గుర్తించుచున్నాము. కావున చిరాభితప్తమగు మానవుని జీవుఁడు కరచరణాద్యవయవములు కలిగి జ్ఞానవిశిష్టుఁడై యలరారుచుండుటకు హేతువు సత్కర్మాచరణమే యని మనకు రామాయణ మనుకుణము బోధించుచుండుట నా యీ ఘట్టములందు సుస్పష్టముగ

యథాశక్తిగఁ జేయుదును. శ్రీరామచంద్రుఁడు మనవలెనే లాభాలాభ ములను, జయాపజయములను గామక్రోధాదులను బ్రదర్శించి తుదకు దన యప్రతిహత ధర్మవిశిష్టతచే నుత్తీర్ణుఁ డగుటయే యీ కావ్యము నందలిపరమార్థము. అక్కారణంబుననే నేఁటికిని రామాయణకావ్యము ప్రతి మానవుఁడును గన్నులకద్దుకొని పఠించుచున్నాఁడు. రామునకుఁ గష్టము వచ్చిన దని మనము చదువునప్పుడు మన నేత్రములనుండి బాష్పకణంబులు జలజల రాలుచున్నవి. శ్రీరామచంద్రుఁ డొకమానవ వ్యక్తిగఁ గాక కేవల విష్ణువుగనే యీ కవి యొక నాటకమువలె నాడించియుండినచో నాటకాంతమం దా యీ వేషధారులతో మనకెట్టి సంబంధము లేక వానిని మన నిత్యజీవనమునం దాదర్శములుగ గ్రహింపము. ఇఁక నా యుద్గ్రంథమునం దొక సామాన్య మానవుఁడు గూడ సత్సాంగత్య వైభవముచేఁ దన ధర్మప్రతిష్ఠను గాపాడుకొనుచు నెన్ని క్లిష్ట సంఘటనలు వచ్చినను వానిని దన ధర్మాయుధముచే నెదుర్కొ నుచు నెటుల గమ్యస్థానము నందఁగలిగెనో యతినిపుణముగ వాల్మీకి నిరూపించెను. అందులకు ముందుగ నేది ధర్మయుక్త కామము యేది దూషితకామ మగు నను విచక్షణము మనము గావించుకొనుటకై దశరథ పాత్రమునుగూర్చి పరామర్శించుట యావశ్యకము. ఏలయన శ్రీమద్రామా యణము నందు కామమునుగూర్చియే విపులముగ వర్ణించినటులుగఁ గవి మనకీ తీరున చెప్పుచున్నాఁడు

శ్లో॥ "కామార్థ గుణ సంయుక్తం ధర్మార్థ గుణ విస్తరమ్।
సముద్రమివ రత్నాఢ్యం సర్వశ్రుతి మనోహరమ్॥ (1-3-8)

అం దుత్తమ, మధ్యమాధమ కామము లేయే తెఱంగున నిరూ పించెనో మనము గ్రహింపవలెను. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని భగవానుఁ డుపదేశించుటచే శాస్త్ర మనఁగా వేద మనియే మనము తెలిసికొనవలెను. కామశాస్త్రాది పెక్కు శాస్త్రములు లున్న నవ్వియవి మనకు నిషిద్ధము లని హా మనవి. అటుల గానిచో "స్వధర్మో రక్షసాంభీరు! సర్వథైవ న సంశయః। గమనం వా పర స్త్రీణాం హరణం సంప్రమథ్య వా" యను రావణుని రాక్షసశాస్త్రము

గూడ లోకమునందుఁ బ్రమాణము కాఁ గలదు! కావున నిట ధర్మ మన వైదిక ధర్మ మనియు, శాస్త్ర మనిన శ్రుతి స్మృతి సముదాయ సముదాహృత మనియు మాత్రమే గ్రహింపఁ బడవలెను. కావున రామాయణమునందు దశరథుఁ డను నొక కోసలదేశ ప్రభువును, నాతని కుమారుఁ డగు శ్రీరామచంద్రుని గ్రహించి వాల్మీకిమహర్షి తన కావ్యమునందలి యితివృత్తమును సాధించి యున్నాఁడు.

దశరథుఁడు మిగుల పరాక్రమవంతుఁడు. ధర్మబుద్ధి కలవాఁడు. రాజధర్మములను బిన్ననాఁటినుండియు సమగ్రముగ గురు వగు వశిష్ఠునివద్ద నభ్యసించి ప్రజారంజకముగఁ బరిపాలించినట్టి ధీయుతుఁడు. దేవేంద్రాది దేవతలకుఁ గూడ నసురులతోఁ బోరునప్పుడు సహాయ మొనరించిన పరాక్రమవంతుఁడు. జితేంద్రియుఁ డనుటకు సందియము లేదు. కాని మున్నూటయేబది భార్యలను గలిగి యుండెనఁట! ఆ నాఁ డట్టి వైభవము యా ప్రభువుల కుండెను కాఁ బోలు. అతనికి రూపలావణ్యాతిశయములలో నందఱికన్న మిన్న యగు కైక యను గరిత భార్య యొకతె యుండెను. ఆమెయందు మిగిలినవారి యందఱియందుఁగన్న మక్కువ నెక్కుడుగ దశరథుఁడు చూపుచుండెను. తండ్రి యగు నజ మహారాజు భార్యావ్యామోహజనిత క్షయవ్యాధిచేఁ జనిపోయెను. పాపము దశరథునియందా వ్యామోహము ద్విగుణీకృతమై దారేషణకుఁ దోడుగఁ బుత్రేషణగూడ చరమదశయందు మితిమీఱెను! చరమదశయం దనుటలో "వృద్ధస్తావచ్చింతా సంక్తః" యను శ్రీ శంకరోక్తి యెంత స్వభావోక్తియో మనము గ్రహింపగలము. ఒక వంక "వృద్ధస్య తరుణీ విష"మ్మని రూప వయోలావణ్యములు గల మగువ, వేఱొక వంక లేక లేక బహుప్రయాసముపై వార్ధక్యావస్థ యందుఁ గన్న గుణరాశి యగు పుత్రరత్నములు. కాలము గడచినకొలఁదియు నా తీరున వ్యామోహ జ్వరపీడితుఁడు కాఁ దొడంగె నా నృపతి. "తేన త్యక్తేనభుంజీథాః" యను నుపనిషద్వాక్యమును మఱచి కాళిదాసు చెప్పినటుల వశిష్ఠుఁ డెన్ని బోధించినను దండ్రి యగు నజమహారాజు భార్యను మఱువఁ జాలకుండినటుల దశరథుఁడు గూడఁ గైకయందలి

కోగులాటమునుండి వీడ్పడఁజాలకుండెను. అందులకుఁ బ్రాయశ్చిత్త మేమి? శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు తమ రామాయణోపన్యాసములందీ తీరున దశరథునిగూర్చి విమర్శించిరి. "King Dasaradha seems to have had a fatal mistake of promising in haste and repenting at leisure' ఆఁగా దశరథుఁ డుద్రేకముతో వాగ్దాన మొనరించుటయుఁ గడకు విచారముతోఁ బశ్చాత్తప్తుఁ డగుటయు నను హృదయదౌర్బల్యము గలవాఁడు. అందుఁ గొంత సత్యము లేకపోలేదు. దశరథుఁ డుద్రిక్త స్వభావము గల నృపాలుఁ డనుటకు మన మాతని యశ్వమేధ యజ్ఞ సందర్భమును గమనించితిమేని మనకు బోధపడఁ గలదు. తా నశ్వ మేధము సేయదలంచితి నని ఋత్విజులతోఁ జెప్పి వారు వల్లె యని యంగీకరించి తనకుఁ బుత్రు లుద్భవింతు రని యాశీర్వదించి నంత మాత్రమున నెంటనే యా నృపాలుఁ డంతఃపురమునకుఁ బోయి "తతస్స గత్వా తాః పత్నీ ర్నరేంద్రో హృదయ ప్రియాః। ఉవాచ దీక్షాంవిశత యక్ష్యేఽహం సుతకారణాత్" తని భార్యలతో వెంటనే మీరు దీక్ష వహింపుఁ డని త్వరపెట్టెనఁట! ఏవిధముగ నొనరింపవలెను? పరికరము లేవి కావలెను? ఉపద్రష్టాద్యధ్వరగణంబుల నెవ్వరిని యోజింపవలెను? అను విషయము లెవ్వియు సమగ్రముగఁ దెలిసికొనకుండ నాతని యుత్సాహోద్రేకములు చూపుటవలన మన కాతఁ డొక యుద్రిక్త చేతస్కుఁ డని చెప్పక చెప్పును. తరువాత వశిష్ఠప్రేరితుఁ డైన సుమంత్రునివలన ఋష్యశృంగాధ్వర్యమునం గాని తన పుత్రకామేష్టి నెఱవేఱఁ జాల దని యెఱింగి యంత నా ఋషిని దెచ్చుటకుఁ బురోహితసమేత ముగ రోమపాదుని కడ కా దశరథుఁ డేఁగెను. దశరథుఁడు కబోదుని కుమారకునిం గొట్టిననాఁటి నుండియు మిగుల పశ్చాత్తప్తుఁడై కరుణారస ప్రపూరిత హృదయముతోఁ బ్రవర్తించుచుండెనా యని మనకుఁ బొడగట్టకమానదు. ఆతఁ డా యంధవైశ్య దంపతుల కుమారుని జంపినప్పు డెటుల విషాద మొందెనో మనకు రామాయణము చెప్పు చున్నది. వారిపుత్ర వియోగదుఃఖ మాతనిమానసమును గలంచి తీవ్ర తరవేదన మాపాదించెను. తుద కా విచారకరసంఘటన మాతనికండ్లకుఁ

గట్టిన ట్లుండి యీ వృద్ధనృపతి పుత్రవియోగ వ్యథనుండి తప్పించు కొనుట కనేక యుపాయములను వెదకుచుండెను. సర్వసాధారణముగ నొక మార్గమునందు క్రూరసర్ప మున్నదని తెలిసికొనినచో మన మా దారివెంట నడువ జాలము. దనకు సర్పగండము కూడ గల దని పూర్తిగ నెఱింగి మానవుచిత్త మెటు లుండునో మన మెటుల నూహింపనగును? అతఁ డనేకవిధముల నా మార్గమునుండి తప్పించుకొనుటకు యత్న మొనరింపకుండునా? పుత్రవియోగ మెటుల దటస్థించునో, యెప్పుడు తటస్థించునో యని యీ దశరథుని హృదయము కొట్టుకొను చుండెను. విశ్వామిత్రున కా బాలుఁ డగు రాము నీయకుండుటకొక కారణముకూడ నదియే. "ఆత్మనః కామాయ సర్వం ప్రియంభవతి" కదా! కావున నట్టి భీతి క్రమక్రమముగఁ బుత్రప్రేమకు దారి తీసెను. పరశురాముఁ డడ్డువచ్చినప్పుడు రాముఁ డే మగునో యని దశరథుడు గడగడ వణంకసాగెను. ఈ తీరున నంతకంత కా నృపాలుని భీతియె వ్యామోహముగ మాఱెను!

దశరథుఁడు కైకను వివాహ మొనరించుకొనునప్పు డామెతండ్రికి రాజ్యశుల్కమును వాగ్దాన మొనరించి యామెను బరిణయ మాడెను. కాని యామెయందుఁ గూడఁ బుత్రోత్పత్తి జరిగియుండలేదు. ఒకవంక నాతఁడు రాజ్యమునందలి తన ప్రజల నత్యంతానురాగముతోఁ బ్రేమించిన ప్రజాస్వామ్యవాది. అతఁడే కాదు రఘువంశ మంతయుఁ బరిపాలనావిధానమున నేఁటి ప్రజాస్వామ్య తత్పరులకన్న మిన్న లగు దేశరక్షణ దీక్షితులు "త్యాగాయ సంభృతార్థానా" మ్మను కాళిదాసవచనమును బరమలక్ష్యముగఁ బాటించిన వదాన్యమూర్తులు. పింగళి సూరనార్యుఁడు దశరథుని రాజ్యరక్షణ దక్షత నగ్గడించుచు:-

"నిలుకడ నేలె విశ్వధరణిన్ సన మిత్రకులంబు వైభవో |
జ్జ్వలతఁ దలిర్పఁ బౌరవసునంతతి రాజుల కెల్ల హెచ్చుగన్ ||

అని నుడివెను. శ్రీరామునకుఁ బట్టాభిషేక మొనరింపఁ దలంచి రాష్ట్ర జనుల నెల్ల నా దశరథుఁడు రావించి వారితో:-

శ్లో॥ "విదితం భవతా మేత ద్యథా మే రాజ్య ముత్తమమ్।
పూర్వకై ర్మమ రాజేంద్రై ః స్సుతవ త్పరిపాలితమ్॥"
"మయా హ్యాచరితం పూర్వైః పన్థాన మనుగచ్ఛతా।
ప్రజా నిత్య మనిద్రేణ యథాశ క్త్యభిరక్షితాః"
"ఇదం శరీరం కృత్స్నం లోకస్య చరతాహితమ్।
పాండుర స్యాతపత్రస్య ఛాయాయాం జరితం మయా॥"
(2-2-53)

ఇత్యాదిగ విజ్ఞాపన మొనరించి వారియభినందనానంతరమె శ్రీ రామచంద్రుని పట్టాభిషిక్తునిగ నొనరింప నెంచిన ప్రజాహితవాది. కైక వివాహకాలమునందుఁ గేకయరాజున కాతఁ డొనరించిన రాజ్య శుల్క వాగ్దానము ననుసరించి భరతునే కోసలరాజ్యపట్టభద్రునిగ దశరథుఁ డొనరింపవలసి యుండెను. అట్లయ్యును బ్రజలందఱు శ్రీరాముఁడే తమకుఁ బ్రభువుగ నుండవలె నని కోరుటచే నాతనినే యౌవరాజ్య పట్ట భద్రునిగఁ బ్రజావాక్యము ననుసరించి దశరథుఁ డొనరింప సమకట్టెనే కాని తన యభినివేశము ననుసరించి కైకేయిపుత్రునకు రాజ్యము నీయఁదలంపలేదు !

ఈ సందర్భమునఁ గొందఱు దశరథుఁడు కైకను మోసగింప నెంచె నని వాదింతురు. శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు దశరథునిగూర్చి చేసిన యాక్షేప మీ ఘట్టములోనిదే! కాని య య్యది న్యాయమైన యూహ కాదు. అనూచానముగ నిక్ష్వాకువంశమున జ్యేష్ఠుఁడే రాజ్యా ర్హుఁడు. అ య్యది వంశక్రమానుగత మగు ధర్మము. అందులకు మను వీ తీరున నిర్వచించెను.

శ్లో. 'జ్యేష్ఠ ఏవ తు గృహ్ణీయా త్పిత్ర్యం ధన మశేషతః

శేషా స్త్వ మనుజీవేయుః యథైవ పితరం తథా' (9-105).

కావున రాజ్యమునకు శ్రీరాముఁడే యర్హుఁ డగుట నిర్వివాదము. ఇఁకఁ గైకవివాహసందర్భమున దశరథుఁ డొనరించిన వాగ్దానమునకు గతి యేమి? యని ప్రశ్నింపవచ్చును. అ య్యది ధర్మశాస్త్రము ననుసరించి చెల్లఁదగినది కాదు. ఏ షరతు ననుసరించి దశరథుఁడు కైకను వివాహ మాడెనో, యా నిబంధనపత్త్రికార మామె సకాలమునఁ బుత్త్రుని గని యుండలేదు. కావున నామె యధివిన్న యయ్యెను. అధివిన్న యైన స్త్రీని వదలి పతి సంతానముకొఱ కితరస్త్రీని వివాహ మొనరించుకొన వచ్చును. అందులకు మన్వాపస్తంబాదు లీ విధముగ నిర్ణయించిరి.

శ్లో. 'వన్ధ్యాష్టమే ఽ ధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా
ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వ ప్రియవాదినీ' (9-81).

ఒకవేళ నప్రియవాదిని సంతానవతి యగుచో నాపస్తంబుఁ డీ తీరున నిర్ణయించెను. "ధర్మప్రజాసంపన్నే దారే నాఽన్యాం కుర్వీత, అన్యతరాభావే కుర్వీత" కావున నధివిన్న యైన భార్యను వదలుటకు భర్తకు హక్కు కలుగు చుండ నిఁక నామెకు రాజ్యార్హత యెచటఁ గలదు? అందుచేతనే యా విషయ మంతయుఁ బూర్తిగ నెఱింగిన మంథర కైకను బ్రబోధించునప్పుడు.

శ్లో. 'యాతౌ దైవాసురే యుద్ధే వరౌ దశరథో ఽ దాత్
తౌ స్మారయ మహాభాగే సోఽర్థో మా త్వా మతిక్రమేత్'
(2-9-28).

అని చెప్పెనే కాని యామెవివాహకాలమందలి వరమును జెల్లింపు మని దశరథుని గోరుటకు బోధించియుండలేదు. నిజమునకు దైవాసురయుద్ధ సమయమునఁ గైక యొనరించిన సహాయముకొఱకుఁ గొసంగఁబడిన వర

ములకన్న నామెవివాహకాలమున నొసంగఁబడిన వరమే రాజ్యము సంపాదించుటలో నా యింతి కెక్కుడు కార్యసాధనోపాయ మనుట నిస్సంశయము. కాని "సో౽ గ్నిమాత్మానమతిక్రమేత్" అని యీ వరద్వయమును మాత్ర మతిక్రమింపకు మని మంధర ప్రబోధించుట లోని రహస్య మేమి? మూఁడు వరము లున్నందువలన నష్ట మేమి? లోకములో మూఁడు వరములకు స్త్రీకి హక్కుకల దని సావిత్ర్యుపాఖ్యానము దెలుపుచున్నదే! కావున మూఁడవ వరములో దశరథుని మఱింత బంధింపవచ్చునుగదా! కాని మంధరకూడ మొట్టమొదట వివాహకాలమందుఁ గైక కీయఁబడిన వరము చెల్ల దని యెఱింగియుండు టచే నమాయికురా లగు నా దశరథపత్ని యీవరమును జెల్లింపు మని కోరెనేని దశరథుఁ డది చెల్లఁదగినది కా దని వెంటనే నిరాకరింపవచ్చును. అటు లయిన భరతుఁడు తండ్రిచే విప్రోషితుఁ డగుటకుఁ గారణ మేమి? భరతుఁ డుండినఁ బట్టాభిషేకము తప్పక జరిగియుండెడి దేమొ! పైఁగ దశరథుఁ డా కాలమునందే శ్రీరామయౌవరాజ్యపట్టాభిషేకమునకుఁ గడంగుటకుఁ గారణ మేమి?

సర్వసాధారణముగ నెక్కుడు ప్రేమగలవారి కేయాపాటము వాటిల్లునో యని మానవహృదయము సదా శంకించుచుఁ గొట్టుకొనుచుండుట స్వభావ మని యెల్లరకును విదితమే. దశరథునకు నలువురుపుత్రు లందు రామునియందుఁ బ్రేమ యెక్కుడు. గుణవైభవములచే శ్రీరామచంద్రుఁడు లోకమునకుఁ గూడ మిగుల ప్రీతి గొలుపుచుండెను. అందుచే భరతుఁ డుండెనేని కేకయరాజాదులనుగూడ నాహ్వానింపక దప్పదు. అట్టితఱిఁ గేకయరాజు కైకకు దశరథుఁడు తన వివాహకాల మందిచ్చిన వాగ్దానమును జెల్లింపవలె నని కోరకుండ నెట్లుండఁగలరు? మిగుల మెత్తని హృదయముగల రామచంద్రుఁడు తండ్రిని సత్యప్రతిష్ఠ గలవా

నివిగఁ జేయుట కట్టి విషమపరిస్థితులందు రాజ్యమును ద్యజింపక మానఁడు. దానివలన వంశక్రమానుగత మగు ధర్మ ముత్సన్న మగు టయకాక ప్రజాహితమునకుఁ గూడ భంగము వాటిల్లఁగలదు. కావున దశరథుఁడు శ్రీరామచంద్రునితో :—

శ్లో. 'విప్రోషితశ్చభరతో యావదేవ పురాదితః

తావదేవాభిషేక స్తే ప్రాప్తకాలోమతోమమ' (2-6-25).

అని శ్రీరామునితో ననకఁ దప్పలేదు. తనకుఁ బ్రియుఁడగు భరతుఁడే లేకుండఁ దనకుఁ బట్టాభిషేకము సేయుటవలన గూడ రామునికి మానసి కావేదన కలుగకుండ నెట్లుండును! కాని రాజకీయములందు మిగుల నేర్పుతో దూరదృష్టితో దశరథుఁడు పదిరెండేం డ్లాలోచించి చేసిన కార్యము నెవ్వరు కా దనఁ గలరు విధి యొక్కటి తప్ప! అందుచే నీక దశరథుని యత్నము కూడ ధర్మవిరుద్ధము కాదు. ఆ నృపాలుఁడు వంశ ధర్మము, లోకధర్మముఁ, రాజధర్మము, ప్రజాభిప్రాయమును బూర్తిగ గ్రహించియే తన బాధ్యతను ధర్మయుక్తముగ నిర్వహింప నెంచెను. శ్రీరాముఁ డీ తీరున లక్ష్మణునితో నా ఘట్టమున నిట్లు సమర్థించెను.

శ్లో. 'ధర్మోహిపరమోలోకే ధర్మే సత్యంప్రతిష్ఠితం
ధర్మసంశ్రితమేతచ్చ పితుర్వచన ముత్తమమ్' (2-21-41).

శ్లో. 'అసంకల్పిత మేవేహ యదకస్మాత్ప్రవర్తతే
నివర్త్యారంభ మారబ్ధం నన్వైవస్య కర్మతత్'.

శ్లో. 'మాచలక్ష్మణ సంతాపమ్ కార్షీర్లక్ష్మ్యా విపర్యయే
రాజ్యంవా వనవాసోవా వనవాసోమహోదయః'
(2-22-24 & 29).

నిజమునకుఁ బైనఁ జేర్కొన్న మూఁడు శ్లోకములుగూడ రాముఁడు లక్ష్మణుని నూరార్పుటకుఁ జెప్పఁబడిన యుపచారవాక్యములుగఁ దోఁచి నను వానియందు దశరథ ప్రవర్తన మంతయు ధర్మబద్ధమై యుండె ననియు నట్టి ధర్మనిష్ఠ మైన కార్యములందుఁగూడ విఘాతములు కలుగక మానవనియు రామచంద్రుని నిర్ణయము. దానికిఁ గారణ మేమి? ఇఁక దైవారాధన మెందులకు? అని సర్వసాధారణముగ మానవుఁడు ప్రశ్నింప వచ్చును. కాని దానికి సముత్తరము రామచంద్రుఁడే చెప్పి యుండెను. "రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః" యని చెప్పుటలోనె దైవనిశ్చయము మానవయత్నముకన్న నధికతర శుభావహ మగుట మనకు గోచరింపక మానదు. దైవమునకీ సృష్టియందలి జీవకోటి యంతయు సమానప్రేమాస్పదము. ఒక్కవ్యక్తి త్యాగము వలన ననేకులు తరింపఁగల్గుచో నట్టి మానవుని ననేకములైన చిక్కులుపాలునేసియైన నాతనిచే లోకకళ్యాణముఁ గావించు చుండును. అట్టి త్యాగమూర్తులనే మన మవతారమూర్తు లని పేర్కొందుము. వారినే శ్రీమద్భగవద్గీతయందుఁ గృష్ణభగవానుఁడు తన యంశసంభూతులుగఁ జేర్కొని యున్నాఁడు. అట్టివారే సాధులను రక్షించుటకును, దుర్మార్గుల శిక్షించుటకు నీశ్వరసత్తా విశేషముగఁ గలిగి యుందురు. శ్రీరాముని యరణ్యావాసమువలన లోక మే తీరున మహత్తర వికాసము చెందెనో, సృష్టియందలి భూతజాలము లన్నియు నే రీతిఁ గేవల సాత్త్విక చైతన్యవిలసితములై లోకకళ్యాణమునకు సహాయపడి తాము తరించి లోకమును తరింపఁ జేసెనో ఆయా ఘట్టములందు యథాశక్తిగ నిరూపించెదను. ప్రస్తుతమున దశరథునకు శ్రీరాముని యరణ్యావాసముచే మహత్తరాత్మ వికాస మే తీరున గలిగెనో మనము నిశ్చయింప వలసి యున్నది.

దశరథుఁడు మిగుల సమర్థుఁడగు ప్రభు వనుట నిస్సంశయము. ధర్మాత్ముఁ డగుట గూడ నిరూపించియున్నాము. అట్టివానికి హృదయ

దౌర్బల్యము లగు దారేషణ పుత్త్రేషణలు తొలంగు టెట్లు? ఒకవంక లోకమునందుఁ బెచ్చుపెరుగుచుండిన రాక్షస ప్రమాదము నరికట్ట వలెను. వేరొకవంక దశరథునకుఁ బ్రాయశ్చిత్తమై యాతనికి హృదయపరివర్తన మొనంగినంగాని యా ధర్మవేదియగు నృపాలుఁ డుత్తమగతికిఁ బోవుమార్గము గానరాదు. ఈ రెండుమహత్తరకార్యములును సాధింప గడంగియే శ్రీరాముఁ డరణ్యవాసమునకుఁ బోవ సంకల్పించెను. తల్లిదండ్రుల యందలి లోపమును జ్ఞానులగు బిడ్డలు సవరించుటెటులనో శ్రీరాముఁడు మన కీ ఘట్టమునఁ బూర్తిగ సూచించి యున్నాఁడు. అతఁడు రాజ్యమును ద్యజించి యడవులకుఁ బోవుటచే దశరథుని మానసమునం దే తీరున గాఢపరివర్తనము కలిగెనో మనము కొంచెము విచారింతము.

రూపలావణ్యాతిశయములచే దన హృదయమును బూర్తిగ నాకర్షించిన కైకయందలి, త్వఙ్మాంసాస్థిగతమైన ప్రేమను, రాముఁడు వనవాసమునకుఁ బోవ సంకల్పించుటచే నా కామరూపిణియందలి వ్యామోహమంతయుఁ ద్రుటిలో నొక ఘోరాసూయగ మార్చివైచెను! అట్టి మోహనమూర్తియగు కైక క్షణములోఁ బిశాచమువలె దశరథునకుఁ గన్పట్టెను! "అర్థరూపాసిద్ధార్థాభ్యాభీతాభయదర్శినీ!" యని యా మోహనసంపద యంతయు నాఁటినుండీ దశరథహృదయమునకు భయావహమై మృత్యురూపముతో విలయతాండవ మొనరించుచుండిన యట్లాతనికండ్లకు గోచర మయ్యెను! లేకున్నచో నా నృపాలుని కాముకహృదయమునందు వైరాగ్యబీజములు నాటి యాతనికిఁ బాంచభౌతిక మగు కైక దేహమునందలి ప్రేమాభినివేశ మణఁచుటెట్లు? తీక్ష్ణ మగు ముల్లును దీసి పాఱవైచుట కంతకన్న సుతీక్ష్ణతరమైనట్టియు కర్కశమైనట్టియు సూచివలనంగాని సాధ్యముకానియట్లు కైకకన్నఁ బ్రియాస్పదుఁడగు రాముని వలనంగాని యా దశరథ హృదయము

నందలి మోహమను ముల్లు పెఱుకుటకు మఱెవ్వరికిని సాధ్యము కాదు కదా! తన తండ్రిని దరింపఁజేయఁజాలని పుత్రుఁడు పుట్టిన నేమి చరితార్థము? కావున శ్రీరామచంద్రుఁడు కామముకన్న మానవుని బంధించునట్టి పాశము వేఱుగ లేదని గ్రహించిన మహామేధావి యగుటచేఁ దన రాజ్యపరిత్యాగము లోకమున కెంత లాభదాయకమో, తన కెంత లాభదాయకమో తన తండ్రి కేతీరున క్షేమ మొసంగునో పూర్తిగ గ్రహించిన నయశాలి వాల్మీకి మానవుఁడన నట్టివాఁడే యని యాతని నాదర్శముగ లోకమున కొసఁగిన మహాకవి. లోకములో మానవుని రాక్షసునిగఁ జేయునట్టి రెండు ప్రతిపక్షశక్తులు కామక్రోధములే యని గీతయం దీ రీతిని శ్రీభగవానుఁడు పేర్కొనెను:

శ్లో. 'కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్' (శ్రీమద్భగవద్గీత)
'జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్' (డిటో)

కావున దశరథుఁడు కామమును జయింపఁ జాలకుండెను. పైఁగఁ దాను జావునకు సిద్ధముగ నుంటి నని యీరీతిగ శ్రీరామునితోఁ జెప్పి యాతని బట్టాభిషిక్తునిగఁ జేయనెంచెను! "అవష్టబ్ధం చ మే రామ! నక్షత్రం దారుణైర్గ్రహైః.

'ఆవేదయన్తి దైవజ్ఞా స్సూర్యాంగారక రాహుభిః'
'ప్రాయోహినిమిత్తానా మీదృశానాం సముద్భవే'
'రాజామృత్యుమవాప్నోతి ఘోరాంచాపదమృచ్ఛతి'(2-4-18-19).

అట్టియాపదఁ దనకుఁ గొలఁదికాలమునందు రానున్న దని గుర్తెఱింగిన సమస్తధర్మవేది యగు దశరథునట్టి చక్రవర్తి గూడఁ, దొలుతఁ గైకకు శ్రీరామపట్టాభిషేకవార్త చెప్పుటకై యామె యిలు సొచ్చి తుద కామె

యందలి మోహాతిరేకముచే నా కైకేయీపాశమునం దే తీగనం జిక్కుకొని తన పదవి తెచ్చుకొనెనో వాల్మీకి యతిచాతుర్యముగ వర్ణించెను.

శ్లో. 'ఉపస్థాన మనుజ్ఞాప్య ప్రవివేశ నివేశనమ్
అద్యరామాభిషేకో వై ప్రసిద్ధ ఇతిజజ్ఞివాన్'.
ప్రియార్హాంప్రియమాఖ్యాతుం వివేశాన్తః పురంవశీ'
(2-10-10 & 11).

రామచంద్రు నుపవసింపం జేయుమని వశిష్ఠునితోం జెప్పి యా బ్రహ్మను రామునింటికిం బంపి, శ్రీరామాభిషేక మంతయుం బూర్తి యయ్యె నని నిశ్చయించుకొనెను. దశరథుండు! "There is many a slip between the cup and the lip," మనము పానపాత్రమునం దుంచిన క్షీరమును ద్రావునంతలోం గూడ నది కాలవశమున జారి క్రిందంబడిపోవునేమో యను భీతి యాతనికి జనింపలేదు! పైంగ "వివేశాన్తఃపురం వశీ" యని దశరథునిమానసిక వైఖరిగూడ నుద్ఘాటించి మిగుల నిగ్రహముతోం గైకయి ల్లా నృపాలుండు జొచ్చె నని కవి చాటుచున్నాండు! అహా? పాపము దశరథుం డెంత న్యాయ మగు నంతఃకరణముతోం బవిత్ర మగు ప్రేమతోం బ్రవర్తించెను! కాని కాలముం గామముం గూడ నొకదానితోనొకటి వాయ్యొగ్నులవలెం జెలరేంగి యాతనియాశయ మంతయుం బూర్తిగ భస్మీపటలము గావించెను! పంద్రెండు వత్సరములు తన యాశయమును దాంచిన దశరథుం డా రాత్రి కైకయింటికిం బోయి యామెతోం జెప్పకుండిన నేమి పుట్టి మునింగినది? ఒకవేళం జెప్పదలంచెనుపో! ఆమె క్రోధాగారమును బ్రవేశించె నన యీ రీతిగ దాసీజనములు చెప్పిరే:—

శ్లో. దేవ! దేవీ భృశం క్రుద్ధా క్రోధాగార మభిద్రుతా (2-10-21).

అటులఁ జెప్పినను దెలియఁజాలక నామె నెంట నే రీతిని "శునీ మన్వేతే శ్వా హాత మపిచ హంత్యేవ మదనః" యని భర్తృహరి చెప్పినట్లుగఁ దొలుతఁ గైకేయి కా రామపట్టాభిషేకవార్త చెప్పుటకుమాత్రమే మిగుల నిగృహీతమనస్కుఁడై యామెయంతఃపురము బ్రవేశించిన నృపతి తుదకు "స కామబలసంయుక్తో రత్యర్థం మనుజాధిపః అపశ్యద్దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ" (2-10-18) ఇత్యాదిగ నాకవి యా దశరథునిమన్మథావేశ మంతయుఁ జెప్పి కైకను వర్ణించుటలో నా ఖండితనాయికా విలాసములనుగూడ మిన్నందించెను! ఒక వంక వృద్ధదశరథునికామావేశము, ఒకవంకఁ దరుణి యగు కేకయ రాజపుత్రికోపభావము లతిమనోహరకములుగ నతివిపులముగఁ జెప్పి చెప్పి "స వృద్ధ స్తరుణీం భార్యా" మనియు, "కామీ కమలపత్రాక్షీ" మనియు నా దంపతుల పరస్పరవిరుద్ధరసవిలాసములను వర్ణించి పాఠకులకుఁ గండ్లయెదుట దశరథుని పతనము కైకేయి యర్థకాంక్షయం దభినివేశము నొక దృశ్యప్రబంధమువలె నా విషాదాంతరూపకము నంతయుఁ గవి చూపింప నారంభించెను! ఇచ్చటనే మానవుని గామ మను వికృతపాశ మెటుల బంధించునో వాల్మీకి నిరూపించెను. ఇచటనే విధి విష్ణువునుగూడ నెటుల వేధించునో చూపియున్నాఁడు! ఆసన్నమృత్యువు మానవు నే రీతి నాతని కేమియుఁ దెలియకుండగనే గ్రసించునో వాల్మీకి బోధింప నెంచి మనకు దశరథపాత్రను జూపెను. అంతియకాదు. పురాకృతకర్మవలన మానవునికి బంధ మెటుల సంప్రాప్తించునోకూడ నిర్ణయించుచున్నాఁడు కవి. దశరథుఁ డొక యంధదంపతులకుమారుని బాణముచే వధించె నని మనకు రామాయణమే చెప్పుచున్నది. విష్ణుఁడు దేవతలను రక్షించుటకై భృగుపత్ని వధించె ననిగూడ శ్రీమద్రామాయణము మనకు నివేదించుచున్నది. చూడుఁడు. ఏ తీరున నా యిరువురకర్మయు నేఁడు వారిని బాధించుచుండెనో!!

ఐశ్వర్యాది పరిపాకమునకు వచ్చినప్పుడు మానవుఁ డపరిమితస్నేహముగ బంధింపఁబడు ననుటకు వేఱుగ నిదర్శన మింతకన్న నేమున్నది? పాశ్చాత్యలోకమున నొక దృష్టాంతమును మన కాలమునాఁటి దిచ్చుచున్నాను. స్వర్గీయగాంధిమహాత్ముఁడు తన యాశ్రమ మందొక యావుదూడ బాధ నొందుచుండ దానిని దుపాకితోఁ గొట్టించి చంపించెనఁట! ఆతఁడే తన పత్రికయందు వ్రాసినయుల మన మెఱుంగుదుము. దాని బాధ పోఁగొట్టి యాలేగ కుపకారము చేయు నుద్దేశముతో నా మహాత్ముఁడు దానిం గొట్టించెనే కాని దానియం దెట్టి ద్రోహము తలంప లేదు! కాని యా మహానుభావుఁడు తుద నొక తుపాకిదెబ్బవలననే మృతి నొందెను! దానికిఁ గారణ మేమి?! ఆతఁ డహంకరించి తా నాలేఁగకు బాధ నివృత్తి గావింపనెంచెను. అటు లహంకరించి 'నేనిట్టియో మహాత్కార్యము చేయుదు' నని చెప్పుటకు మానవున కేటి హక్కు కలదు? అందుచేతనే రామచంద్రుఁడు:—

శ్లో. "ఋషయో ఽ ప్యుగ్రతపసో దైవే నాభిప్రపీడితాః
ఉత్సృజ్య నియమాం స్తీవ్రా న్భ్రశ్యంతే కామమన్యుభిః"
(2-22-23).

అని దైవప్రాబల్యమును మనుజునికించిజ్జ్ఞత్వమును, జాటి చెప్పియున్నాఁడు. ఇఁక నొక విశేషముగూడ నిందుఁ గలదు. మానవుని హృదయము పరిపూర్ణమై నిష్కళంకమైనకొలఁది యాతనియందలి కామక్రోధాదిలేశము లత్యంతప్రమాదకరములుగ నేర్పడుచుండును! చంద్రమండలము పూర్ణమై దేదీప్యమానప్రకాశము వెదజల్లుకాలముననే యందలి కళంక మంతకంతకు స్పష్ట మగుటయు, పూర్ణిమాతిథియందే యా చంద్రుని రాహుకేతువులు బాధించుటయుఁ గలుగుచుండుట సర్వజనవిదితముకదా!

శ్లో. “సత్త్వైకనిష్ఠే మనసి భగవత్పార్శ్వవర్తిని

తమశ్చంద్రమసీవేద ముపరజ్యావభాసతే” (భాగవతము).

అని వ్యాసాచార్యులు వ్రాసియున్నారు. కావున స్వల్పదోషములు కూడ నిష్కళంక జీవితముగల మానవులను జీకాకు పఱచుచుండును. స్వచ్ఛమగు నీటి నొక స్వచ్ఛమగు కాచపాత్రమునం దుంచి యందొక రంగుయొక్క కణమునుమాత్ర ముంచినంతటనే మన కా నీరమంతయు నెటుల ఛాయామయముగఁ గన్పట్టునో యా తీరుననె మానవుని యందలి లోపము లాతఁడు పరిపూర్ణత నొందుకొలఁది మనకు గోచరింపకమానవు. పవిత్రమగు రక్తమున కొక దోషయుక్తమగు పదార్థము తగిలిన వెంటనేదానియందు మిగుల నపూర్వమగు సంచలనము కలిగి యా మానవు నజ్ఞాఁతలూగించి కలంచివైచుట మనకు ఋష్యశృంగోపాఖ్యానము బోధించుచున్నది !

ఋష్యశృంగుఁ డావఱ కెట్టి వికృతిని జెందక నింద్రియనిగ్రహము కల వాఁడై బ్రహ్మచర్యము నాచరింపుచుఁ దండ్రి పజ్జనుండి సమస్త వేద వేదాంగ పారంగతుఁడై తపము నాచరించుచుండెను. దైవవశమునఁ దండ్రి యింటికడ లేని సమయమున రోమపాదునిచే నంపఁబడిన వేశ్యలు పోయి వాని కపూర్వము లగు కృత్రిమ భక్ష్యములఁ దిననిచ్చిరి. వాని నాతఁడు భుజించినంతనే యా తపసికి మనోవైకల్య మేర్పడి యందు వలన నా వేశ్యలం దొక విలక్షణ మగు ప్రేమ యంకురించెను! “అన్నమయంహి సౌమ్యమనః” యని మనకు వేదము బోధించుచున్నది. నేఁటి మన యువకులు పాశ్చాత్యసంఘసాంప్రదాయములను, పాశ్చాత్య విద్యావైభవములను దుదకుఁ బాశ్చాత్య వ్యక్తులనుగూడ వందిమాగధులవలెఁ బొగడుచు స్వదేశ, స్వభాష, స్వవేషములను దెగడుటకుఁ గారణ మేమి? వారు శిశువులుగ నున్న కాలమునందు విదేశీయులనుండి

దిగుమతి యగుచున్న డబ్బాపాలు, హార్లిక్సు, గ్లాక్సో, మున్నగు విజాతీయకృత్రిమపదార్థములచేఁ బెంచఁబడుటయే కాక నేఁడు విదేశముల నుండి మన దేశమునకు విరివిగ దిగుమతి యగుచున్న గోధుమలు, బియ్యము, తినుబండారములు, మత్తుపదార్థములు, మున్నగు వస్తుజాలములను మనము నిరంతము సేవించుచు స్వదేశమునందుఁ బండిన యాహారాది పదార్థములను మనవారితరదేశముల కెగుమతి సేయుచుండుటచే మన యువతీయువకుల మనోభావములం గీ రీతి విపరీతవిషమపరిణామ మేర్పడుచున్నదనుటలో వింతయేమి?

కావున దశరథునియట్టి వేదవిజ్ఞానముగల ధర్మమూర్తి యాచరించిన దోషము నేఁడు ఫలించు కాల మాసన్న మగుచుండుటచే నాతనికి మనోవిభ్రాంతి యీ రీతిని గలిగెను. "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి" కదా! దానినంతయు సమగ్రముగ వివేకించిన నయజ్ఞుఁడు గావుననె శ్రీరాముఁ డీ తీరున సోదరు నూరార్చెను.

శ్లో. "యదచింత్య తద్దైవం భూతేష్వపిన హన్యతే
వ్యక్తంమయి చతస్యాంచ పతితోహి విపర్యయః"
"కశ్చిద్దైవేనసహ సామర్థ్యే యోద్ధు ముత్సహతే పుమాన్?
యస్య న గ్రహణం కించి త్కర్మణో ఽన్యత్ర దృశ్యతే?"

అని చెప్పుచు నా రామచంద్రుఁడు దైవతత్త్వ మెటుల నిగూఢముగఁ బ్రవర్తించి ఫలకాలమునందుమాత్రమె దృశ్యమై లోకమును ముగ్ధులఁ జేయుచుండునో తెల్పియున్నాఁడు. కావున నట్టి యదృష్టమగునట్టియు

తన యకుంఠిత శక్తిచే నీలోకమును నడిపించుచున్నట్టియు నొక యదృశ్య మగు శక్తి కల దని మానవుఁడు గ్రహించి తన కెయ్యది శ్రేయోదాయకమో, శ్రుతియుక్త్యనుభవములనలన, నెఱింగి ధర్మయుక్తముగ నాతఁడు నడుచుకొనునేని భగవానుఁడు చెప్పినట్లుగ "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" యట్టి మానవునకు బుద్ధిభ్రంశము గాకుండ నీ భూతప్రకృతియుఁ గాలకర్మలును, దైవమునుగూడ సహాయ మొనరింతురు. అటులగాక ధర్మవ్యతిరిక్త మగు నర్థకామముల నార్జించుటకు మనుజుఁడు గడంగెనేని రామచంద్రుఁడనినటుల:—

శ్లో. అర్థధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథోయథా".

ధర్మార్థములను వదలి కామవశంగతుఁడు మానవుఁ డయ్యేనేని యవశ్యముగ దశరథునివలె నాపదలం దతఁడు చిక్కుకొనక మానఁడని మనకు దశరథపాత్రము బోధించుచున్నది. పురోహితునితోనైన నాలోచింపక 'రేపు రామున కభిషేకము సేయించెద'నని ప్రతిజ్ఞచేసె నా నృపాలుఁడు. అన్నియు సమకూర్చెను. సర్వసిద్ధమైన యత్నము త్రుటిలో ఝంఝామారుతములోని తూలికవలె నెగిరిపోయెను! ఇంతకన్న మానవుని యస్వతంత్రకు నిదర్శన మేమి కావలెను! దశరథుఁడు ప్రాజ్ఞుఁడా? కాఁడు. మహావిద్వాంసుఁడు. వశిష్ఠ శిష్యుఁడు. అందుచేతనే భరతుఁ డీతీరున విలపించెను.

శ్లో॥ "తాతం న పరిగచ్ఛేయం దైవతం చేతిసంపది।
కోహిధర్మార్థయో ర్హీన మీదృశం కర్మ కిల్బిషమ్॥"

శ్లో॥ "స్త్రియాః ప్రియచికీర్షుస్సన్ కుర్యా ద్ధర్మజ్ఞ ధర్మవిత్ ।
అన్తకాలేహి భూతాని ముహ్యన్తీతి పురాశ్రుతిః॥"

శ్లో॥ "రాజ్ఞైవం కుర్వతాలోకే ప్రత్యక్షం సా శ్రుతిః కృతా।
సాధ్వర్థమభిసంధాయ క్రోధాన్మోహాచ్చ సాహసాత్॥"
(2-106-12-14)

ఈ శ్లోకముల సారము ప్రతి భారతీయుఁడును, వేయేల ప్రతి మానవుఁడును మనన మొనరింపవలె నని నా మనవి. కామధేనువువంటి యీ భూతప్రకృతినుండి శాస్త్రవిరుద్ధములును ధర్మవిరుద్ధములు నగు మారణయంత్రములు కేవలము తమభోగములకొఱకు సాధించువా రెట్టి మహత్తర వినాశహేతువుల పాలగుచున్నారో మనము గత రెండు యుద్ధములవలన నెఱింగియుంటిమి, నేఁటి మన సాఘింకవాదులు, మతవిద్వేషులు, కామోపహతచేతస్కులు, నైహిక భోగలాలసులు మరలఁ బూర్వముకన్న నెక్కుడుగ దారుణ మారణాస్త్రముల నేరీతిని సృజించుకొనుచున్నారో గమనించితిమేని మానవజాతి కొక యపూర్వ విషమ సమయ మేతెంచె నని చెప్పక తప్పదు. కావున నేఁడు శ్రీమద్రామాయణ పఠనము ప్రతి హిందువునకు నావశ్యకము. ఈ రామాయణ విలక్షణతను దేశ దేశములందు ఖండ ఖండాంతరములందుఁ జాటుట ప్రతి భారతీయునకు విధి యని నా మనవి. సత్కర్మాచరణ మొనరించి యిహపరసౌఖ్యములను బొందుటకు మాఱుగ విపరీత చర్యలకుఁ గడంగి లోకములోని స్వర్ణమంతయు సంపాదించినను దృష్ణ దీరక, సూర్యుఁ డస్తమింపని సామ్రాజ్యము సాధించిన యాంగ్లాంతము గానట ప్రవర్తించిన

రావణుని గూర్చి మండోదరి యే తీరున విలపించెనో మనము జ్ఞప్తికి దెచ్చుకొనవలెను.

శ్లో॥ "అవశ్యమేవ లభతే ఫలం పాపస్య కర్మణః।
ఘోరం పర్యాగతేకాలే కర్తా నాస్త్యత్ర సంశయః॥"

శ్లో॥ "శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్పాప మశ్నుతే।
విభీషణ స్సుఖం ప్రాప్త స్త్వం ప్రాప్తః పాప మీదృశం॥"
(6-114-26, 27)

స్వస్త్రీయందు ధర్మవ్యతిరిక్తమగు కామముచేఁ దగులుకొనిన తండ్రి యగు దశరథునకు శ్రీరాముఁడు రాజ్యత్యాగ మొనరించి ప్రాయశ్చిత్తము సమకూర్చెను. పరస్త్రీ పరధనముల కాసించిన దుర్మార్గు లగు వాలి రావణులను వినాశ మొనరించి ప్రాయశ్చిత్తము గావించెను! యుద్ధభూమిని దన భర్తృ కళేబరముపైఁ బడి విలపించుచు స్త్రీ యగు మండోదరియే కర్మఫలనిర్ణయము సేయఁగలిగియుండ, నేఁటి యిరువది యవ శతాబ్దమందలి నవనాగరిక శిఖామణుల మనిపించుకొను పురుషులు పరధనములను దోఁచుకొనుచు, పరస్త్రీల నెత్తుకొని పోవుచు, పైఁగ దేశము నుద్ధరింతు మని ప్రగల్భములు పలుకుట లోకమును మోసగించుటకు మాత్రమే వంచన మొనరించుకొనుచున్నా రని మనవి చేయుచున్నాను. అట్టి దుర్మార్గతవలన దేశ మెంత నికృష్టదశకు రానున్నదో వా రాలోచింప వలసియున్నది. దుర్నీతి యను పునాది పై నిర్మింపఁబడిన సంఘసౌధము కుళ్ళిన పెంటకుప్పపైఁ బోసిన సుగంధ ద్రవ్యమువలెఁ దుట్టిలోనశించి యట్టివిధాత్మలను వారి సౌధమునుగూడ

విధ్వంసము సేయుననుట మనకు శ్రీమద్రామాయణము నిత్యమును బోధించుచున్నది. ఇఁక నైశ్వర్యవంతు లగు మానవులు తమ కలిమి నే తీరున భోగింపవలెనో "తేనత్యక్తేన భుంజేథాః" యను వేదవాక్యమును శ్రీరాముఁడే తీరున ననుసరించి శాశ్వతకీర్తిని గాంచెనో క్రమక్రమముగ నిరూపించెదను. నాకీతీరున రామాయణమునుగూర్చి నా నేర్చినకొలంది లోకమునకందఁజేయు భాగ్యమును నవకాశమును కలుగఁజేయుచున్న శ్రీ యాంధ్రసాహిత్య పరిషత్తువారికి నాధన్యవాదములు.

(సశేషము)

# విషాద సారంగధర

కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, బి. ఏ. [ఆనర్సు]

ఆంధ్రనాటకపితామహులును, కీర్తిశేషులును, ఐన శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారిచే నీనాటకము వ్రాయఁబడినది. ఇందైదంకము లున్నవి. ఈ క్రిందిది కథ.

రాజనరేంద్రుఁడు మాళవరాజు. అతని భార్య రత్నాంగి. తత్పుత్రుఁడు సారంగధరుఁడు. తదుద్వాహమునకై కన్యల నన్వేషించుకొనుటకు దేశదేశములకు బ్రాహ్మణుల నంపినాఁడు రాజనరేంద్రుఁడు. వారు దెచ్చిన కన్యల చిత్రపటములలో విదర్భరాజపుత్రి చంద్రికళ, భోజరాజకుమారి చిత్రాంగి యును సౌందర్యవతులను నిర్ణయము జరిగినది. అందు చిత్రాంగి దగ్రి తాంబూలము. సారంగధరుని చిత్రపటమున దర్శించిన నాఁటనుండియుఁ జిత్రాంగి వానిపై వలపుగొనియుండెను. కాని రాజనరేంద్రుఁ డామె సౌందర్యమునకు ముగ్ధుఁడై చిత్రాంగిని దాను వివాహమాడి, కుమారుఁడైన సారంగధరునకుఁ జంద్రికళను బరిణయము గావించెను. చిత్రాంగి మనసు మాత్రము సారంగధరుని నుండి మరల లేదు.

కాలము గడచుచున్నది. రాజు మృగయావినోదియై బయలు వెడలెను. సారంగధరునకుఁ బావురముల యాట యనిన ప్రాణము. అతఁ డొకనాఁ డట్లు పావురముల నెగురవేసి యాడుచుండగా నా పావురము పోయి చిత్రాంగి నగరున వ్రాలెను. ఆమె దానిని బంధించెను. సారంగధరుఁ డామె ప్రాసాదమున కరిగి పావుర మిమ్మనెను. ఆమె యదను జూచుకొని, సరససల్లాపములు మొదలిడెను. అతఁడు చకితుఁడైనాఁడు. నీతులు పెక్కు పేర్కొనినాఁడు. ఆమె కవి వినుపించ లేదు. మరులు రేకెత్తి సర్వమును ద్యజించి వానిని కౌఁగిలించుకొనుటకు

యత్నము చేసినది. నిగ్రహించుకొని సారంగధరుఁడు వెడలిపోయినాఁడు. అది యామె కాగ్రహ హేతువైనది. మృగయ ముగించుకొని రాజ రుదెంచినాఁడు. దుఃఖాతిరేకమునఁ జిత్రాంగి, సారంగధరుఁడు కాముక కేళీ కుతూహలమునఁ దన మందిరమున కరుదెంచినాఁ డనియు, బలిమి యొనర్చినాఁ డనియుఁ జెప్పి రాజనరేంద్రుని "మామ" అని సంబోధించి నది. రాజు నమ్మినాఁడు. సారంగధరుని బంధించి, న్యాయము విచారించి కాలు సేతులు ఖండించవలసినదిగా నాజ్ఞ యిచ్చినాఁడు. కొలఁదురుఁడు రాజాజ్ఞ ననుసరించిరి.

రాజనరేంద్రుఁడును, చిత్రాంగియు శయనించిరి. నిద్రలోఁ జిత్రాంగి కలవరించినది. రాజునకు సత్య మెఱుకపడినది. ఆమెను నిగ్ర నుండి మేల్కొలిపి విషయము గద్దించి యడిగినాఁడు. ఆమె నోరెత్త లేదు. కుమారునికొఱకు నడవికి పరుగెత్తినాఁడు రాజు. కడపటి చూపు చూచుకొనినాఁడు. సారంగధరుఁడు మరణించినాఁడు. పుత్రశోకముఁ [illegible] నాఁడు రాజు. ఈడునఁ గాని పరిణయము వలని యనర్థములను జేర్కొని "ఈడుగాని వివాహ మెందును దగదు" అని దుఃఖాశ్రుపూరములతో రాజు నిష్క్రమించినాఁడు — ఇది నాటకేతి వృత్తము.

ఈ కథ యితఃపూర్వమే పలువురచే వ్రాయఁబడి యున్నది. 15వ శతాబ్దమునకుఁ బూర్వ మందున్న గౌరన ప్రథముఁడు. అతఁడు వ్రాసిన "నవనాథచరిత్ర" మునఁ బ్రథమాశ్వాసాంతమునను, ద్వితీయము మొదలునను నీ కథ కలదు. 17వ శతాబ్దపు పూర్వార్థమున నున్న చేమకూర వేంకట కవి ద్వితీయుఁడు. ఇతఁడు "సారంగధర చరిత్రము" ప్రబంధముగా వ్రాసినాఁడు. తరువాత బాణాల శంభుదాసుఁ డను వాఁ డీ కథనే ద్విపదగా వ్రాసినాఁడు. కూచిమంచి తిమ్మకవియు నీ కథను వ్రాసినట్లు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు పేర్కొని యున్నారు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ 'నవనాథచరిత్ర పీఠిక'లో సారంగధరుని చరిత్రమును బోలిన కథల కొన్నింటిని పేర్కొనిరి. అవి పరస్పరము సామ్యము గలవియే. మహారాష్ట్ర భాషలోనున్న 'కృష్ణాగరుడి' ని చరిత్ర నామ భేదముతో మన సారంగధరుని కథను బోలి యున్నది. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు (కీ. శే.) తమ సారంగధర చరిత్ర పీఠికలో నుదాహరించిన భువేశ్వరుఁ డను రాజునకుఁ గలిగిన సంతానము – చంద్రావతి, శోభావతి, అనువాని భార్యల చరిత్రము చాలవఱకు సారంగధరుని కథయే. కన్నడభాషలోనున్న కుమార రాముని కథగూడ సించుమించుగ సారంగుని కథవలెనే యున్నది. ఈ కథ లన్నింటియందును నొకరాజు ఇరువురు భార్యలు. పెద్దభార్యకుఁ గుమారుఁడు. రాజులేని సమయమున కారణాంతరములచే నాకుమారుఁడు రాజు చిన్నభార్య యంతఃపురమున కరుగుట, ఆమె వలచుట, ఇతఁడు నిరాకరించి నిరసించుట, ఆమె భర్తతోఁ గల్పించి చెప్పుట, రాజు కుమారుని కాలుసేతులు ఖండింపించి చంపించుట, తప్పక యున్నది.

తెనుఁగున నీకథ భారతాంధ్రీకరణమునకుఁ గారణభూతుఁడైన రాజరాజనరేంద్రున కంటఁగట్టబడినది. గౌరన వ్రాసిన కథయందు స్థలము మాళవదేశము. రాజధాని మాంధాతపురము. చేమకూర వేంకట కవి సంశయాస్పదముగ వ్రాసినాఁడు. రాజనరేంద్రుఁ డని ముందు పేర్కొనినాఁడు. తరువాత

మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
రాజరాజనరేంద్రుఁడు రాజరాజు
నవఁగఁ బేరెన్నికకు నెక్కె యతిశయిల్లు
నింద్ర విభవుండు రాజమహేంద్ర విభుఁడు

అని వ్రాసినాఁడు. మాళవపతి యని పేర్కొనుచు రాజమహేంద్ర విభుఁ డని చెప్పుట వానినే రాజరాజనరేంద్రుఁ డనియు, రాజరాజనియుఁ

జే రెన్నిక గన్నవానిగా నిరూపించుటను బట్టి వేంకటకవికే యీ విషయమున నిశ్చితమైన యభిప్రాయము లేదని చెప్పవచ్చును. కథను నాంధ్రదేశమునకు సంబంధించినదిగాఁ జిత్రించుటకుఁ దగిన యత్నము కొంత వేంకట కవిలో నున్నది. వీనికిఁ గొంచెము తరువాతవాఁడైన కాకునూరి అప్పకవి తన లక్షణగ్రంథమునకుఁ బీఠిక వ్రాయుచు "గ్రంథ ప్రభావ" ముగ్గడించు సమయమున "రాజరాజనరేంద్ర తనూజుఁ డార్యసఖుఁడు సారంగధరుఁడు" అని పేర్కొనినాఁడు. ఈ రాజరాజనరేంద్రుఁడు భారతాంధ్రీకరణమునకు నన్నయ్యను నభ్యర్థించినవాఁడు గాక మహోకఁడు గాఁడు. అప్పకవి మతము ననుసరించి వానికుమారుఁడే సారంగధరుఁ డనవలయును. ఇంతకుఁ బూర్వమే బాలభాగవత కర్త దోనేరు కోనేరు నాథకవి కృతిపతి వంశానుచార వర్ణనాసందర్భమున 'విమలాదిత్యుఁడు భానుమతియందు రాజరాజనరేంద్రుని గనె ననియు, ఆతఁడు రాజమహేంద్రవర మను పేర నొక పట్టణముఁ గట్టించి యదియే రాజధానిగా వేంగీదేశమును బాలించె ననియు, వాని కుమారుఁడే సారంగధరుఁ డనియు, అతఁడు "ఆసక్తి బినతల్లియైన చిత్రాంగి, చేసిన యాపదఁ జెచ్చెర గడచి, యనఘుఁడై చౌరంగి యను సిద్ధుఁడయ్యె" అని వ్రాసి యున్నాఁడు. కూచిమంచి తిమ్మకవి యీ సారంగధరుని కథ గోదావరి యొడ్డున రాజమహేంద్రవరముననే జరిగినట్లు స్పష్టముగా వ్రాసి యున్నాడఁట. కనుక నీకథ కాంధ్రదేశముతో నవినాభావ సంబంధ మేర్పాటు చేయవలయు నన్న ప్రయత్న మందరిలోనను గలదు.

ఈ కథ యొక్క పుట్టు పూర్వోత్తరము లాలోచించుదము. ఈ కథ కల్పితమే గాని యథార్థముగాదు. యథార్థమే యైనచోఁ బైన నిరూపింపబడిన సందిగ్ధత యుండదు, కల్పనకును నొక కారణ ముండవలయును. ద్రావిడులలో మేనమామ కూతు నుద్వాహమగుట విధి. ఇది యనాది సిద్ధము. వరుఁడు బాలుఁడై యున్నపుడు యుక్తవయస్సు

వచ్చిన యావధువును నా బాలునితండ్రి వివాహమాడి యామెతో సంసారము చేసి సంతానమును గనును. తన కుమారునకు యుక్తవయస్సు రాఁగనే యామెను, నామె సంతానమును గుమారున కప్పగించును, నాఁటినుండి యామె యితని భార్య. ఆ సంతానము వారి సంతానము. ఇందుకుఁ బోద్బలకముగా బ్రౌను దొర తన నిఘంటువున 'కోడలు' అను శబ్దమునకు 'చిన్నభార్య' (కోడి = చిన్న; ఆలు = భార్య) యనియు, మామ యను శబ్దమునకు, భర్త యనునది యర్థ మనియు వ్రాసెను. తమిళ, కన్నడ, భాషలలో 'మగన్' అనఁగాఁ గొడుకని యర్థము, మనకు మగఁడనగాఁ భర్త యని యర్థము. కొంతకాలము కుమారుడుగా నుండి తరువాత యతఁడే భర్తయగు నాచార మున్న యీ మన ద్రావిడులలో 'మగ' శబ్దమును భర్త యను నర్థమునఁ గొందఱు కుమారుఁడను నర్థమునను వాడుచున్నారు. ఈ సంప్రదాయ మౌత్తరాహులైన యార్యులకు నచ్చినది కాదు. వారి నాగరికతా సిద్ధాంతములకు నిది నింద్యము. న్యూనము. "మాతుల కన్యోద్వాహఃనింద్యః" అని వారి ప్రచారము. ఇట్టి ద్రావిడుల యాచారమును నిర్మూలించుట కార్యులు కొన్ని గాథల నల్లి యుందురు. అట్టి కథలలో నీ సారంగధరుని కథ యొకటై యుండును. ఈ కథయం దార్యసంప్రదాయము చెప్పి ద్రావిడులను సంస్కరించు ప్రయత్న మున్నది. బహుభార్యలను గలిగి యుండుట దోసఁగు కాదు. తండ్రి భార్యలందఱును గుమారునకు దల్లి వంటివారే. వారియందుఁ గామేచ్ఛ బొడమరాదు. అసలు పెర స్త్రీ జన మందే యట్టి దృష్టి కలుగరాదు. ఆ దృష్టి తత్క్షణము శిక్షింపఁబడవలయును. ఈ కథ యందదే జరిగినది. సారంగధరుని పినతల్లి యే యతనిని గామించినది. అతఁడు నిగ్రహించుకొనినాఁడు. ఆమె తన భర్తకుఁ గల్పించి చెప్పినది. అతఁడు సహించలేక కుమారుని కాలుసేతులు ఖండింపించినాఁడు. ధార్మిక ప్రవృత్తిగల సారంగధరుఁడు

శిక్షింపఁబడినచో ధర్మమే శిక్షింపఁబడినట్లు. ఆర్యమతమున కది విరుద్ధము. కనుక సారంగధరునకుఁ దిరిగి కాలుసేతులు వచ్చినట్లు చిత్రించుట జరిగినది. ఈ కథా నిర్మాణమునందలి భాగము ద్రావిడ సంస్కరణమున కుపస్కారకముగాఁ గల్పింపఁ బడినది. ఈ కథను నుత్తరదేశ సంబంధిగానే వారు చిత్రించి యుందురు. "మహాత్ముల కథలను, మహాపురుషుల జీవితములను దమ తమ యభిజనములకు ననుసరించు స్వప్నములకు నతుకు పెట్టుకొని యానందించుట మానవ స్వభావము" (శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి)మగుట మన యాంధ్ర కవులు దానిని రాజరాజ నరేంద్రున కంటఁగట్టి యుందురని తలఁచుట సమంజసము.

నవనాథచరిత్రమునందలి కథ. — రాజు రాజమహేంద్ర విభుఁడు. అతఁ డనపత్యుఁడు. శివునిగూర్చి సేవించెను. స్వప్నమున శివుఁడు ప్రత్యక్షమై పట్టపుదేవి యైన రత్నాంగికి సుతుఁ డుద్భవించు ననెను. ఆమె గర్భభరాలస యైనది. కుమారుని గన్నది. అతని పేరు సారంగధరుఁడు. యౌవనప్రాప్తి యైన దానికి. ఘూర్జర రాజపుత్రి యైన మంగళాంగితోఁ బరిణయ మైనది. ఒకనాఁడు రాజమహేంద్రుఁడు వేటాడుట కడవికిఁ బోయెను. సారంగధరుఁడు పావురముల యాట్ల యాడుచుండెను. ఆతఁ డెగురవేసిన పావురము రాజమహేంద్రుని భోగసతి చిత్రాంగి యంతఃపురమున వ్రాలినది. దానిని దెచ్చుకొనుట కాతఁ డుద్యుక్తుఁడాయెను. సుబుద్ధి వారించెను. ఇతఁ డాతని మిత్రుఁడు. సారంగధరుఁడు వినక వెళ్ళెను. చిత్రాంగి వానిని శృంగారక్రీడకు దించుటకు యత్నించెను. అతఁడు తిరస్కరించెను. ఆమె బెదరించినది. లాభము లేదు. తరువాత రా జరుదెంచెను. చిత్రాంగి సారంగధరుని పై నేరారోపణ చేసి చూపినది. రా జాగ్రహించినాఁడు. సారంగధరుని బంధించి నఱుకుట కాజ్ఞ యిచ్చినాఁడు. మంత్రి మతిమంతుఁ డాలోచించవలసిన దిగాఁ గోరినాఁడు రాజును. కాని లాభము లేకపోయినది. సారంగధరుఁ

డు శిక్షింపఁబడినాఁడు. శిక్షను బొంది విలపించు సారంగధరునకు నాకాశవాణి వాని పూర్వకథను జెప్పినది. అంత మత్స్యేంద్రుఁడను సిద్ధుఁ డా రాకుమారుని యార్తనాదము విని వచ్చి తన మహిమవలనఁ గాలుసేతు లిచ్చి సిద్ధులలోఁ గలుపుకొనెను. చేమకూర వేంకటకవియు నీకథనే గ్రహించెను. చిత్రాంగిని రాజుగారి 'భోగ కుటిల శిరోజా తిలకము' అనియే వ్రాసెను. సారంగధరుని భార్యపేరు మంజువాణి యని మార్చెను, కాని, 'ఘూర్జరాధిపు గారాబుఁ గొమార్తె' గానె యుంచెను. బాణాల శంభుదాసుఁడు మాత్రము గొప్ప మార్పు చేసినాఁడు. సారంగధరునకు వివాహము చేయుటకుఁ గన్యల నన్వేషించుచుండఁగ, చిత్రాంగి చిత్రపటము రాజు చేతఁ బడినది. రా జామె యందు బద్ధానురాగుఁడై ఖడ్గమును బంపి వివాహకార్యము నెఱవేర్చి చిత్రాంగిని దనభార్యగాఁ జేసికొనినాఁడు. చిత్రాంగి తాను చూచిన చిత్రము నందలి వాఁ డీ రాజమహేంద్రుఁడు కాకునికి సందేహించి చెలికత్తెలవలన సత్యమెఱిఁగి సమయమునకై నిరీక్షించుచుండెను. అని వ్రాసి తరువాత వెనుకటి కథల వలెనె కలిపెను. కూచిమంచి తిమ్మకవియుఁ జిత్రాంగిని రాజు రెండవ భార్యగనే చిత్రించెనఁట.

ఇఁకఁ బ్రకృతము. శ్రీరామకృష్ణమాచార్యులవారు నవనాథ చరిత్ర, సారంగధరచరిత్రము లందలి కథనే గ్రహించిరి. కొన్ని మార్పు లున్నవి. చిత్రాంగిని రాజుగారి చిన్నభార్య యనిరి. ఆమె భోజరాజ పుత్రిక యని పేర్కొనిరి. సారంగధరుని భార్యపేరు చంద్రకళ యనిరి. ఆమె విదర్భరాజపుత్రిక యఁట. రాజాజ్ఞచేతఁ గాలుసేతులు నఱుకఁబడిన సారంగధరుఁడు పూర్వగ్రంథము లందువలె నిందుఁ దిరిగి బ్రతుకలేదు. కనుకనే ఇది విషాదసారంగధర మైనది. విషాద సారంగధర యనునది విషాదాంతమైన సారంగధరుని చరిత్ర యనుట. ఈ విషాదాంత మను శబ్దము "ట్రాజెడి" అను నాంగ్ల శబ్దార్థముగా నుపయుక్తము. 'ట్రాజెడీ

యనునది గ్రీకుల నుండి యాంగ్లేయుల కెక్కినది. గ్రీకు వాఙ్మయమున ట్రాజెడీ చరిత్ర విచిత్ర గతులలో గమించినది. ఆంగ్లమునను నది భిన్న గతులఁ బురోగమించినది. సేక్స్పియరు కాలమున దాని కొక స్థిరత్వ మేర్పడినది. వాఙ్మయము మానవ జీవిత ప్రతిబింబము. హైందవ మానవ జీవితమునకును పాశ్చాత్యుల జీవిత విధానమునకును జాల యంతర మున్నది. అదే వాఙ్మయమునను బ్రతిబింబించినది. హైందవ వాఙ్మయము ధర్మప్రతిష్ఠాపనమున కేర్పడినది. ధర్మమునకు విషాదాంతత్వము పట్టదు. కనుకనే యార్యవాఙ్మయమున నది లేదు. సాంఘికములైన నీతి నియమములే ధర్మమునందలి యంశములు. ధర్మస్థాపన కావ్యమది యొక విధి. అది కావ్యప్రయోజనములం దొకటి. ఎట్టి క్లిష్ట పరిస్థితులయం దైనను ధర్మమునకే విజయ మని మానవ విశ్వాసము. అది భంగింపఁబడఁగూడదు. ఇది భారతీయుల నరమున కంటుకొనిన భావము. ధర్మ వ్యతి క్రమమును వారు సహింపరు. అధర్మ విజయము వారికి నరక తుల్యము. కావ్యమునకు నాయకుఁడు కాఁదగినవాఁ డుదాత్తత గలిగి యుండవలెను. అట్టి వాని గాథ ట్రాజెడీ కారాదు. ఇది సిద్ధాంతము, పాశ్చాత్య పద్ధతి వేఱు. అనఁగా జీవన పద్ధతిగాదు. దానిని దర్శించు పద్ధతి. మానవుఁడు పరిపూర్ణజ్ఞానము కలవాఁడు గావలెను. ఎంత పరిపూర్ణుఁ డైనను నొక లోప ముండక తప్పదు. దాని వలన వాని పరిపూర్ణత యంతయు నశించును. చివరకు వాఁడును నశించును. కనుక జనులు జాగరూకులై దానిని గూడ సవరించుకొనవలెను. లేనిచోఁ బతనము తప్పదు. ఈ నగ్నసత్య నిరూపణమునకే వారు ట్రాజెడీలను సృష్టించినది. సత్యమే వాఙ్మయమునం దైనను నిరూపింపఁ బడవచ్చును. ఆంగ్ల వాఙ్మయ పరిచయ మేర్పడు నంతకు నిట్టి పద్ధతి మనకు లేదు. నేఁ డేర్పడినది. దీనికి హేతు భూతులు శ్రీరామకృష్ణమాచార్యులవారే వీరితో పాటు శ్రీ శ్రీనివాసరావుగారును గూడ.

ట్రాజెడీ యనఁబడు నీ నాటకమునకు సిద్ధి పాశ్చాత్య విమర్శకుల దృష్టిని, కలుగునో కలుగదో పరిశీలించవలయును. The tragic hero is a person neither eminently virtuous or Just, nor yet involued in crime by deliberate vice or Villany but by some reason of human frailty. (ARISTOTLE) ఇది యొక నిర్వచనము. అంగీకరించక తప్పదు. నాయకుఁ డుదాత్తత కలిగి యుండి మానవ సహజమైన యొక దౌర్బల్యముచేత దోషనిర్వహణమునకు మొగ్గవలెను. దీనిని నిర్వహించుటలో నిరు తెఱఁగు లున్నవి. నాటకము లోని పాత్రలలో నొక దానితో నాయకునకు విరోధము కల్పించుట మొదటిది. నాయకుని మనస్సు నందు విరుద్ధ భావద్వయము సన్నిహిత సంఘర్షణ ప్రతిపాదనము ద్వితీయము. ఇది యుత్తమము. షేక్స్పియరు ట్రాజెడీలయం దిదియే యనుసరితము. నాయకుఁ డీనాటకమై సామాజికుల సానుభూతికిఁ బాత్రమై నాటకసిద్ధికిఁ గారకుఁడు కావలెను. అందుకుఁ దగిన యుదాత్తత—చిత్తసంక్షోభము ప్రదర్శింపఁబడవలెను. ట్రాజెడీకి సంబంధించిన మూలసిద్ధాంతము. ప్రకృతము విమర్శనైన 'విషాద సారంగధర' నాటకమున నాయకుఁ డెవరు?— 'ఈనాటకము నందలి ముఖ్యపాత్రలు' అను చోట 'రాజనరేంద్రుఁడు — కథానాయకుఁడు' అని వ్రాయఁబడియున్నది. నాటకమున కుంచిన నామమును బట్టి సారంగధరుఁడు నాయకుఁ డనవలెను. ఇతనిలో నాయకుని లక్షణములు లేవు. చైతన్యము లేని రాతి బొమ్మవలె నున్నాఁడతఁడు. అతనిలో నొక యుదాత్తత లేదు. చిత్త సంక్షోభము లేదు. ప్రధానాంశము లే లోపించినవి. ఆ పావురము లాట — చిత్రాంగి విషయమన్యులకు జెప్పకుండుట — సంభవించిన దాని ననుభవించుటకు సిద్ధపడుట — సారంగధరుని నాయకునిగాఁ జేయుట లేదు. కేవలము మనోనిగ్రహము గలవాఁడుగా గనుపించుచున్నాఁడు. మనో నిగ్రహము మానవ సహజమైన యొక బలహీనత గాదు. ఆంగ్లము నందలి ట్రాజెడీ

లలో నిట్టి నాయకుఁడు కానరాఁడు. నాయకుని మరణమే ట్రాజెడీ కాఁ జాలదు గనుక నాటకమున సారంగధరుఁడు మరణించినను, ఈ నాటకమునకు ట్రాజెడీతనము పట్టదు. కనుక నీ నాటకము ట్రాజెడీ కాదు. సామాజికుల సానుభూతికి సారంగధరుఁడు పాత్రుఁడు కాఁడు. యథార్థమును వాకొన నేరక పోవుట సారంగధరుని పతనమునకు హేతువైనది. సామాజికులకు నాయకునియందలి యీ బలహీనత యుదాత్తముగాఁ గనుపించుట లేదు. కనుక నాయకునియందు సామాజికులకుఁ గరుణ బొడముట లేదు. అనఁగా నతనిలో ట్రాజెడీకిఁ దగిన నాయకునితనము లేదు. నాయకునిలోనే యీ తనము లేనపుడు నాటకమునం దుండ కుండుట కను సహజము. ఈ నాటకము ట్రాజెడీ కాదు. ఒకవేళ సారంగధరుఁడే నాయకుఁ డనియు మరణించినాఁడుగనుక ట్రాజెడీ యనియు ననుకొనినచో నీ నాటకము పంచమాంకము 53 అనుబంధమున "మురారిదానవవిరామ కేశవ" అను గేయముపాడి సారంగధరుఁడు మరణించుటతో సమాప్తము కావలయును. కాని నాటక మట్లుగాక కొంతముందునకు సాఁగినది. అందు రాజనరేంద్రుని పశ్చాత్తప్త హృదయాంతర్గత భావ వ్యక్తీకరణము జరిగినది.

కథానాయకుఁడు రాజనరేంద్రుఁడను పక్ష మొకఁడున్నది. పూర్వరంగము నందలి విభావసుఁ డను బ్రాహ్మణుఁడు "మజిలి నీవు విదర్భకు, నే భోజపురికిం బోయి చంద్రికలను సారంగధరునకుఁ జిత్రాంగిని ననకు (రాజనరేంద్రునకు) నిశ్చయించి రావలయునఁట" అని హాస్యుఁ డను వానితోఁ జెప్పుట వలన రాజనరేంద్రునిలో మోహాశృంగార ప్రకోపనము బలహీనత స్థాపించఁ బడినది. ఇఁక నాటక మంతయు దీని నాధారముగఁ జేసికొని క్రమ వికాసము నందవలయును. ఈతని ప్రణయస్కృతిలోని స్త్రీప్రలోభము చిత్రాంగిని బలితీసికొనినది. వ్యక్తి నిష్ఠమైన ప్రవృత్తులలో వైవశికమున కంటె సామాజికము శక్తము. చిత్రాంగి

శారీరక ప్రవృత్తి రాజనరేంద్రమనోనుకూల మైనను మానసికము మాత్రము సారంగధరునిలోఁ బర్యవసించు టనివార్యమైనది. ధర్మాధర్మ విచక్షణ మందులేదు. సారంగధరుని ప్రవృత్తులు రెండును ధర్మబద్ధములు. గనుకనే సారంగధరుని లోఁబఱచు కొనవలయునను చిత్రాంగి యత్నమున్నృథయైనది. అనఁగా ధర్మమువీఁద విజృంభించిన యధర్మము మొక్కవోయినది. వెంటనే ప్రతీకారదృష్టికలిగినది ధర్మమునకు. అనఁగాఁ జిత్రాంగికిఁ దత్ప్రతీకార నిర్వహణ బాధ్యత తనను ప్రేమించి పఱచిన రాజనరేంద్రుని పైననే పెట్టినది. ఈప్రుట్టుటలో రాజనరేంద్రునిలోఁ గల మోహ శృంగార ప్రలోభ చేతస్కత కనుకూలముగ సారంగధరునిలోని రాక్షసమైన కాముక చిత్తవృత్తి తనయందు స్థాయి నందుకొనిన దని నిరూపించి, తత్క్షణము రాజనరేంద్రుని యున్మత్తుని గావించి కార్యోన్ముఖమునకుఁ బ్రేరణ మొనర్చి, చిత్రాంగి చిత్రాంగిగా నిలచిపోయినది. స్త్రీ విషయ కాల్యము గల రాజువెంటనే దౌష్ట్యమునకుఁ బూనుకొన వలయును. అపుడే ట్రాజెడీ రక్తమంతము. కాని రాజన్లు చేయక న్యాయస్థానమున విచారణచేయించి నేరము ఋజు వైన దని సారంగధరుని శిక్షించినాఁడు. ఇందు రాజనరేంద్రుఁడు ట్రాజెడీ నాయకుఁడుగా గాక న్యాయమును బాలించు చక్రవర్తిగా దర్శన మిచ్చుచున్నాఁడు. కనుక నాటక మిచట ట్రాజెడీతనము కోలుపోయినది. ఆ న్యాయ విచారణ పైనను జాల యసందర్భముగ నున్నది చిత్రాంగి నిదురలోఁ గలవ రించిన దానిని బట్టి సత్యమును గ్రహించిన రాజు చిత్తసంక్షోభమునకుఁ దగిన పుష్టి యా న్యాయవిచారణ మున్నందున కలుగలేదు. అయినను నీడు.గాని వివాహము దుఃఖహేతు వను నాయకుని వాక్యము లందొక నైరాశ్యము గోచరించు చున్నది. రాజనరేంద్రుఁడు తన పశ్చాత్తాపము నిష్ప్రయోజన మని జీవితమును రోసి మృత్యువు నాహ్వానించుకొనినచో వానిలో ట్రాజెడీకిఁ దగిన నాయకునితనము ప్రదర్శిత మయ్యెడిది. కాని

అట్లుగాక "యీడుగాని వివాహమొందును దగద" ని "దుఃఖముతో నిష్క్రమించు"ట నాటక సిద్ధికి భంజకమైన దనియే చెప్పవలసి వచ్చు చున్నది. ఎట్లైన నీ నాటకమునకు నాయకుఁడు సారంగధరుఁ డనుట కంటె రాజనరేంద్రుఁడనుటయే యుచిత మని తోఁచుచున్నది. అపుడే ఇది ట్రాజెడీ యని చెప్పుటకు వీలు కలుగును.

ఇఁక నిర్వాహణ శిల్పము. అన్ని యితివృత్తములును నాటకము నకుఁబనికిరావు. పనికివచ్చిన యితివృత్తమును నాటక మర్యాదల ననుసరించి నాటకసిద్ధికిఁ గారణభూతము లగునట్లు విభజించుకొని రసపర్య వసితము పరమావధిగా నాద్యంతమును నడుపించుటయే నిర్వాహణ శిల్పము. దీనికీ భారతీయాలంకారికులనిర్వాహణ సంధితోఁ బ్రసక్తి లేదు. ఇట్లని నిర్వాహణశిల్పమున జెప్పబడిన యంశములందుఁ జేరకపోవు. పాశ్చాత్యులు పేర్కొనిన మైక్యత్రియమునందును, వస్త్వైక్యము ముఖ్యము. దేశ కాలైక్యములు తరువాతవి. ఈ సారంగధర నాటక మున వస్త్వైక్యము పాటింపఁబడిన దనవచ్చును. అనఁగాఁ గథకు సంబంధించని యితివృత్త ప్రసక్తి యంతగా లేదనుట. ప్రథమాంకమున రాజ నరేంద్రుఁడు సారంగధరుని బిలిపించి రాజనీతియు, ప్రభుత్వభంగియు నలవఱుప వలెనని నిన్ను బిలిపించితి. ఎట్లును నీవింకఁ గొన్నిదినముల లో నీ భద్రపీఠము నారోహింప నున్నాఁడవు గదా" అనుట వలననే నిరంతరము పావురము లాటలాడుకొను సారంగధరుఁడు తండ్రి వేటకుఁ బోయియుండఁగా దిరిగి వచ్చినవెంటనే రాజ్యాభిషేకము చేయు ననియు నంత నీయాటలకు వీ లుండ దనియు, రాజు రాకపూర్వమే నా యాట లాడుట కుపక్రమించినాఁడు. వింధ్యాటవినుండి వచ్చిన ఎఱుకవాని యాహ్వాన మంగీకరించి రాజు వేటకుఁ బోవుట వలననే సారంగధరున కా యవకాశము చిక్కినది. రాజు లేఁడు గనుకనే తన నగరున వ్రాలిన పావురమును బంధించి, దాని కొఱకు వచ్చిన సారంగధరునితోఁ దన

మనోభావముల వెల్లడించినది చిత్రాంగి. ద్వితీయాంకమునఁ బ్రధమ రంగ మంతయుఁ జిత్రాంగి మనోభావములకును సారంగధరుని చిత్త స్థైర్యమునకును సంఘర్షణ. ఇంత సంఘర్షణము జరిగినను సారంగధరుఁడు లోఁబడమి. చిత్రాంగిలోని పాశవిక ప్రకృతి విజృంభించి రాక్షసముగా మారి, ప్రతీకారదృష్టిని బ్రేరేఁచినది. కనుకనే ద్వితీయ రంగమున వేటనుండి వచ్చిన రాజనరేంద్రుని యెదుట దుఃఖాతిశయ మభినయించి రాజునకు నమ్మిక కలిగించి చిత్రాంగి రాజుచేత

"వాని గండింతు ఖండింతుఁ బఱతుఁ జెఱుతుఁ
గడగి చంపుదు నొంపుదుఁ గలఁతు నలఁతు
చెరల నడఁతును బొడుతు వధింతుఁ ద్రుంతు"

అని యున్మత్తునిఁజేసి పలికించి కార్యరంగమునకుఁ బంపినది. రాజుదిగ్రస్తుఁడై నాఁడు. కాని మంతిమంతుని ప్రేరణమున సారంగధరుని ప్రత్యుత్తరమును బట్టి, రాజు చిత్రాంగిని శంకించినవాఁడు వలె నామెతో "ఎట్లు జరిగినదియుఁ బ్రమాణ పూర్వకముఁ జెప్పవలయునని- సారంగధరుఁడు నిన్నే మఱల నడుగుచున్నాఁ"డనఁగనే యామె "రాజేంద్రా! నన్నేల యడిగెదు! సారంగధరుఁడు నిరపరాధి. నే నపరాధిని ననుఁ శిక్షింపుము" అని జాణతనము నెఱపుటతో రాజు చిత్రాంగిని బూర్తిగ విశ్వసించి సారంగధరుని బంధించుట కాజ్ఞ యిచ్చినాఁడు. దీనితో తృతీయరంగము పూర్తి. సారంగధరుని నేరము విచారింపఁ బడినది. తృతీయాంకమున నీ న్యాయవిచారణ మట్టి తరుణమున నుచితము గాదనియు నందువలననే రాజనరేంద్రుఁడు టాప్రెజెడీ నాయకుఁడుగా గాక చక్రవర్తి వలెనె దర్శనమిచ్చుచున్నాఁడని వెనుక చెప్పియుంటిని. ఈ న్యాయవిచారణ మంతయుఁ బాశ్చాత్య పద్ధతి ననుసరించినదై జిగిగాని బిగిగాని లేనిదైన. ఈ నాటకమున వస్త్వైక్య మనుభంజించిన దీ విచారణయే. నాటక కర్త న్యాయవాది గనుక నీ యంశమును జాల పెంచినాఁడు. కాని రక్తి

మంతము గాలేదు. న్యాయవాదులైన "ఉద్దండ, సదయుల" వాదములు శక్తములు. ఉపన్యాసములు మాత్ర మతి దీర్ఘములు. అందు సగ ముపోద్ఘాతములు. పావురమునకుఁ బోయినవాఁడు కవచాదులఁ దీయఁ గారణ మేమి" అని ప్రశ్నించి నేరము స్థాపించిన యుద్దండునకుఁగాని ప్రతి పక్షికిఁగాని యీ కవచాదులను న్యాయస్థానమునకుఁ దెప్పించవలయు నను భావమే కలుగలేదు. ఆపావురము నాతఁడు తీసికొని పోయినాఁడా లేదా యను ప్రశ్నలే లేవు వారికి. చివరకు నేరము ఋజువైన దనిరి. తృతీయాంకము సమాప్తము. నాటకమున నేర్పడవలసిన కరుణ సంత్రాసముల కీయంకము కేవలము భంజకముగా సృష్టింపఁ బడినది. శిక్షాప్రాప్తుఁడైన సారంగధరుని తలవరులు గొనిపోవు చుండఁగా రత్నాంగి ప్రవేశించి విలపించుటతోఁ జతుర్థాంకము ప్రారంభము. ఈ విలాపము వస్త్వంతర్భాగమేగాని రక్తిగట్టుట లేదు. దానికిఁ గారణము రచనా "శిల్పము"నందలి వాచిక లోపము. తరువాత చిత్రాంగి రాజనరేంద్రునితో సారంగధరుని క్షమించ వలసినదిగాఁ జెప్పుట రాజు చిత్త సంక్షోభమునఁ జిత్రాంగిని దూషించుట ట్రాజెడీకి పుష్టిఁ నిచ్చినవి. పంచమాంకమునఁ జిత్రాంగి కలవరింతల మూలమున విషయము విశదమైనపుడు రాజు కలఁగుండున డుట-చిత్రాంగిని ననుమానించి దూషించి-కుమారుని రక్షించుకొను నుద్దేశమున నడవికి పరుగుదీయుట చేతులు కాలినతరువాత యాకులు కొఱకు వెతకినట్లై, సామాజికుల సానుభూతికి రాజనరేంద్రుఁడు పాత్రుఁడైనాఁడు. కార్యము మేరమీఱిన మీఁదట పూర్వాపరములను దలఁచుకొనిన రాజునకుఁ జిత్త సంక్షోభము మధికమైనది. దానితో నతఁడు నిరాశా నిస్పృహాలతో జీవితమును రోయవలసి యుండెను. మరణించుటయే మే లనుకొనుస్థితికి రావలసియుండెను. కాని యట్లుగాక 73 ద్విపద సంక్తులలో "ఈడుగాని వివాహమెందును గా" దని నీతిని ప్రేక్షకులకు బోధించుట యుచితముగా లేదు. నాటకమున మొదటనున్న బిగి తరువాత తరువాత లేదు.

నాటక మాద్యంతము రసపర్యవసితమగుటకు నిర్వహణ శిల్పము నం దంతర్భాగమైన రచనాశిల్పము సహాయకారి యగును. ఇది దేశకాల ముల ననుసరించి మాఱుచుండును. శ్రీరామకృష్ణమాచార్యులవారి కాలమునను నేఁటికిని చాల భేదమున్నది. వారీనాటకము 1887 వ సంవత్సరమునకు ముందు వ్రాయఁబడినది— ఆ సంవత్సరముననే ప్రప్రథమ మున బళ్ళారిలోఁ బ్రదర్శింపబడినదఁట. నాటిసామాజికులకు—నాఁటినాట కర్తలకుఁ బ్రాబంధిక రచనాశిల్పము పాథేయము. నేటివారి కది కంట గింపు. కనుక యీ నాటక మందలి రచనాశిల్పమును నాఁటిదృష్టితో విమర్శించవలయును. నాఁటి నాటకములలో పద్యములు తఱచు చుండెడివి· వానికిఁ దోడు పాటలుగూడ. నాఁటి వచనము నేఁడు గ్రాంథిక మనునది· కేవల వ్యావహారిక వచనరచనాసమ్మిశ్రితములైన నేఁటినాటకముల పరి చయము గలిగిన మన కాకాలపు నాటకములందలి గ్రాంథిక వచనము కొంత వింతగాఁ గనుపించక మానదు. ఆ వింతఁదనము కేవలము భాషా గీతముగాక నటకుల వాచికముమీఁదను నాధారపడియుండును. కనుక యీనాటకమునందలి వచనమునుగూర్చి యంతగా వ్రాయవలసినదిలేదు. కాని యొకవిషయము. ఈ నాటకమున వచనము శబ్దాలంకారములతో నంత్యప్రాసలతో నిండి సుదీర్ఘములై రససిద్ధి కంతగా సహాయకారు లగుటలేదు. అసలు నాటకములందు సంభాషణము మాటమీఁదమాట పెరిగినట్లుగా నుండవలయును. ప్రతిమాటయు శక్తిమంతముగా నుండ వలయును. ఈ సంభాషణ తీసివేసినను నాటకము నడచునుకదా యని యనిపించ రాదు. అందును ట్రాజెడీలయందు నిబిడబంధ మత్యధికముగా నుండవలయును. అది యీ నాటకమున లేదు. సారంగధరునియందు వలపునింపుకొనిన చిత్రాంగి తద్వ్యక్తీకరణమున కుద్యమించుచు హృద్య యాంతర్గతాందోళనము నిట్లు వ్యక్తముచేయును "చెల్లివంపుఁ దగులం పుఁదమిచే నేభయమును బాసి యెట్లయిన నీమనోహరాకారు లోఁబఱ

చుకొన నుద్యమింతును. తమకింతును. యోచింతును అయ్యో! నే నెంత ప్రేరేపించినను మాతృసమాన వనితాగమనమునకీ సుందరుఁ డొడఁబడునా యని చింతింతును. నంకింతును. పలవింతును. మహాద్రోహమే, ఘోరపాపమే, యని విలపింతును మఱియు నుంకింతును, తలంతును, వెతగాంతును. ఏమిసేయుదును." ఈ నాటకమున వచన మంతయు నీపద్ధతిలోననే యున్నది. తృతీయాంకమున న్యాయవిచారణ సందర్భమున న్యాయవాదుల వాదన లన్నియు కొన్ని పుటల కున్నవి. ప్రతి పాత్రయు పుటలునిండునట్లు భాషించుట ఈ నాటకమున నధికము.

ఇఁక పద్యముల విషయము. ట్రాజెడీలలో లయాన్వితమైన ఛందోగమనము భావరంజకత్వమున కత్యవసరము. ఈ విషయము పాశ్చాత్య విమర్శక సమ్మతమే. ఈ నాటకమున మొత్తము 62 పద్యములు, 73 ద్విపదపాదము లున్నవి. పద్యములలో 21 సీసములు. ఇవిగాక, రాగతాళనిరూపణముతో 56 పాటలున్నవి. ఇందలిపద్యము లందు సామాన్య దోష మొకఁడున్నది. వచనములోఁ జెప్పిన భావమునే పద్యములోఁ జెప్పుట. పావురమునకై వచ్చిన సారంగధరుని జిత్రాంగి ఫలహారము గైకొనుఁమనఁగా నతఁడు నిరాకరించినాఁడు. అంతఁ జిత్రాంగి "ఊరక కాకేమున్నది? వచ్చి యొక్కింత ఫలాహారము గైకొని మనసు రంజింపఁజేయు మన్న వల దని నిరాదరణ మొనర్చువానితో నేటిమాట" యని వెంటనే

"ఎన్నఁడును రాక వచ్చి మ
హోన్నతి నాకోర్కెదీర నుపహారముగై
కొన్నన్ బాగను మనవిని
మన్నింపని వానితోడ మాటలిఁకేలా"—

అనును. ఇట్లే సారంగధరుఁడు "అమ్మా సొరపడితివి. ఈ సమయమున నామాట లెందుకని యంటిఁగాక మఱియొక్కటిగాదు." అని వెంటనే

"అమ్మా యరిగా దీ సమ
యమ్మున నామాట లేటికంటివి గాదే,
సమ్మతి వడితివె యెఱుఁగవు
హామ్మా నానుడుల నిందుఁ బొరవడితివిగా"

అని యనును. ఇవి ద్వితీయాంకమున. ఇట్లింతటను గలవు. పంచమాంకమున సారంగధరుని శిక్షానంతరము రత్నాంగి విలాపము వచనమునను బద్యమునను నొకే విధముగా జరుగును. ఇట్టివి రసభంజకము లని వేఱుగాఁ జెప్పనక్కఱయుండదు. కనుక రచనా శిల్పవిషయమున నీ నాటకకర్త కంతిశక్తి యున్నట్లు గానరాదు-

ఈ పద్యరచనావిషయమున యీ నాటకమున మఱొక లోపమున్నది. అనుకరణప్రాయమైన పద్యరచన యది. వేటనుండి తిరిగి వచ్చిన రాజనరేంద్రుఁడు చిత్రాంగి దుఃఖాభినయము విశ్వసించుచు

"నిండు చందురుఁ బోలు నీ ముద్దుమోము
వనిత యే కారినుండు వాడఁగా జేసె"

అను సీసపద్యము కంకంటివాని యుత్తరరామాయణము చతుర్థాశ్వాసమునందలి (227)

"వెల లేని కళలతో వెలయు నీ నెమ్మోము
వనిత యే వికలుండు వాడుపఱిచె"

అను పద్యమున కనుకరుణ మేకదా-? పావురమును వదలి యాకసమున బోవు పారువమును సారంగధరుఁడు వర్ణించు

"గగనేందిరారామకయిసేయురవలచేఁ
బోలుపారుపాపటబొట్టనంగ"

అనుపద్యము చేమకూరవాని సారంగధరచరిత్రము ప్రథమాశ్వాసము నందలి (127)

"నవహారనంఘట్టనగ్రస్తపతయాళు
గగనలక్ష్మి హస్తకంబనంగ"

అనుపద్యమున కనుకరణము. కారాగారబద్ధుఁడైన సారంగధరుఁడు తన పేశలకుఁ బశ్చాత్తప్తుఁడగుచు

"పారావతములాట పనిబూని నాకునే
జెలమి నాడెడు బుద్ధి యేల గలిగె"

అనుపద్యము చేమకూరవాని ద్వితీయాశ్వాసములోని (145)

"పట్టు పాఱుమటంచుఁ బారావతంబును
నెకరికై నేనేల విడువఁ బోతి"

అనుపద్యమునకు సాలంకారానుకరణము. ఇట్టి వింకను పెక్కులు గలవు. ఉదాహరణము లనినచో గ్రంథ మంతయు నగును. చేమకూర వాని భావములే యీనాటకమున గద్యపద్యములం దధికముగా నున్నవి. నాటకకర్త గద్యపద్యములు రెంటెంటియందును శబ్దాలంకారములు, అంత్యప్రాసములు విరివిగా నుపయోగించినాఁడు. అవి నాటకసిద్ధికిఁ బుష్టి కలుగ చేయలేదు. ఇందలిపద్యములు కేవలము పద్యములుగా నుండి పోయినవి గానికవిత్వ మిముడ్చుకొనినవి గావు. అనఁగా యీ నాటకమున మేధాశక్తిచేత సంయతమును, సంభావితమును నై తంత్రీలయ సమన్వితభాషలో వ్యక్తీకరించఁబడిన మనోహరమును—నుత్కృష్టమును నైన, భావోద్వృత్తి కానరాదు. అనుకరణము నిజమునకు దోషము గానపోయినను రసనిష్పత్తికిఁ గారణభూతములు కాకపోవుటచేత లోపము గా భాసించుచున్నది.

నిర్వాహణ శిల్పమున మూఁడవ ముఖ్యవిషయము, పాత్రనిర్మాణశిల్పము. కావ్యజగత్తున నీ శిల్పప్రతిష్ఠ ద్వివిధము. పాత్రచిత్రణ మొకటి. పాత్రవర్ణనము రెండవది. దృశ్యకావ్యములందుఁ జిత్రణమే యుపాదేయము. ఈ నాటకమునఁ బ్రముఖపాత్రలు మువ్వురు. రాజనరేంద్రుఁడు— చిత్రాంగి— సారంగధరుఁడు. రాజనరేంద్రుఁడు కథానాయకుఁడు. నిజమున కీతనిపాత్ర టాజెడీనాయకునకుఁ దగినదే యైనను

చిత్రిణ మంతపరిపూర్ణముగ లేదు. అది రచనాశిల్పమువలనఁ గలిగిన లోపము. ప్రథమమున రాచకీవి కొంత ప్రదర్శింపఁబడినది. అటుతరువాత ట్రాజెడీనాయకుఁడై చక్రవర్తిగాఁ గొంతకార్యము నిర్వహించుట రసస్ఫోరకముగా లేదు. రాజోచితమైన యుదాత్తత వీనికున్నదని సారంగధరుని వాక్యములనుబట్టి యూహించుకొనవలయును. అంతియుగాని వానిచేతలలోఁ గానరాదు. వాని వాచికమునఁ బొడసూపదు. స్త్రీప్రలోభనే యీతని జీవితము. కుమారుని యందలి వాత్సల్యముకంటె నది యధికముగా ముందు కన్పట్టును. తుదకు వాత్సల్య మధిక మగును. కాని కార్యము మించిపోయినది. చిత్రాంగిచేతులలోఁ గీలుబొమ్మ రాజనరేంద్రుఁడు. ముందువెనుక లాలోచించు తత్త్వమున్నను కామాంధకారము కనుగప్పుట వలనఁ దుదవఱకు నాతనికి కనువిప్పు కలుగలేదు. తనవాతఁ గలిగియుఁ బ్రయోజనము లేకపోయినది. చిత్రాంగి పట్టినపట్టు నెగ్గించుకొను తత్త్వముగలది. నెగ్గకపోయినచో రాక్షసకృత్యమునకైనను దిగి యామె ప్రతీకార మొనర్పక యుండలేదు. ఆమెలో నుద్రిక్తత యధికము. మోహ మను నంతశ్శత్రువునకు మనస్సు సదుపదేశము చేయును. కాని యీమెయందలి యంతశ్శత్రువే బలవంతము. కనుక నాశత్రువునకు లోఁబడి యెట్టి ఘోరమునకైనను నీమె దిగును. ఆ కార్యము నెఱవేఱనిచో మోహాంతశ్శత్రువు ప్రతీకారాంతశ్శత్రువుగా మాఱి యామెను పసిపలఁ బురికొల్పును. తన్నిర్వహణమున కామె యశక్తులను శక్తులను జేసి నిలుపును. సారంగధరునిపైఁ గల యాగ్రహమున వానిని శిక్షించుటకు సహజముగ నశక్తుఁడైన రాజనరేంద్రుని శక్తునిగాఁ జేసి రంగమున దింపినది. విషయమునందలియౌదార్యము రాజనరేంద్రుఁడెఱిఁగిన వెంటనే ఫలిత మైనది. అచట నామె వీఁగినది. ఈమెపాత్ర యీనాటకమునఁ బరిపుష్టముగనే పోషింపఁబడినది. కాని రచనాశిల్పమందుకు దోహద మంతగా నీయలేదు. సారంగధరుఁడు ప్రతినాయకుఁ

డనవలయును. కాని వానిలో నా లక్షణములు లేవు. రాజకుమారుఁడు గదా—తదనుగుణముగా నైనను పాత్రచిత్రణము జరుగలేదు. పట్టాభిషేకము చేయ నుంకించిన తండ్రితో "నీవు మనిసంతకాల మాఁగుకొనుచుందు" నని సమాధానము చెప్పుట రాజకులోచితము గాదు. స్త్రీవిషయ లౌల్యము లేకపోవుటయే వీని యుదాత్తతకు హేతువు. ఇతర గుణవిశేషములా యుదాత్తతను భజించుచున్నవి. చిత్రాంగి విషయ మన్యులకుఁ జెప్పకుండ దాఁచి మరణమును గోరి తెచ్చుకొనినాఁడు. ఈతని తల్లి రత్నాంగి పరిదేవనమును బట్టి యీతఁ డొక యమాయకునివలె-పసివానివలెఁ గనిపించుచున్నాఁడు గాని మరొకటిగాదు. ఇట్టివానికి స్త్రీవిషయలౌల్యము లేకపోవుట సహజమైన బలహీనత వలె నున్నదిగాని యుదాత్తతగా లేదు. అమాయకతను మించిన గుణవిశేష మీ సారంగధరునిలో లేదు. సామాజికుల హృదయగ్రంథిని గదలించఁ గల భావనావ్యాపార మతనిలో లేదు. కనుక సానుభూతికిఁ బాత్రుఁ డగుటలేదు. మిగిలిన పాత్రలు కొన్నియున్నవి. ప్రముఖపాత్రలే యిట్లుండ పెరల విషయము తడవనేల?

ఆ కాలమున నీ నాటకమునకుఁ బేరుప్రఖ్యాతు లుండెడివి. ఆంధ్రమున నాటకరచన నాఁడే ప్రారంభము. అతఃపూర్వము నాటకములు లేకపోలేదు. సంస్కృతానువాదము లుండినవి. కాని తెనుఁగున స్వతంత్రరచన లంతగా లేవు. క్రొత్తగాఁ గల్పింపఁ బడిన యితివృత్తముతో స్వతంత్రముగా రచింపఁబడిన తెనుఁగునాటకము వావిలాలవాసుదేవశాస్త్రిగారి "నందకరాజ్య" మనియు, అది 1880 లో ప్రకటిత మైన దనియు జయంతి రామయ్యపంతులుగారు వ్రాసిరి. దానినిబట్టి యప్పుడప్పుడే తెనుఁగున స్వతంత్రనాటక రచన ప్రారంభ మైనదని యూహించవచ్చును. ఆచార్యులవారి యీ నాటకము 1887 లో గనుక ప్రాథమికావస్థలోనే యున్నదనుట నిర్వివాదము. దీనికిఁ గోడు రామకృష్ణమాచార్యులవారు

పురాణములనుండి కథను గ్రహించి పాశ్చాత్య పద్ధతిని వ్రాయుట కా నాఁడే యుపక్రమించిరి. కనుకనే దీనిస్థితి యిట్లున్నది. ఆంధ్రనాటకరచనావికాసమును సూచించుటకే సారంగధర నాటక ముపకరించును. కనుకనే యీనాటకమున నిర్వాహణశిల్పము మొక్కవోయినట్లు నిరూపించుట సత్యదూరము కాఁజాలదు. అన్నింటను బక్వదశ యొకనాఁడే రాదు. కొంతకాలము పట్టును. నాఁటివారుగనుక యీ మాత్రమైనను గృషిచేసిరి. నేఁ డసలు మెఱుకపట్టినది. క్రొత్త తెన్నులు వచ్చినవి. వచ్చుచున్నవి. ఇంకేవి నిలచునో-యేవికాలగర్భమునఁ గలియునో మన మూహించలేము. నాఁటిపరిస్థితులలో నాటక మంతకంటె వ్రాయఁబడదు. నాఁటిపండితులను మెప్పించుటకుఁ బ్రాబంధికశైలి గ్రహించక తప్పినదిగాదు. పామరుల నుద్దేశించి పాటలువ్రాయుట యనివార్యమైనది. తాను పాశ్చాత్య పద్ధతి ననుసరించవలయు ననుకొనుచుండుటచేత గ్రహించిన యితివృత్తమును ట్రాజెడీగా నిరూపించుటకు యత్నముచేసినాఁడు. అన్నివిషయములందును గొంతకుఁగొంత కృతకృత్యుఁడైనాఁడు. ఆకృషిని సహృదయముతోఁ బరామర్శించి తగవరితనము నెఱపవలసిన గురుతరబాధ్యత మనమీఁద నున్నది. కొంతవఱకు నేను బరామర్శించితిని. నాపరిశీలనా ఫలితమే యీ వ్యాసము. ప్రబోధ చంద్రోదయమునందలి

"పారిఁబారి నొప్పుసలాకల
నొరపిన కుందనపుఁ బాఁదియును బోలె సభన్
సరసుల సంఘర్షణమున
వరకవి కావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్"

అనుపద్యము నాకు ప్రబోధమై యన్నివిమర్శనా వ్యాసంగమున కుపక్రమింపఁ జేసినది. నా మేధ కందినంత వఱకుఁ దోఁచిన విషయము మీముందుంచితిని. గుణాగుణములు పరిశీలింపఁ బడును గాక!

నాకీ సదవకాశము లభింపఁ జేసిన యాంధ్రసాహిత్యపరిషత్కార్య

ఓమ్

# దీక్షాశంసలు

ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రి

చ. జిలిబిలి ముద్దుపల్కులకుఁ జిత్తము రంజిల, దేశభాషలం
దెలుఁగది లెస్స నాఁ బలికి, దివ్యచరిత్రుఁడు కృష్ణదేవరా
యలు తన తెన్గు కబ్బమున ఖ్యాతి గడించెఁ బ్రశస్తి మించె నీ
తెలుఁగు యుగాదినాఁడు వినుతించెద మ్రొక్కెద నాంధ్రభారతిన్. ౧

చ. హరిహరనాథు మెప్పుఁ గొనె నాంధ్రకవిత్వము రాజరాజుచేఁ
గరము నుతింపఁ గాఁబడియెఁ గావ్యప్రబంధరసజ్ఞు లెల్లరున్
బరవశులైరి రాయలును బల్లకి నెత్తె యుగాదినాఁడు త
ద్వరకవికావ్యవైభవము వర్ణనసేయుటధర్మమాంధ్రుఁడా ౨

మ. పరదేశీయుల దాస్యశృంఖలలలోఁ బాల్పడ్డ నాఁ డెల్ల రా
పరభాషాపరభావదాసు లయి కావ్యశ్రేణి నిర్మించి రా
సరియే, నేఁడు స్వతంత్రులై మనఁగ రాష్ట్రం బబ్బె జాతీయత
న్దిరుగ న్నిల్పఁగఁ జూడరేల? మదిలో దీక్షన్ గొనుం డిప్పుడే. ౩

---

చ. సరసకవిత్వ సంపదల చాతురి గల్గిన నన్నయాది ధీ
వరుల యమూల్యగ్రంథతతి ప్రాభవ మెల్లర కందఁజేయ మం
దిరమున నిల్పి ప్రాజ్ఞులకు దీప్తి నొసంగెడు నాంధ్రసాహితీ
పరిషదఖండవైభవము వర్ధిలుగావుత మీశరత్తునన్ ౪

మ వృథగాఁ గాలముఁబుచ్చు సోమరులకు న్విజ్ఞానదం బౌచు స
త్కథలం దెల్పుచుఁ గావ్యజాలముల సంస్కారంబు గావించుచున్
ప్రథితంబై చనె నా జయాబ్ద మటులే నానారసోల్లాసి మ
న్మథసంవత్సర మెల్లవారలకుఁ బ్రజ్ఞాప్రాభవం బిచ్చుతన్. ౫

లంకారము వాచ్యముగ నున్నది. ప్రియాస్తనముల సాదృశ్యము కల్గి యుండుటచే శత్రుగజకుంభస్థలములఁగూడ వీరు లానందము నొందఁగల్గినారు. ప్రియాస్తనములకును, గజకుంభస్థలమునకును నుపమాలంకారము వ్యంగ్యము—ఆయుపమాలంకారమున, ప్రియారతివలనఁ గలుగు నానందమును గజకుంభస్థలమర్దనముననే వీరులు పొందఁగలరా యనునట్లు వారికి యుద్ధమునందే యాదర మధికమైన దను నర్థము సిద్ధించి, వారి వీరత్వమునకు మెఱుఁగిడి, చమత్కారాధాయక మగుచున్నది. అందుచే నిచట వ్యంగ్య మగు నుపమాలంకారమునకే ప్రాధాన్య మని ధ్వనికర్త యభిప్రాయము.

మఱియొక యుదాహరణము.

తత్, తేషాం శ్రీసహోదర రత్నాహరణే హృదయ మేకరసం
బింబాధరే ప్రియాణాం నివేశితం కుసుమబాణేన".

అర్థము—శ్రీసహోదర రత్నాహరణే=లక్ష్మీదేవి పుట్టినసముద్రమునుండియే పుట్టిన రత్నముల నపహరించుటయందు, ఏకరసమ్=తన్మయతగల, తేషాం=ఇన్ద్రాదు లనేకవిధముల బాధించిన ఆరాక్షసుల యొక్క, తత్=(ఎన్నికష్టములనుండియైనను వెనుదీయని, అప్రసిద్ధమైన, హృదయం=హృదయము, కుసుమబాణేన=చాలకోమలమగు నాయుధములుగల మన్మథునిచేత, ప్రియాణాం=ప్రియురాండ్రయొక్క, బింబాధరే=దొండపండువలె నెఱ్ఱనైన యధరములయందు, నివేశితమ్=లగ్నము చేయఁబడినది.

వివరణము:—రత్నముల నపహరించుటకై సంకల్పించిన యంతఃకరణవృత్తివేఱు. ప్రియాబింబాధరలగ్నమైన యంతఃకరణవృత్తి వేఱు. అయినను వాని కభేదముఁ జెప్పుటచే నిచట సతిశయోక్త్యలం

కారము వాచ్యము. ప్రియాబింబాధరము సకలరత్నసారతుల్య మగుటచే వారి కచట నాదరము కల్గినది. బింబాధరములు సకలరత్నసారతుల్యము లను నుపమాలంకార మిచట వ్యంగ్యము. ప్రతీయమాన మగు నా యుపమయే యిచట చమత్కారాధాయక మగుచున్నది.

అలంకారధ్వని యప్రధానముగ నున్న యుదాహరణము.

చంద్రమయూఖైర్నిశా నలినీ కమలైః కుసుమగుచ్ఛైర్లతా
హంసైశ్శారదశోభా కావ్యకథా సజ్జనైః క్రియతే గుర్వీ".

అర్థము-చన్ద్రమయూఖైః = చన్ద్రకిరణములచేత, నిశా = రాత్రియు, కమలైః=కమలములచేఁ నలినీ= తామరతీఁగెయు, కుసుమగుచ్ఛైః=పుష్పగుత్తులచేత, లతా=తీఁగె, హంసైః=హంసలచేత, శారదశోభా=శరదృతుకాంతియు, సజ్జనైః= సత్పురుషులచే, కావ్యకథా= కావ్యకథయును, గుర్వీ=గొప్పదిగ, క్రియతే=చేయఁబడుచున్నది.

వివరణము :- చన్ద్రమయూఖాదులచే నిశాదులకు శోభాతిశయము కల్గుచున్నది. రాత్రి యనునది లేనిచో, చన్ద్రమయూఖాదులకు మాత్రము శోభ యెట్లలవడును ? కావ్యకథ లేనిచో సజ్జనులయొక్క సజ్జనతమాత్ర మేమి? ఇట్లు నిశా చంద్రాదులు పరస్పరము శోభాజనకములు. చన్ద్రమయూఖములవలన రాత్రికిఁ గలుగు భాస్వరత్వము, సేవ్యత్వములు, కమలములవలనఁ దీఁగెకుఁ గలుగు శోభా పరిమళలక్ష్మ్యాదులును, కుసుమగుచ్ఛముల వలన లతలకుఁ గలుగు నభిగమ్యత్వ మనోహరత్వములు, హంసలవలన శరదృతువునకుఁ గలుగు శ్రుతి సుఖ మనోహరత్వాదులు, నను నవన్నియును సజ్జనులవలనఁ గావ్యకథకుఁ గలుగు ననుభావముగూడ నిందు వ్యక్తమగును. "గుర్వీ క్రియతే"యను పదములవలన నింతటి యర్థమును స్ఫురించుచున్నది. చన్ద్రమయూఖైః నిశా గుర్వీక్రియతే, కమలైః నలినీ గుర్వీ క్రియతే. ఈ విధముగ 'గుర్వీ క్రియతే' యను పదము లంతటను సమన్వయించుటచే నిచట దీపకా

లంకారము వాచ్యముగ నున్నది. ఇచట సజ్జనులకు, హంసాదులకును, కావ్యకథకు, నిశాదులకును నౌపమ్యము గమ్య మగుచున్నను, నీయుప మాధ్వనికంటె దీపకమే యతిశయముగఁ జమత్కార హేతు వగును.

[ఇచట "కావ్యకథా" యనునపుడు కథాశబ్దమువలన నీ విశేషము స్ఫురించుచున్నది. కావ్యమునందు ధ్వని ప్రభృతులు సూక్ష్మ విశేషములు కొన్నియున్న నుండుగాక, సజ్జనులు లేనిదే "కావ్యము" అను శబ్దమే ధ్వంస మగును. సజ్జనులున్నచోఁ, గేవలశబ్దసన్దర్భ మైనను "కావ్య" మను పేరునకుఁ దగియుండును. సజ్జనులు కావ్యము నాదరణీయముఁ జేయుదు రని భావము].

రసాదులు ప్రధానముగ నున్న యుదాహరణము:- కుమార సంభవమున వసంత పుష్పముల నాభరణములుగ ధరించి, పార్వతి శివునియొద్దకు వచ్చినపుడు, మన్మథుఁడు శరసన్ధానము సేయఁగా, మనో ధైర్యము వీడిన శివుఁడు తన చూపులను పార్వతిపైఁ బ్రసరింపఁజేయు ఘట్టము రసాది ప్రాధాన్యమున కుదాహరణముగ గ్రహింపనగును. ("ఉమాముఖే బింబఫలాధరోష్ఠే, వ్యాపారయామాస విలోచనాని"- మొదలగు వర్ణనమునఁజూడనగును).

రసాదుల ప్రధానముగనున్న యుదాహరణము:-అప్రధానము లుగ నున్న రసాదులు శుద్ధము లనియు సంకీర్ణము లనియు రెండు విధము లుగ నున్నవి. అందు శుద్ధమును, అప్రధానమును నగు రసమున కుదా హరణము.

"కిం హాస్యేన న మే ప్రయాస్యసి పునః ప్రాప్తశ్చిరాద్దర్శనం
కేయం నిష్కరుణ ప్రవాసరుచితా కేనాసి దూరీకృతః
స్వప్నాన్తేష్వితి తే వదన్ ప్రియతమ వ్యాసక్త కణ్ఠగ్రహో
బుద్ధ్వా, రోదితి, రిక్తబాహువలయ స్తారం రిపుస్త్రీజనః॥

అర్థము:- హాస్యేన కిమ్=నవ్వులతో నేమగును? మే=నానుండి (నా బాహుపాశమునుండి) పునః=తిరిగి, నప్రయాస్యసి=తప్పించుకొని

వెళ్ళలేవు, చిరాత్=చాల కాలమునకు, స్వప్నసంప్రాప్తః= కన్పడితివి. నిష్కరుణా! ఇయంతా ప్రవాసగుచితా, కాదూర దేశ నివాసమునం దపూర్వమైన యీ యాదర మేల ? కేన=ఎవనిచేత (లేక ఏకారణముచేత), దూరీకృతః = దూరస్థుడవుగా జేయబడితివి. ఇతి= ఈవిధముగా, స్వప్నాన్తేషు=కలల యందు, వదన్=పలుకుచు, తే=నీయొక్క, రిపుస్త్రీజనః=శత్రుస్త్రీలు, ప్రియతమ వ్యాసక్తకంఠగ్రహః= ప్రియుని దమ బాహువులతో గౌగలించుకొని, బుద్ధ్వా=నిద్రనుండి మేల్కొనినవారై, రిక్తబాహు వలయః=తమ బాహువులలో నెవరును లేకుండుటను జూచి (శూన్యమైన బాహుబంధము గలవారై), తారం=బిగ్గరగా, రోదితి=ఏడ్చుచున్నారు.

<u>వివరణము:</u>- ఒక డొక రాజును ప్రశంసించుచు నీభావమును వర్ణించినాడు. నీ శత్రుస్త్రీలు ప్రియుల యెడబాటు ననుభవించుచు, నీ యవస్థల ననుభవించుచున్నారు. కలలయందు వారు వచ్చుచున్న తమ ప్రియులను జూచి యిట్లనుచున్నారు. "ఓ నిష్కరుణా! నీ కార్యమును దాచియుంచవలె నని ప్రయత్నించుచున్నావు. కాని నీ కార్యమును దెలిసికొంటిని. ఎంతకాలమునకో నీ దర్శన మైనది. ఇక నిన్ను వదలను. నేను నీకై యింతగా బరితపించుచున్నను, నీకు జాలియైనను లేదే! దూరదేశముల నుండుట యన్న యింత మక్కువ నీ కెటునుండి వచ్చినది. ఇదివఱకు లేదే! నిన్నెపుడును నే నేమియు ననలేదే! ఎందువలన నిట్లు దూరస్థుడవైనావు". అని తమ భర్తల నాకలలోనే గట్టిగా గౌగలించుకొనినారు. ఇంతలో వారికి మెలకువ వచ్చినది. తమ బాహుపాశములయం దెవ్వరును లేరు. తాము చూచిన వన్నియు గల లనియే తెలిసికొని వారు పెద్దగా నేడ్చుటకు మొదలిడినారు. ఇచట స్వప్నమున బ్రియుని జూచుటచేత, శోక మను స్థాయిభావ ముద్దీపితమై, కరుణరసమున పర్యవసించినది. కాని యిచట గవి వర్ణిం

పఁతలచినది నరపతిప్రభావాతిశయము. ఈకరుణరసముచే నరపతిపరిభావ మతిసుందరముగ భాసించుచున్నది. నీవు నీ శత్రువులఁజంపితి వను వాక్యమువలన నిట్టి సౌందర్యము కలుగదు. కరుణరసప్రతీతి సహకృతమగుటచేతనే యిచట నీసౌందర్యము భాసించుచున్నది. అనఁగా నిచట కరుణ రసము నరపతి పరిభావ మను వస్తువు నలంకరించుచున్నది.

ఇచటఁ గరుణరసముతో నితర రసమునకుఁగాని యలంకారాదులకుఁగాని సంకీర్ణత లేకుండుటచే శుద్ధమును, నరపతి ప్రభావాతిశయ మను వస్తువున కలంకారకమగుటచే నప్రధానమును నైనది.

<u>సంకీర్ణమైన రసాదు లంగములుగ నుండుట కుదాహరణము.</u>

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్తః చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్యోఽవధూతః త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వః శరాగ్నిః॥

<u>అర్థము:</u>— యః=ఏశరాగ్ని, ఆర్ద్రాపరాధః=క్రొత్తగా నపరాధము నేసిన, కామీవ=కాముకునివలె, హస్తావలగ్నః=చేతులను దాఁకుచున్నదై, సాశ్రునేత్రోత్పలాభిః = (ఈర్ష్యచేతను; ఆశ నశించుటచేతను) =అశ్రువులతో నిండిన నేత్రోత్పలములుగల, త్రిపురయువతిభిః=త్రిపురాసురులకుసంబంధించిన స్త్రీలచేత, క్షిప్తః=తిరస్కృతమైనదో; ప్రసభం=బలాత్కారముగా, అంశుకాన్తం=చీరకొంగును, ఆదదానః = అంటుకొనుచున్నదై (తాఁకుచుండ)అభిహతః=విదల్పఁబడినదో(కొట్టఁబడినదో) కేశేషుగృహ్ణన్=జుట్టునంటుకొనునపుడు, అపాస్తః=దూరముగ విసరఁబడినదో, చరణయోః నిపతితః=పాదములమీఁదఁ బడగా,సంభ్రమేణ=తొందరపాటుచే, నేక్షితః=చూడఁ బడలేదో, ఆలింగన్=పైకివచ్చుచుండ (కౌఁగిలించుకొనుచుండ) అవధూతః=నిరాకృతమైనదో (త్రోసివేయఁ బడినదో) సః=ఆ, శాంభవః=శంభుసంబంధమైన, శరాగ్నిః=

బాణాగ్ని, వః=మీయొక్క, దురితం=పాపములను, దహతు=దహించు గాక.

వివరణము:-త్రిపురదాహము సేయుచున్న మహాదేవుఁ డింద ఖివర్ణితుఁడైనాఁడు. ఈశ్వరుని బాణాగ్ని, నూతనముగ నపరాధము సేసిన కాముకునితో నుపమిత మైనది. త్రిపురయువతు లార్ద్రాపరాధుఁ డగు ప్రియుని దిరస్కరించు యువతులతో నుపమితులైనారు. శివుని బాణాగ్ని త్రిపురయువతుల హస్తముల మీఁదఁ బడినది. ఆయువతులు జీవితాశ పోవుటచేఁ గనులలో నీరు నిండినది. చేతులను విదల్చుకొనినారు. చీరకొంగులపైఁ బడ నాకొంగులనుగూడ విదల్చినారు. అటులే శిరసునను, శరీరముపైనను, పాదములమీఁదను బడగా వారెటులో యాయగ్నినుండి తప్పించుకొన యత్నించినారు.

ఆర్ద్రాపరాధి యగు కాముకుఁడు ప్రియురాలియొక్క కోపమును శాంతింపఁజేయవలయు నను నభిప్రాయముతో నామె చేతులను బట్టుకొని బ్రతిమాలినాఁడు. ఆమె చేతులను విదల్చివేయఁగాఁ, గొంగును పట్టుకొనినాఁడు. ఆమె కొంగును లాఁగుకొనఁగా శిరసును స్పృశించినాఁడు. ఆమె లెక్కసేయలేదు. పాదములమీఁదఁ బడినాఁడు. ఆమె చూడనే లేదు. ఆలింగనము సేయఁబోయినాఁడు. ఆమె తిరిగి యాలింగనము సేయకయే విదల్చుకొని వెళ్ళిపోయినది. తన ప్రియుఁ డన్యాసక్తుఁడైనాఁడని యీర్ష్యాభావముతో నామెకను లన్నియు నశ్రుమయములే యైనవి.

ఇచ్చట "క్షిప్తః" "అభిహతః" మొదలగు పదములు శ్లేషవశమున బాణాగ్ని పరముగను, కాముకుని పరముగను గూడ నన్వయించును. ఈశ్లేషవలన నుపమాలంకార మనుప్రాణితమైనది. ఈర్ష్యా విప్రలంభముగూడ నిందు వర్ణితమైనది. ఈ యీర్ష్యా విప్రలంభాత్మకశృంగార రస మిచటఁ బ్రధానము గాదు. ఈశ్వర ప్రభావాతిశయ మిందలి ప్రధానవాక్యార్థము. ఆ త్రిపురరిపు ప్రభావాతిశయమున కుపమాశ్లేష

సహిత మగు నీర్ష్యా విప్రలంభ మంగముగ నున్నది. అందుచే నిచట రస మప్రధానమును సంకీర్ణమును నైనది.

ఈ యుదాహరణముల ననుసరించి, వస్త్వలంకార రసములను మూఁడువిధము లగు భేదము లందును, అనుమేయార్థ సంస్పర్శయే (వ్యంగ్యమే) కావ్యమునకుఁ జారుత్వ హేతు వని తేలుచున్నది. ధ్వనికర్తయు నీ యభిప్రాయము నీవాక్యములలోఁ జెప్పియేయున్నాఁడు.

"సర్వధా నా స్త్యేవ హృదయహారిణః కావ్యస్య స ప్రకారః

యత్ర ప్రతీయమానార్థసంస్పర్శేన, న, సౌభాగ్యమ్-తదిదం కావ్యరహస్యం పర మితి సూరిభి ర్విభావనీయమ్.

"ముఖ్యా మహాకవిగిరా మలంకృతిభృతామపి
ప్రతీయమానచ్ఛాయైషా భూషా లజ్జేవ యోషితాం"
"ప్రకారోఽన్యో గుణీభూత వ్యంగ్యః కావ్యస్య దృశ్యతే
యత్ర వ్యంగ్యాన్వయే వాచ్యచారుత్వం స్యా త్ప్రకర్షవత్॥

తా॥ ప్రతీయమానార్థసంస్పర్శవలన సౌభాగ్యము నందని, సహృదయహృదయహారి యగు కావ్యభేదము లేనేలేదు. ఇది ముఖ్య మగు కావ్యరహస్య మని పండితులు గ్రహింపవలయును.

అలంకారవతులైనను స్త్రీలకు లజ్జవలె, నలంకారయుతము లగు మహాకవి వాక్యములకుఁగూడ ప్రతీయమానచ్ఛాయయే సౌందర్యాధాయక మగును.

గుణీభూతవ్యంగ్య మనుపేరు గల మఱియొక కావ్యభేదముగూడఁ గలదు. ఇందు వ్యంగ్యార్థాన్వయమువలన వాచ్యమునకుఁ జారుత్వాతిశయ మధిక మగును.

ఆక్షేపము :-వ్యంగ్యార్థము కొన్నితావులయందుఁ బ్రధానముగను, మఱికొన్ని తావులయం దప్రధానముగను గన్పడుచున్న దని

ధ్వనిస్వరూపస్వభావములఁ దెల్పుటలో దోష మే మున్నది ? వానిలోఁ జారుత్వము లే దని మేము మాత్రము చెప్పితిమా ?

సమాధానము :- అట్లగుచో, పదధ్వని, వర్ణధ్వని మొదలగు వానినిగూడ నేల చెప్పలేదు. ఇన్నిపదములు, ఇన్ని వర్ణములు, ఈధ్వని కభివ్యక్తములుగ నున్న వను విషయమునుగూడఁ జెప్పవలదా? కావున నీ పరిగణనము వ్యర్థము. ఈ పరిగణనమువలన నీధ్వని కీనామ ముండవల యు నను సంజ్ఞాసంజ్ఞి సంబంధముమాత్రమే తెలియునుగాని, ధ్వనికావ్య విషయ మగు విశేషజ్ఞాన మేమియుఁ గలుగదు. ఈవ్యంగ్య మొకచోఁ బ్రధానముగను, మఱియొకచో నప్రధానముగ నున్నంత మాత్రమున వానిలో ననుమేయార్థ సంస్పర్శము లేకుండఁబోయినదా! కావునఁ బ్రధా నగుణీభూతభేద కథనము కావ్యస్వరూప వ్యుత్పత్తి ఫలప్రదము కా దని నిరూపించినాము. ఇప్పటికిఁ దేలిన దిది—

(1) అర్థశబ్దములకు "ఉపసర్జనీకృత స్వార్థములు" అను విశేష ణము. వ్యర్థమువాచ్యార్థము ప్రతీయమానార్థముకంటె నెప్పుడును గుణీభూత మయియే యుండును. అందుచే,నర్థమున కుపసర్జనీ కృతస్వత్వ విశేషణము నుపయోగించుట వలన వ్యావర్త్యము లేకుండుటచే, నిచట "అవ్యభిచార" మను దోషము కలిగినది. శబ్దము స్వప్రతిపాద్య మగు నర్థము నెప్పుడును దనకు గుణీభూతముగాఁ జేసికొనదు. అందుచే నిచట నసంభవ మను దోషము కల్గుచున్నది. ఇట్లవ్యభిచారాసంభవదోష దుష్ట మగుటచే శబ్దార్థముల కుపసర్జనీకృత స్వార్థత్వ మసంగతము.

(2) వ్యంగ్యలక్షణము సమన్వయింపకుండుటచే వాచ్యప్రతీయ మానార్థములకు వ్యంగ్య వ్యంజకభావ ముపపన్నము కాదు.

(3) ప్రయోజనము లేకుండుటచే "కావ్యవిశేష"మునకు లక్షణ మును జెప్పఁబూనుటయు వ్యర్థమే యైనది.

(4) వ్యంగ్యవ్యంజకభావము లేకుండుటచే; కావ్యవిశేషమునకు "ధ్వని" యను నామకరణముగూడ సమంజసముగాదు. ఇట్లు విచారిం

పగా ధ్వనికర్త చెప్పిన "యత్రార్థశ్శబ్దోవా" మొదలగు ధ్వనిలక్షణ మంతయు నసంగత మైనట్లుగనే కన్పడుచున్నది.

యది కావ్యే గుణీభూత వ్యంగ్యేఽపీష్టైవ చారుతా
ప్రకర్ష శాలినీ త్వర్థి వ్యర్థ ఏవాదరో ధ్వనౌ 97
న చ కావ్యాత్మ భూతస్య ధ్వనేస్తత్రాస్తి సంభవః
తేన నిర్జీవతైవాస్య స్యాత్ ప్రకర్షే కథైవ కా 98
అతోఽ తదాత్మభూతస్య యేఽ భావం జగదుర్ధ్వనేః
తే ముధైవ ప్రతిక్షిప్తాః స్వోక్తి భావ మపశ్యతా 99
అథేష్యతే న తత్రాపి రసాదివ్యక్త్యపేక్షయా
కావ్యమేవాన్యథా నస్యాత్ రసాత్మక మిదం యతః 100
ఇత్థంచ గమ్యమానార్థ సంస్పర్శమాత్ర మలంకృతః
వాచ్యస్సేత్యేత దుక్తం స్యాన్మతా సైవానుమాతతః 101

సంగ్రహశ్లోకములు.

తా॥ గుణీభూత వ్యంగ్యకావ్యము నందుఁగూడ చారుత్వాతిశయ మున్న దని మీ రంగీకరించుచో, ధ్వనికావ్యమునం దాదరము జూపుట నిష్ప్రయోజనము. కావ్యమున కాత్మ యగు ధ్వని గుణీభూత వ్యంగ్యమునందు లే దందురా? అట్లగుచో గుణీభూత వ్యంగ్యకావ్యమున, నాత్మయే లేకుండుటచే నది నిర్జీవమే యగును. అందులో జీవమే లేనపుడు ప్రకర్ష మెచ్చటనుండి వచ్చును?. అందువలన "అనుమేయార్థ సంస్పర్శ లేనిదే ధ్వని యుండదు" అని చెప్పిన పూర్వుల నధిక్షేపించునపుడు ధ్వనికర్త "సర్వథా నాస్త్యేవ" మొదలగు తాను జెప్పిన వాక్యముల భావమునే మఱచినాఁడు. జ్ఞాపకముండుచో నాక్షేపింపఁడు. ప్రతీయమానార్థ సంస్పర్శ లేనిదే చమత్కార ముండ దని యాతఁడు చెప్పినాఁడు. ప్రతీయమానార్థ మెప్పుడును ననుమేయార్థమే యగును. అగుచో ననుమేయార్థ సంస్పర్శయే ధ్వని హేతువనియు, నది లేనిది

ధ్వనియే లేదనియు నిశ్చయ మగుచునే యున్నది. ఇప్పు డనుమేయార్థ వాదుల నాక్షేపింప నేల ? గుణీభూత వ్యంగ్యమునందు వ్యంగ్యము లగు రసాదులకుఁ బ్రాధాన్యము లేకుండుటచే నందు ధ్వని లేదని మీ రంగీక రించుచో, రసాత్మకమైన దానినిగూడ మీరు కావ్యము కా దను చున్నారు. అప్పుడు కావ్య మనునదియే లేకపోవలసివచ్చుచున్నది. ఈవిధముగ నాలోచనసేయుచో, గమ్యమానార్థ ప్రతీతియే వాచ్య మున కలంకారక మనీ తేలును. ఆ గమ్యమానార్థ మనుమేయమే యగుటచే ధ్వని యనునది "అనుమానమునం దంతర్ధానమునొందు నని మేము చెప్పిన మతమును మీరును నంగీకరించినట్లైనది.

అవివక్షిత, వివక్షితాన్యపర, వాచ్యభేదఖండనము:- అవివక్షిత వాచ్య మనియు వివక్షితాన్య పరవాచ్య మనియు, ధ్వని రెండు విధము లుగ నున్న దనిగదా మీరు తెల్పితిరి ! అందులో అవివక్షిత్వ మన నర్థమేమి? అనుపాదేయ మనియా? అన్యపర మనియా ? అనుపా దేయతగూడ, సర్వాత్మనా యనుపాదేయమా ? కొన్ని యంశముల లో ననుపాదేయమా? సర్వాత్మముగ నీ వాచ్య మనుపాదేయ మగుచో దాని నాశ్రయించిన వ్యంజకత్వమునుగూడ ననుపాదాయమే యగును. అప్పుడట్టి ప్రయోగమే, పునరుక్తాది ప్రయోగములవలె దుష్టము కావలసివచ్చును. ఇఁకఁ గొన్ని యంశముల నిది యనుపాదేశ మందురా? ఆ యనుపాదేశము లగు నంశములను మీరు తెలుపవలయును. అపుడు వాచ్యాంశ మనుపాదేయ మనియు, వ్యంగ్యాంశ ముపాదేయ మనియు మీ రనవలెను. అనినచో వాచ్యాంశ మప్రధాన మనియు, వాచ్యేతర మగు వ్యంగ్యము ప్రధాన మనియు, వాచ్యము వ్యంగ్యరూప మగు నన్యార్థపర మనియు స్పష్ట మగుచున్నది. ఇపు డేమైనది ! (1) అవివక్షి తత్వము (2) అన్యపరత్వము (3) ఉపసర్జనీకృతాత్మత్వము - ఇవి యన్నియు నేకార్థము లగుచున్నవి. ఇపుడు పరిశీలింపఁగా ధ్వనిలక్షణ

మునే చెప్పినట్లైనది. ఉపసర్జనీకృతాత్మత్వమేగదా ధ్వనిలక్షణము. కావున నిందు ధ్వని ప్రకారభేదము నిరూపితము కాలేదు.

ఇచట నీ విషయము నాలోచింపవలయును. అవివక్షిత వాచ్యత్వ మనునది ధ్వనికిఁ గల ప్రకారములలో (భేదములలో) నొకటి యనిగదా మీరు చెప్పుచున్నారు! ప్రకార మననేమి? ఒక వస్తువున కావస్తువు లక్షణ మన్వయించిన తరువాత నధికముగ నవాంతర విశేష మొకటి కన్పడినపుడా విశేషమును బ్రకార మందురు. గోవునందు గోత్వ మను ధర్మము సమన్వితమై తరువాత నలుపు, తెలుపు లేక విచిత్రవర్ణములు కలిగియుండుట (శబలత) యను విశేషము నా గోవునందుఁ జూచినపుడు, నలుపు, తెలుపు, శబలతలు, ప్రకారము (భేదజనకములు) అగును. గోత్వమునకే శబలత్వ మొక ప్రకార మనుట యెట్లు పొసఁగును? ఉదాహరణమునకు - గోవునందు గోత్వ మను ధర్మ మనుగతమైయుండును. అపు డధికముగ సంక్రమించిన శాబలేయత్వమును (విచిత్ర వర్ణములు) గల గోవునకు సంబంధించియుండుట - విచిత్ర వర్ణములుగల్గియుండుటయని గ్రహింపనగును. ప్రకారము (భేదము) గా గ్రహింతుము. గోత్వమునకు గోత్వమునే ప్రకారముగ (భేదముగ) గ్రహింపరాదుగదా! గ్రహించుచో ననవస్థాదోషము సంభవించును. ప్రస్తుతము "అవివక్షిత వాచ్యము" నొక నామకరణము చేయుటవలన ధ్వనికి సంక్రమించిన విశేష మేమియును లేదే! అందుచే నవివక్షితవాచ్య మనునది ధ్వని ప్రకార మనుట యుక్తము కాదు.

ఇక వివక్షితాన్య పరవాచ్యము నాలోచింతము - వివక్షితాన్య పరవాచ్యమను శబ్దమున కర్థమేమి? వివక్షిత మను శబ్దమునకు ప్రధాన మను నర్థము నంగీకరింతురేని ప్రధానముగా [illegible] ర్థ [illegible] న్యపర [illegible] నేని అన్యపరత్వ మున [illegible] కలుగవలెనుగదా [illegible] [illegible] నంగీకారాదము. ప్రాధాన్య

మున్ను నెట్లు కుదురును ? ఇట్లు వివక్షితత్వమునకును నన్యపరత్వమున కును బరస్పరవిరోధ ముండుటచే, వివక్షితాన్య పరవాచ్యత్వ మనునదియే సమంజసము గాదని తేలినది.

ప్రాధాన్యాప్రాధాన్యము లొక్కే వస్తువు నాశ్రయించియుండుట యను నదొకవిశేషణమునకే సరిపోవును. ఇతరము లగు నర్థములకు సరి పోదు. విశేషణము, విశేష్యమునందున్న యొక యుత్కర్షాతిశయ మును దెల్పుటకుఁ బ్రయుక్తమగుటచే నపుడా విశేషణార్థము వివక్షితమై ప్రధాన మగును. విశేష్యగతమగు నుత్కర్షాతిశయమును దెలుపునపుడు ప్రధాన మగును. కాని సహజముగ విశేషణము, విశేష్యమున కంగమ గుటచే నప్రధానమే యగును. ఉదాహరణమునకు— "రామస్య పాణి రసి, నిర్భరగర్భఖిన్న సీతావివాసనపటోః కరుణా కుత స్తే"—నిర్భర గర్భఖిన్నయగు సీత నరణ్యములకుఁ బంపుటయందు సమర్థుఁడగు రాము నియొక్క పాణివి (హస్తము) నీవు! నీకుఁ గరుణయెక్కడ! ఇచట, గర్భ వతియు, నపరాధలేశ శూన్యయు, పతివ్రతయు నగు సీతనే యడవులకుఁ బంపఁగలిగిన రామునకు సంబంధించినచేయి - యనునపుడు, రామపద ము విశేషణము - చేయి విశేష్యము. "రామస్య" యను విశేషణ ము, చేతియందలి కార్యాతిశయమును నిష్కరుణత్వమును దెలుపు నప్పుడు రామపదార్థము ప్రధానమే యగును. మిగిలినపుడు, కేవల ము పాణిశబ్దముతో విశేషణముగ నన్వయించునపుడు మాత్ర మప్ర ధానమే యగును.

వివక్షితాన్య పరవాచ్య మనునది కూడ నొకధ్వని ప్రభేద మని యేగదా తాము తెల్పునది. అగుచో "అన్యపర" మను పదమిచట నుండుట యుక్తియుక్తముగాదు—" అన్యపరవాచ్యత్వ మన్నను, ఉప సర్జనీకృతాత్మత్వ మన్నను సమానార్థకములే యగును. ఉపసర్జనీ కృతాత్మత్వము ధ్వని సామాన్యలక్షణమే. వివక్షితవాచ్యధ్వని యని

యొప్పు డనినామో యప్పుడే, అవివక్షితమైన వాచ్య మన్య పరమగు ననియే మన కర్థ మగును. కావున నన్యపరపద మిచటఁ బ్రయోగింప నక్కఱ లేదు.

ఆక్షేపము.—— కేవలము "వివక్షిత" మనియో, వివక్షితవాచ్య మనియో నామకరణముఁ జేసితి మేని, గుణీభూత వ్యంగ్యమునందుఁ గూడ వాచ్యము వివక్షితమే యగుటచే, వివక్షితవాచ్య శబ్దమునకు గుణీభూతవ్యంగ్యముగూడ నర్థ మగును. ఆ యర్థము రాకుండుటకై వివక్షితాన్య పరవాచ్య మని మేము నామకరణ మిడినాము. ఇపుడు మీ యాక్షేప మెట్లు చెల్లును ?

సమాధానము.——అగుచో, అవివక్షితవాచ్య మను నపుడుగూడ "అవివక్షితాన్య పరవాచ్య మనియే నామకరణము నిండు.——వివక్షితాన్యపర వాచ్యము, అవివక్షితాన్య పరవాచ్యము నను నవి రెండును ధ్వని ప్రభేదములేగదా ? లేదా రెండుచోట్లను "అన్యపర" మనుపదము ను తీసివేయుఁడు. రెండుచో ట్లనేక విధమున నామకరణ ముండుటయే బాగుగ నుండును.

అర్థాన్తర సంక్రమితవాచ్యఖండనము:—— "స్నిగ్ధశ్యామల కాన్తి లిప్తవియతో" అను పద్యమున "రామోస్మిసర్వం సహే" అనుచో "రామ" శబ్దము రాజ్య నిర్వాసనాద్యసంఖ్యాకము లగు కష్టముల ననుభవించిన రాముని దెల్పుటచే నది యర్థాన్తర సంక్రమితవాచ్యమున కుదాహరణముగ నిరూపితమైనది. వాస్తవమున కిది "అగ్నిర్మాణవకః" "ఆబాలుఁడు నిప్పు". అను నుదాహరణమువలె గుణవృత్తికి మాత్రమే లక్ష్య మగును. ఇదియును గుణవృత్తులలో నొకభేదమే యగును. అగ్నిర్మాణవకః అనునపు డగ్నిని మాణవకునిపై నారోపించుటలోఁగల తత్త్వమిది- తేజస్విత్వము. దాహకత్వము మొదలగువానితో నగ్నికి వ్యాప్యవ్యాపకభావము (అన్యూనానతిరిక్తవృత్తిత్వము) ప్రసిద్ధమైయున్నది.

మాణవకుని యందు తేజస్విత్వాది లక్షణము లున్నవి. అగ్నికిని, మాణవకునకును సాధర్మ్యమును దెలుప నెంచినపు డగ్ని మాణవుల కభేదారోపము జేయుచున్నాము. ఈ యారోపమునే యుపచార మనుచున్నాము. ఈ యుపచారమునం దారోప్యారోపకములు రెండును భాసించుచునే యుండును. అనఁగా నగ్నియు (తేజస్విత్వాది రూపమున) మాణవకుఁడును భాసించుచునే యుండురా.

పైన నిరూపితమైన యుదాహరణము నందు, ఆరోప్యారోపక శబ్దార్థములు విభిన్నముగ నున్నవి. ఒకప్పు డీ యుపచారమునం దొకే శబ్ద మారోప్యారోపాత్మకముగ నుండును. ఆ శబ్దమునకుఁ బ్రతిపాద్యము నొకే యర్థము, సామాన్య విశేషరూపముగ విభేదమునందును. అపు డీ రెండర్థములును నుపచారవిషయము లగును. ఈ రెంటిలోఁ బ్రయోజనము, సందర్భము మొదలగువాని ననుసరించి, విశేషాంశమే సామాన్యాంశమున నారోపితమై, సాధర్మ్య హేతు వగుచున్నది. ఉదాహరణమునకు- "తదమృత మమృతం"—"స ఇన్దురిన్దుః" "ఆ యమృత మే యమృతము. ఆ చందురుఁడే చంద్రుఁడు"-ఇచట నమృతత్వము సామాన్యాంశము-జీవనప్రదత్వము విశేషాంశము-రెండవ యమృత పదమునందు, జీవనప్రదత్వమను విశేషాంశ రూపముగు నమృతత్వము నారోపించి,జీవనప్రద మగు నమృత మని రెండవ యమృతపదమున కర్థముఁ జెప్పుకొనుచున్నాము. ఇట్లు విశేషాంశము నెపు డారోపణ చేసినారము, సామాన్యాంశము దానితో పాటుగ నున్నట్లే యగును. సామాన్యాంశ మింతకుఁ బూర్వమే రెండవ యమృతపదమున సిద్ధమై యుండుటచే దానియందుఁ దిరిగి [illegible] న్యార్థము నారోపింపవలసి యుండలేదు. [illegible] నాగుటచే విశేషాంశమునే యారోపించుచున్నాము; [illegible] సామాన్యవాచక మగు రెండవ చంద్రశబ్దమున [illegible] మను విశేషాంశ రూపమైన [illegible] [illegible]

చున్నాము. అర్థాన్తర సంక్రమితవాచ్యముగూడ ననుమానమునందే యన్తర్భావము నొందును. "రామోఽస్మి సర్వం సహే" మొదలగు నర్థాన్తర సంక్రమిత వాచ్యమున కుదాహరణములగు స్థలములలో, రామ శబ్దము, కేవలరాముని దెలుపక, రాజ్యనిర్వాసితత్వాది ధర్మవిశిష్టుఁడగు రాముని దెలుపును. ఈ ధర్మ మనుమేయము. రామశబ్ద వాచ్యార్థ మీ యనుమేయ మగు నర్థాన్తర రూపమునఁ బరిణమించినది. అనఁగా ననుమేయార్థమున కీ వాచ్యార్థ మాశ్రయ మైన దని భావము. (సంక్రమిత మనఁగా—అనుమేయార్థమున కాశ్రియరూపముగఁ బరిణతి నొందుట యని యర్థము) అందుచే నర్థాన్తర సంక్రమితవాచ్య మను నామము సార్థకమే యగును.

అనుమేయ మగు నర్థము రెండురూపములు. (1) ధర్మరూపము (2) ధర్మిరూపము-వీనిలో ధర్మ మనుమేయమైనపు డర్థాన్తర సంక్రమిత వాచ్య మగును. ఇచ్చట ననుమేయ మగు ధర్మము వాచ్యార్థము నాశ్రయించియుండును. ధర్మిరూప మగు ననుమేయమునకు "అగ్నిరత్ర ధూమాత్" (ఇచ్చట ధూమముండుటచే నగ్ని యున్నది.) అను ప్రయోగ ముదాహరణము. దీనినే శాస్త్రములయం దనుమాన మని పిలుచుచున్నాము. ఈ చర్చలవలన నిప్పటికిఁ దేలినదేమన-"రామ" మొదలగు శబ్దములనుండి, కేవల రాముఁడుగాక, రాజ్యనిర్వాసితత్వాది ధర్మవిశిష్టుఁడగు రాముఁడు ప్రతీయమానమగుటకు హేతువు ప్రకరణము (సందర్భము) మొదలగు నవియేయగునుగాని, రామాది శబ్దములుకాదు.

అత్యన్తతిరస్కృత వాచ్యముగూడ "గౌర్వాహీకః" "వాహీకుఁ డెద్దు"—అను ప్రయోగముల వలెఁ బదార్థోపచారమే యను విషయము నింతకుఁ బూర్వమే నిరూపించితిమి.

శబ్దమున కభిధా శక్తికంటె నతిరిక్తమైన శక్తినే మే మంగీకరింప కుండుటచే శబ్దశక్తిమూలానురణనరూప వ్యంగ్య మనునది యున్న దను

టయే పౌనఃగ వని యిదివఱకే నిరూపించితిమి. ఇఁకముందుఁ గూడ నిరూపింతుము.

సావివక్షితవాచ్యస్య ధ్వనే ర్యుక్తా ప్రకారతా
నహిప్రకార స్తస్యైవ ప వేత్యుపపద్యతే 102
భక్తిః పదార్థవాక్యార్థ రూపత్వాత్ ద్వివిధా మతా
తద్బుద్ధి శ్చానుమానా న్తర్భూతా యదుపపాదితా 103
తత్ తిరస్కృతవాచ్యస్య ధ్వనే ర్భక్తేశ్చ కా భిదా
ద్వితీయోఽపి ప్రకారోయః సోఽపి సంగచ్ఛతే కథమ్ 104
పరస్పర విరుద్ధత్వాత్ వివక్షాతత్పరత్వయోః
యశ్శబ్దశక్తిమూలోఽన్యః ప్రభేదో వర్ణితోధ్వనేః 105
సోఽయుక్తోఽన్యత ఏవాసౌ తత్రోత్ప్రేక్షాన్తరే మతిః
శబ్దేశక్త్యన్తరాభావస్యాసకృత్ప్రతిపాదనాత్ 106

సంగ్రహశ్లోకములు.

[ వచనమున వర్ణితమైన యర్థమే యీశ్లోకములలో నిబద్ధమైనది. అందుచే వీని కనువాదము నిచ్చుటలేదు ].

ప్రథమ విమర్శము సమాప్తము.



## గ్రంథ సమీక్ష

### చిత్ర తారకము

రచయిత : శ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు

నాటకము రు 1—0—0

ప్రాప్తిస్థానము : శ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు

రామారావుపేట, కాకినాడ

ఇది మూఁడంకముల రూపకము. తారాలక్ష్మణ సన్నివేశము దీని కథావస్తువు తారపాత్ర ప్రధాన మని పేరే పేర్కొనుచున్నది. తారకాశబ్దము చర్చకు రావచ్చును. నక్షత్రవాచకము లగు 'తారా తారకా' శబ్దములు పర్యాయశబ్దములు. కాఁబట్టి 'తారక' యని తారా పాత్ర సూచకముగ గ్రహింపఁబడినది. చిత్రా తారకా అస్మిన్ అస్తీతి 'చిత్ర తారకమ్' అని సమాసము. కాఁగా రామకార్యమును బురస్కరించుకొని యీరూపకము రూపెత్తుటచేఁ దద్ద్యోతకముగఁగూడ నిట్లు పేరు పెట్టఁ బడినది.

ఆత్మానుమానాత్ పశ్యామి మగ్నంత్వాం శోకసాగరే
త్వా మహం తారయిష్యామి

అను రాముని ప్రతిజ్ఞాత్మకక్రియ తత్తారకత్వమును విపులీకరించుచున్నది. చిత్ర మగునట్లుగ వాలిని సంహరించి రాముఁడు సుగ్రీవకార్యమునకుఁ దారకుఁ డైనట్లుగ, లక్ష్మణుని క్రోధోన్మాదము నుపసంహరించి తార రామకార్యమునకుఁ దారకురా లైనది. ఇట్లుభయతారకముగ నీ శబ్ద ప్రయోజనము గోచరించుచున్నది.

ఇట 'తారా' శబ్దవ్యుత్పత్త్యర్థముకూడఁ రూపకములోని తారా పాత్ర కన్వర్థమగుచున్నది. తరంతి అనయా నావికా ఇతి తారా, తారకా చ. త్ప్లవన తరణయోః. నావికులు తారచే (నక్షత్రము) దిక్కునెఱిఁగి సముద్రమును దరించునట్లుగ, సుగ్రీవుఁడు తారను బురస్కరిం

చికొని లక్ష్మణకోర్ధ మను సముద్రమధ్యమునుండి బయటికి వెలువడెను. ఇట్లు పేరులోనే రూపకవస్తువు స్ఫురిత మగుచున్నది.

రామాయణములోని పాథేయమును గొనియే శ్రీ శర్మగారు తమరూపకములోని పాత్రలకన్నింటికి జీవములు పోసిరి. తత్తచ్చరిత్రలను జిత్రించిరి. మూలము నతిక్రమింపకుండ కళకుఁ బ్రాభవ మొసఁగిన శర్మగారి రచనాచమత్కృతి ప్రశంసనీయము.

తనపై నిలువున మండిపడుచున్న లక్ష్మణానలమును జల్లార్ప సుగ్రీవుఁడు తారను ముందుకుఁ ద్రోసినాఁడు. "బిడ్డ! లక్ష్మణ నీవు యిట్లాగ్రహింప నిన్ను శాంతింపఁజేయువారెవరు" అని తారతనమాతృత్వమున లక్ష్మణుని జ్వలనశీలత్వమును బొదివివేయుచున్నది. (నరత్వమే యిట్లు విచేష్టితమైన వానరత్వమేమి చేయఁగలదని వ్యంగ్యము) తార యెట్టిదో మరణోన్ముఖుఁడైన వాలిముఖమున మహర్షి రెండుముక్కలతో వాకుచ్చినాఁడు.

"సుషేణదుహితా చేయ మర్థసూక్ష్మవినిశ్చయే
జౌత్పాతికే వివిధే సర్వథా పరినిష్ఠితా
యదేషా సాధ్వితి బ్రూయాత్ కార్యం తన్ముక్తసంశయం
న హి తారామతం కించి దన్యథా పరివర్తతే.

'చిత్రతారకము'న లక్ష్మణుని మనోభావము నతని కయోమయముగఁ బరివర్తనమునకుఁ దెచ్చుటకుఁ దార పూనిన వాగ్వైఖరి చిత్రము. యుక్తి ప్రయుక్తి యద్భుతము. సుగ్రీవకుపితుఁ డగు లక్ష్మణుని వాలివధ ఘట్టమున కీడ్చి తాను వాలిపక్షమున నిలిచి, లక్ష్మణుని సుగ్రీవపక్షమునఁ జల్లగఁ జేరవైచినది. లక్ష్మణుఁడు రాముని ధర్మపక్షము నిరూపించుటకు సుగ్రీవుని సజ్జనత్వమును బలపఱచుచు తార పన్నిన విచిత్ర వాగ్జాలమునఁ జిక్కి బిగిసిపోయినాఁడు. దీనితో "కథకంచికి—మనమింటికి" అన్నట్లయినది.

ఉండియుండి లక్ష్మణునియందుకు నెత్తురు పొంగులు వాఱినవు డెల్లఁ దార చల్లని నీరు చల్లి స్థాయికిఁ దెచ్చినది. ఈ దిక్కుమాలిన కోపముతోనే సీతమ్మను లంకపాలుచేసితివి. మరి రామునికొంపఁ దీయకుమని యిట్లు హెచ్చరించినది.

సీ॥ రాముని నడవికి రమణి ♦ బంపెనటంచుఁ
గైకఁ జంపుదునని ♦ కత్తిదూసి!
కామించివచ్చిన ♦ కాంతను దయమాలి
ముక్కుచెవులఁగోసి ♦ ముప్పుదెచ్చి!
పలుమాట లనెనంచు ♦ భర్తకై బెగడొందు,
వదినె సుగ్రీవుని ♦ వదలిపోయి!
నిష్కారణంబుగఁ ♦ గిష్కింధఁగల వాన
రాంగన ♦ లెల్లరు హడలునట్లు

గీ॥ సింహ శార్దూల గర్జలఁ ♦ జెలఁగ నిట్లు
పృథ్వి యంగన లుండిన ♦ పీడయనుచు
స్త్రీల నెల్లర నేవంపు ♦ దృష్టిఁజూచు
తిరిగె లక్ష్మణ! నీతల ♦ దిక్కునేడు!

దీనితో స్త్రీయన్న లెక్కసేయని లక్ష్మణునకుఁ గనువిప్పైనది. చిత్రితారకము, స్త్రీవిజయరూపక మగు రూపకము.

వాలి పితృద్రోహి, భ్రాతృద్రోహి, దేశద్రోహి యని యుత్తరోత్తర బలవద్ధేతువులతో లక్ష్మణముఖమున నిరూపింపఁబడినది. ఇది చాల సమంజసముగను - సవిర్శముగను నున్నది. దీనితోపాటు నాఁటి ధార్మిక,సాంఘిక, సాంప్రదాయిక రాజనైతిక పరిస్థితులుకూడఁ జక్కఁగ వివరింపఁబడినవి. అఖండ భరతఖండమును రావణుఁడు త్తర దక్షిణా రాజ్యములుగ ఖండింపఁజూచెను. వాలి యతనికిఁదోడుదొంగ. కావున నార్షధర్మ ప్రతిష్ఠాపకుఁడగు రాముని బాణములకు వాలి గురి

యాయెను. ఇట్లు బహు విమర్శనావిషయమును నాటకరూపమున-పాత్రల సంభాషణములద్వారా లోకమున కందిచ్చిన శ్రీ శర్మగారి లేఖిని యభినందనీయము.

ఆంజనేయునిపాత్ర రంగమున భాషణరూపమున మితముగను-నేపథ్యమున కార్యరూపమున నధికముగను గోచరించునట్లు చిత్రింపఁబడినది. ఆంజనేయుని క్రియాశక్తి కార్యసంసిద్ధతలు లక్ష్మణుని సంరంభమును వృథా చేయుచున్నవి.

సుగ్రీవుని మంత్రులు ప్లక్షప్రభావుల గుఱించి రామాయణములో-
"ప్లక్షప్రభావశ్చ మంత్రిణావర్థ ధర్మయోః
వక్తు ముచ్చావచం ప్రాప్తం లక్ష్మణం తౌ శశంసతుః"
అనియున్నది.

చిత్రతారకమున వీరికిఁ దారాలక్ష్మణ వాగ్వాదములోఁ బ్రవేశముఁ గల్పింపఁబడినది. కఱ్ఱ విఱుగకుండ పామును చంపినట్లు వీరు లక్ష్మణ కోపోపశమనమున స్వీకరించిన నటన వీరికొక విశిష్టత చేకూర్చినది.

నాటక భాష గ్రాంథికము. మధ్య మధ్య రచయితకిష్టమయిన వ్యావహారిక ప్రయోగము లున్నవి. పద్యములు రామాయణములోని రమణీయార్థమున కెట్లు ప్రతిబింబములో నుదహరింతును.

శ్లో॥ దర్శయంతి శరన్నద్యః పులినాని శనైః శనైః
నవసంగమ సవ్రీడా జఘనానీవ యోషితః

నవ సంగమ సవ్రీడా
యువతీజన జఘన పాళి కోడుచు నదులన్
నవ సైకతా స్థలములు
నవలోకిత మగుచు డాఁగు నద్భుతభంగిన్.

వద్దిపర్తి చలపతిరావు.

---

# ఉపనిషత్సారము

కృతికర్త :- శ్రీ జగద్గురు నిత్యానందేంద్ర సరస్వతీస్వామి.
ప్రకాశకులు :- శ్రీ బండారు సీతారామయ్యగారు,

గాంధీనగరం - కాకినాడ.

223 పేజీలు వెల రూ. 2-8-0.

అగాధములగు నుపనిషత్తులను గూర్చి పండిత పామర జన సుబోధము లగు తేటతెనుఁగు మాటలలో రచింపఁబడిన "ఉపనిషత్సారము" నాంధ్రదేశమునందు మిగుల ప్రఖ్యాతిజెందిన "ఉపనిషత్స్వామి" యని పేరుగాంచిన శ్రీ నిత్యానందేంద్ర సరస్వతీస్వామిచే రచింపఁబడెను. జనసామాన్యమునకు దురాపము లగు వేదశిఖలను జక్కని మృదు మధురశైలిలో నందఁజేసిన శ్రీ స్వాములవా రభివందనీయులు. వీరి రచన లనేకలోకోక్తులతోడను రసభరితము లగు నుదాహరణములతోడ నలరారుచుండును. ప్రతివిషయమును మిగులనేర్పుతో నెదుటఁ గూర్చుండిన శిష్యుల కుపదేశమిచ్చురీతి నీ యుపనిషత్సారము సంతరింపఁబడుట శ్రీ స్వాములవారి బోధనశక్తిని జాటుచున్నది. ఇట్టి యమూల్యము లగు వేదాంతవిషయములను లోకమునకు బోధించుటయే తమ జీవిత పరమార్థముగఁ జేసికొనిన శ్రీ స్వాములవారు ప్రశంసనీయులేకాక వారి సూక్తులను గ్రంధ రూపమునఁ బ్రకటించి లోకోపకార మొనరించిన శ్రీయుత బండారు సీతారామయ్యగారుకూడ ధన్యజీవు లనుట సామాన్యోక్తి. పుస్తకములు వలయువారు ప్రకాశకులకు వ్రాయవచ్చును.

---

# గ్రంథస్వీకారము

## 1. చొక్కనాథ చరిత్ర

ద్విపద కావ్యము, రాయల్ సైజు, పుటలు 365

ప్రణేత - పచ్చకప్పురపు తిరువేంగళరాజు

సంపాదకులు :— శ్రీ టి. చంద్రశేఖరన్, ఎమ్. ఏ. ఎల్. టి.

ప్రకాశనము :- గవర్నమెంటు ఓరియంటల్ సీరీస్, మదరాసు.

మూల్యము రు 7—0—0.

## 2. శ్రీ శంకరాశంకరభాష్య విమర్శః

సంస్కృతము, నాగరలిపి, వేదాంత గద్య గ్రంథము.

రాయల్ సైజు పుటలు 371

రచయిత : శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు

సంపాదకులు, ముద్రాపకులు, శ్రీకవితా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రాప్తిస్థానము:— శ్రీరామా కవితాగ్రంథమాల.

నరసారావుపేట, గుంటూరుజిల్లా. మూల్యము రు 5—0—0

## 3. హిందూదేశ చరిత్ర సంగ్రహము

రాయల్ సైజు, పుటలు 790.

సర్ అమలచంద్రఘటక్జీ గారి గ్రంథమున కాంధ్రీకరణము.

అనువాదకులు

(1) విద్వాన్ శ్రీ సే. భక్తవత్సలము. ఎమ్. ఏ. బి. ఎల్.
ఆంధ్రశాఖాధ్యక్షులు, వివేకానందకళాశాల, మదరాసు

(2) శ్రీవేదము వెంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ.

పరిష్కర్తలు :—శ్రీ సే. వెంకటరమణయ్య, ఎమ్. ఏ పి హెచ్. డి.

ప్రకాశనము :— మదరాసు విశ్వవిద్యాలయము.

మూల్యము రు 15—0—0.

## 4. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము

రాయల్ సైజు, పుటలు 528

లేఖకులు : శ్రీ నిడదవోలు వెంకటరావు, అధ్యక్షులు, తెనుఁగు పరిశోధనశాల, ప్రాచ్యవిద్యా సంస్థ.

ప్రకాశనము : మదరాసు విశ్వవిద్యాలయము

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాష లందుఁ దెలుఁగు లెస్స

సంపుటము
౪౪

సంచిక
౨

## సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

## విషయ సూచిక

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౪ | మన్మథ సంవత్సరము జ్యేష్ఠాషాఢ మాసములు | సంచిక ౧

# స్వాగతము

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి, అరుణాశ్రమము, నడకుదురు

శా. శ్రీమన్మూర్తి, పవిత్రవర్తన, ప్రజా
క్షేమాంకితాత్మా, జగ
త్ప్రామాణ్యప్రథితార్షధర్మ పునరు
త్థానైకసత్కార్య ని
స్సీమారంభవిజృంభమాణనిజసా
చివ్యాధికార స్ఫుటాఽ
సామాన్యాశయ, చంద్రమౌళి, సుగుణ
శ్రీధాళు వర్ధిల్లుమా.

శా. ఈ సాహిత్య సభాగృహాంగణమునం
దీనాఁడు నీవింత శ్రీ
ద్ఘాసౌభాగ్యము మీఁర కా లిడిన చం
దంబెల్ల నీదేశ భా
షాసంరక్షణబద్ధ దీక్ష కొక సా
క్ష్యం బౌను నిర్దుష్ట భా
షాసేవాంకితు లైనవారి కొక యు
త్సాహం బగుఁగా ధీసధీ!

శా. ఏనాఁడో మన పీఠికాపురవరా
ధీశాన కారుణ్య భా
షానంతర్యముగా మహామహుల సా
హాయ్యమ్మునన్ జ్ఞాన వి
జ్ఞానానందమయాంధ్రసాహితి యథా
శక్తిన్ బ్రపూజింప సు
స్థానంబై పరిషత్తు పుట్టినది వి
ద్వల్లోక మగ్గింపఁగన్.

ఉ. నాఁటికి నాఁడు ఘోర పత
నమ్మున దిక్కుఁటి పోవుచున్న యీ
తేట తెలుంగుబాస కొక
తీరును సౌరును నిల్పి శుద్ధమా
ర్గాటను నిల్పి సుక్రమ ని
బద్ధము చేయఁగ వేయిరీతులన్
నేఁటికిఁగూడఁ బూనుకొని
నిల్చిన దీ పరిషత్తు దీక్షతో.

ఉ. ఘోరక రాజకీయముల
నుక్కిఁరిబిక్కిఁరి యౌచు వ్యగ్రతా
వారలె కాని భాషకు శు
భస్థితి గూరిచి ధర్మరక్షణో
దారపథమ్మున న్నడచు
త్త్వాదృశు లిప్పుడు దుర్లభుల్ - భవ
చ్చారుతర ప్రయత్నములు
సర్వజగచ్ఛుభ వృద్ధి హేతువుల్.

ఉ సర్వజగత్పవిత్ర మగు
సంస్కృతభాష సముద్ధరింపఁగాఁ
బర్విన నీదు భావవిభ
వఁబు ఫలించినఁ బ్రాచ్యభారతా

ఖర్వమహత్త్వ మెల్లఁ బాడ
కట్టుఁ దనంతటఁ దా నిసర్గమై
యుర్వి సహింప సత్యము మ
హోన్నత రీతులఁ బాలితం బగున్.

మ. ధర సత్కార్యములం బొనర్పునెడ ను
త్పన్నంబగున్ ముందుగా
దురదృష్టమ్మునఁ బ్రాతికూల్యగణ మెం
దుం; గాని యుష్మాదృశుల్
స్థిరచిత్తుల్ వెనుకంజ వైచి భువన
శ్రేయఃపదం బైన త
ద్గురు కార్యమ్మును బాయనొల్ల రెద నాం
దోళింప రొక్కింతయున్.

ఉ. మాపరిషత్తు శాస్త్రనియ
మ ప్రతిపాదిత సంస్కృతాంధ్ర భా
షాపరభాగ గౌరవముఁ
జాటఁగఁ బుట్టి యనన్యమున్ నిరా
టోపము నైన పద్ధతిఁ గ
డుంగడు గణ్యతఁ గాంచె దీనికిన్
బ్రాపు నొసంగి బ్రోవఁగల
భారము నీయది మంత్రిసత్తమా!

మ. ఒకరంగస్థలమంచు నేర్పడియె నీయూరన్ సదా దాన నె
ద్దికమై భారతి శుద్ధరూపమున నర్తింపన్ దదీయమ్ము లా
వికసన్నూపురకంకణధ్వనులు దిగ్వీథిన్ విజృంభింపఁ దా
వకసాహాయ్యము పొల్పుఁగావుత - జగద్భద్రమ్ము చేకూఱుతన్॥

ఆర్యా !

ఆంధ్రజాతిజీవనమునకు, ఏకీకరణమునకు, ముఖ్యాంగ మగు ఆంధ్రభాష, వాఙ్మయము, చరిత్ర, మున్నగు విషయముల పరిశోధనలు సల్పి, భాషాపోషణకుఁ గృషిసల్పుటకై, ఈ 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1911 లో మద్రాసు పట్టణమున, శ్రీ జయంతి రామయ్య పంతులుగారి ప్రోద్బలమున, స్థాపింపఁబడినది. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ వావిలకొలను సుబ్బా రావుగారు, శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు, శ్రీ గోటేటి కనక రాజుగారు, శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడుగారు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు మున్నగు విద్వాంసుల కృషికి, శ్రీ పీఠికాపుర సంస్థా నాధీశ్వరులౌ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుగారి యం డయు, శ్రీ వెంకటగిరి మహారాజా, బొబ్బిలి మహారాజా శ్రీ విక్రమవర్మ గారల చేయూఁతయు లభించినది. దేశమందలి పెక్కు సంస్థానాధీశ్వరు లును, అభిమానులును పరిషన్నిర్వహణమునఁ బూనిక వహించిరి.

ఆంధ్రమున సమగ్రమగు నిఘంటునిర్మాణము, తాళపత్ర గ్రం థముల సేకరించి, అముద్రిత గ్రంథముల ముద్రింపించి ప్రచురించుట, పారిభాషిక పదావళిని సేకరించి నిర్ణయించుట, ఆంధ్ర చరిత్ర, భాష లకు సంబంధించిన శాసనములు సవిమర్శముగఁ బ్రకటించుట, పాఠభేద సహితముగ నపురూపములగు గ్రంథముల, పూనా భండార్కర్ ఇనిస్టి ట్యూట్ వారు సంస్కృత మహాభారతమునువలె, ప్రకటించుట; ఆంధ్ర భాషకు సమగ్ర మగు వ్యాకరణము సమకూర్చుట; లిపి, భాష, వాఙ్మ యము చరిత్రలకుసంబంధించిన విషయములఁ గూర్చి పరిశోధనలు సల్పి, ప్రజల కందించుట; వాఙ్మయచరిత్ర, దేశచరిత్ర ప్రకటించుట; ఈ పరిషత్తు ముఖ్యోద్దేశ్యములు.

భాషాభిమానులు, జమీందారులు చేసిన ధనసాహాయ్యమువలన, పండితులను దేశము నల్దిక్కులకుఁ బంపి, మూలమూలలఁ బడియుండిన రమారమి ఆఱువేల తాళపత్రి గ్రంథములు సేకరింపఁబడి పరిషద్గ్రంథాలయమున భద్రపఱుపఁబడినవి. ఇప్పటికి డెబ్బది యపురూపములైన గ్రంథములు ముద్రించి ప్రకటించియున్నాము. అందు శివరాత్రి మాహాత్మ్యము వంటి కొన్ని గ్రంథములకుఁ బ్రత్యంతరములుకూడ నెక్కడను లేవు. చరిత్ర భాషా, వాఙ్మయ విషయముల పరిశోధకులకు పకరించు Indian Antiquary, Epigraphica Indica మున్నగు నమూల్యములు నపురూపములు నగు ముద్రిత గ్రంథములు (ఆంధ్రము, ఆంగ్లము, సంస్కృతము) ఆఱువేలకుఁ బైఁగా పరిషద్భాండాగారమున సేకరింపఁబడినవి.

ముద్రింపించి ప్రకటింపవలసిన గ్రంథము లింకను నెన్నియో కలవు. తాళపత్త్రముల నుండి, కాగితములపై వ్రాయించి భద్రపఱుపకున్న, తాళపత్రము లగుటచే, ఎన్నివిధముల జాగ్రత్తపఱచినను, కాలవశమున శిథిలమై, స్వరూపములుకూడ నాశన మగు నను భీతి కలుగుచున్నది. విద్వాంసుల నియోగించి, తాళప్రతులనుండి వ్రాఁతప్రతులను నిర్దుష్టముగ వ్రాయింపవలెను. ఒకే గ్రంథమునకుఁ బెక్కు తాళప్రతులలో నెన్నియో పాఠాంతరములు గలవు. వ్రాఁతకాండ్ర లోపమువలనఁ గలిగిన యపభ్రంశములు గాక, కొన్ని గ్రంథములలో నేపాఠమున కాపాఠము సమంజసముగను, శుద్ధముగను గన్పట్టుచున్నవి. ఏపాఠము గ్రంథకర్తదో, నిర్ధారింపశక్యము కాదు. అట్టితఱి నిర్దుష్టము లగు పాఠములన్నిటితో ముఖ్యగ్రంథములనైనఁ బ్రకటించినఁ జరిత్రకారులకుఁ బరిశోధకులకు మిక్కిలి యుపయుక్త మగును.

పరిషద్ధ్యాపక్షాధ్యక్షులగు శ్రీ పీఠికాపురాధీశ్వరులయుదారసాహాయ్యమువలన సూర్యరాయాంధ్రనిఘంటురచన, సేకరణ, యిరువదేం

డ్లకుఁ బైనుండియుఁ బెక్కండ్రు పండితులచే సాధింపఁబడి, యిప్పటికి వేయి పుటలచొప్పున 'అ' మొదలు 'న్ర' వఱకు నాలుగు సంపుటములు ముద్రింపఁబడి ప్రకటింపఁబడినవి. తక్కంగల భాగరచనయుఁ బూర్తి యయి ముద్రణమునకై శ్రీ పీఠికాపురాధీశ్వరులు మద్రాసులో నుంచినారు. ఆ కార్యము పూర్తిచేయవలసి యున్నది.

అముద్రిత గ్రంథములు, శాసనములు, చరిత్ర, లిపి, భాష, వాఙ్మయము సాహిత్యములకు సంబంధించిన పరిశోధన వ్యాసములయు, విమర్శనములయు, ప్రకటనకై ఆంధ్ర సాహిత్య పరిషత్పత్త్రిక యను ద్వైమాసిక పత్త్రికను నీ పరిషత్తు ప్రకటించుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనము, నందంపూడి శాసనము వంటి ప్రాచీన శాసనములు 47 సవిమర్శనముగ నీపత్త్రికా ముఖమునఁ బ్రకటింపఁబడెను. పరిషత్తు వార్షిక సభలను నిర్వహించుచు, పండితులను, విద్వాంసులను, విమర్శకులను, పరిశోధకులను జేర్చి విద్యావ్యాసంగములు నుపన్యాసములు, చర్చలు నేర్పఱచి, ప్రజాబాహుళ్యమునకు నభిరుచిని, విజ్ఞానమును గల్గించుటకు దోహద మొనర్చుచున్నది.

పరిషత్తునందు సభ్యు లిచ్చెడి చందా సంవత్సరమునకు ఆఱు రూపాయలుమాత్రమే. లక్ష్మీ, సరస్వతుల సాహచర్యము దుస్తర మగుటచే, దేశమందలి సుప్రసిద్ధ విద్వాంసులు, నియమావళినిబట్టి గౌరవ సభ్యులు. చందా లిచ్చెడి సభ్యుల సంఖ్య పరిమితము.

వేంకటగిరి, బొబ్బిలి సంస్థానాధీశ్వరు లిచ్చిన రూ. 20,000/- గవర్నమెంటు పత్త్రముల రూపములో నున్న మూలధనమువలన సంవత్సరమునకు, ఆఱువందల యాదాయముమాత్రము వచ్చుచున్నది. గ్రంథముల విక్రయమువలన వచ్చు నాదాయము స్వల్పము.

పత్త్రిక ప్రకటనమునకు వలయు కాగితములు కొనుట, అచ్చు, గ్రంథముల ప్రాఁతప్రతులు సిద్ధపఱచుటకుఁ బండితుల వేతనములు, పరిష

త్కార్యాలయోద్యోగుల జీతములు, మున్నగు వ్యయముల భరించుటకేఁ రాఁబడి చాలక, ఉదారాశయుల సాహాయ్యములపై నాధారపడి యున్నది.

వార్షిక సభలకుఁ బండితుల నాహ్వానించి, సభల నిర్వహించుట కగు వ్యయము లిదివఱలో విద్యాపోషకులగు జమీందారుల సాయమున ముఖ్యముగ లభించుచుండెడిది. జమీందారీల రద్దుతో, ఆ సహాయ్యము మృగ్య మైనది.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము బోర్డువారు, Tirupati Oriental రిసెర్చి ఇన్‌స్టిట్యూటులో, ప్రముఖ విద్వాంసుల నియమించి, వాఙ్మయపరిశోధనకు దోహద మిచ్చుటయే గాక, అముద్రిత సంస్కృతాంధ్ర గ్రంథముల నచ్చొత్తించుచు విద్యాపోషణకు మార్గదర్శకులైరి.

విశేషాదాయములు గల అన్నవరము, సింహాచలము వంటి పెద్ద దేవాలయములు, ఇతర ధర్మాదాయములు, మనరాష్ట్రమునఁ బెక్కు కలవు. విద్యాపోషణకు విజ్ఞానాభివృద్ధికిని, అట్టి సంస్థల యాదాయముల నుండి కొంత సొమ్ము వినియోగించుటకుఁ జట్టమున నవకాశము కలదు. కీర్తిశేషులు శ్రీమతీ ప్రభల చిలుకుడు అను వేంకట సుబ్బమ్మగారి భూరివిరాళముతోఁ బరిషత్తున కీ సుందరరామభవనము నిర్మింపఁగల్గితిమి. ఆమె మరణశాసనమునఁ బరిషత్తుకు మరల నీయనేర్పఱిచిన ఆఱువేల రూప్యములతో భవనముకుఁ గల లోపములు పూర్తి గావింపఁగలము. పరిషత్కార్య నిర్వహణాదికముల కిదివఱలోవలెనే, యెట్లెట్లో నిర్విఘ్నముగ జరుపుచుందుము. అట్టి ధర్మాదాయమునుండి లభించు వార్షికములను బ్రత్యేకముగాఁ దాళపత్త్రి గ్రంథములనుండి వ్రాఁతప్రతులు వ్రాయించి యముద్రిత గ్రంథముల ముద్రణమునకు మాత్రమే వినియోగించెద మనియు, మఱి యే యితరములకు వెచ్చింప మనియు మనవి.

విద్యావిషయికమై నలువది నాల్గేండ్లకుఁ బైఁగాఁ బాటుపడుచున్న యీ సంస్థకు, అన్నవరము, సింహాచలము, ద్రాక్షారామ, ద్వారకా తిరు

మల వంటి దేవస్థానములు, ఇతర ధర్మాదాయ సంస్థలును, శాశ్వత ముగా వార్షికముల నిచ్చునటు లవకాశము కల్పించి, పరిశోధనలక్ష్య, విద్యాపోషణకుఁ జేయూఁత నిత్తు రని విన్నవించుచున్నాము. అతిపురాత నము పత్త్రిముల రూపమున నున్న మన వాఙ్మయమును ఖిలముగా కుండఁ బ్రకటిత మగుటకు సహాయభూతు లయ్యెదరు గాక.

ఇట్లు,

విధేయులు,

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శులు.

---

# యక్షగానము — హరికథ

## శ్రీ బాగేపల్లి అనంత రామాచార్యులవారి కృతులు.

శ్రీ యస్వీ. జోగారావు, ఎమ్. ఏ.

యక్షగాన మన్నను హరికథ యన్నను నొక్కటే యని కొందఱు పండితు లభిప్రాయపడుట గలదు. నా యెఱుక కందినంత వఱకు శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యు లను నాయన యీ యభిప్రాయమును మొదట వ్యక్త మొనర్చినవారుగాఁ గనఁబడుచున్నారు. ఆయన రాయలసీమ అనంతపురమండలము హిందూపురము వాస్తవ్యులఁట. 19 వ శతాబ్ది యుత్తరార్ధమున నుండినవారఁట. ఆయన నగరి యనునూర నొక గుమస్తా యుద్యోగమునం దుండినను నాప్రాంతములందు హరికథోపన్యాసకులుగాఁ బ్రసిద్ధి వడసి రఁట. హరికథోపన్యాసము వృత్తిగాఁ గాక భక్తికో నవలంబించినవారఁట. వారు హరికథల నుపన్యసించుట కాక స్వయముగాఁ బలురచనలు గావించిరి. అవి యముద్రితములు. అవశ్యము ముద్రణీయములు. అం దేడింటి వ్రాఁతప్రతులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి కడ నున్నవి. వారే నాకీవిషయ మెల్ల నెఱింగించిరి. దయతో గ్రంథములెల్లఁ జదువ నొసంగిరి. వారికి నేను కృతజ్ఞత చెప్పుకొని మఱి యారంభింపవలె నీ వ్యాసము. ఆ గ్రంథము లన్నియు హరికథలే. (ఆ యీ గ్రంథసమీక్ష తరువాతఁ జేయఁబడును). అందు నాల్గు యక్షగానము లనియుఁ గవిచేతనే వ్యవహరింపఁబడినవి. అట్లు వ్యవహృతములైన వానిలో శశిరేఖాపరిణయ మనుదాని రచనా కాలము వ్యయసంవత్సరముగాఁ బేర్కొనఁబడెను. అది క్రీ. శ. 1886 అనఁగా నప్పటికే అనంతరామాచార్యుల వారికి హరికథ యనఁగా యక్షగాన మను నభిప్రాయ మున్నదన్నమాట. తరువాత హరికథోపన్యాసక చక్రవర్తులు, సంగీతసాహిత్యకళాపారంగతులు నైన శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు (క్రీ. శ. 1899 లో మినర్వా ముద్రా)

క్షురశాలలో ముద్రిత మైన తమ ప్రహ్లాదచరిత్ర మను హరికథ యవతారికలో హరికథ యన్నను యక్షగాన మన్నను నొకటే యను నభిప్రాయముతో నొక పద్యము రచించిరి. అది:—

సీ॥ ఘనశంఖమో యనఁ గంఠంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయఘనంబులఁ బెక్కు
రాగభేదంబుల రక్తిసల్పి
బంతు లెగిర్చిన పగిదిఁ గాలజ్ఞతఁ
జాతిమూర్ఛన లొప్ప స్వరముఁ బాడి
చక్కని నృత్యముఁ సర్వరసాను కూ
లంబుగ నభినయనంబుఁ జేసి
గీ॥ స్వకృత మ్మగు యక్షగాన ప్రబంధసరణి
వివిధదేశంబులం బిన్న పెద్దలు గల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమాన మేల"

ఈ పద్యమే యాంధ్రపత్రిక విరోధికృత్సంవత్సరాది సంచికలోఁ గూడ (పుట. 77) హరికథ యను శీర్షికక్రింద నుదాహరింపఁబడినది. దాసుగారు వారి 'అంబరీష చరిత్రము' (ద్వితీయముద్రణ-సరస్వతీబుక్ డిపో ప్రచురణ, బెజవాడ, 1929) ఉపోద్ఘాతములో 'ఈయంబరీషోపాఖ్యానము దొట్టి మరికొన్ని యక్షగానములను వ్రాసియుంటిని... నేఁ దెలిసిన మట్టు యక్షగానముల కుదాహరణముగ నిందుతోఁ బది విరచించినాఁడను' అని తన రచించిన హరికథల నన్నిటిని యక్షగానము లనియే వ్యవహరించిరి. పార్వతీపరిణయ మను హరికథ (ప్రథమ ముద్రణ 1922 లో వివరము తెలియదు) రచించిన శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారు తదాశ్వాసాంత గద్యలలోఁ దమకృతి యక్ష

గాన ప్రబంధ మనియే పేర్కొనిరి. ఆయన దాసుగారి శిష్యులే. తమ కృతి గురువుగారికే యంకిత మిచ్చినవా రాయెను. శ్రీభక్తవిజయ మను నింకొక హరికథ (రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ ముద్రణ, 1943) కూడ యక్షగాన ప్రబంధముగనే పేర్కొనఁబడినది. తద్గ్రంథకర్త 'శ్రీమత్సంపూర్ణ రామాయణ మహాభారత భాగవత శివపురాణాద్యనేక యక్షగాన ప్రబంధకర్తలును హరికథోపన్యాసకులు నగు శ్రీ అయ్యగారి వీరభద్రరావుగారు.'

ఇట్లు పలువురు పండితులు సామాన్యులుకాదు, స్వయముగా హరికథా గ్రంథరచన గావించినవారే యభిప్రాయపడి రనఁగా నది కాదన లేము. వానిలో నేదో సాదృశ్యము లే దనలేము. కాని రెండను బూర్తిగా వాని యుత్పత్తి పరిణామములనుబట్టి యభిన్నము లన లేము. జక్కులకథలు (యక్షగానములు) జంగం కథలు, హరికథలు, బుఱ్ఱ కథలు-ఇవియన్నియు గేయరూపమునఁ గథాఖ్యానమే ప్రధానాశయ ముగాఁ బ్రారంభింపఁబడినవి. కావునఁ దత్తద్రచనా ప్రక్రియలలోఁ గొంత సాదృశ్యము గోచరించినను వాని వాని ప్రయోగ పద్ధతులు వేఱు, ప్రయోజనములు వేఱు, వాని పుట్టువు పొలకువలే వేఱు వేఱు.

ప్రకృతవిషయము యక్షగానము హరికథల యుత్పత్తి పరిణామ ముల గూర్చిన విచారణ. యక్షగాన మాంధ్రదేశమున పదునాల్గవ శతాబ్ది నాఁటికే ప్రచారము నందుండినట్లు తెలియవచ్చును. అది తొలినాళ్ళలో జక్కులవారిచేఁ బ్రవర్తింపఁబడుచుండుటచే దానికా పేరు వచ్చి యుండవచ్చును. అది హరికథవలె నాఖ్యానింపఁబడుచు,ఇంటింట నాడువారిచేఁ బారాయణము గావింపఁబడుచు,బొమ్మలాటవారిచే వెనుక పాటగాఁ బరిగణింపఁబడుచు,వీథిభాగవతులచే రూపకముగాఁ బ్రదర్శింపఁ బడుచు నిట్లు బహుముఖ ప్రయోజనములతో బహుముఖముగా వర్ధిల్లుచు వచ్చినది. స్వరాష్ట్రములందుఁ గొంతకుఁగొంత తత్సదృశము

లైన ప్రక్రియలు, ఉదాహరణకు వంగదేశపు యాత్రానాటకములు మొదలగునవి యున్నను, ఆ యక్షగానము వేరితో నట్టివి లేవు. కన్నడ తమిళ రాష్ట్రములం దున్న వన్ని నవి యాంధ్రదేశ యక్షగాన రచనల కర్వాచీనము లైనవి. హరికథోదంతముఁ జూచినచో నది బౌద్ధేతిహాసిక యుగములకే కాదు; వేదకాలముననే బీజరూపమున నున్నట్లు శ్రీ ఎమ్. ఎస్. రామస్వామి యయ్యరు తమ కాలక్షేప మను నాంగ్ల గ్రంథమున వ్రాసియున్నారు. కాని యేదో కథ చెప్పుట, అది విష్ణుకథ యగుట యనునట్లుగాక మనమీ నాఁ డనుకొనుచున్న విశిష్టలక్షణములు గలదిగా హరికథ రూపొంది ప్రచారము గాంచుట మధ్యయుగమున మహారాష్ట్ర మునఁ బదునేడవ శతాబ్ది పూర్వార్ధమున నుండిన ప్రసిద్ధ మహారాష్ట్ర భాగవతుఁ డగు తుకారామ్ హరికథాకాలక్షేపములు చేయుచుండినట్లు తెలియుచున్నది. ("తుకారామ్ మాచీగాథా" అను గ్రంథము నిర్ణయసాగరముద్రణ. బొంబాయి 1927. అందు అభంగములు 4045 వది మొదలు 4049 వఱకు). దక్షిణ దేశమునకు హరి కథా కాలక్షేపము దిగివచ్చుట పదునేడవ శతాబ్దములో, అటు కర్ణాటకము, ఇటు తంజావూరి యాంధ్రనాయక రాజ్యము మహా రాష్ట్రుల కైవసమైన తరువాతనే. తంజావూరి నేలిన మహారాష్ట్ర ప్రభువు లంతకముం దాంధ్రనాయక రాజులు మిగుల నాదరించిన యక్షగానప్రక్రియ తమ హరికథాసంవాదిగా నుండుటచేతను, అంతకన్న మఱియొక మెట్టెక్కువగా రూపకప్రయోజనము గల్గియుండుటచేతను దామును దానిని నాయకరాజులకంటెను నెక్కుడుగ నాదరించిరి. స్వాయముగా నెన్నో యక్షగాననాటకములను రచించిరి. కాని యాంధ్ర మున వారై తమ హరికథలను వెలయింపలేదు. కాని మహారాష్ట్రులకుఁ బుట్టినింటను బొరుగు వారైన మధుర సౌరాష్ట్ర సభవారు పిదప కాలమున తెనుఁగునఁ గొన్ని హరికథలను వెలయింపఁజేసిరి. (కొన్నిటి

ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నవి. నంబర్లు ఆర్. 1602×1608.) తత్రాపి మనవారును రూపకావకాశము లేనియెడ నేకపాత్రాభినయమునకైనఁ బనికివచ్చు ననియో, అన్యగీత ప్రబంధచ్ఛందస్సుల కాకృష్టు లగుటచేతనో నాఁటినుండి హరికథా గ్రంధ రచనకు దొరకొనిరి. అసలు యక్షగానము లీ నాఁటికిని రూపకముగాఁ బ్రదర్శింపఁబడుటకాక హరికథగాఁ జెప్పఁబడు సంప్రదాయముగూడ కర్ణాటకమున మైసూరు ప్రాంతమునఁ గలదని వింటిని. అనంతరాయా చార్యులుగా రది యెఱిఁగి యుండవచ్చును. అది యక్షగాన ప్రారంభదశ వంటి దైనను నిజమున కా సంప్రదాయ మీ హరికథల ప్రభావమే సూచించు ననవచ్చును. ఏదెట్లయినను మనకు యక్షగానరచన ప్రాచీనము. హరికథారచన యాధునికము. నేఁటి హరిదాసులు హరికథలను యక్షగాన ప్రబంధము లని పేర్కొనినట్లు, ప్రాచీన యక్షగానకర్త లెవ్వరును యక్షగానమును నది వైష్ణవేతివృత్త మగుచో నౌపచారికముగా హరికథయనుట తప్ప (అ యనుటయుఁ గదాచిత్తుగా) ప్రక్రియగా హరికథ యని వ్యవహరింపలేదు. లాక్షణికులుగూడ వస్తుచ్ఛందో వైవిధ్యము విశేషముగఁ బ్రదర్శించియుండుటచే యక్షగానమున కొక నిష్కృష్ట లక్షణము నేర్పరింపలేకపోయిరి. ప్రక్రియగా నావదులుతనమే, మొదట తాళప్రధానము లైన దరువులతో, ద్విపదలతో, కొలఁది గద్య పద్యములతోఁ బ్రాదుర్భవించిన యక్షగానమును వివిధదేశి పద కవితా రీతులను, కర్ణాటక సంగీతమునకుఁ బ్రాచుర్యము వచ్చిన దినములలో నా యా రాగప్రభేదములను, దక్షిణదేశమున కొత్తరాహులతో సంపర్కము కలిగిన రోజులలో నా హిందూస్తానీ రాగములు మట్లను నిముడ్చుకొనునట్లు చేసి, రానురాను ఛందోవైవిధ్య విశిష్టగేయ ప్రబంధ సామాన్యవాచియా యనిపించి నేఁటికి హరికథలకుఁగూడపర్యాయవాచకముగా నిలిపినది. అసలు హరికథ ప్రయోగవిషయమున యక్షగాన

ప్రారంభదశను సూచించును. రచనాప్రక్రియలో నీనాటి ధోరణినిబట్టి రెండింటను నెట్టి ఛందస్సులనైన పాటలనైన నెట్టి కథనైన నెల్పకొల్ప వచ్చును. ఈ నాఁడు యక్షగానము లెట్లు యక్షులచే (జక్కులచే) గానము చేయఁబడుటలేదో యట్లే హరికథ లన్నియు విష్ణుకథలు గావు. శివకథలు, చివరకు శివాజీ, గాంధీజీ కథలును హరికథలపేర 'చలామణి' యగుచున్నవి. అంటే యిక ప్రక్రియకేగాని యీ పేరునకుఁ బ్రాముఖ్యము పోయిన దన్నమాట. అసలు కడమ ఛందస్సులమాట యెట్లున్నను గధాఖ్యానమునకు యక్షగానములలో ద్విపద, (జంగం కథలలో రగడ), హరికథలలో డోరాలు, తోహరాలు సంప్రదాయసిద్ధముగా వాడఁబడుచున్నవి. నారాయణదాస ప్రభృతుల రచనలలో డోరా తోహరాలకు బదులు మంజరి యను రచనావిశేషము గన్పట్టును. అది మన మంజరీద్విపద కాదు. డోరావంటిదే. హరికథలలో మన ద్విపదలు, కందార్థాదులును జేరినవి. యక్షగానములలో (ఇటీవలివానిలో) డోరా తోహరాలును, మరి కొన్నిట లావణి మొదలగు మహారాష్ట్రిచ్ఛందస్సులును జేరినవి. అందులకు యక్షగానములుగా వ్యవహరింపఁబడిన యనంతరామాచార్యులవారి కృతులే సాక్ష్యము.

ఇఁక సంగ్రహముగా వాని సమీక్ష:

అనంతరామాచార్యుల కృతులుగాఁ బదునొకండు తెలియవచ్చినవి. అవి

1. చంద్రహాసచరిత్రము. 2. మూఁడున్నరవజ్రము. 3. అనసూయ చరిత్రము. 4. కుచేలోపాఖ్యానము. 5. సావిత్రీచరిత్రము. 6. సుభద్రా పరిణయము. 7. శశిరేఖాపరిణయము. 8. ప్రహ్లాద చరిత్రము. 9. రుక్మాంగదచరిత్రము 10. ఉషాపరిణయము 11. రామాశ్వమేధము

ఇవియన్నియు నముద్రితములు. ఇందు చివరి నాలుగుతప్ప తక్కిన యేడింట ననసూయా చరిత్రము, సావిత్రీచరిత్రము, సుభద్రా పరిణయము, శశిరేఖాపరిణయము మాత్రము యక్షగానములుగాఁ

బేర్కొనఁబడినవి. కాని వానిలో నట్లు పేర్కొనఁబడని వానిలోనుగూడ రచనా ప్రక్రియ యొక్కఫక్కిగనే నడచినది. అన్నిట తోహరాలు, సమపాళముగా వాడఁబడిన వివిధ ప్రసిద్ధకర్ణాట హిందూస్థానీ రాగములలో (ఉదా॥ కల్యాణి, ఆనందభైరవి, శంకరాభరణ, ధన్యాసి, రేగుప్తి, సురటి, నాదనామక్రియ, కానడ, సావేరీ, కేదారగౌళి, భైరవి, మోహన, కాఫీ, బేగడ, ఫరజు, కమాచ్, బేహాగ్, దేశి, తోడి, అఠాణా, జంఝూటి, దర్బారు, గజల్, నోటు, లావణి మొ॥) తఱచు ఆది, ఆట, రూపక తాళములలో విరళముగా, ఏకత్రిపుటలలోఁ బాటలు, జాత్యుపజాతి వృత్తములు, కొన్నిట షట్పదులు మాత్రము, కొన్నిట ద్విపదలు, కొన్నిట నవియు నివియు, ఒండురెండింటఁ దక్క తక్కిన యన్నిటను వచనములును విరివిగా వాడఁబడినవి. పాటలకన్నిటఁ బల్లవియనుపల్లవి చరణ విభాగము గలదు. అన్నిగ్రంథములు వృషశైల స్వామి కంకితములు. ప్రతిగ్రంథము తత్స్తుతితోఁ బ్రారంభించును. తరువాతఁ బ్రాయికముగ లక్ష్మీస్తుతి, గురుస్తుతి పేరిట రామానుజస్తుతియు నుండును. గ్రంథనామముతోఁ గథారంభ మొక తోహరాలోఁ గవి పేరితోఁగూడ కథాంత మొక తోహరాలోఁ జెప్పఁబడును. మంగళ గీతముతో గ్రంథాంతము. ఆశ్వాసాది విభాగమెందును లేదు. ప్రతికథయు సూతుఁడు శౌనకాదులకుఁ బరీక్షిత్తునకు బాదరాయణి, జైమిని జనమేజయునకు—ఇట్లెవరో యొకరు మఱియొకరికిఁ జెప్పినట్లు గలదు. అన్నిట గథ ప్రసిద్ధమైనదే. ఒక్కమూఁడున్నర వజ్రమునఁదక్క యందుఁజరిగొండ ధర్మనగారి చిత్రభారతము నందువలె గయోపాఖ్యాన కథ మూదలగాఁ గొని విచిత్రకల్పన కొంత చేయఁబడినది. అల్పదోషము లెడనెడ నున్నను నన్నిగ్రంథము లందును భాష సలక్షణమైనది. రచన చక్కనిది. శశిరేఖాపరిణయ రచన యన్నిట నుత్తమమైనదిగాఁ దోఁచును.

గ్రంథవిస్తరభీతిచే ముఖ్యములైన మూఁడున్నర వజ్రముకథయు, శశిరేఖాపరిణయ రచనయు, విశేషము లితరములనుండియు నుదాహరింతును.

1, మూఁడున్నర వజ్రము: ఈ కథకు మూల మేదియో తెలియదు. ఏ చిత్రభారతమునో చూచి యీకవి కల్పించినదే యగునేమో! పాండవు లరణ్యవాసము చేయుచుండిన కాలమున నారదుఁ డొకపరి కృష్ణుని జూడవచ్చెను. కృష్ణుఁ డాతని భూత, భవిష్యత్కాలముల భువి నెందుఁ బొసఁగఁదగనట్టి నూతన చిత్రకథ నొకదాని విన వేడుక గలిగి యడుగును. నారదుఁ డాకథను యథార్థముగా సంఘటింపఁజేయు ప్రయత్నమున బయలుదేరును. రుక్మిణికడ కేగిఁ యట సత్యభామను బొగడును. బలరాము నింటి కేఁగి యతఁడు హాలామదోన్మత్తుఁడై తన్నె యుద్ధమునకు రమ్మనఁగా భీముఁడు నీబలగర్వ మడఁపఁగలవాఁడు లెమ్మని చెప్పి పోవును. పాండవమారణతంత్రపరుఁడై యున్న దుర్యోధనుని కడ కేఁగి నేమ మడుగును. అతఁడు "భీముఁడు జీవముతో మహి నుండఁగ నేమ మెట్లు మముఁజెందు మహాత్మా" యని, యెట్లయిన భీమునికి శౌరికిని బోరు ఘటింపు మనును. దుర్యోధనుని దురాలోచనకు లోలో వెకసపడియు నట్ల యగుఁగాక యని నారదుఁ డిక భీష్ముని సత్యసంధతను బరీక్షించుట కరుగును. ఇందుఁ గవి భీష్మునకు నొకభార్య నంటగట్టినాఁడు. నారదుఁడు భీష్మునిమాటజారునట్లు చేసి యామెను గాంక్షించును. ఆమె వికృతాకారుఁడగు నారదుని కడకుఁ బోనొల్లక దాసిని గైసేసి పంపును. నారదుఁ డది యెఱిఁగి భీష్మపత్ని నొకగుఱ్ఱమవు కమ్మని శపించును. భీష్ముని వేఁడికోలుపై 'మూఁడున్నర వజ్రము లొక్కచోఁ గూడి ముట్టినంత' నిజరూపము వచ్చునని యనుగ్రహించును. భీష్ముఁడా యశ్వమును గడు గారాబముతోఁ జూచుకొనుచుండ నది యొకనాఁడు పరసీమలకుఁ బలాయన మగును. అట బుద్ధిరాజను నాతఁడు దానిని బంధించును. అదికడు గొప్పగుఱ్ఱ మెవ్వ రడిగిన విడువవల దని యతనిని, దానిని యుద్ధముచేసియైన సంపాదింపవలె నని కృష్ణుని నారదుఁడు హెచ్చరించును. కృష్ణుఁడు బుద్ధిరాజుపై దండు వెడలును. బుద్ధి భీముని శరణుఁజొచ్చెను. కృష్ణుని రాయబారములు విఫలమై యతనికిని బాండవులకును యుద్ధము తప్పదయ్యెను. నారదుని యుపదేశమున దుర్యోధనుఁడు పాండవులకే తోడ్పడును. నరునితోఁ బోరుచు నారా

యణుఁ డలసట నటింపగా నారగుని ప్రోత్సాహమున రుక్మిణి సవతి నరకుని మార్కొనినట్లు తా నరుని మార్కొనును. అది యట్లుండ నారదుఁడు భీముని బలరామునిపైకి రొప్పును. గుఱ్ఱమును విడిచి భీముఁడు తలపడి బలరాముని బడగొట్టును. కృష్ణుఁ డది తెలిసి గుఱ్ఱముతలఁ బట్టెను. భీముఁడు మెడఁ బట్టును. బలరాముఁడు లేచి తోఁకపట్టి లాగును. దుర్యోధనుఁడు కాళ్లు పట్టుకొనును. అట్లా నలుగురి సిగపట్లగోత్రములో నద్భుతముగా నాయశ్వము మానవ స్త్రీ రూపము దాల్చును. భీష్ముఁడు వచ్చును.

తోహర. 'హరిబల మారుతి లరయనవ్రజముల్
కురుపతి యరవజ్రం బనుచు
ధరణీశ్వర గణియించెద రార్యులు
తద్బలముల గనుగొనుచు.'

అని మూఁడున్నర వజ్రముల యర్థమును నారదుఁడు విశదీకరించును. కథలో ననౌచిత్యము లటనట నున్నను, ఆ చిత్రమైన నన్ని వేశకల్పనయు, నా రచనయుఁ జమత్కారావహముగ నున్నవి.

2. శశిరేఖాపరిణయము,

గ్రంథారంభము :

జయహయవదన జయ రిపు మదన ॥ప॥
ద్వయసముపాసక భయహార సదన ॥అ॥
శ్రుతి తతిగేయాద్భుత సితకాయ
సితగళ శతధృతి ధృతి నిరుపాయ ౧ etc.,

కథా ప్రారంభము :

తోహరా, దేవా శశిరేఖాపరిణయ కథ
తెనుఁగు యక్షగానముగాఁ
గావించెద నాకర్ణింపుము భవ
త్కారుణ్యాధీనముగా.

కథ జనమేజయునకు వైశంపాయనుఁడు చెప్పినట్లుగలదు. కాని భారతమున నీకథలేదు. అయినను బ్రసిద్ధమైనది.

తోహరా. 'బాగుగ శశిరేఖా పరిణయకథ భోగిరాడ్గిరిపతికొప్పఁగ
బాగేపల్లి యనంతరాముఁడను భగవద్దాసుఁడు చెప్పెఁగ॥
వ్యయసంవత్సర వైశాఖశుక్ల గురువాసర సంయుతదశమిఁగ
జయకరమగు నీకథ ముగించెను హనుమవదనుని దయకలిమిన్.

మంగళం - కాంభోజి - ఆది.

'మంగళం శ్రీకృష్ణ రంగనాయకి ప్రియ ॥ప॥
అంగజారినుత విహంగవాహనా జయ మం. అ॥ ప॥
ఈశ మేడిపురీవాస భాసురమందిర
వాసవ సన్నుత దాసపోషక ॥జయ॥

(ఉపక్రమోప సంహారములన్నిట నిదేతీరు)

ఒక ఉదా : బలరాముఁడు తన కూఁతును దుర్యోధనపుత్రున కిత్తు నని చాటింపగా సుభద్ర కృష్ణునితో నన్నమాటలు :

ధన్యాసి - ఆట.

'అన్యాయ మొనరింతురా అన్నా యిటు ॥ప॥
అన్యునిగా నభిమన్యుని చెయివిడిచి॥
కన్నాకులై యిద్దరు అన్నలు నాకున్నారు పెన్నుద్దులు
నిన్నుబోలిన యన్నలు జగమెన్న లేరని
యెన్నుచుండఁగ మొన్ననీవు వినంగ మన పె
ద్దన్న యాడిన దాని దలఁపక॥' etc.,

ఇదీ ఘట్టము, ఘటోత్కచాభిమన్యుల యుద్ధ ఘట్టము. కడు చక్కఁగనున్నవి.యక్షగానమని పేర్కొనఁబడినను నిందు ద్విపదలులేవు. తోరాలు 142 గలవు. షట్పదు లొక యాఱు వాడఁబడినవి. అవి ద్విపదలకు బదులేమో! అది కన్నడదేశ సామీప్య ప్రభావమేమో! అనంతరామాచార్యుల కృతులలో నెందును తోరాలేగాని డోరాలులేవు. ఆ రెండిటి గతులు నిరుగు పొరుగుగా నుండును. అసలు రెంటి పేళ్లును ధురివాశబ్దభవములే యగునేమో!

౩. విశేషములు!

లావణి యొక్క మహారాష్ట్రి పదచ్ఛందము. కాని యనంత రామాచార్యుల కృతులలో నది రాగ విశేషముగా వాడఁబడినది. చంద్రహాస చరిత్రిలో (ఆదితాళమున)

పరిపంధి రాజుల నెల్లఁ
పరిమార్చి నంతట వెళ్లెఁ ॥పల్లవి॥
భండన పండిత భట సమూహములు
చండవేగ బహుకాండ నివహములు
కొండలసరి వేదండ యూథములు
మండిత రథచర దండ నాయకులు
గండు మిగిలి భూమండల మదరగ
నిండినడువ నరిమండలి బెదరగ॥ etc,

'గజల్' అన్నదొక పార్శీమట్టు. అదియు నిందొక రాగముగా నుదాహరింపఁబడినది. (చఁ॥ చ॥లో ఆదితాళములో)

'మంత్రీశ్వర. దయతోడ మా మనవిని వినవలయు ॥ప॥
వింతగాదు హరిదాసుఁడీ వేషంబున వెలయు ॥అ. ప॥ etc.,

కంద పద్య మీ కవికి మిగుల ప్రియమైనది. తద్రచన రుచి గొల్పుచున్నది. అనసూయా చరిత్రమునుండి యొక ఉదాహరణ: (సందర్భము ముగు రయ్యలను పసికందులను జేసిన యనసూయ కడకు వారి భార్యలు పతిభిక్షకొఱకు వత్తురు. అపు డనసూయ వండుకొనుచు పిల్ల లేడ్చుచున్నను చెయి తీఱికలేక వచ్చినవారిని జూచి యిట్లనుకొనెనఁట)

'పాపలకుఁ బాలు పోయఁగ
నీ పణతుల కేను జెప్ప నే మందురొకో!
యీ పని కెటు సేయుదునని
తాపస సతి కొంతసేపు తలపోసె మదిఁ॥'

ఈ పద్యమునఁ జమత్కార మెంతైన నిమిడియున్నది.

కుచేలోపాఖ్యానమునుండి యొక కొంత రచనా విశేషముల
కుదాహరణములు:

నాటురాగము—రూపక తాళము:

'ఉపహార మేదియైన దెచ్చియున్న నాతఁడో ||ప||
నెప మేదియైన దలఁచి నన్ను కృపను జూచునో ||అ||

తిలాన తరగతి : ఆదితాళము.

'సుఅచితో విప్రా గిరిగణ్య ||ప||
ధరణీ సురా విరాగి వర ||అ. ప||
సమిధలకై గురుసతి మము సనుపగ
విమల మతీ విపుల మతీ జనట||' etc.,

సావిత్రి చరిత్రమునుండి షట్పది కుదాహరణ:

'అశ్వపతి యని తొల్లి మద్ర మహేశ్వరుఁడు శతానంద సన్నిభ
శాశ్వతైశ్వర్యాదులను హరి దశ్వ తేజుండు||' etc.,

సుభద్రా పరిణయమునుండి యొక పద్యము నుదాహరణ.

సీ|| 'ఇదిగదా శ్రీ రమా ధీశ్వర పాదార
విందసంభృత మకరంద బిందు
విదిగదా కపిల మునీంద్ర కోపానల
దగ్ధసాగర పుణ్యధామసరణి
ఇదిగదా సకల బర్హిర్ముఖాంబుజ ముఖ
సముదయాభీష్ట మజ్జన గృహంబు
ఇదిగదా హైమవతీశజటాగ్ర వి
స్ఫురితాభినవ సితాంబుజ దళంబు

గీ|| ఇదిగద నిమజ్జ నాగతానేక సుజన
సంఘ దురితాంధకార పూషాయుతాతి
విమల తరవారిపూర సంభృత తరంగ
గంగ భవభంగ ధవళాంగ కమల సంగ||

---

# శ్రీ మద్రామాయణము—మానవత్వ ప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణ శర్మ.

---

శ్రీరామచంద్రపాత్రమునుగూర్చి రచించుటకుఁ బూర్వమునం దిఁక నొక్క విషయమునుగుఱించి దశరథపాత్రములోఁ జేర్కొనక తప్పదు. ఆ నృపాలుఁడు విశ్వామిత్రయాగసంరక్షణార్థము రాముని బంపుటను మనము గొంత పరీక్షింపవలెను. శ్రీ శ్రీనివాస శాస్త్రిగా రధిక్షేపించినటుల దశరథుఁ డుద్రేకముతో వాగ్దానము నొనరించి పిమ్మట పశ్చాత్తప్తుఁ డయ్యెనా? లేక నాసందర్భమున మనము గ్రహింపవలసిన విశేషాంశము లేమైన నున్నవా? తొలుదొల్త "నీవెద్ది కోరిన నద్దాని నంతయుఁ బూర్తిగఁ జేయుదు" నని చెప్పిన దశరథుఁడు శ్రీరాముని నిమ్మని యా మునివర్యుఁడు కోరుటచే నాతఁడు దన పుత్రు నిచ్చుటకుఁ గేవలపుత్రవ్యామోహపీడితుఁడై నిరాకరించెనా? లేక విశ్వామిత్రుని కోర్కె యసంగత మని నిరాకరించెనా? మరి యే యితర ప్రబలతరకారణము లైనం గూడ కలవా? అను విషయములు గొంత మనవి చేసెదను.

దశరథునియట్టి ధీరోదాత్తుఁ డా తీరున విశ్వామిత్రునికిఁ దన పుత్రు నీయ వెనుకంజ వేయుటకు మూఁడు ప్రబలకారణము లున్నవి. ఇఁక నాల్గవది సూక్ష్మతర మగు ధర్మములోని పరమార్థము. అందు మొదటిది నే నీవఱకు నా పూర్వవాసమునఁ జేర్కొన్న విషయము. దశరథునకు శ్రీరామచంద్రవియోగముచే మృత్యువు వాటిల్లునేమో యను భీతి. అయ్యది యాతనిహృదయమును నిరంతరము వేధించుచుండిన పరమరహస్యశల్యము! అరువది వేలేండ్లు రాజ్య మొనరించి లేక లేక కన్న పుత్రరత్నముల వివాహమహోత్సవమును జూడకుండ నీలోకము నెట్లాతఁడు వీడఁగలఁడు? "అంగం గలితం, పలితం ముండం ...తదపి న ముంచ త్యాశాపిండం" అను శంకరభగవత్పాదుల వాక్యము

లనాలోచితములా? శంకరునినాఁడుమాత్రమే యీయనుభవవాక్యములు పుట్టెనా! దశరథునియట్టి ప్రఖ్యాతపురుషులచారిత్రములను జదివియే యీ బుద్ధిశాలి రచించెను. మానవుల కామరణాంతము నెవ్వియో కోరిక లుండుటయు నయ్యవి వారు వృద్ధు లగుచున్నకొలంది వృద్ధి నొందుటయు లోకస్వభావము. దశరథుఁడుమాత్రము లోకస్వభావము నెటుల వీడఁగలఁడు. “స్వభావస్థ మిదం సర్వం సదేవాసురమానుషం” అని శ్రీకృష్ణభగవానుఁ డుద్ఘాటించియున్నాఁడు! కాకున్న నింద్రుఁ డహల్యాజారుఁ డెట్లగును? కావునఁ దనకుమారులకు వివాహము సేయఁదలపెట్టినట్టి శుభసంతోషసమయంబునఁ దన యజ్ఞసంరక్షణ మను సేరుతో ఘోరరాక్షససంహారమునకు ముక్కుపచ్చ లాఱని బిడ్డలను గొనిపోవ వచ్చిన విశ్వామిత్రునికోరిక యశనిపాతమువలె దశరథునకు గోచరించి యాతనిమానసమును గలంప కెట్లుండును? ఒకవంక పుత్రవ్యామోహాంధకారము; దానికిఁదోడు స్వమరణభీతి. “శుభము పలుకరా అంకన్నా! యనిన అవిరేణికుండలకాడ చచ్చినట్లు తొంగుందు’ నను సామెతవలె శుభాకాంక్షసమయమున రక్కసులతోఁ బోరాటమా! అంతకన్న నశుభవార్త యే మున్నది? ఏ తల్లిదండ్రుల గుండెలవియవు?

దశరథుఁడు పరమలౌకికశిఖామణి. అనేకయుద్ధములం దాఱి తేఱిన వీరుఁడు. కాని పుత్రవిషయమునను, సంతానము లేకలేక బహుప్రయాసముపై సాధించిన పుత్రోత్పాదనము నాతఁ డెట్లు మఱువఁ గలఁడు? తుద కటునిటు జూచి క్షత్రియజాతియం దుద్భవించినవాఁడ వయ్యును నీవు పదునాఱువత్సరములకన్నఁ దక్కువ వయస్సునం దుండిన బాలుని యుద్ధమునకుఁ దీసికొనిపోవుటయు క్షమా యని ముందుగ విశ్వామిత్రునికోర్కె యసంగతమును, నస్థానమును నని యీ తీరున నిర్ణయించెను:—

శ్లో. ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః
న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః (1-20-2)

ముందుగ విశ్వామిత్రుని యభ్యర్థనమే యనుచిత మని నిర్ణయించి యటుతరువాతఁ దన మరణభీతిని వ్యక్తపఱచెను.

శ్లో. 'విప్రయుక్తో హి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితుం మునిశార్దూల న రామం నేతు మర్హసి'. (1-20-8)

ఈశ్లోకమున విశ్వామిత్రుని "మునిశార్దూల" యని దశరథుఁడు సంబోధించుట గమనింపఁ దగిన విషయము. "మేము శుభము నాలోచించు చుండఁ బెద్దపులివలె నెచ్చటనుండి వచ్చితివయ్యా! మా బిడ్డలను గొని పోవుట కను హృదయావేదనము నా శబ్దముసూచించుచున్నది, ఒక వంక విశ్వామిత్రస్తవము, వేఱొకవంక నాతనిది క్రూర మగు నభ్యర్థన మను నింద' అదీ వాల్మీకిశబ్దప్రయోగములలోని స్వారస్యసౌష్ఠవములు. ఇట్టివి రామాయణమునందుఁ గుప్పలుతిప్పలుగ నున్నవి. అన లుపమా తయారుచేయుటలోఁ గాళిదాసుకు వాల్మీకి పరవడిఁ బెట్టె ననుట సాహసోక్తి కాదు. ఈ రీతిగ విశ్వామిత్రునియసంగతవాంఛయుఁ దన భీతిని మెల్లమెల్ల వెళ్ళఁగ్రక్కెను. దశరథుఁడు పైశ్లోకమునందు, కబోదుని శాపముచేఁ దనకు మరణము సంభవించు నను భయము ధ్వనించుచున్నదే కాని నిజమున కా శ్లోకములో దశరథునకు రామునియం దత్యంత ప్రేమ యనిమాత్రమే పైకి పరిస్ఫుట మగును. కావ్యమునకు ధ్వనియే జీవముకదా. తుద కొక్క మాటలో :—

శ్లో. "కథ మప్యమరప్రఖ్యం సంగ్రామాణా మకోవిదం
బాలం మే తనయం బ్రహ్మ న్నైవ దాస్యామి పుత్రికం".
(1-20-24)

అని పూర్తిగ నిరాకరించెను. దశరథుఁడా మునిశార్దూలునికోర్కెను! అటు లుద్రేకపూరితహృదయముతో నాతఁడువిశ్వామిత్రార్థమును ద్రోసి

వేయుట మానవధర్మవ్యతిరిక్త మెంతమాత్రమును గాదు. ఎంతటి యుదారస్వభావుఁడైనను దననునయుక్తములగు కోరిక లర్థియడుగునని యనుకొనఁడుకదా! “నీకేమి కావలసిన నిచ్చెద” నని యొక యుక్తుఁడగు ఋషిపుంగవునితో దాత యగు ప్రభు వనునప్పు డా మునివరుఁడయుక్తము లగు కామ్యముల నర్థించు నని యెవ్వఁ డనుకొనును? దాత ధర్మయుక్త మగు దానమును మాత్రమే సేయుట విధి గాని ధర్మవ్యతిరిక్తము లగు వాంఛలను దీర్పఁదలంచుట కర్ణాదుల దానము వలె నాత్మవినాశహేతువు. అట్టి దానముల నెన్నఁడును వేదము లంగీకరింపలేదు. తన కున్నదానిలో న్యాయము దప్పకుండ నర్థశాస్త్రమునకు వ్యతిరేకము గాకుండ నిచ్చుటయే వేదమతము. ఇందు దశరథుఁడు త్వరపడి చేసిన వాగ్దాన మే మున్నది? కైక రాము నరణ్యవాసమునకంపు మను కోర్కెకన్న విశ్వామిత్రునియర్థము మిగుల సంకటహేతు వనుటలో నాశ్చర్యమేమి? వనవాసమునకుఁ బోవునప్పుడు శ్రీరామునకిరువదై దేండ్లుండెను. అప్పటికప్పుడే శంబరాదులతో యుద్ధ మొనరించి వారిని సంహరించిన ధీరుఁడు రాముఁడు. విశ్వామిత్రాభ్యర్థనకాలమునఁ బదిరెండేండ్ల బాలుఁ డాతఁడు! మారీచసుబాహ్వాదులతోఁ బోరుట సామాన్యవిషయమా? వారివెనుక రావణుఁడుకూడ నుండెనని విశ్వామిత్రుఁడే వెలిబుచ్చెను. రాక్షససంహారము జరిగి తుదకుఁ దనపుత్రులకు వివాహముగూడ నగు నని దశరథుఁ డూహించుటకాతఁడు ఋషియా? కావున నక్రమ మగు విశ్వామిత్రాభ్యర్థనము నిరాకరించిన దశరథుని మనము గర్హించుటకాని యధిక్షేపించుటకాని తగదు. దశరథుఁడు శిబి, కర్ణ, బల్యాదులవలెఁ దన సర్వస్వము నర్పింపఁబూనితి నని దానకంకణము గట్టుకొని సర్వసంగపరిత్యాగ మొనరింపఁ దలంచిన మోక్షార్థి కాఁడు. అటులైన “కార్యస్య న విమర్శంచ గంతుమర్హసి కౌశిక! కర్తా చాహ మశేషేణ దైవతం హి భవా న్మమ’

(1-19-56) అని తన కార్యమునంతయుఁ జేసెద నని దశరథుఁడు ముం దుగ నేలఁ జెప్పవలె నందురా? అయ్యవి యుపచారవాక్యము లని ప్రతిగ్రహీత గ్రహింపవలెనే గాని యథాక్షరసమన్వయము నేసికొని దుష్ప్రాప్యము లగు వస్తువులను గోరుట యుక్తమా? ఉచితమా? మహానుభావు లగు నతిథులు మన గృహముల కరుదెంచినతఱి వారిని స్తోత్రము నేసి మీ కేమి కావలె నని గృహస్థధర్మము ననుసరించి యడు గుట తప్పా? అంతమాత్రమునం బ్రతిగ్రహీత దాతయౌదార్యమును దుర్వినియోగ మొనరించుటకుఁ జూచుట ధర్మమా? చూడుఁడు! అగస్త్యుఁడు సీతారామలక్ష్మణులు దన యాశ్రమమునకు వచ్చినప్పుడు వారి కతిథిసత్కారము సేయుటొక యుత్కృష్టధర్మ మని చెప్పుచు నీ తీరున బోధించెను:—

శ్లో. అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథిం ప్రతిపూజయేత్
అన్యథా ఖలు కాకుత్స్థ, తపస్వీ సముదాచరన్
దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్
(3-12-29).

అర్థాని పరమార్థమును గ్రహించిన సీతాదేవిని యతిథివేషముతో వచ్చిన రావణుఁ డెటుల మోసగించెనో జగద్విదితము. కావున నతిథ్య భ్యాగతులను వివేకించి వారికిఁ బూజ లొనరింపవలెనే కాని "కాషాయ దండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" యను నార్యోక్తి ననుస రించి ప్రతికుహనాయతిని గృహస్థుఁడు పూజించుటకు సిద్ధపడరాదు. ప్రఖ్యాతుఁ డగు ఋషిపుంగవుఁడు దన గృహమున కరుదెంచినందున విశ్వామిత్రుని సగౌరవముగా దశరథుఁడు సమర్థుఁ డగు వదాన్యుఁ డగుటచే మీ కేమి కావలసియున్న వాని నన్నిటి నిచ్చెద నని వాక్రు చ్చెను. అదియే వైదికధర్మపరిపాలనమునందలి పరమార్థము. అందు లకుఁ దార్కాణముగా నా యగస్త్యుఁ డేయేమి చెప్పెనో చూడుఁడు!

శ్లో. "రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః
పూజనీయ శ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః"
(3-12-30).

అని శ్రీరాముఁడు ప్రఖ్యాతక్షత్రియపుంగవుఁడును ధర్మచరితచరితుఁడును గావుననే యాతని నా యగస్త్యుఁడు పూజించెను. దానిరహస్య మెఱుంగని సీత తన పర్ణశాలముమునకు వచ్చినయతిథి యెట్టివాఁడో యెఱుంగక వాని నారాధించుటవలనఁ బూర్తిగఁ బరాభవింపఁబడెను. కావున నీ విశ్వామిత్రాభ్యర్థనఘట్టము గృహస్థధర్మమును నిర్వర్తించు మానవు లెటుల మెలఁగవలెనో, యాచకు లెట్టి కోరికలను మాత్రమే కోరవలెనో, దాత లెటుల దమ ధర్మమును నిర్వర్తింపవలెనో, మనకు బోధించుచున్నది. ఇచ్చట దశరథుఁ డొనరించిన వాగ్దాన మొక ప్రతిజ్ఞగా మనము గ్రహింపరాదు.

ఇఁక నొక్క విశేషముకూడ నీ ఘట్టమున మనకు గోచరించుచున్నది. జాగరూకతతో మనము విశ్వామిత్రుని ప్రవర్తనము నా సందర్భమునందు గమనించితిమేని యాతనియహంకారపూరితహృదయమే యాతనియాచ్ఞాపరిపూర్తి కాటంకము కలిగించెననుట నిర్వివాదము. తా నర్థియై వచ్చికూడ నే తీరున నా నిండుసభలోఁ దన యపూర్వ ప్రతిభానమున్మేషము నుగ్గడించుకొనెనో మనము కనుఁగొంటిమేని యా మహర్షి నింకను రజోగుణలేశమువలని యౌద్ధత్యము వీడలే దని మనకుఁ దోఁపక మానదు!

శ్లో. "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః (1-19-24).

వసిష్ఠవామదేవజాబాల్యాదులు గూర్చుండియున్న యా మహాసభాభవనమునందు రాముఁ డెవ్వఁడో నే నెఱుంగుదును. వసిష్ఠుఁడుగూడ నెఱుఁగును. ఈ తాపసులకును దెలియు' ననుట కేవల మాత్మోత్కృ

ర్షము నా ఋషిపుంగవుఁ డుగ్గడింపఁ దలంచుటయు సాహసము కాదా? తొలుతనుండియు శ్రీరామచంద్రు నీ లోకమునం దవతరింపఁ జేయుటకు సమకట్టి దశరథుఁ డొనరించిన యశ్వమేధము మొదలు పుత్రకామేష్టి వఱకు నుపద్రష్టలై సాగించిన వసిష్ఠనామదేవాదులముందుఁ దా నా రీతి గుండె బాదుకొనుచు "రాముని నే నెఱుంగుదు" ననుటలో నెంత యహంభావ మాతఁడు చూపించెను! చూడుఁ డాసమయమున వసిష్ఠుఁ డే తీరునఁ దన మహత్తరసాత్త్వికప్రవృత్తిని వీడక పరమశాంతచిత్తముతో మెలంగి యా వికలహృదయుఁ డైన దశరథుని బుజ్జగించెనో!

శ్లో. "కృతాస్త్ర మకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః
గుప్తం కుశికపుత్రేణ జ్వలనే నామృతం యథా".

శ్లో. "ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుధ్యాధికో లోకే తపసశ్చ పరాయణం' (1-21-9&10).

ఆహా! ఏమి యా పరమసాత్త్వికవైదికశిఖామణివినయము! విశ్వామిత్రుని దివ్యాస్త్రసంపద నంతయుఁ దృటిలోఁ దన బ్రహ్మదండముచే నుపహతి మొనరించి యాతనియుద్రేకమునంతయుఁ బూర్తిగ నణంచి వైచిన యా బ్రహ్మఋషివచనరచన మెంత గంభీరభావవిలసితము. విశ్వామిత్రుని "ఏష తపసశ్చ పరాయణం" అను వసిష్ఠవాక్యము లా విశ్వామిత్రునిహృదయము నెటుల తాఁకెనో యా నాఁటిసభయం దుండిన నామదేవజాబాల్యాదు లెఱుంగుదురు. కాని మన మెట్లూహింపఁ గలము! వసిష్ఠుఁ డొక సంపూర్ణామృతఘటము. అయ్యది తొణఁకదు. బెణఁకదు. అట్టి పరమసాత్త్వికునివద్ద నిరువదైదేండ్లు వచ్చువఱకు శుశ్రూష లొనరించిన రామచంద్రునిపరమసాత్త్వికసంపదకు వేఱుగఁ బ్రతిష్ఠాపత్రము కావలెనా? విశ్వామిత్రవసిష్ఠపాత్రలనుగూర్చి పరామర్శించునప్పు డా విశేషములను బాఠకమహాశయుల కందఁజేయ యత్నింతును. ప్రకృతమున నా యహంకారపూరితవిశ్వామిత్రాభ్యర్థన

మును దశరథుఁడు నిరాకరించుటలోఁ దప్పేమి ? ముష్టికి వచ్చిన యాతఁడు బ్రహ్మఋషియే కావిండు. ఆతఁడు లోకోపకారార్థమో, తన యశస్సంపాదనార్థమో, యాచింపనిండు. నేను జాల గొప్పవాఁడను గావున నీవు నా కోరిన వస్తువు నిచ్చితివేని నేను నిన్నుద్ధరింతు ననియు లోకము నుద్ధరింతు ననియుఁ జెప్పి తన యాథార్థ్యము నహంకారమును జూపుట ధర్మముకాదు. అట్లు మేము చాల గొప్పవారము కాని నేఁడు మీ వద్దకు యాచింపవచ్చితి మనుట రజోగుణదూషిత మగు యాచ్ఞ గాని సాత్త్వికార్థన మనిపించుకొనదు. చూడుఁడు! తుదకు వసిష్ఠుఁ డడ్డుపడి దశరథున కుపదేశించినఁ గాని యా నరపాలుఁడు విశ్వామిత్రు నకుఁ దన తనయు నీయలేదు. తా నాడంబరముతో శ్రీమునితత్త్వ మెఱుంగుదు నని విశ్వామిత్రుఁ డనినంతమాత్రమున దశరథుఁ డాతని నమ్మెనా ? శ్రీరామచంద్రునిపుట్టుకపూర్వోత్తరములు పూర్తిగ నెఱిం గిన వసిష్ఠునియుపన్యాసానంతరము విశ్వామిత్రుని యహంకారము పూర్తిగ నణంగినపిమ్మటనుగాని శ్రీరామచంద్రునిదర్శనముగూడ నా ఋషిపుంగవునకుఁ గలుగలేదు! అంతటనుండి సీతాకళ్యాణానంతరము విశ్వామిత్రుఁడు కౌశికీతీరమునకుఁ బోయి యచ్చట దన నింకను బీడిం చుచుండి యా యత్కించిదహంకారమునుగూడఁ బూర్తిగ నిర్జించుటకే వెడలియుండె నని నా మనవి. ఆ శ్రీరామాభ్యర్థనఘట్టమునం దెంత విశేష మున్నదో మన మీ తీరున గ్రహింపఁగలము. అటు విశ్వామి త్రునియజ్ఞసంరక్షణము, నిటు రావణవధ మహానాటకమునకు నాంది యటువసిష్ఠునినిరతిశయసాత్త్వికసంపద లోకమునకుఁ జాటుట, దశర థుఁడు తలంచిన తన పుత్రవివాహవైభవమునకుఁ బునాదియుఁ బ్రతి ష్ఠింపఁబడి యంతటినుండియే నిజమగు శ్రీరామచరిత్ర శ్రీమద్రామా యణము ప్రారంభ మయ్యెను.

ఇఁక దశరథపాత్రవలన మనకుఁ బ్రధానముగ గోచరించెడి విష యములు మూఁడు కలవు. అందు మొదటిది ధర్మవ్యతిరిక్త మగు

కామోద్వేగమువలన నెంతటి ధీరుఁడైన ధర్మరతుఁడైనను గ్రమ క్రమముగఁ బ్రమాదపరిస్థితులందుఁ జిక్కుకొని దుర్మరణముపాలుకాక మానఁడు. స్వభార్యయందుఁగూడ నిగ్రహముతో మానవుఁడు ప్రవర్తింపఁడేని మన ముంచిన దీపముకదా యని ముద్దిడఁబోవ మూతి కాలినట్లుగఁ బరాభవము నొందఁగలఁడు, అట్టివాని కెట్టి మనోనిగ్రహము గూడ నుండదు. చూడుఁడు! ఎంతయో నిగ్రహదీక్షతోఁ గైక యిలు సొచ్చిన దశరథుఁడు తుదకు "స కామవశమాపన్నః రత్యర్థం మనుజాధిపః" యనినట్లు కామార్తుఁడై పూర్తిగఁ గైకవలలోఁ జిక్కుకొనెను! విశృంఖలముగాఁ దన స్త్రీయందైనఁ బ్రవర్తించువాని కెట్టి మహత్తరకార్యము సాధించుటకును శక్తి యుండదు. తుద కాతనిదైనందినజీవితము గూడ దుర్భరమై నిరంతర మెద్దియో యొక యాపద తనకు మూడునని యురియాడుచుండు నాతని హృదయము. సమస్తభోగభాజనమగు సామ్రాజ్యము నేలుచుండియు దైవాసురయుద్ధములం దింద్రునంతవానికి సాయపడ సమర్థుఁడగు వీరుఁడయ్యును నిరతిశయప్రేమాస్పదులైన పరమపతివ్రతలు తనకు భార్యలుగ నున్నను దశరథునిజీవితము రామాయణమునుబట్టి చూడఁగ నంత సుఖాస్పదసంఘటనముగ మనకుఁ జూపట్టదు. కొనకు మృత్యుకాలమునందుఁ గూడ శ్రీరామచంద్రునియట్టి తనయులను గాంచిన నృపాలునకగ్నిసంస్కారము సకాలమునఁ జేయుట కెవ్వరు లేరయ్యె! దీని కంతకు నాతనియందుఁ జూపట్టుచుండిన దుష్టకామమే కారణ మనక తప్పదు. ఇఁక రెండవది పుత్రవ్యామోహము మిక్కుట మయ్యెనేని సంసారియే తీరునఁ దన జీవితసుఖమును గోల్పోవుటయేకాక పరమార్థ మగు ధర్మమునుగూడఁ ద్యజింపవలసివచ్చునో యను విషయము. పుత్రులు తనకు లేరను తహతహచే నా నరపతి రాజ్యశుల్కవాగ్దాన మొనరించి కైకను వివాహ మాడెను! వంశక్రమానుగతమైన రాజ్యము నిజ

ముగఁ గైకేయిపుత్రునకా నరపతి యీవలసియుండెను. అయ్యది ధర్మశాస్త్రవిరుద్ధము కాదా? వంశక్రమానుగత మగు ధర్మముగతి యేమి! అది యటులుండ నాతఁడు సర్వదా పుత్రవ్యామోహపీడితుఁ డగుటచేఁ దన కుమారులపై నీఁగ వ్రాలునేమో యని నిరతము వ్యథఁ జెందుచుండెడివాఁడు. మన పుత్రపుత్రికాదులు గుణవంతులై, ధర్మకాములై, యైశ్వర్యవంతులై మనకు మిత్రులుగ నుండి సుఖహేతువులుగ నుందురేని వారిని మిత్రబుద్ధిస్థులుగ మాత్రము మనము గ్రహించి వారినిదూర మందుండి వారియభివృద్ధిని గాంక్షించుచు వారి యందు మిత్రభావముతోడనే క్రమక్రమముగ మన తగులాటమును వీడవలెనుగాని, వారి సుఖదుఃఖములందు మనము గూడఁ బాల్గొనుచు నిమగ్నుల మగుదుమేని ధూర్జటికవి రచించినటుల "సీల న్సీల యమర్చినట్లొసఁగితో శ్రీకాళహస్తీశ్వరా!" యని విచారింపవలసివచ్చును. ఇఁక నిర్భాగ్యులై శత్రువు లగుదురేని సగరచక్రవర్తి యసమంజుని వీడినట్లుగ మనము వారిని వదలి దూరమునకుఁ బోవవలెను. ఎప్పటికైన నీ పాంచభౌతికదేహము నశింపక తప్పదని యెఱింగిన ప్రతిమానవుఁడును గ్రమక్రమముగఁ దన జంజాటమును వయస్సు మీఱినకొలంది విడువ దలంపఁడేని యయ్యవి యాతనికిఁ బ్రబలతరయాతనాహేతువులై మృత్యుకాలమునందుఁగూడ వేధింపక మానవు! అందుచేతనే కాళిదాసు శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణాం। వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజా'' మని నుడివెను. దశరథుఁ డటుల గాక తొలుత సంతానముకొఱకును, పిమ్మట వారి ముద్దుముఱిపెములం జూచి యానందించుచును, నటుతరువాత వారి పెండ్లిపేరంటముల కొఱకును, ననంతరము వారి పట్టాభిషేకమహోత్సవములందును, నీ రీతిగ నొక కోరికనుండి వేఱొక వాంఛకుఁ దీఁగెలుసాగ నలముకొను చుండునే గాని తన యాసన్నమృత్యువునుగూడ సరిగ గమనింపలేదు. ఒకవేళ

ననేకవిధములఁ బ్రకృతియందలి యుత్పాతములు తనకుఁ గలిగిన స్వప్నాదులయందలి దుర్నిమిత్తములు సూచించుచుండినను దా నెద్దియో నిర్వాహకత్వ మింకను వహింపవలె నను నహంకార మమకారములను, కామ వ్యసనములను వీడఁజాలకుండుటచే నాతనిమరణముగూడ దుఃఖపూరిత మయ్యెను! కావునఁ బితృపుత్రికాదులందు మానవుఁడు క్రమక్రమముగ మమకారము నుపహరించుకొనుచు నిష్కామకర్మాచరణదీక్షితుఁ డయ్యేనేని దశరథునివలె దుఃఖించుచు నీ లోకమును వీడకుండఁగలఁడు.

ఇఁక మూఁడవది గుణవతు లగు భార్యలను వదలి తన ప్రేమ యంతయు రూపవైభవము గల యాదుదానియందు లగ్నముచేయుట వలన నా నరపతి యెటుల ముప్పునఁ దిప్పలపా లయ్యెనో గమనింపఁ దగినది. దశరథుని ముగ్గురుప్రధానభార్యలలోఁ బట్టమహిషి యగు కౌసల్య యద్వితీయ, వీరమాత, మహాపతివ్రత, సుగుణరాశి, త్యాగమూర్తి. తన కశ్వమేధాదికములందుఁ దోడునీడగ నుండి యుపచరించిన మహత్తరశ్రద్ధాళువు. ఆమెనుగుఱించి ప్రత్యేకముగ నా యాపాత్రవిమర్శనావసరమునఁ బ్రసంగింతును. అట్టిసుగుణఖని యగు కౌసల్యను వీడి, వేరొకవంక గేవలమహాయోగిని యట్టి సుమిత్రను ద్రోసిరా జని తుచ్ఛభోగలాలసత్వముచేఁ బాంచభౌతిక మగు నీ శరీరమునందలి రూపసంపదచే నాకర్షింపఁబడి కైకయందుమాత్ర మత్యంత రాగానుబద్ధుఁ డగుట దశరథునియట్టి వివేకవంతునిలక్షణమా? తుద కామె యా వృద్ధనృపతి కేగతి తెచ్చెనో శ్రీరామచంద్రుఁడే యీ తీరున విలపించెను :-

శ్లో. "మన్యే దశరథాంతాయ మమ ప్రవ్రాజనాయ చ
కైకేయీ సౌమ్యసంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ"
(2-53-14).

గుణవిశిష్టతావైభవమును వీడి కేవలగ్రామ్యసుఖసంతుష్టికై ప్రమదా రూపవిశేషములచే విమోహితు లగు మానవులు దశరథునివలె నంత కాలమునకు దుఃఖభాజను లగుట మనకు శ్రీమద్రామాయణము బోధించుచున్నది.

ఇవ్విధముగ రామాయణమహాకావ్యము మానవుని కరిషడ్వర్గ మేయేవిధమున నెవ్వెడెవ్వ డడ్డుతగులుచుండునో, వానిఁ గలని ప్రమాద ముల నేవిధమున నరికట్టవలయునో, మాయాపాత్రములవలన వాల్మీకి నిరూపించెను. బాలకాండమునఁ గామమువలన నిజబుద్ధివిపర్యయమును, నయోధ్యాకాండమునందుఁ గ్రోధమువలన బుద్ధిభ్రంశమును, నరణ్య కాండమునందు లోభోపహతమైన మానవుఁ డేతీరునఁ బరాభవము నొందునో యావిషయమును, కిష్కింధాకాండంబున మోహమువలననైన ప్రమాదంబును, సుందరకాండములో మదమువలనమానవునకుఁ గలుగు భంగపాటును, యుద్ధకాండంబున మాత్సర్యముచేఁ గలుగు వినాశం బును నా కవిపుంగవుఁడు నిరూపించుచు నా యరిషడ్వర్గము ధర్మరతు లను బాధించుతఱి శరత్కాలమేఘమువలె వారికిఁ దోఁచి విడిపోవుచుం డుటయు, నధర్మపరుల నయ్యది వర్షాకాలమేఘంబువలె నే తీరున నుప ద్రవములందు ముంచునో యభివర్ణించియున్నాఁడు. ఆయా విషయముల నాయా ఘట్టములను బాత్రములను విమర్శించుతఱిఁ బాఠకమహాశయుల జ్ఞప్తికిఁ దెచ్చుచుందును.

## శ్రీ రా మ చం ద్రుఁ డు

అనేకదివ్యవత్సరములు నిశితతప మాచరించి మహత్తరనార దోపన్యాసము నొంది "వాగ్దేవతాచరణ చిత్రితచిత్త సమ్యక్దై"న్స్వయం భువుండు ననాదికవియు నగు బ్రహ్మచే నాశీర్వదింపఁబడి యాదికవి యని నేఁటికిని బ్రఖ్యాతి గాంచిన కవిబ్రహ్మ యగు వాల్మీకిమహర్షిచే

వర్ణింపఁబడిన శ్రీరామచంద్రుని దివ్యవైభవమును నిరూపించుటకు "మందఃకవియశఃప్రార్థీ గమిష్యామ్యుప హాస్యతా" మని కాళిదాసువంటి విద్వాంసుఁడు వెనుకంజ వేయ నాబోంటి కించిజ్జ్ఞుఁ డా లోకాదర్శక మహాపురుషపాత్రనుగూర్చి యాధునిక పాఠకలోకమునకుఁ బరిస్ఫుటము సేయయత్నించుట శ్రీరామసేతువున కుడుతపిల్ల యత్నమువంటి దని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. "తపస్స్వాధ్యాయ నిరతు"ఁడైన "వాగ్విదు" లలో శ్రేష్ఠుఁడైన నారదుని "తపస్వి" యు, నిరంతర తారకమంత్రో పాసకుఁడు నగు వాల్మీకి ముందుగఁ బరిప్రశ్నము సేసి యటుపిమ్మట నవతరింపఁజేసిన యుత్కృష్టకార్యమునందలి నాయకమణిని గూర్చి రచించుట కా పుట్టలోఁబుట్టినయాతనికే చెల్లునుగాని నా యట్టి వాని యత్నములు కేవలబాల్యచాపల్యముచేఁ జంద్రమండలము నందుకొనఁ జేతులు చాఁచునటువంటి దని యెఱుంగుదును. అట్లయ్యును భట్ట మురారి సెప్పినట్లుగ స్వాత్మోద్ధరణమునకై యా రామచంద్రుని స్మరించిస్మరించియు నా పతితపావనుని నామము పలుమాఱు రచించి రచించియు నాయుదారమూర్తి గుణవైభవములను మాటిమాటికిని దలంచిదలంచియైన నా జన్మము నీషన్మాత్రమునైనఁ బవిత్రముసేసికొను నాసతో నే నీ శ్రీమద్రామాయణములోని యా యా పాత్రవిమర్శన మునకుఁ గడంగితినే కాని సహస్రముఖవ్యాప్తమై శతకోటిసంఖ్యా విస్తృతమైన రామచరిత్రమున కెద్దియో యపూర్వార్థకల్పనము సేయ వలె నని కాదు. అటు లూహించుట సూర్యునిఁజూపుటకు మిణుఁగురు పుర్వుయత్నమువంటిది.

షోడశకళాప్రపూర్ణుఁ డగు చంద్రునివలె షోడశగుణాత్మకుఁ డగు పురుషవర్యుఁ డొకఁడు నేఁడు జీవించి యీ మర్త్యలోకమునందుఁ బాంచభౌతికశరీరముతో నివసించుచుండినవానింగూర్చి తన కుపదేశింపు

మని వాల్మీకి నారదు నడిగెనఁట! అందు దపస్స్వాధ్యాయనిరతుఁ డగు మునిపుంగవుని దపస్వి యగు ఋషి యనుగుటలోని స్వారస్య మేమి? నారదుఁడు కేవలతపస్వికాక స్వాధ్యాయనిరతుఁడుగూడ నగుటచే వేద వేదాంగరహస్యము లన్నియు నెఱింగియుండిన నిష్పాక్షిక మైన బుద్ధి కలవాఁడు. వేదోపబృంహితము లగు మహాపురుషలక్షణములనుగూర్చి నారదుఁ డెఱింగినంతగ వాల్మీకికిఁ దెలియకపోవచ్చును. "రూప మేవాస్మి న్మహిమానం వ్యాచష్టే" యని వేద ముద్ఘోషింపుచున్నది. దివ్యరూపసంపదకూడ మహాపురుషలక్షణములలో నొకటి. అందు చేతనే చతుర్వేదపారంగతుఁ డగు నాంజనేయుఁడు శ్రీరామచంద్రుని మహాపురుషలక్షణములను సువిస్ఫుటముగ నిరూపించి వర్ణించి సీతాదేవి హృదయమునం దతఁడు రామదూత యను విశ్వాసమును నెలకొల్పఁ గలిగెను. ఒకవేళ వాల్మీకి యవియన్నియుఁ దన తపఃప్రభావముచే నెఱుంగఁ గల్గినను, దనకన్న నన్నివిధముల మిన్నయుఁ ద్రిలోకసంచారియునగు నారదునియట్టి విజ్ఞాననిధివలనఁ దన యెఱింగినయర్థమును దృఢీకరింపఁజేసికొనుట యవసరముకదా! సూర్యచంద్రు లుండునంత కాలము గంగాస్రవంతివలె నిరతిశయపవిత్ర మగు మహాకావ్యమును రచింప నమకట్టిన పరమతపోవర్యునిమానస మట్లు తహతహం జెందుట సహజము. భర్తృహరి చెప్పినట్లు తెలియనివానికే సర్వముఁ దెలిసిన ట్లుండును. ధర్మరాజుగారి కన్నియు సందేహములే! తిప్పన్నాత్రుని కెట్టి సందియ ముండదు. కావునఁ దనకు క్షుణ్ణముగఁ దెలిసిన విషయమునుగూడ మహత్తరానుభవము గలిగినపెద్దలు వచ్చిన ప్పుడు వారినుండికూడ "సెహబాస్" అని యనిపించుకొనుట మన యార్యసాంప్రదాయ మని మనకు శ్రీమద్రామాయణము బోధించు చున్నది. ప్రకృతనవ్యాంధ్రవాఙ్మయవిశ్వబ్రహ్మల రచనగమనికలం గాంచినచో వానికి దారితెన్నులు తోఁపక పాఠకులలో విశేషముగఁ

బ్రిక్రతమున స్త్రీలే యగుటచే నా కథావస్తువులచే నలంకరింపఁబడిన కాగితములను మఱచటిదిన ముదయమున నే తమ బిడ్డలసపర్యలకై మాత్రి ముపయోగింపఁబడుట తటస్థించుచున్నది! అంతకన్న నా రసా భాసాలంకారపూరితము లగు కథాసృష్టికర్తల గ్రంథరాజముల కిరవగు స్థాన మేమి కలదు!

శ్లో. "యత్ర భార్యా గిరో వేదాః యత్ర ధర్మోఽర్థసాధనం
యత్ర స్వప్రతిభామానం తస్మై శ్రీకలయే నమః

కవిడంబనము).

అని వక్కాణించెను. కలివిడంబనకారుఁడు. ఈ నాఁడాతనివాక్యము లెంత యన్వర్థములో మనము చూచుచున్నాము. నేఁటిరచయితల స్వప్రతిభావిలసితము లగు రచనలు కేవల మర్థసాధనాపేక్షయందే పర్యవసించుచున్నవి! కాని వాల్మీకి యట్టి దుష్టకామముతోఁ దన కావ్యమును రచింపఁదలంపలేదు. తాను రచించెడికావ్యమునకుఁ బరమార్థము, గంగాసవంతిపవిత్రయోజనమువంటి దనుట నిస్సంశయము. అందుచేతనే యా ఋషిపుంగవున కెన్ని చూచినను, నెంత యాలోచించినను, తన కనులయెదుట బ్రహ్మవరమహిమచే నంతయుఁ గరతలామలకముగఁ గాన్పించుచుండినను నాతఁడు నారదుని బ్రశ్నింపసమకట్టెను! నారదుఁడుమాత్రము తక్కువవాఁడా? వాల్మీకి పదియాఱుగుణములు గల మహాపురుషునిగూర్చి యుపన్యసింపుఁ డని యా స్వాధ్యాయనిరతుఁ డగు తపస్విని గోరినంతనే యా దివ్యమునిపుంగవునిమానసము పొంగ నతఁడు చతుష్షష్టికళాత్మకమును బరమపవిత్రము నగు వేదమువలె జతుష్షష్టి నిరతిశయగుణాత్మకుఁడగు శ్రీరామచంద్రునిగూర్చి మహాగంభీరమై సూక్ష్మతరశబ్దమై ఖరీసమేతమై యల్పాక్షరసమన్వయ శబ్దములచే నధికార్థస్ఫోరకము లగు తన విశిష్టవాగ్విలాసముతో నా

కౌసల్యానందవర్ధనుని వర్ణించి చెప్పెను! ఆహా! ఉపదేష్ట యనఁగ నట్లుండవలెనుగదా! మన పాఠశాలలయందు బోధించు పండితులా నారదుని జూచి తమ యుపదేష్టృత్వమును సంస్కరింపఁగడంగుచో నేఁటి భారతవర్షమునందలి బాలబాలికల విద్యాసంస్కారములు మిగుల నభివృద్ధి గాంచఁగలవు. నా మిత్రులలో నొకరు "శర్మగారూ! మీరు వ్రాస్తారు గాని మీకు మూఁడవ హస్తం కొంచెం పొడుగండీ" అనఁగా చాదముగా వ్రాస్తారండీ" అని విమర్శించుచుండిరి. వారికి నారదుఁడే తీరుఁ వాల్మీకి కుపదేశించెనో జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాను. నేను పండితులకొఱకు విద్యాధికులకొఱకు నీ రామాయణవిమర్శన మందీయఁదలంపలే అక్షరాస్యులగు జనసామాన్య మీ విషయమును గ్రహింపవలె న నూహతోడనే నేను రచింప మొదలిడితి ననిగూడ వారికి నా మన వాల్మీకియట్టిమహర్షి గూడఁ దన నాయకునిగూర్చి నారదునియట్టిప్రతి వంతుఁ డేమి సెప్పునో యని యుబలాటపడియుండ నాబోఁటి య విద్యావంతుఁడు నేను జెప్పువిషయము ప్రజాహృదయమున కర్థమగు లేదో యని తహతహ చెందుట సహజముకదా! ఇఁక నా పరాపశ్య మధ్యమా వైఖరీ వాక్సంప్రదాయములను బూర్తిగ నెఱింగిన న దుఁడు స్వతస్సిద్ధముగ మహత్తరగాయకుఁడును నాట్యశాస్త్రవిశారదుఁ గూడ నగుటచేఁ దన యప్రతిహతవాగ్విలాసముచే నత్యంతమృదుమధ వచనరచనచేఁ బృచ్ఛకుఁ డగు వాల్మీకిహృదయకుముదముఁ సహస్రము బుల రంజిల్లునట్లుగ శ్రీరామయశశ్చంద్రికలను గీర్తించెను. తా నూహిఁ రచింపఁదలంచిన చరిత్రమునకుఁ బ్రధాననాయకునకుఁ బదియాఱు గుణం లున్నవా? యను ప్రశ్నకు గురు వా నాయకున కఱువదినాల్గు గుణంబులు కల వని యెఱిఁగించినచో నా శిష్యుని యానందమునకు మేర యుండునా! ఇఁక వాల్మీకిరచనావైభవమున కమృతరసప్రవాహమున బ్రసరింపఁజేయ నిటు సరస్వతియు నటు బ్రహ్మయుఁ బూనుకొనిరి! అతి చేతిది ఘంటమా! అతఁడు రచించినవి తాఁటియాకులా? కావు! కాక ఆతనిచేతిలోని దొక యమృతరసప్రపూరితస్వర్ణమయ మోహనలేఖిని

ఆతఁడు రచించినింపినవి నిరంతరభావతరంగితములై నిరవధికమధురరస ప్రవాహపోషితము లగు మానవమానసకాసారములు! ఆ కవి యెట్టివాఁడో వానిపరికరము లట్టివి! వానిపరికరము లెట్టివో యాతనివస్తు వట్టిది! ఆతనివస్తు వెట్టిదో యందలి పాత్రలుగూడ నమృతమయములే! ఇఁక వేద మా మహాకవిలేఖినినుండి మహాకావ్యపథంబునం బడి యా త్రేతాయుగాంతము మొదలు కలియుగాంతమువఱకును వేయేల యుగయుగాంతములవఱకు నొకేతీరునం బ్రవహింపకతప్పునా? శ్రీరామచంద్రు లనేకులుండ వచ్చునేమోగాని వాల్మీకి యొకఁడే! యాతఁ డద్వితీయుఁడు. ఆతఁడు రచించిన బాటపై నడుచుకొనుట కనేకరాములుండిన నుండవచ్చు. రాముఁ డవతరించినప్పుడెల్ల సీత యవతరింపకతప్పునా? అందుచేతనే శ్రీరామచంద్రుఁడు "దేశేదేశే కళత్రాణి" యని సీతయొక్కతెయే మహాపతివ్రత యని యంగీకరింపలేదు! ఎన్ని శాసనములు భూతభవిష్యద్వర్తమానప్రభునామకులీ భారతసంఘమునందుఁ జొప్పింపఁదలంచినను వాల్మీకి రచించిన సీతారాముల చరిత్ర మాత్రము హిమవత్పర్వతశ్రేణివలె నిలచి యచంచలమై యుండకమానదు. భారతజాతియొక్క ప్రతిస్త్రీపురుషుని నాడులయందుఁ బ్రవహించెడి జీవరక్తకణంబులు శ్రీమద్రామాయణకథాశబ్దసంస్కృతంబులు! ఒకవేళ నరులు మాఱినను వానరులో! వానరుల నితరదేశముల కెగుమతిసేసినను, శిలామయపర్వతపంక్తు లున్నవి! మైనాకుఁ డింకను సముద్రమునందుఁ డాఁగి శ్రీరామచరిత్ర నుద్ఘోషించుచునేయున్నాఁడు! ఒకవేళ నాప్రళయకాలంబున శిలామయపర్వతపంక్తులుగూడ చూర్ణితములైనను సేతుబంధముచేఁ బవిత్రముగావింపఁబడిన జలార్ణవ మేమగును? కావున ననాది యగు నీ సముద్రము గూడ రామవృత్తాంతమును మానవుల కందింపకమానదు. అయ్యది తంత్రీలయసమన్వితమై భూమ్యాకాశములు నిండిన శతకోటిప్రవిస్తరగాథ! అట్టి శ్రీమద్రామాయణములోని ప్రధానపాత్ర యగు శ్రీరామచంద్రునిగూర్చి యథాశక్తిగ ముందు సంచికనుండియుఁ బాఠకమహాశయుల కందింప యత్నింతును.

# కవిసార్వభౌముని కథాకథన కౌశలము.

శ్రీ కాకర్ల వెంకటరామనరసింహము.

కాశీఖండమునందలి యుపాఖ్యానములలోఁ గళావత్యుపాఖ్యానమున కొక ప్రత్యేకత గలదు. అది కథావిధానమునకు సంబంధించి యున్నది. కవిసార్వభౌముని యాంధ్రీకరణమున, మూలమునకు వన్నె పెట్టు ఘట్టము లనేకములు గలవు. కాని యవి యన్నియు నౌచిత్యనిర్వహణముకొఱకు శిల్పదృష్టితోఁ గావింపఁబడినవి. కళావత్యుపాఖ్యానము నందుఁగూడ నట్టి మెఱుఁగులు పెక్కులు గలవు. వానికిఁదోడు కథాగతియందును మార్పు గావింపఁబడినది. కథాగతియందు మార్పు సేయుట శ్రీనాథునిపద్ధతి గాదు. అట్టియెడ నీ యుపాఖ్యానమునమాత్రమ మ్మహాకవి యట్టి ప్రత్యేకత నేల చూపె నను విషయము చర్చనీయము. ప్రప్రథమముగ నా మార్పెట్టిదో చూచి, తరువాత నద్దాని నేల చేసెనో గమనింతము. మూలమున సుశీల సహగమనము చేసినట్లు లేదు.

"ధ్యాయంతీ సాపి తం బాలా, విద్యాధర కుమారకమ్
విరహాగ్నౌ విస్పృష్టాసుః, కర్ణాటే జన్మభాగభూత్."

మీఁది వాక్యములనుబట్టి సుశీల యుత్కటమగు విరహబాధను సహింపఁజాలక మరణించె నని చెప్పనగును. ఆంధ్రమునమాత్ర మామె సహగమనము చేసినట్లు గలదు. చూడుఁడు

"అనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుఁ బోలె,
కొసర కగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి".
"ఆలింగనంబు సేసెం
బాలిండ్లను ముట్టె వదనపద్మము తావుల్
గ్రోలె మగఁ డనఁగ నెవ్వం
డా లనఁగా నెద్ది? భర్త యతఁడే నాలిన్.

"అని విద్యాధరునితోడ ననుగమనంబు సేయందలంచి, యతివి యమ్మోలుంగుఁబోఁడి మలయాచలోపాంతంబున"

"వెగ్గల మైన కూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా
రగ్గి పటీరకాష్ఠములయందు రవుల్కొనఁజేసి కమ్మపూ
మొగ్గలదండ దాల్చి మది మున్కడఁ గాశిని విశ్వనాయకు
న్దిగ్గన సంస్మరించి, జననిం జనకుం దలఁచెం గ్రమంబునన్."

"నెండియు న క్కన్యక కర్పూరకదళీకాద్రుమనిర్యన్నిర్యాసధారాద్రవ వాసనానుగంధంబు లగు గంధసారగిరినితంబనిర్ఝరాంభః ప్రవాహంబున ముఖప్రక్షాళనం బాచరించి, విద్యాధరోపరివిరచిత (చితా) గంధసార కాష్ఠంబుల రవుల్కొని గంధకరటికర్ణతాళవృంతతాడన ప్రస్తార విస్తారితంబు లగు మారుతంబులవలనం బెచ్చుపెరిఁగి విచ్చలవిడిఁ మండుచిచ్చునకుం బ్రదక్షిణంబు వచ్చి నిసర్గకాతరంబులగు కటాక్షవీక్షణంబులు పుష్పాంజలివిక్షేపంబులభంగి నంగీకరింప"

మీఁదివర్ణనమునుబట్టి సుశీల సహగమనము సేసె నను విషయము నిశ్చిత మగుచున్నది. ఇఁక గవిఁ యీ మా ర్పేల చేసె నను నంశము చర్చనీయము. ఈ మార్పునకుఁ గారణములు ముఖ్యముగా రెండు గన్పట్టుచున్నవి.

1. గ్రంథప్రభావము. 2. కాలప్రభావము.

1. కాశీఖండమున, ద్వితీయాశ్వాసమున, బృహస్పతి లోపాముద్రికుఁ బతివ్రతాధర్మములఁ జెప్పు ఘట్టము కలదు. అందు, సహగమనము, పతివ్రతా ధర్మములలో నత్యుత్తమముగాఁ జెప్పఁబడినది. చూడుఁడు:—

"పిఱికిగండ యొకింత లే కఱిమివేడ్కఁ
జిచ్చుఱికెఁబోవు వికచరాజీవనేత్రి
కశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగుఁ
బదపదమ్మున కిదె వేదభాషితమ్ము."

పుట్టలోపల పాము నభ్యుద్ధరించు
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి.

"తోలఁగుదు రంతనంత యమదూతకిరాతులు భీతచిత్తులై
కలుషసమన్వితుం డయిన కాంతుని దారుణలోహపాశ శృం
ఖలికలు విచ్చి పుచ్చుకొని కాంతచితాగ్నిశిఖాముఖంబునన్
వెలువడి యాత్మభర్తవెనువెంబ హుటాహుటి గూడివచ్చినన్.

ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించుసాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెఱపొకింతయు లేక చిచ్చుఱికెనేని"

ఇట్టి పతివ్రతాధర్మములు గల గ్రంథము కాశీఖండము. ఆ గ్రంథముననే, కళావత్యుపాఖ్యానము గలదు. ఆ యుపాఖ్యానముననే, యొక సాధ్విభర్త మరణించినట్లు చెప్పఁబడియున్నది. భర్తృమరణానంతర మా యమకర్తవ్య మేమి? కాశీఖండమున నా యంశము విస్పష్టముగాఁ జెప్పఁబడియేయున్నది. సహగమనము సేయుటయే యా సాధ్వికర్తవ్యము. సహగమనము సేయకున్న నామె పతివ్రత కాకూడదా? కావచ్చు. కాని యుత్తమసాధ్వీలక్షణ మది కాదు. మఱియు వితంతుత బహుధా గర్హింపఁబడినది. అవ్విషయమున నుదాహరణము లిట నప్రస్తుతము. ఇఁక నే గ్రంథమున వితంతుజీవనము బహుధా గర్హింపఁబడి, సహగమన ముత్తమోత్తమసాధ్వీలక్షణముగాఁ బ్రస్తుతింపఁబడినదో, ఆ గ్రంథముననే, సుశీల యను సాధ్వి, భర్తృమరణానంతముగూడ జీవించియున్న దని చెప్పుట హాస్యాస్పద మగుటయేకాక, గ్రంథప్రతిపాదితధర్మమున కుపహతియు నగుచున్నదిగదా! కవిసార్వభౌముఁడు

మూలమునందలి యీ లోపమును గ్రహించినాఁడు; సుశీలచే సహగమనము చేయించినాఁడు. ఇంకొక ముఖ్యవిషయము— భంగ్యంతరమునఁ గూడ సహగమనమే సమర్థనీయ మగుచున్నది. మలయాద్రి కాశీక్షేత్రమునకుఁ జాల దవ్వునఁ గలదు. ఖేచరగమనము గలవాఁడు కావున విద్యాధరుఁ డవలీల నంతదవ్వుఁ దరించినాఁడు. సుశీల మానవి; ఆమెకు ఖేచరగమనము లేదు. ఒంటరిగా నంతదూరము నడచిపోవుటయు నసాధ్యమే. ఒకవేళఁ బోయినను మార్గమధ్యమున నెట్టి యిక్కట్టులు వచ్చునో! ఆమె సుందరి; ఆమె యపరూపసౌందర్యమునకు ముగ్ధుఁడై యేకదా విద్యాధరుఁ డామెను మలయాద్రికిఁ దెచ్చినది! ఇఁక నామె యొంటరిగా నేఁగుచో నెవ్వ రెట్లగుదురో యెవ్వరి కెఱుక? కావునఁ గాశి కేఁగుట యసంభవము. ఇఁక మలయాద్రియందే యుండరాదా యన్న నది మఱియుఁ గష్టసాధ్యము. అసంభావ్యము. సుశీల కాశికాపురియందుఁ బుట్టి పెరిఁగినది. అచ్చోటు వాసి యెన్నఁడు నెచ్చోటికి నేఁగినది కాదు. మఱియుఁ దలిదండ్రులచాటునఁ బెరిఁగినది. అట్టి యామె కన్నుమూసి తెఱచునంతలో మలయకూటమున కేఁగినది. దారి తెన్ను లామె కేమియుఁ దెలియవు. అట్టియెడ నమ్మహారణ్యమున నా ముగ్ధ యె ట్లుండఁగలదు? ఏమి చేయఁగలదు? అనన్యసామాన్యమగు నామె సౌందర్యమునకు ముగ్ధులై యాటవికు లెవ్వరైన నామెకుఁ జేటు గల్పింపవచ్చును. కావున, నాపరిస్థితిలో నామెకు సహగమన మొక్కటియే శరణ్యము. కావుననే కవిరాజు చేసిన యీ మార్పాతని యుచితజ్ఞతను వేనోళ్ళఁ జాటుచున్నది.

2. కాలప్రభావము:—ఇది మొదటిదానికంటె బలీయ మైనది. కాకతీయసామ్రాజ్యము క్రీ॥ శ 1323 లో, మహమ్మదీయులవశ మైనది. వశమైనంతనే తురకలయత్యాచారములు మిన్నుముట్టినవి. గోబ్రాహ్మణుల హింసించియుఁ బతివ్రతలఁ జెఱబట్టియు, దేవతాయతనములఁ

గొల్లకొట్టియు, హైందవమతగ్రంథములఁ దగులఁబెట్టియు, వారు విచ్చలవిడి సంచరింపఁజొచ్చిరి. వారియత్యాచారము లెంతకాలమో సాగలేదు. ముసునూరిప్రోలయనాయకుని యాధిపత్యమున నాంధ్రమహావీరులందఱు నేకమై మహమ్మదీయుల నిర్జించి యాంధ్రసామ్రాజ్యమును స్థాపించిరి. ప్రోలయకుఁ జేదోడువాదోడుగఁ గాపయనాయకుఁడు పని చేసెను. కాని యేమి లాభము ? కొలఁదికాలములోనే యాంధ్రులలో నైకమత్యము చెడిపోయినది. రాచకొండవెలమలకును, రెడ్లకును మనఃస్పర్ధ లేర్పడినవి. విజయనగరసామ్రాజ్యము స్థాపింపఁబడినది. కాని దానికిఁ బ్రత్యర్థిగా బాహమనీసామ్రాజ్యమును మహమ్మదీయులు స్థాపించిరి. ఈ సామ్రాజ్యస్థాపనకుఁ గాపయనాయకుని యవివేకమే కొంత కారణ మనవచ్చును. మహమ్మద్‌బీన్‌తోగ్లక్ తెలంగాణముపై నెపుడు దాడివెడలునో యను భయము. కాపయనాయకుఁడు జాఫరుఖా నను నొక తురకకు సాహాయ్యము గావించెను. వాఁడు కాలూనినంతనే, స్వతంత్రుఁడై బాహమనీసామ్రాజ్యమును స్థాపించి, ప్రప్రథమముగాఁ దనకు సాహాయ్యము గావించిన కాపయపైకే దాడివెడలి, యాతని నోడించి, కొన్ని దుర్గములుకూడ నాక్రమించెను. ఈ జాఫరుఖానుఁడే సింహాసనము నధిరోహించినతరువాత, 'అలాఉద్దీన్ హసన్ గంగూబహమన్' అను బిరుదునామమును దాల్చెను. ఢిల్లీసుల్తానుమరణానంతర మీతఁడు మఱలఁ దెలంగాణముపై దాడివెడలెను. ఈతని మరణానంతర మీతని తనయుఁడు మహమ్మద్‌షా యనువాఁడు క్రీ॥ శ 1366 లో మఱలఁ దెలంగాణముపై దాడివెడలెను.

ఇట్లు మహమ్మదీయులు విజృంభించుచుండఁగా నాంధ్రవీరు లేమి చేయుచుండిరి ? నిద్రించుచుండిరా యను సంశయమునకు నవకాశము లేదు. విద్యానగరప్రభువులు బహమనీసుల్తానులతో వెనుకంజ వేయక యుద్ధము చేయుచునే యుండిరి. రెడ్లును వెలమలును నప్పుడప్పు డా

యుద్ధములలోఁ బాల్గొనుచుండిరి. కాని తురకలలోఁ గల యైకమత్యమాంధ్రప్రభువులలో లేకుండుటచే వారిని సమూలముగా నిర్జించుట వీరికి సాధ్యపడ దయ్యెను. మహమ్మదీయుల దౌర్జన్యముల కాంధ్రులప్పుడప్పుడు గుఱి యగుచుండిరి. అట్టియెడ స్వజనస్వధర్మరక్షణార్థమై ధర్మజ్ఞులగు వారికి, విపరీతములగు కొన్ని కట్టుబాట్లను బ్రచారములోనికిఁ దెచ్చుట తప్పనిసరి యైనది. అట్టి విపరీతనియమములలో నొకటి సహగమనము. దీనిని బ్రచారములోనికిఁ దెచ్చుటకై కవులును బండితులును బహుధా శ్రమించిరి. గ్రంథములలో సమయము వచ్చినప్పు డెల్ల సహగమనము నుత్కృష్టపతివ్రతాధర్మముగాఁ బ్రశంసించిరి. ఆర్యద్రావిడ సంఘర్షణావసరమున నార్యులు స్వజనశీలరక్షణార్థమై యేర్పఱచుకొనిన యీ దుష్కరముష్కర సంప్రదాయమును దురకల దౌర్జన్యమునకు వెఱచిన యాంధ్రులు పునరుద్ధరించిరి. కాలప్రభావమునుబట్టి శ్రీనాథమహాకవియు నీ నియమము నంగీకరింపకతప్పినదికాదు. కళావత్యుపాఖ్యానమునందలి మార్పున కిదియు నొకకారణము గావచ్చును. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు History of the Reddi kingdoms అను తన గ్రంథమున రెడ్డిరాజులకాలమున సహగమనము ప్రచారములో నున్న సంప్రదాయమే యని యీక్రింది వాక్యములలోఁ జెప్పియున్నారు.

"Sahagamana or Sati was another custom. Some of the Telugu works, like Rukmangadacharitra and Kasikhandam, which were produced in this period, describe the custom of Sahagamana or following one's husband to the other world by immolating oneself on his funeral pyre. The letter work states that she who jumps into fire gladly without any fear or timidity, acquires as much phala as one would get by the performance of an asvamedhayaga, that is, the horse sacrifice. The exuberant praise, lavished on this custom in the Telugu works referred to above, and the enumeration of different kinds of merit, which a married woman would reaply performing this

rite, suggest that there was a conscious effort to popularise this custom. It seems probable that the Mustim invasions were, to some extent, indirectly responsible in inducing the leaders of the Hindu society mobilise opinion to enforce this custom, if it was already in vogue. The atmosphere, which was surcharged with the spirit of self-sacrifice, and the social and political conditions then prevailing, added strength to this custom.

"There is no denying the fact that this custom was in vogue in the period under review. "When any man dies" observes. Frair odoric, "they burn him, and if he leaves a wife they burn her alive with him, saying that she ought to go and keep her husband company in the other world. But if the woman have sons by her husband she may abide with them, as she will. And, on the other hand, if the wife die there is no law to impose the like on him; but he, if he likes, can take another wife." Friar Jordanus writes: "In this India, on the death of a noble, or of any people of substance, their bodies are burned, and eke their wives follow them alive to the fire, and, for the sake of wordly glony, and for the love of their husbands, and for eternal life, burn alorg with them, with as much joy as if they were going to be wedded; and those who do this have the higher repute for virtue and perfection among the rest. Wonderful! I have sometimes seen, for one dead man who was burnt, five living women take their places on the fire with him, and die with their dead." One who committed Sati was revered as perantalu or matrasati and occasionally her image was made in stone and worshipped."

శ్రీ సోమశేఖరశర్మగారు తమ యభిప్రాయముతోపాటు మఱి కొందఱి యభిప్రాయములనుగూడ జోడించి చెప్పి రెడ్ల రాజ్యకాలమున సహగమన మాచరణములో నున్న దని నిరూపించుటయేకాక శ్రీనాథాదులు తమగ్రంథములలో సతి నంతగాఁ బ్రశంసించుటకుఁ గారణము తత్కాలప్రభావమే యనియు సువ్యక్తము చేసియున్నారు. కావున గ్రంథప్రతిపాదితధర్మప్రభావమును గాలప్రభావమును గారణములుగాఁ గళావత్యుపాఖ్యానమునఁ గవిసార్వభౌముఁ డీమార్పును గావించె నని మనము నిశ్చయింపనగును.

మీఁదఁ జెప్పినది ముఖ్య మగు మార్పు. ఇఁకఁ గళాదృష్టితో శ్రీనాథుఁడు గావించిన మార్పు లనేకములు గలవు. అవి యాతని యౌచిత్యపరిజ్ఞానమును, సరసకవితాకళావైదగ్ధ్యమును, పాత్రచిత్రణ చాతుర్యమును వ్యక్తము సేయుచున్నవి. వానిని వరుసగాఁ బరిశీలింతము. మూలమున సుశీలా [మఱుజన్మమునఁ గళావతి] సౌందర్యమును గూర్చి పెక్కుశ్లోకములు ప్రబంధ ధోరణిలోఁ జెప్పఁబడియున్నవి. ఆమె సౌందర్యవర్ణనము నిట నావశ్యకమే. కాని మూలమునందువోలె నఖశిఖాపర్యంతము వర్ణించుట యనావశ్యక మగుటయేకాక ప్రకరణో ద్దిష్ట పవిత్రాశయ విధ్వంసమునకును గారణ మగును. ఇచ్చట నీ యుపాఖ్యానము శివతీర్థ (జ్ఞానవాపిక) మాహాత్మ్యప్రకటనార్థము చెప్పఁబడినది. ఇందలి ప్రతివాక్యమును బ్రత్యక్షముగనో పరోక్షముగనో తన్మాహాత్మ్య విశదీకరణమున కుపకరించునదిగా యుండవలెను. వర్ణనలు గూడఁ బ్రస్తుతాంశ ప్రతిపాదకములై సహజములై యుండవలయును. అట్లు కానినాఁ డయ్యవి యనౌచితములే యగును. మూలమునందలి సుశీలావర్ణనము సుదీర్ఘమై ప్రకరణౌచిత్యమును గోల్పోవుచున్నది. చూడుఁడు :—

కలాకలాపకుశలా స్వరేణ జితకోకిలా
న నారీదాదృగ స్తీహ, నామరీ కిన్నరీ న చ
విద్యాధరీ న నో నాగీ గంధర్వీ నా సురీ న చ
సర్వసౌందర్య నిలయా సర్వలక్షణసత్ఖనిః
అధిశేతే ధ్రువం ధ్వాంతం తన్మౌలిం బ్రధ్న సాధ్వసాత్
తదాస్యం శరణం యాతో మన్యే దర్శభయాచ్ఛశీ
దివాపి న త్యజేత్తాం తు త్రస్త శ్చండ మరీచితః
తద్భ్రూభ్రమరరాజీవగండపత్రలతాంతరే
ఉదంచత్కృంచ దుడ్డీనగతే రభ్యాస భాజినీ

తచ్చారులోచన క్షేత్రే విచరంతౌ చ ఖంజనౌ
సదైవ శారదీం ప్రీతిం నిర్విశేతే నిజేచ్ఛయా
సుదత్యా రదనశ్రేణీచ్ఛేదేషు విషమేషుణా
విహితా కాంచనీ రేఖా క్వేందావేతావతీ కలా
ప్రాయో మదన భూపాల హర్మ్యరత్నాంతరే శుభే
జిత ప్రవాల సుచ్ఛాయే తస్యారదన వాససీ
స్వర్గే మర్త్యేచ పాతాలే నైషా రేఖా క్వచిత్ స్త్రియామ్
తత్కంఠరేఖా త్రితయ వ్యాజేన శపతే స్మరః
శంకే చిత్తభువోరాజ్ఞో లసత్పటకుటీద్వయమ్
అనంగ భూనియమతోఽదృశ్యే మధ్యే న తద్భ్రువః
రోమాలీలక్షికా మూర్ధ్నామివ యష్టిం విధి ర్వ్యధాత్
తస్యానాభీదరీం ప్రాప్య కందర్పోఽనంగతాం గతః
పునః ప్రాప్తు మివాంగాని తప్యతే పరమం తపః
గురుణైతన్నితంబేన మహామన్మథదీక్షయా
భువి కే కే యువానో న స్వాధీనాః ప్రాపితాదృశామ్
ఊరుస్తంభేన చైతస్యాః స్తంభవత్కస్య నో మనః

ఈవర్ణన మింకను గలదు. గ్రంథవిస్తరభీతిచే నింతదనుకమాత్రమే యుదాహరించినాఁడను. మూలమునందలి సాంగోపాంగ మగు నీవర్ణనము శ్రీనాథమహాకవికి రుచింపలేదు. ఆమెసౌందర్య మవశ్యము వర్ణనీయ మని కవిరాజుగూడ నంగీకరించును. ఆమె సౌందర్యమే యామె యిక్కట్టులకుఁ గారణ మయినది. ఆ సౌందర్యమునకు ముగ్ధుఁడై యే విద్యాధరుఁ డామెను గామించి తుద కామెకొఱకై ప్రాణములనుగూడ బలి యిచ్చెను. కావున శ్రీనాథమహాకవియు నామె సౌందర్యమును బ్రకరణోచితముగ వర్ణించి తన యౌచితీపరిజ్ఞానమును వ్యక్తము సేసియున్నాఁడు. చూడుఁడు—మొట్టమొదట "సుశీల యనునది రూపరేఖా

విలాసంబులం ద్రిభువనంబుల యందునుం బొగడఁదగియుండు" నని చెప్పి యనంతరము పౌరు లామె సౌందర్యమును జూచి యుర్విళులూరు చుందు రని చెప్పినాఁడు.

"లలన సాక్షాత్కరించిన లక్ష్మి యో లేఁ
గంకణములతో మణిసూడిగముల రాయ
విశ్వనాథుని కళ్యాణ వేది యందు
ముగ్గు పెట్టంగ మోహించు ముజ్జగంబు
బహుళసౌభాగ్యలక్ష్మికిఁ బద్మముఖికి
ముజ్జగంబుల సరి లేరు ముదిత లనుచు
బ్రహ్మసంకేత రేఖలు వ్రాసె ననఁగఁ
గాంతగళమున నొప్పె రేఖాత్రయంబు."

సాధారణముగాఁ గవులు సౌందర్యవర్ణనమును రెండువిధములఁ గావింతురు. ఒకటి, ఏయంగమున కాయంగమునే వర్ణించుట; రెండు, సాముదాయికముగా సర్వాంగసౌందర్యమును స్ఫురింపఁజేయు పదసముదాయము నుపయోగించి వర్ణించుట. ఇందు మొదటిదానికంటె రెండవది రసవత్తరము. సౌందర్య మనునది యాత్మాశ్రయమా పరాశ్రయమా యను సమస్యకు మన సత్త్వశాస్త్రజ్ఞు లిప్పటికిని సరియగు సమాధాన మిచ్చినట్లు గన్పట్టదు. కాని వారందఱు నొక్క విషయము నేకగ్రీవముగ నంగీకరింతురు. అది యంగాంగీభావసంకలమునందే సౌందర్యము గల దను సిద్ధాంతము. సౌందర్య పరిగణమునఁ బృథగ్భావనకుఁ జోటే లే దనువాదము సమంజసము కాదు. అట్లని పృథగ్భావనయందే సౌందర్యము నిక్షిప్త మయియుండు ననుటయు సమంజసము కాదు. ఏ యంగమున కాయంగమునే భావించుట పృథగ్భావన యనఁబడును. ఈభావన యనఁగా నేయంగమున కాయంగమునే భావించుట యట్లే నిలచి యున్నచో ననఁగాఁ గవి కల్పనా ప్రభావ మంతవఱకే భావుక హృద

యమును గొనిపోవ సమర్థమై యున్నచో, నయ్యది నిజమగు సౌందర్య వర్ణనము కాదు. అంగసౌందర్యవర్ణన మంగిసౌందర్య ద్యోతక మయి యుండవలయును. అంగిసౌందర్యవర్ణన మంగసౌందర్యము నుద్దీపింపఁ జేయవలయును. మఱియు స్థూలరూపవర్ణనముకంటెఁ దత్తశలావణ్యా వర్ణనము రసవత్తరము. కవి సార్వభౌముఁడు సుశీలాసౌందర్య వర్ణనమున నీయంశముల నన్నిటిని బ్రతిపాదించి చూపినాఁడు. అమ్మహా కవికి సుశీల సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ గన్పట్టినది. ఎప్పుడు? విశ్వనాథుని కళ్యాణవేదియందు ముగ్గులు వెట్టునప్పుడు. జగదీశ్వరుఁ డగు నీశ్వరుని కళ్యాణవేది సకలకళ్యాణసంధాత్రి యగు నాదిలక్ష్మి ముగ్గులు వెట్టిన నెట్లుండును? అది యనిర్వచనీయ మగు నొక సన్నివేశము. ఆ సన్నివేశమును భావించి ప్రత్యక్షీకరించు కొనినాఁడు మహాకవి. ఆసాక్షాత్కారమే సుశీలాపాత్రచిత్రణమునందు మనకును సాక్షాత్కరించుచున్నది. ఆమె తెలికన్నులు, మొలకచన్నులు, బొమ్మలమీఁద వ్రాలు గుంతలములు మాత్రమే యిట వర్ణితము లయియున్నవి. మొలక చన్నులు చెప్పుట యౌవన ప్రాదుర్భావసూచనార్థము తెలి కన్నులు నిష్కళంకత్వమును సూచించును. బొమ్మలమీఁద వ్రాలు కుంతలములు సౌభాగ్యసంసూచకములు. గళమున రేఖాత్రియము సర్వసంపత్సూచకము. ఇట్లామె సౌందర్యము కొలఁది మాటలలోనే స్ఫురింపఁజేసి కవి, యామెరూపచిత్రమును భావుకమనఃఫలకములయందు రూపరేఖలు చెడకుండ చిత్రించినాఁడు.

---

# మేఘదూతము.

(అనువాదము)

శ్రీ బొడ్డపాటి వెంకట సుబ్బారావు, ఎం. ఏ.

ఈ ప్రపంచమున మేఘు నెవ్వ రెఱుఁగరు! నిర్జనారణ్యమునఁ దనగూఁటిలో నొంటరియై నివసించు పక్షి శాబకము మొదలుకొని కుబేరానుచరులైన గుహ్యకసిద్ధులవఱకు నెల్లరును మేఘుని గని యాదరింతురు; సమ్మానింతురు. స్థూల సూక్ష్మ, దృశ్య, సేంద్రియ నిరింద్రియ భేదములు లేక సకలపదార్థములు మేఘాగమనముచేఁ బ్రభావాన్వితము లగును. కవి యాతని [1]సాధు[2], సౌమ్య, [3]సుభగ [4]ఆయుష్మచ్ఛబ్దములచే సంబోధించినాఁడు.

మేఘుని యాశీర్వాద మెల్లరకు సమానమే. ఆతనిప్రసాద మందఱకు లభ్యమే! ఆతఁడు కూర్చుట వితరణకొఱకే. ప్రజాపాలనము చేతనే మేఘుఁడు 'ప్రజాపతి' యైనాఁడు. ఆతనియజ్ఞద్వార మెల్లరకుఁ దెఱచియే యుండును. అతని సర్వస్వవితరణముచే నెల్లరుపుష్టి చెందెదరు. వర్షర్తువున నీలాభిరామ విష్ణురూపమేఘుఁ డెంత సౌభాగ్య సమన్వితుఁ డగునో లోకలక్ష్మియు నంత యధిక సంపన్నయగును.

మేఘుని యాయువు సృష్టికల్పమువలె సనాతనము. ప్రజల యుద్భవస్థితిసంహారముల మూఁడింట నతనికిఁ బాలు కలదు. మేఘుఁ డమరబ్రహ్మచారి[5]. అందుచేఁ బురాణపురుషుఁ డయ్యును నిత్యయావనుఁడు. ప్రతిసంవత్సరము నతఁడు కాయకల్పము చేసికొనును. ఇట్లా

1. ఏభిః సాధో హృదయ నిహితైర్లక్షణైః లక్షయేథాః మే. దూ 2-17.
2. 'శ్రోష్యత్యస్మాత్పర మవహితా స్సౌమ్యసీమంతినీనాం మే. దూ 2-37.
3. 'సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యంజయంతీ' మే. దూ 1-39.
4. 'తామాయుష్మన్ మమ చ వచనా దాత్మన శ్చోపకర్తుం' మే. దూ. 2-38.
5. ఉదకమునకు బ్రహ్మచారి పేరు (నిఘంటువు 1-12)

యుష్మంతుఁడును సౌమ్య సుభగసాధువు నయిన మేఘునిగూర్చి[6] ప్రీతి ప్రముఖ వచనములచే యక్షుఁడు చేసిన ప్రశంస యెంతయుఁ దగియున్నది. మేఘుజలములచేఁ బుష్టినంది, వనస్పతి జగత్తు, విశ్వవ్యాప్తమైన జీవశక్తిని దనలోఁ గూర్చుకొనుచున్నది. సర్వౌషధసారభూత రసము జలమే[7]. కృష్టపచ్య, అకృష్టపచ్యౌషధులే పశువులను బోషించునవి. ఈ విరాట్ప్రకృతిలో మనుష్యుఁ డోక(మంచి యాఁకలి గల యన్నము దిను) అన్నాదపశువు. అందుచే జీమూత మేఘుఁడు సర్వప్రాణులకు నాథుఁడు. సర్వత్ర జలవహనక్రియచే నతఁ డంబువాహ వారివాహ నామకుఁ డైనాఁడు. జలమేహనక్రియచే (విసర్జన)నాతనికి మేఘనామము కల్గినది. తటిత్సౌదామని యాతని కళత్రము. అందుచే నాతఁడు తటిద్వంతుఁ డైనాఁడు. నిత్యవ్యోమవిహారిణి యగు విద్యుత్ప్రియను నంకమం దిడుకొని అర్ధనారీశ్వరుఁ డగు శివునివలె గోచరించుచు దేశదేశములఁ గ్రుమ్మరుచుండును. వృష్టికి హేతువు విద్యుత్తుగాని మేఘుఁడు కాదు. వృష్టియజ్ఞమున విద్యుద్వ్యజనమే చేయఁబడును. ఏలన నదియే యన్నజలాదికముల నిచ్చు సామర్థ్యము కలదు.

వృష్టి ర్వై యాజ్యావిద్యుదేవ హీదం వృష్టిమన్నా
ద్యం సంప్రయచ్ఛతి. ఐతరేయబ్రాహ్మణ 2-41.

ఉమా,రమా, విహీను లైన శివకేశవులనుండి యేమి శుభము నాశింపఁ గలము? మేఘునకు "ధూమయోని[9] యనికూడ పేరు. నిత్యము

---

వానిని వెన్నంటి చరించు మేఘుఁడు బ్రహ్మచారి.
ఋగ్వేదమున 'ఉషసూడ - అమర్త్యాపురాణీయువతీ' యని చెప్పబడినది. [ఋ 3-61].

6. 'ప్రీతిప్రముఖవచనైః స్వాగతంవ్యాజహార' [మే.దూ 1-4].
7. 'ఏషవావై సర్వాసా మోషధీనాం రసో యదాపః[కాషీతకబ్రాహ్మణము 2-1].
8. మేఘః కస్మాత్ మేహతీతి [నిరుక్త]
9. ధూమజ్యోతిః సలిలమరుతాం సన్నిపాతః [మే స 1-5]

ధూమముచే[10] "ఉపచితవపు" వగుచుండుటచే నిది గల్గినది.

వాయుపరిహారమును ధైర్యముగ సహించును; గావున మేఘుఁడు ఘనాఘనుఁడైనాఁడు. ఆతనియందు, జలరాశి నిండియుండుటచేఁ గవి యతనిని, 'స్తంభితాంతర్జలౌఘు'[11] అనినాఁడు.

ఎవనియొద్దఁ బుష్కలమైన వృషసంచయము కలదో వానికే గౌరవము. ముందుముందు ఘనగౌరవము మేఘుని వృషపుష్కలత్వముచే నొక పుణ్యకార్యసాధనము కవి చేయింపవలసియున్నది. పరిభూత జలరాశిచే ననంతవృషశక్తిమయమైన మేఘసోపానములపైఁ గాలూని శివుఁడు మణితటారోహణము చేయును[12]. నిష్పీడితములైన మేఘములందు నేమాత్రమును బ్రయోజనకారులు కావు. ఇంద్రశక్తి, శూన్యములైన యింద్రియములు గల్గిన పురుషులయందు సంయమమును దపమును గూడ ఫలింపవు. బలాకమిథునములు గర్భాధానోత్సవమునకై మేఘోపస్థానము చేయును. అనఁగా మేఘుని సేవించును[13]. ఇందువలన నింద్రుని ప్రధానపురుషుల నొకనిపేరు "బలాహకుఁడు". ఇవ్విధమునఁ బయోద

---

10. జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూమైః [మే. సం 1-32].

"అగ్నిర్వై ధూమో జాయతే ధూమాదభ్రమభ్రాద్వృష్టిః" [శతపథ బ్రాహ్మణము 5-3-5-17]

తన కుక్షియందు గాఢమైన ఆవర్ణమును గల్గిన మేఘుఁడే సృష్టి కుపకర్తయగును. జలమునకు వృషనామము కలదు. ఏ మేఘమునందు 'వృష' శూన్యమో, దాని జన్మ నిష్ఫలము. పురుషశరీరమున జలరూపము వీర్యము. "అపః రేతో భూత్వా శిశ్నం ప్రవిశతి" (ఉపనిషత్తు)

11. 'భంగీభక్త్యా విరచితవపుః స్తంభితాంతర్జలౌఘః' (మే, దూ 1-10)

12 కాళిదాసుని మణితటములు యోగమున మణిపద్మము, మణికర్ణిక లేక ఊర్ధ్వ మస్తిష్కము.

13 గర్భాధానక్షణ పరిచయాన్నూనమాబద్ధమాలాః
సేవిష్యంతే నయన సుభగం ఖే భవంతం బలాకాః [మే, దూ 2-9]

మునకు "జలలవముచ"అను నామకరణోత్సవము నైఘంటికులు చేయించిరి.

నిరుక్తకారుఁడైన యాస్కముని యీ సంస్కారమున సాధ్వర్యవము వహించిన ఋత్విజుఁడు. నిఘంటు (అ1, ఖం, 10) వునందలి యతని యభిప్రాయప్రకారము మేఘునకు 'వృషంధి' యను నామము కలదు. కాళిదా సిందుని 'వృష' యనినాఁడు. మఱి మేఘుఁడు మఘవుని ప్రఖ్యాతానుచరులలో నొకఁడు[14]. ఇందుచే నాతఁడు వృషంధి[15] కావలసినదే. యాస్కాచార్యుఁడు మేఘుని 'వరాహ' అనినాఁడు. అద్రిః ... ... పర్వతః గిరిః ... ... వరాహః ... ... ... ఇతి మేఘనామాని ... ... (నిఘంటువు 1-10) హిరణ్యాక్షదైత్యుని సంహరించి సలిలార్ణవమునుండి వరాహమూర్తి పృథ్వి నుద్ధరించె నని, పౌరాణికుల కథనము. సృష్టిపరిశీలకులైన పండితప్రకాండులు మేఘుని వరాహరూపునిగ నెట్లు కల్పన చేసిరో చూచెదముగాక ! 'వరం ఆహం తీతి వరాహః' అని వరాహశబ్దమునకు వ్యుత్పత్తి. అనఁగా "వరమును ఆహననము' చేయునది. సూర్యునకు 'వర' నామము కలదు. అతని తేజమునకుఁ బ్రతిబంధక మగునది యగుటచే వరాహనామము కల్గినది. సృష్ట్యాదిని చాపమూర్తి యగు సూర్యునిగూర్చి హైమాండ, హిరణ్యగర్భ, హిరణ్యాక్ష శబ్దములు ప్రయోగింపఁబడినవి. సూర్యుఁడెంత వఱకు ప్రతిహత భర్గుఁడై వెలుఁగుచుండెనో యంతవఱకు లోక లోకాంతరముల కల్పన మసంభవము. అతఁడు పృథివ్యాది లోకములను దన కుక్షిలో నిడుకొని సంహరించినట్లే యాలంకారికోక్తి. అతని జ్యోతి

---

14 ప్రకృతిపురుషం మఘోనః [మే. దూ1-6]

15 తపః కృశామభ్యుపపత్స్యతే సఖీ వృషేవ సీతాం
తదవగ్రహక్షతాం [కు. సం. 5-61]

ర్మయు శరీరమునుండి సృష్టిప్రక్రియను నడుపుటకు 'వరాహ్ముని' ఆవశ్య కతగల్గినది. నలుగడలఁ గాంతిమంతము లైన మంచుమేఘము లా సూర్యమండలము నావరించినవి. కాలాంతరమున నా వేఁడిమి తఱు గఁగా సూక్ష్మరూపము గల్గిన యా తైజస బాష్పమేఘములు స్థూల జలాదిరూపములు చెందినవి. పిమ్మటఁ గ్రమముగా గురుతత్త్వముల సంయోగముచే పృథ్వి జన్మించినది. సూర్యుని యందుఁగల యురేని యము, మొదలైన విద్యుత్స్ఫులింగీభూత (Radio active) ధాతువులు క్రమముగ రూప పరివర్తనము నంది స్థూలధాతువుల యాకృతిఁ జెం దుటకు వేల, లక్షల, సంవత్సరముల కాలము పట్టియుండు నని, విజ్ఞాన వేత్తల యుద్దేశము. ఇదియే మనసృష్టికి వారాహ కల్పము. భారతీయ వేదాంత శాస్త్రమునఁ బిండగత,చైతన్యమునకు సంబంధించిన తురీయ సుషుప్తి స్వప్న జాగ్రదవస్థ లని నాలు గవస్థలు నిర్ణయింపఁబడినవి. వీనితో సమానముగ బ్రహ్మాండవ్యాప్త చైతన్యమునకు సంబంధించిన యవస్థలు బ్రహ్మ, ఈశ, హిరణ్యగర్భ విరాడవస్థలు. హిరణ్యగర్భ దశనుండి విరాడ్దశకు వచ్చుటకే 'వారాహము' యొక్క యావశ్య కత గల్గినది. హిరణ్యగర్భదశలోఁ బ్రకృతి తత్త్వము సంచితమై యున్నది.'విరాట్'అగుటకు, నలుగడల వ్యాప్త మగుటకై 'స్వాయంభూ' బ్రహ్మ దానిని యుపబృంహణము (శక్తివంతము) చేసెను[16]. ఇందు ననే స్త్రీ పురుష భేదము కల్గినది. అనఁగా నొకే మూలశక్తి "ఎల క్ట్రాన్ ప్రోటాన్" అను రెండు శక్తులుగ విభాజిత మైనది.సర్వజగత్తీ రెండింట విభజింపఁబడినది. ప్రాణాపాన స్త్రీ పురుష, రయి (యుక్త) ప్రాణ, అశ్వనీయుగళ, మిత్రావరుణ, అగ్నిష్టోమప్రభృతియుగ్మములు సిద్ధించినవి. ఆ విద్యున్మహార్ణవమున స్వీయవిస్తరణమున కను వగు

---

16 "తదండ మభవ ద్ధైమం సహస్రాంశుసమప్రభం

తస్మిం జజ్ఞే స్వయం బ్రహ్మ సర్వలోకపితామహః (మను)

శక్తి తనంతటఁ దాను, లోనుండి యుద్భవించును. అందువలన బరమాణువులు బహిర్ముఖములై వికీర్ణము లగుటకు మొదలిడును. వానివలనఁ గ్రమముగా లోకలోకాంతర సృష్టి జరుగును[17].

ఈ జగత్తున సామాన్యమానవునినుండి, చరిత్రకారులు, విజ్ఞానవేత్తలు, కవులు నందఱు మేఘునిగూర్చి యెఱుఁగుదురు. ఏ శాస్త్రవేత్త నైన "మేఘ మెట్టిది?" అని ప్రశ్నింపుఁడు. అతని సమాధాన మిట్లుండును. 'ధూమజ్యోతిః సలిల మరుతాం సన్నిపాతః మేఘః' అనఁగా మేఘము కేవలము ధూమము, అగ్ని, నీరు, గాలియొక్క సమాహారము. తన పాండిత్యప్రభావమువలనఁ దానే ప్రకృతియొక్క నిగూఢ నియమముల సత్యమును గ్రహింపఁ గల్గె నని యాతని గర్వము. వాయువునందు ధూమరూపమున సూక్ష్మాతి సూక్ష్మము లైన రజఃకణములు వ్యాపించి యుండును. వాయుసంఘర్షణముచే నవి విద్యుత్పరిగృహీతము లగును. అప్పు డావిరిరూపమున నంతరిక్షమున వ్యాపించియున్న జలము నవి తమపై కాకర్షించుకొనును. ఈ విధమున మేఘములై వర్షయోగ్యము లగును. ప్రత్యక్షరసత్యమయ్యు నీ కల్పన మెంత నీరసముగ నున్నది! వైజ్ఞానికుఁడు ప్రకృతి నిట్లే దర్శించును. ప్రకృతియొక్క యైశ్వర్యమయగుణములచే ముగ్ధులై యాశ్చర్యచకితమగునట్టి మానవ ప్రవృత్తిని, శాస్త్రవేత్త తన రహస్యవివరణముచే నభిభూతము చేయఁ గోరును. శాస్త్రజ్ఞునకు మనోభావములులేనట్లే; భరద్వాజపక్షిని గూర్చిన వైజ్ఞానికవర్ణనమున నిరతము నిమగ్నుఁ డగు విద్యావ్యాసంగి నిత్య మది పర్యటించివచ్చు ననంతలోకముల మఱచినట్లు. పాపము, కేవలము సత్యాన్వేషణమందే నిమగ్నుఁడయి స్వీయభావములకు

---

17 ధన, ఋణము లనెడి విద్యుద్భేదములు కార్యకాలసముత్పన్నములు. మూలమున విద్యుత్తు ఏకవస్తువే. శివుడు శక్తి మూలమున ఏకమే. వారు ద్వివిధములుగ లోకమునకు [illegible] గుణములవలె వర్తింతురు.

దూరుఁడై యుండుటయే యాతని యదృష్టరేఖ. నిజమునకు నిరపేక్ష సత్యోపలబ్ధి యెవ్వనికిఁ గల్గిన దింతవఱకు ? ఇందుచేతనే కవి వరులు సంభావితసత్యమును వర్ణవ్యంజిత చ్ఛందః పాత్రముల నింపి మానవ హృదయముల కానందమును గూర్తురు. రససిద్ధుఁ డైన కవిగూడ విజ్ఞానానుగత విమర్శనముచేఁ దృప్తి చెందియుండినచో మేఘదూతము వంటి కావ్యము జన్మించియే యుండదు.

"ధూమజ్యోతిః సలిలమరుతాం సన్నిపాతః" అనుదానిని విమర్శింపఁగా కవి కది యత్యంత రసవిహీనముగఁ దోఁచెను. అటువిమ్మటఁ దన యభిప్రాయము కవి రెండు పదములలోఁ జేర్చెను, "క్వమేఘః" ఓ వైజ్ఞానిక శిఖామణీ ! 'ధూమము వహ్ని జలము, అను విచ్ఛిన్న భాగములు గల నీ మేఘ మెంత హేయము! నికృష్టము!' అని భావము. 'క్వ'యను పదవ్యంజన మతి తీవ్రమైనది. కవిత్వము విజ్ఞానము ననువాని సందర్భమందుఁగాని, సత్యము, కల్పనలను వాని ప్రతిస్పర్థమందుగాని సర్వదేశములయందును, సర్వకాలములయందును కవులు తమ విపక్షులపై నెట్టి తిరస్కారభావమును వ్యక్తపఱచిరో దానినే కాళిదాసుని "క్వమేఘః" అను శబ్దద్వయ మంత్యంత సరళముగను, ప్రభావవంతముగను వ్యక్తపఱచుచున్నది. జడములనుగూడఁ దన మనోభావముల సంపర్కముచేఁ చేతనములుగఁ జేయుటయందే కవియొక్క మహత్తర కౌశలము గానిపించును. ఇందుచేతనే ఘర్మ, ధూమ, నీర, సమీర, సన్నిపాతమునందే కాళిదా సనంతవిశ్వకల్పన చేయఁగల్గినాఁడు.

ఇఁక చరిత్రకారుఁడు.

చారిత్రకుని దృష్టిలో మేఘుఁ డెవరు ?

జాతం వంశే భువన విదితే పుష్కరావర్తకానాం 'అనఁగా' పుష్కర, ఆవర్తకము లనెడి విశ్వవిశ్రుతము లైన మేఘవంశములందు జన్మించినవాఁడవు, అని వంశావళిని నిర్మించి యతనిని భువనవిదితుఁ డని

నిరూపించుటకై గుణగాథల నాలపించుటలోనే చారిత్రకుల యాయుస్సు గతించును. ప్రాచీన గౌరవపరిచయముచేఁ గల్గు నానందమే చరిత్రవిజ్ఞానమందుఁ గల్గు నానందము. కాని జడములై పోయిన చారిత్రకఘటనలకుఁ గావ్యమందలి యమరకల్పనలకుఁ గల సంబంధ మెట్టిది. నవనవోన్మేషమగు ప్రజ్ఞ కేవలము జడమగు చరిత్రాభ్యాసముచే నెట్లు మొక్కవోవఁగలదు ? ఒకానొక విలక్షణ మైన యానందము నిరూపించుటకే కవికల్పన యవతరించును.

మన యక్షుఁడు యాచకుఁడై మేఘునిసమ్ముఖమునకు వచ్చినాఁడు[18], మేఘునకు మాగధుఁడై తన దూతను బ్రిసన్నునిగఁ జేసికొనఁగోరెను. అతఁడు తాను నిశ్చయించుకొనిన దూతకుఁ గులీనుఁడని ప్రమాణపత్రము నొసంగినాఁడు. కులముతోడిదే శీలము. శరణాగతరక్షణము (లేక శరణ్యత) సుశీల లక్షణముగదా ?[19] యక్షుఁడు పుష్కరావర్తక మేఘముల ఘనత యెఱుంగును.

"ఆవర్తకే మహావర్షః సంవర్తే బహుతోయదః
పుష్కరే చిత్రితా వృష్టిర్ద్రోణేపి బహువారిదః"(బృహజ్జ్యోతిస్సారము)

అనఁగాఆవర్తక మేఘములందుఁ బెద్దపెద్ద సుడు లేర్పడును. సంవర్త మందు జలసంచయము జరుగును. పుష్కరమేఘమునందుఁ జిత్ర, విచిత్ర వృష్టి కలుగును.ద్రోణనామక మేఘ మపరిమేయ జలరాశికిఁ బ్రభువు[20].

ఇంకను "యజ్ఞా సుఘనా ఘోరాః పుష్కరావర్తకాదయః" (శబ్దార్ణవాళి) అనఁగా, పుష్కరావర్తక మేఘముల మహిమయే యవి,

18 "తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబంధుర్గతోఽహం [మే. దూ 1-6]

19 "సంతప్తానాం త్వ మసి శరణం (మే.దూ 1-7)హారీతుని ప్రకారము శీలమునకు సంబంధించిన పదుమూఁడు గుణములు-బ్రహ్మణ్యత్వము, దేవ పితృభక్తి, సౌమ్యత్వము, అపరోపితాపిత్వము, మృదుత్వము, అపారుష్యము, మైత్రత్వము, ప్రియవాదిత్వము, కృతజ్ఞత, శరణ్యత, కారుణ్యము, ప్రశాంతత్వము.

20 విజ్ఞాన శాస్త్రము ననుసరించి మేఘములు నాలుగు విధములు. వాని ఆంగ్లనామ

యజ్ఞ సముద్భూతము లగుటకుఁ గారణము. విజ్ఞానశాస్త్రజ్ఞునకు మేఘమును సృష్టించుటకుఁ గేవలము ధూమమే, చాలును; కాని సహృదయులుమాత్రము దానిని యజ్ఞధూమ మందురు. ప్రాచీనులు హవ్య వనస్పతుల సూక్ష్మ వికరణముచే వాయువునందు సూక్ష్మధూళి కణములఁ గల్పించి, విద్యుత్పరిగృహీతములు గావించి, వృష్టిని గలుగఁ జేయుటయందు, సఫలు లై యుందురు. కనీసము యజ్ఞక్రియయందు ననేక సదాశయములు దాక్షిణ్యయుక్త భావముల సన్నివేశము కల దనుటమాత్రము స్పష్టము. ఆ పుణ్యాభిలాషతోఁ గూడిన యజ్ఞధూమము పైకిఁ బోయి ధూమయోని యైన మేఘముతోఁ గలియును. ప్రకృతిరూప మైన వేదియందుఁ దొమ్మిదినెలలుగా సూర్యకిరణములు చేయు యజ్ఞకర్మకు దాక్షిణ్యఫలముతోఁ గూడిన పుష్కరావర్తక మేఘములు సర్వస్వ దక్షిణవ్రతము చేఁగొని విశ్వ మంతటను జీవన (జల) ప్రదానముఁ జేయుచు సంచరించుచుండును.

విజ్ఞానవేత్తలను జరిత్రకారులనుగాక, కృషియే జీవనాధారముగఁ గల యే గ్రామసీమయం దైనఁబోయి, మేఘుని రహస్య మే మని ప్రశ్నించినచోఁ బ్రత్యుత్తర మి ట్లనివచ్చును.

---

ములు 1. సిర్రో (cirro) 2. క్యూములోస్ (cumulose) 3. స్ట్రేటస్ (stratus) 4. నింబస్ (nimbus). వీని పరస్పర మిశ్రణముచే నవాంతరభేదము లేర్పడును. సిర్రోమేఘములు అయిదు మొదలు పదిమైళ్ళ ఎత్తున నన్నిటికంటె మున్నతముగ నుండును. వీనియందు చిన్నచిన్న హిమకణ సముదాయముల పొంతరలు వ్యాపించియుండును. క్యూములోస్ మేఘములు భూమినుండి ఒకమైలు ఎత్తున త్రికోణముగ వ్యాపించియుండును. వీనియందు నీటియావిరి చల్లనై తిరుగ జలరూపముదాల్ప మొదలిడును. స్ట్రేటస్ మేఘములు నీహారాత్మకములై మిక్కిలి క్రిందుగ వ్యాపించియుండును. ఇవి యుదయించుటచే దిక్కులు ప్రసన్నములై ఋతువుల సౌమ్యముగ గోచరించును. నింబస్ మేఘములు దట్టమై నల్లగనుండి జలరాశిచే నిండియుండును. వీనివల్లనే మూసల ధారముగ వృష్టిగల్గును.

"త్వయ్యాయత్తం కృషిఫల మితి, భ్రూవిలాసానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధై ర్జనపదవధూలోచనైః, పీయమానః" [1-16]

ఓ గ్రామీణ జీవులారా! మీకు మేఘునియం దెట్టి ప్రేమకలదు! మావధూజనలోచనములు మేఘుని యభిరామరూపమును పానము సేయుటకుఁ గారణము. మాకృషికిఁ బ్రవర్తుఁడగుటయేయని వా రందురు. మేఘాగమన మేకారణమునసైన, నొక మాస మాలస్య మైనచో, వన ప్రకృతి యంతయు,నాకసమువంక కాశావిస్ఫారిత నేత్రములతోఁ జూడసాగును. మేఘునిను ధావర్షము, ప్రకృతినయనముల కమృతప్రవము. అందుచే మేఘునకు గ్రామములందు జరుగు స్వాగతమే యధిక స్వాభావికము; సరళము; ప్రీతిస్నిగ్ధము. పురస్త్రీలు తమ కటాక్షములచే మేఘునితో విలాసములు నెఱపుదురు. ఉజ్జయినీ నగరోన్మాదినులయొద్ద మేఘుని కంతకు మించి యేమి లభించును?

"విద్యుద్దామస్ఫురితచకితై స్తత్ర పౌరాంగనానాం
లీలాపాంగై ర్యది, న, రమసే, లోచనై ర్వంచితోఽసి. [1-17].

నగరస్వైరవిహారులగు స్త్రీపురుషులకు మేఘుఁడు కామోద్దీపకద్రవ్యము. మేఘరసనిషించనముతోడనే వారికిఁగూడఁ బరిమళోద్గిరణ మగుట మొదలిడును.

"[యః పణ్యస్త్రీ రతిపరిమళోద్గారిభి ర్నాగరాణా|ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభి ర్యావనాని]" [1-25]. కాని, గ్రామవధువులు భ్రూవిలాసముల వక్రగతు లేమాత్రము నెఱుంగరు. పూజ్యులు పరోపకారులు నగు నభ్యాగతుల నాహ్వానింపఁదగువిధమున వారు మేఘునకు స్వాగత మిచ్చెదరు. "ఏఁటేట నొకమాఱు విచ్చేయు యాత్రికా! దీర్ఘాయువును గల్గి యీ రీతిగనె రమ్ము; మా యింట నిలువంగ నెల్ల కాలమ్ము" అని పాడుచు మేఘుని దర్శనముచేఁ బులకించి యాతనికి వారు శతశతాశీస్సు లిచ్చెదరు. వృష్టి యెవరి శుభాకాంక్షల కనువగు

ఘల మని ప్రశ్నించినచో, మన వేళ్లు లీ యమాయికపు గ్రామవధూటులనే చూపును. భ్రూవిక్షేపకుశలురైన పౌరాంగనల యుచ్ఛృంఖలోద్దీప్తాస్థిర వాంఛపై నాధారపడి యాకసమందు మేఘమాలలు కూడవు, దృఢతమ మగు సంయమి సూత్రబద్ధ మైన జానపదజీవనము గడపు దీర్ఘకాయు లగు గ్రామీణులమీఁదనే రాష్ట్రసంపత్తియు దాని యభివృద్ధియు నాధారపడియున్నవి. అచట స్త్రీ, పురుషులకే మేఘాగమన రహస్యము సరిగ ననుభవ మగును. వృక్షజాలముననుఁ బశుజాలముననుఁ మేఘముచేఁ గల్గు పరివర్తనలకుఁ గృషీవలులే సాక్షులు. బ్రాహ్మణ గ్రంథములయందుఁ గృషి "స ర్వ దే వ తా మ యి"[21] యనఁబడినది. సూర్యుఁడు, వాయువు, మేఘుఁడు లేక యింద్రుఁడు, పశువులు, పక్షులు, రాజు, ప్రజ, వీ రందఱు వీణాతంత్రులవలె నేకమై యేకస్వర మైనపుడే కృషిసిద్ధి, లేక రాష్ట్రమున కన్న సంప్రాప్తి.

పైఁజెప్పిన విశేషజ్ఞులుగాక సామాన్యులు పైకెఁ గన్నెత్తి చూచిన వారికిఁ గేవలము మేఘునియొక్క వర్ణము, పరిమాణమే స్థూలముగఁ గానుపించును. వారికై కవి "ఆషాఢస్యప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం, వప్రక్రీడాపరిణతగజ ప్రేక్షణీయం దదర్శ" అని పల్కినాఁడు. మేఘ మన నేమి? కేవలము నల్లని భయంకరాకారము గల్గిన యేన్గువలె గుట్టలకు ఢీకొనుచు, గర్జిలు నేయు జంతు వని సాధారణదృష్టి. మేఘ, గజసంబంధ మతి పురాతనము. వర్ష హేతువు లగు ప్రకృతి నియముల సముదిత నామము "ఇంద్రుడు". ఈ యింద్రునకు నైరావత మనెడి యేనుఁగు వాహనము. మన యభ్రమాతంగ నాముఁ డగు మేఘుఁడుకూడ, నింద్రునకుఁ బ్రధానపురుషుఁడుగఁ జెప్పఁబడినాఁడు. [1-6] సంస్కృతమున జలమును "ఇరా" యందురు. "ఇరా" యొక్క యక్షయ భాండారము గల్గినవాఁ డగుటచే సముద్రు

21. సర్వదేవత్యాత్కృషిః (శతపథ 7-2-2-12).

నకు "ఇరావాళ్" అను పేరు కల్గినది. అట్టి యిరావంతునందు జన్మించునది "ఐరావతి" మగును."[22] దూరమునుండి దీనియాకార మేన్గును బోలి యుండుటచే నీ యైరావతిగజమే మన యభ్రమాతంగము. పురాణములందుఁగూడ నింద్రుని యైరావతము, మేఘములతోఁ జరించునట్లు చెప్పఁబడినది. ఆవిరిరూపమున జలభస్మ మిందుఁగూడి యుండుటచేత మేఘమును నభ్ర మందురు.

ఎట్లన "అభ్రం వా, ఆపం భస్మ [శతపథ 7-5-2-14] ధూమో భూత్వా అభ్రం భవతి,అభ్రంభూత్వా, మేఘోభవతి మేఘోభూత్వా ప్రవర్షతి" [ఛాందోగ్య ఉపనిషత్ 6-10] అనఁగా :— సూర్యతాప సంయోగముచే జలము భస్మ మగును.దాని మొట్టమొదటి యాకృతి జల ధూమము.(Vapour) దీనియందు జల ముండుటచే దీని నభ్ర మందురు. ఈ యభ్రమంతరిక్షగామియై సాంఘాతిక రూపమున మేఘనామమును బొందును. మేఘుఁ డగుటచే నితనికి మేహన క్రియ జలవిసర్జనకు యోగ్యత కల్గుచున్నది.

సముద్రమందు జన్మించుటచే 'ఇరావతము'ను, జలమును దన శరీరమందు ధరించుటచే'అభ్రము' నను రెండువిధము లోకపదమున నతి సుందరముగ వ్యక్తమగుచున్నవి. వర్ణపరిమాణక్రియలయందు సాదృశ్య ముండుటచే మేఘున కేనుఁగు మంచియుపమానము. పురాణములలో సముద్రమథనసందర్భమున నుదధినుండి యీ యభ్రమాతంగము జన్మించినట్లు చెప్పఁబడినది. ఇంద్రుఁడు తన యభ్రవాహన సాహాయ్యముచే సముద్రమునుండి లేచి యాకసములోనికి వచ్చును. పుష్కలావర్తక మేఘములచట గుమిగూడి గర్జింపఁగా సాధారణముగ జనులు నేఁ

22. ఇరా అపః ఇరావాన్ సముద్రః తత్రభవః ఐరావతః అభ్రమాతంగః-మల్లినాథుని రఘువంశ సంజీవనీ టీకలో 1-36 మరియు "ఐరావతో౽భ్రమాతంగః" అని అమరకోశము,

డింద్రుఁడు తన వాహనము నధిరోహించి వచ్చినాఁడు; నేఁడు వర్షము కురియు నందురు. భరతదేశమున నింద్రునివాహన మైన యైరావతము పూర్వదిశాధిపతి యగు దిగ్గజముగ నెన్నఁబడుచున్నది. పూర్వదిశయే యైంద్రీ దిశయే! ఏలన, భారతమాతయొక్క శ్యామలాంచలము తూర్పు గాలులచేతనే వికసిత మగును. ఇచట వర్షమున నధిక భాగమును వంగ మహోదధియందు బయలుదేఱు పవనములే తెచ్చును. మన వర్షాధిదైవత మైన యింద్రుఁడు నతని వాహనమైన యైరావతమును, రెండును చివరకు మేఘునికి నామములే!

నిఘంటువు ననుసరించి యైరావతముభార్యపే రభ్రముపు. అభ్రము శబ్దమును పలువిధముల వాఖ్యానింతురు. దాని శరీరమున వ్యాపించి యుండు సౌందర్య శ్రీ, దాని సుందరగర్జ దాని జలనిర్భరమంథరతగాని కావచ్చును. ఐరావతపత్నియైన[23] యభ్రముపు విద్యుత్తునకే మఱియొక పే రని యింకొక స్థలమునఁ జెప్పఁబడినది. ఇవ్విధమున విద్యుత్కళత్రుఁడును[24] విద్యుద్వంతుఁడును[25]నగు మేఘుఁడిరావతీ ప్రియుఁడై యైరావతమును నొక్కటియే! విద్యుద్విహీనములైన మేఘములు వృష్టియోగ్యములు గావని పైఁజెప్పఁబడినది. విద్యుద్రూపశక్తిచేతనే విద్యోతనమునకును [మెఱయుటకును] గంభీరగర్జనమునకును ననువగు సామర్థ్యము త్పన్నమగుచున్నది. "విద్యుద్వా అపాంజ్యోతిః [శత-బ్రా] వియోగి యైన యక్షుఁడుగూడ విహరించు మేఘుని 'నీకు విద్యుత్సహచరీ వియోగము క్షణకాలముకూడఁ గలుగకుండునుగాత' యని యాశీర్వదించినాఁడు: "మాభూదేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః"

23. "అభ్రే భేమాతి, నభ్రామేతివా, మంథరగామినీత్వాత్ ఇతి అభ్రముః" అమరకోశము రామాశ్రమీ టీకలో.

24. విద్యుత్కళత్ర (మే. దూ 1-38).

25. విద్యుత్వంత (మే. దూ 2-1).

[మేఘ 2-62] అనఁగా, "నో మేఘుఁడా! నీయంకమందుండు విద్యుత్తు నుండి క్షణకాలముకూడ నీవు వేఱుగాకుము" అనుట. దానినుండి వేఱైనచో నీశోభ, నీమేఘత్వము, అంతయు శూన్యమునఁ గలసిపో వును. నావలె కాంతావిశ్లిష్టుఁడ వైనచో నీ వేదేశముపోయినను నచట దుఃఖమే ప్రాప్తించును. కాలానుకూల్యములకు బదులు న్యూనా మునే కాంచెదవు. అచట నీసౌందర్యముగూడఁ దిరోహిత మగును. మఱి ప్రీతి స్నిగ్ధనయములతో నీకెవ్వరుస్వాగత మిచ్చెదరు! నిన్నుగాంచి యానందించుటకుబదులు ప్రజలు నిన్ను జూచి యేడ్చెదరు. నీప్రియ యగు సౌదామినిని స్మరించెదరు.

ఈ సుదామాపర్వతపుత్రి యొకప్పుడు వలయాకారముగ మెఱ సినచో మఱియొక వేళయందుఁ గనులు మిఱుమిట్లు గొల్పు క్షణప్రభ గల్గిన చంచల తేజముచే దీపించును. 26 మఱియొక పట్టున ఖద్యోతపం క్తివలె నల్పాల్పభాసముచే విలసిల్లును.

"అర్హా స్యంతర్భవనపతితాం కర్తు మల్పాల్పభాసం
ఖద్యోతాలీ విలసితనిభాం విద్యు దున్మేష దృష్టిమ్" (1-18.)

మేఘునివర్ణము:—వర్షాకాలమందలి మేఘుని కాటుకకొండ లతోఁ బోల్చెదరు. మనమేఘుఁడుకూడ మెత్తగాపొడిచేయఁబడిన యంజ జనపు రంగువాఁడు. 27 అతి సుందరుఁడు. 28 వర్షఋతువున నతని శోభ ద్విగుణీకృత మగును. 29 వృషశక్తిపూరితులైనచో, నొక్క మేఘుఁ డేమి? పురుషులు, స్త్రీలు, వృషభములు, అశ్వములు, అన్నిటి వర్ణ మును స్నిగ్ధ శ్యామముగను పరమాభిరామముగను గోచరించును.

26. 'విద్యుద్దామ స్ఫురితచకితైః (మే.దూ 1-17)
27. "స్నిగ్ధభిన్నాంజనాభే" (మే.దూ. 1-59)
28. "ప్రకృతి సుభగః (మే. దూ 1-40)
29. "ప్రావృషా సంభృతశ్రీః (మే. దూ 2-47)

మేఘుని శోభ పూర్ణముగ వర్ణించుట యసంభవము. ఇందుచే కవి యతనిని శివకంఠచ్ఛవితోఁ బోల్చెను. "భర్తుః కంఠచ్ఛవిరితి, గణైః సాదరం వీక్ష్యమాణః" [1-33.] తమ స్వామి శోభను దిలకించు నభిలాష గల శివగణము లా శోభచే నధిక శ్రీమంతమైన ప్రకృతి వస్తురూపసుధను మనసార పానము సేయును. శివునికంఠవర్ణవిభూతి యెవరి కనులయందు నిండిపోయినదో వారావర్ణాభాస మాత్రమె చటఁ గానుపించిన నచట నాత్మార్పణము చేయుదురు. సూర్య,చంద్ర, విద్యుత్ప్రభ లే శివుని బహుళజ్యోతియందు భాసమానములు కావో, అట్టి జ్యోతిర్దర్శనము భక్తులకు మేఘుని యందుఁ గల్గినచో మేఘుని సౌభాగ్య తేజము లేమని వర్ణింపఁగలము? మేఘుఁ డననేమి ? కేవల మొక నామ రూపాత్మక వికారము మాత్రమే! పరమ శివతత్త్వ ప్రకాశమును జూపుటకు, కేవల మతఁ డొక ప్రతీకమైనను నతని జన్మ సఫలీ కృతమే. అతఁడు సమస్త లోక కళ్యాణోపార్జన చేసినట్లే.

ఇట్టివస్తు సౌందర్య పరాకాష్ఠను జూపఁ గల్గునట్టి యొకానొక యద్భుత చమత్కారము కాళిదాసుని కళయందుఁ గలదు. రఘువంశమందు పదుమూఁడవ సర్గలో నతఁడు గంగా యమునా ప్రవాహ సంగమ వర్ణనముఁ జేయ మొదలిడెను. ఒకటి, రెండు, మూఁడు-నాలుగు,- ఇవ్విధము నన్గుపటచి సౌందర్యమును సాంతసీమనుండి వెలువరించి యనంతుని హస్తగత మొనర్చిన నాఁడో యన, శివుని శరీరశోభ యే దానికుపమాన మనినాఁడు.

"క్వచిచ్చ కృష్ణోరగభూషణేవ, భస్మాంగరాగా తను రీశ్వరస్య,
నవద్యాంగి విభాతి గంగా భిన్న ప్రవాహా యమునా తరంగైః"

[రఘు 13-57] కృష్ణ సర్ప విభూషితమై భస్మాంగరాగవిలిప్తమైనయీశ్వరుని శరీరముతోఁదుల్యముగ నున్న యీగంగా,యమునా సంగమమును "ఓ యనవద్యాంగ సీతా!నీవు తిలకింపుము"అని దీని భావము.

ఆ శరీరముకంటెఁ బ్రశస్తతరమైన యుపమానకల్పనోద్దేశము నే భారతీయ కవియైన తన మనమున నిల్పినచో నతఁడీదేశపు సనాతన కళాధర్మములను దిరస్కరించినట్లే. దానిని మించిన శోభ యింకెచటఁ గలదు? అనంతమును మించిన, యనంతత యెట్లుండఁ గలదు ? సౌందర్యమునకు శివునితోఁ దాదాత్మ్యమే కలదు.

త్రిభువనగురువైన చండీశ్వరుని కంఠచ్ఛవి కేవలము ప్రతీకరూపమున నే వ్యక్తమగును. గాని దాని సమగ్రవర్ణన మెవరు చేయుదురు! అంతియే! మేఘునిశోభ కూడ నట్టి యుపమానముతో ననంతమైపోయినది. ఆ సౌందర్యప్రయోజనము భోగము కాదు. ఈశ్వరసమర్పణమే. ఈస్థితికి వచ్చినపిమ్మట నే మనము "ఓ నారీ! నీ నామమే పవిత్రత, సౌందర్యము" అని యందుము. తన సాయంకాల తేజమును, శివునినృత్యసామగ్రీరూపమున సమర్పణ సేయవలసిన దని కవి మేఘుని గోరెను. తన క్షణభంగురచ్ఛవిని మేఘుఁడు నటరాజుయొక్క యవినాశనృత్యశోభ నినుమడింపఁ జేయుటకై యర్పింపవలసిన దని కవియాదేశము.[30] కామదేవుని భస్మావశేషునిగఁ జేసిన కుబేరసఖుఁడగు సాక్షాచ్ఛివుఁడు నివసించు నలకాపురీప్రదేశమునకు మేఘుఁడు పోవలసియున్న దని మేఘసందేశమున నాదినుండి తుదవఱకు జ్ఞప్తి యందుంచుకొన వలసిన విషయము. ఇందుచేతనే మేఘుఁడాలోకమునఁ దన చాపము నెక్కుపెట్టుటకు భయపడును.

మేఘునితో నింద్రధనుస్సునకు సాహచర్యము గలదు. సాతప మేఘాగ్ర భాగమున వివిధవర్ణసమన్వితమైన యింద్ర చాపము విలసిల్లును. ఆకసమందలి యావిరి జలబిందు రూపముఁ జెందు ననియు, నట్టి

30. "పశ్చాదుచ్చైర్భుజ తరువనం మండలేనాభిలీనః
సాంధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః
నృత్యారంభే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛాం
శాంతోద్వేగా స్తిమితనయనం దృష్టభక్తిర్భవాన్యా" (మే సం. 1-36)

మేఘము సూర్యకిరణముల మార్గమునఁ బడగా, నా ప్రకాశ కిరణములు విభిన్న ఘనత్వము గల్గిన పొరలద్వారా పోవలసి వచ్చుటచేఁ గిరణములుఁ వికీర్ణములై విడివిడిగఁ గానవచ్చు ననియు విజ్ఞానవేత్తల కథనము. ఇట్లు సప్తపాతాళ పర్యంతమును బోయి,సత్యమను గవ్వను వెల్లగించు కోర్కె కవికి లేదు. అతని కింద్రధనువుస నద్భుతమైన యింద్రజాలము కలదు. గోచర పదార్థములందా శోభకుఁ దగిన యుపమానము దొరకక పోవుటచే నతఁడు "రత్నచ్ఛాయా వ్యతికర"మని కల్పనచేసినాఁడు. కాని యీ సహోత్పాదనముచేత నతనికి సంతసము గలుగలేదు. అప్పుడు ద్వాపరయుగలోని గోపకునిశృంగారము తలఁపునకు వచ్చెను. మఱి 'భర్తుః కంఠచ్ఛవిరితి'కి సమానమున ననంత సౌందర్య వ్యంజనముకై

"యేన శ్యామం వపు రతితరాం కాంతి మాపత్స్యతే తే
బర్హేణేన స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః"

అని లిఖించినాఁడు. క్షీరసాగరమున శేషతల్పముపై యోగమాయాస మాశ్రియమునఁ జాతుర్మాస్యమును సల్పు సమయమున, బాహ్య ప్రపంచమున కాతని యభిరామరూపమును మేఘుఁడు స్ఫురింపఁజేయునో యనునట్లు తోఁచును.

కాళిదాసు మేఘుని 'కామ రూప' మనఁగా నిచ్ఛానుసారము రూపమును మార్చుకొనువాఁడు యనినాఁడు. విజ్ఞానవేత్తలుగూడ నితని సర్వత్రవిహారదక్షతను నంగీకరించినారు. ఆకసమున నొక సమయమున నడ్డముగ గోచరించును. మఱియొకప్పుడు నిలువుగను మఱియొక వేళ వెనుక భాగమున వ్రేలాడుచుండునట్లుగ నుండి నీట వ్రాలుటకై యుఱికి యేనుఁగువలెఁ గనఁబడును. ఈతిరశ్చీన దీర్ఘప్రసారిత రూపమున భూమికి దిగివచ్చుట యతనికి సులువు.మఱియొకప్పుడు తోయోత్సర్గముచేఁ దేలికయైయాకాశమునదుత్రగతితోఁజాఱుచుఁబోవును.[31]ఇంకొక సమయమున

31. "తోయోత్సర్గద్రుతతరగతి స్తత్పరం వర్త్మతీర్ణః" (పూ. సం. 1-11)

ఎంతేర్ఘనత్వముచే మంథరగతితో మందమందముగఁ జరించును. మేఘ
మూత మందలి మందాక్రాంత చ్ఛందమునకును మేఘుని మందగతికిని
బాకృత సంబంధము కలదు.

దేశ కాలములు రెండును విలుప్తములైపోవలయు ననియనఁగాఁ
ననమాత్ర,క్షణమాత్రము నలకాపురిఁ జేరవలయు నని యక్షుని హృదయ
పూర్వక మైన వాంఛ. కాని దేశకాలపరిచ్ఛిన్నులైన మర్త్యులు
మాత్ర మీ నియతిద్వయానుశాసనమును శిరసా వహింపవలసి
దే. ఆకాశ మార్గమునఁ బోవు మేఘుఁ డెన్ని పర్వతాటంకములు
దాఁటవలెనో యెఱుఁగము.

"ఉత్పశ్యామి ద్రుతమపి సఖే! మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే" మే. సం. 1-22

ఓసఖుఁడా! నీ వెంతత్వరగ బోవువాఁడ వైనను మార్గావరోధక
ములై నిలుచు పర్వతములచెంతఁ గాలక్షేపము గాకుండ పోఁగల్గుట సంభ
వముకాదు. అని భావము. కాని యొకమాటమాత్రము హృదయ
మం దుంచుకొనుము. "మందాయంతే న ఖలు సుహృదా మభ్యుపేతార్థ
కృత్యాః (మే. సం. 1-38) భౌతికవ్యవధాన మెట్లైన నుండనిమ్ముగాని
నీ యుత్సాహముమాత్రము మందగింపరాదుసుమా! యని.

తేలికయైన మేఘములను వాయు వెగురఁ గొట్టి చిందఱవందఱ
చేయుట యందఱుఁ జూచిన విషయమే. గంభీర జలరాశిచే నిండిన మేఘ
ములే గాలి కెదురుగ నిలిచి వర్షించును. పొలిపోయి పలుచఁబాఱిన
వ్యక్తికి గౌరవము లభించుట యరిదిగదా! ఘనముగ వర్షించుమేఘ
ములచేతనే యక్షుఁడు కోరు సందేశవాహకత్వము సంభవము. కావుననే

"అంతస్సారం ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వాం
రిక్తః సర్వోభవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ" మే. సం 1-10
యని జ్ఞాపకముచేసినాఁడు. అనఁగా నో మేఘుఁడా! నీవు జలముచే నిండి

యున్నచోఁ బెనుగాలిమాత్రము నిన్నేమిచేయఁగలదు. యని చెప్పుట. బలవంతుని యధికారము నందఱు నొదలఁ దాల్తురు. అల్పులకుమాత్రము అప్రతిహతవేగమునఁ బ్రవహించు కాలప్రవాహమునఁ గొట్టుకొనిపో వుటదప్ప వేఱుగతి శూన్యము. 'అంతస్సార' మందలి వ్యంగ్యార్థధ్వని యెంతయు సుందరము. మేఘుని నామము 'వృష' యని యీ వఱకే చెప్పఁబడినది. వృషకు రేతస్సు లేక వీర్యమని పేరు.[32] బ్రహ్మచారియైనవాఁడు. అనఁగా నెవఁడు వృష సంపన్నుఁడగుటచే నంతస్సారవంతుఁడో యతఁడే ప్రాణాయామ రూపమైన యనిలాఘాతము నోర్వఁగలఁడు. వృషశూన్యజనులను విషయములు తమ యిచ్ఛవచ్చినట్లు త్రిప్పును. అట్టివారికిఁ గుంభకము (ప్రాణాయామక్రియ) సిద్ధింపదు. మఱియొక విశేషము. ఇంద్రునకు 'ఓకసారీ' యని పేరు. [33] అనఁగా నెవని యింటియందు (ఓకమందు) సారము నిండియున్నదో యతఁడనియర్థము.[34] అలకాపట్టణ నామము 'వసోకసారీపురీ' యని గలదు. [35] అనఁగా 'వసురూపసారము భవనములందు నిండియున్న పురము' అని భావము. మేఘుఁ డింద్రుని ముఖ్యానుచరుఁడు. అతఁడు'అంతఃసారి'యై యలకాపురియందుఁ గాలిడవలెను. ఇంద్రుని నామమే వసువు. [36] ఇంద్రశక్తికి నివాసస్థానమైన దేదో

---

32. రేతో వై వృషయమ్ - శతపథ 7-3-1-46
అపో మే రేతసి శ్రితః - తైత్తిరీయ బ్రాహ్మణ. 3-10-8-6
శరీరమందు జలము రేత రూపమునఁ గలదు అని భావము.

33. ఓకసారీ వా ఇంద్రః - ఐతరేయ బ్రాహ్మణ 6-17-37.

34. గృహో వా ఓకః - ఐతరేయ - 8-26

35. "వసతిం వసుసంపదాం" - కుమారసంభవము 6-3
వసుఓకసారీ-"అక్షయ్యాంతర్భవన నిధయః" యక్షభవనములందు అక్షయ నిధులుండినట్లు మేఘసందేశమున చెప్పబడినది.

36. స ఇంద్రో వై దేవానాం వసుర్వీరో హ్యేషాం - శతపథ 1-6-42
ఇతఁడు దేవతలకు వసువు, అని అర్థము.

యదియే 'వస్వోకసారీపురి'యగును. విరాట్ప్రకృతికి మేఘుఁడే వృషశక్తి కోశమైన యింద్రుఁడు. అందుచే నతనికి 'అంతఃసారీ'యను విశేషణము సాభిప్రాయముగఁ గూర్పఁబడినది.

వర్షానుకూలస్థితికై యనుకూల పవనముకూడ నావశ్యకము. [37] జలపూరితములై వచ్చు మేఘములను బ్రతికూల వాయువులు చించి చెండాడును. మేఘము లెంత యభ్రభత్వ విశిష్టములైనను ననుకూలపవన ప్రేరణ లేక వర్షింపఁజాలవు. అందుచే యక్షసఖుఁడైన మేఘుని మంద పవనము ప్రోత్సహించుచున్నది.

"మందంమందం నుదతి పవన శ్చానుకూలో యథా త్వాం

మే. సం. 1-9

తరువాత వర్షమునకు పసరిక (పచ్చనిచెట్లు చేసులు) యావశ్యము. అటవీవనప్రదేశములం దావిరి త్వరగ జలరూపమును దాల్చును. కవి యీ విషయమునుగూడ సూచించినాఁడు.

"స్థిత్వా తస్మి న్వనచరవధూభుక్తకుంజే ముహూర్తం
తోయోత్సర్గద్రుతతరగతి స్తత్పరం వర్త్మతీర్ణః.

అనఁగా నామ్రకాననఘనకుంజములందు నీవు నిలుచునపుడు బాష్ప రూపమున సంచితమైన నీ జల మచట వర్షించుము. ఇందుచే నీవు తేలికవై ద్రుతగామి వయ్యెదవు. రేవానదీజంబూకుంజములందుఁగూడ నీవు వాంతవృష్టి వయ్యెద అని భావము.

ఘన మెత్తునకుఁ బోయినకొలఁది దాని వేడిమి తగ్గుఁగును. తత్ఫలితముగ వర్షము గలుగును. ఇది వర్షసంబంధియైన మూఁడవ రహ

---

37. యాం దిశం వాయు రేతి తాం దిశం వృష్టిరన్వేతి - శతపథ 8-2-3-5.
వృష్టి యనుకూలవాయువున కధీనమై యుండును;

స్యము.మాలక్షేత్ర వర్ణనమున[38] ధ్వనిరూపమున నీతత్త్వమునకుఁ జెందిన సూచనచేయఁబడెను.

సద్య : సీరోత్కరణ సురభిక్షేత్ర మారుహ్యా మాలం
కించిత్పశ్చా ద్వ్రజ లఘుగతి ర్భూయ ఏవో త్తరేణ
మే. సం. 1-16

ఆరోహణానంతరము వృష్టి, యటుపిమ్మట దాని ఫలస్వరూపమైన లఘుగతివై పునకు ధ్యాన మాకర్షించి పైఁజెప్పిన యభివర్షణ వర్ణనము మిచట ప్రచ్ఛన్న రీతిని జేయఁబడెను.[39]

వర్షానంతరము భూమినుండి పరిమళ సుగంధము బయలు దేరును.

"దగ్ధారణ్యే ష్వధిక సురభిం గంధ మాఘ్రాయ చోర్వ్యాః
మే. సం. (1-21)

దావానలదగ్ధము లైన వనములందు, మేఘుఁడు తన జలముచే భూతాపము నడంపఁగా, దానినుండి సుగంధము పుట్టును. ఎన్ని సుగంధిత కాష్ఠములు, ఎన్ని హవ్యవనస్పతులు, దావాగ్నిచే భస్మమై భూమియందుఁ గలసిపోవునో యెవరికెఱుక! అట్టిస్థలమున వర్షించిన మేఘుఁడును నాఘ్రాత సుగంధముచేఁ బరితృప్తిఁ జెందును. దావానలమును శాంతింపఁజేయు పురుషార్థము కేవలము మేఘునిదే.

త్వా మాసార ప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్య త్యధ్వశ్రమపరిగతం సానుమానామ్రకూటః

సమస్త సంతప్త సృష్టికిని మేఘుఁడు నిజముగ శాంతి గూర్చును. గావుననే కవి యతనిని సంతప్తానాం త్వ మసి శరణం(1-7) అని పొగడినాఁడు.

---

38. మాల క్షేత్రము - నేపాలునకుఁ దూర్పుదిశయందున్న యొక ప్రదేశము.

39. సద్యస్తత్కాలమేవ సీరైః హలైః ఉత్కర్షణేన సురభిఘ్రాణి తర్పణం యథాతథా ఆరుహ్య తత్ర అభివృష్యయిత్యర్థః - మల్లినాథుఁడు.

మేఘుని పయనమందె యన్నిచోటులఁ గాళిదాసు వర్షవర్ణనము చేయుచుఁ బోయెను. కాని, పర్వతప్రదేశములఁ జేరిన పిమ్మట స్థితి మాఱి పోవును. కొలఁది వర్షము పడి, చలి పెరిఁగి యచట నాకాశమందలి జలము హిమరూపమును దాల్చును. ఇందుచే నచటఁ జిట చిట వడగండ్లె పడ మొదలిడును. కావుననే కనఖిల ప్రదేశము[40] దాఁటిన పిమ్మట వర్షవర్ణనము వచ్చినపుడు నీరు వడగండ్ల రూపము దాల్చినట్లుగ వర్ణించెను.

"యే సంరంభోత్పవ రభసాః స్వాంగభంగాయ తస్మిన్
ముక్తా ధ్వానః సపది శరభా లంఘయేము ర్భవంతమ్
తా న్కుర్వీథాస్తుములకరకావృష్టిపాతావకీర్ణాన్
కేవానన్యః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః మే.సం. 1-56

అనఁగా, శరభమృగములు పై కెగిరి నిన్ను దాఁటిపోవఁ బ్రయత్నించినచో వానిని హిమఖండములచేఁ గట్టిగ మర్దింపుము అని. ఈశ్లోకమందలి యాధ్యాత్మికభావ మత్యంతము మనోహరము. మేఘసందేశమందుఁ గల వృషశక్తి మీమాంసలోని దుర్ధర్షత్వమిందుఁ బ్రతిపాదింపఁ బడినది. కామమును యోగసంయమముచే నిర్జించి, సాధనతో ముందుకు సాగునట్టి యేమార్గము కలదో దానిని నిరాదరించి కామమును నిర్జింపకయే, యితరమార్గముల నవలంబించి ఒక్కుమ్మడిగ యుదుటున సిద్ధిని బొందఁదలచినవారు చివరకు వృషశక్తి యధోముఖపతిత మగుటచే నవకీర్ణులై యనఁగా ఖండితబ్రహ్మచర్యవ్రతులై పోయెదరు. వారి ప్రయత్న మంతయు నిష్ఫలమైపోవును. శ్లోకమందు 'అవకీర్ణ' యను శబ్దము జ్యోతివలె సమస్తార్థమును గాంతివంతముఁ జేయుచున్నది. వ్రతము

40. కనఖిల= హరిద్వార సమీపమందలి యొక తీర్థ విశేషము.

చెడిన బ్రహ్మచారులను నవకీర్ణు లందురు. సప్తమధాతువైన యోజము నెవఁ డెవ్విధమునైన జాఱవిడుచునో యతఁ డవకీర్ణుఁడు.[41]

మనుష్యుఁడు వాజసంపన్నుఁ (వాజీ) డగుటకు, అనఁగాఁ దన వాజ (వృష) శక్తిని దనయందే నింపుకొనుటకై యేక రేతస్కుఁడు లేక కేవల మూర్ధ్వరేతస్కుఁడు కావలయును. అతఁడు తన సమస్త పాంసువులను[42] (రేణువులను) స్వాత్మతోనే పానముచేయలేకపోయినచోఁ బాంసుఁడు లేక ద్విరేతస్కుఁడై పోవును.

(శతపథ 4-5-1-11).

మేఘాగమనముచేఁ జెట్లుచేమలు నోషధులు, నూర్జముగఁ బెరిఁగి యెట్లు వీర్యవంతము లగునో యట్లే జంతుజాలమును నానందోద్రేకమును జెందును. చేతనదృష్ట్యా పశువులు, మనుష్యులు, వనస్పతులు, నన్నియును విశ్వవ్యాప్తమైన మహాప్రాణమునకుఁ బరాపరభేదమాత్రములే. విరాణ్మేఘుని ప్రభావము సర్వత్రఁ జూపట్టును. చరాచరము లనెడి కాల్పనిక సీమలను దాఁటి యేకైక చైతన్యమును దర్శించినపుడే మేఘసందేశమెల్లరకును జరితార్థము కాఁగలదు.

41. "అవకీర్ణీ భవే ద్గత్వా బ్రహ్మచారీ తు యోషితమ్ - యాజ్ఞవల్క్యము.
యోషాభిగమనముచే బ్రహ్మచారి అవకీర్ణుఁ డగును.
బ్రహ్మచారీ, ఉపకుర్వాణో, నైష్ఠిక శ్చేతి యోషితం గత్వా, అవకీర్ణం తత్తు యస్యాస్తి సో అవకీర్ణీ (విజ్ఞానేశ్వర)
స్త్రీ సంపర్కా ద్విప్లుత బ్రహ్మచర్యః అవకీర్ణీ (మను, కుల్లుక)
42. పాంసు = రేత, రేణు = వీర్య, వాజ = వృష.

---

మూలము:—డాక్టరు వాసుదేవశరణ్ అగ్రివాల్,
M. A., PL. D గారి
నా గ రీ ప్ర చా రి ణీ ప త్రి క
విక్రమ. 2006—54 వ సంపుటము
పత్రిక 2—3 లోఁ బ్రచురితమైన హిందీ వ్యాసమునకు
స్వే చ్ఛా ను వా ద ము

# కల్యాణపురీ ప్రశంస

(బండారు తమ్మయ్య)

[నేఁడు హైదరాబాదు రాష్ట్రములో, బిదరు జిల్లాలో గుల్బర్గాకు రమారమి యేఁబదిమైళ్ళ దూరముననున్న కల్యాణమను గ్రామము పూర్వము పశ్చిమ చాళుక్య రాజధానియై బహువిభవాకరమై ప్రసిద్ధి నొందియుండెను. దీనినిబట్టియే పశ్చిమ చాళుక్యులకుఁ గల్యాణ చాళుక్యు లనువ్యవహార మేర్పడినది. క్రీ॥ శ॥ 1060 ప్రాంతమున నిచ్చటఁబరిపాలన మొనర్చిన యాఱవ విక్రమాదిత్యుని యాస్థానమున బిల్హణుఁడు, విజ్ఞానేశ్వరుఁడు నాస్థానకవులుగా నుండెడివారు. వీరిలో రెండవ యాతఁడు రచించిన "విజ్ఞానేశ్వరీయము" అను ధర్మశాస్త్ర గ్రంథమున "నాసీదస్తి భవిష్యతి క్షితితలే కల్యాణ కల్పం పురమ్" అనియున్న ప్రశంసవలన నప్పటి యీపట్టణవైభవము వ్యక్తముకాఁగలదు. క్రీ. శ. 1160 ప్రాంతమున నిచ్చటఁ బాలన మొనర్చిన తైలపదేవుని నాతని దండనాథుఁడు బిజ్జలుఁడు సింహాసన భ్రష్టునిఁగావించి పశ్చిమ చాళుక్యరాజ్య మాక్రమించెను. వీరశైవ మతోద్ధారకుఁడగు బసవేశ్వరుఁడక్కాలమున బిజ్జలుని ప్రధానమంత్రిగానుండెను. అప్పుడు బసవేశ్వరుఁ డచ్చట నిర్మించిన శివానుభవ మంటపము గొప్ప యాధ్యాత్మిక నిలయమయి విలసిల్లెను. దానికి అల్లమప్రభువధ్యక్షుఁడు. భారత దేశము దశదిశలనుండి జ్ఞానులచ్చటి కేతెంచి తమ తమ శివానుభవములను వెలార్చుచుండిరి. వారి యాయనుభవద్యోతక వాఙ్మయమే నేఁడు కర్ణాటభాషలో వచనవాఙ్మయ మనుపేర విశిష్ట స్థానము వహించుచున్నది. ఇట్టి కల్యాణ కటకము, దేశము తురుష్కాక్రాంతమయి తురకల దొరతనము నెలకొనిన పిమ్మటఁ దొంటి వైభవమును గోల్పడి నేఁడు సామాన్యగ్రామముగానున్నది. జనపనికాలము

నుండి యిది బసవకల్యాణమను పేర వ్యవహృతమగుచున్నది. ఆనాఁటి సన్నివేశముల శిథిలావశేషములను పురాతత్త్వ పరిశోధక శాఖవారు సంరక్షించుచున్నారు. ఈపట్టణమందలి భక్తిగౌరవములచే వీరశైవ సోదరు లీసంవత్సరము జనవరి 29-30 తేదులను అఖిలభారతీయ వీరశైవమహాసభయొక్క షోడశవార్షికసభ నిచ్చట సమావేశమొనర్చిరి. అందు శ్రీ మైసూరు మహారాజుగారు ప్రారంభోపన్యాసమొసంగిరి. వీరశైవులు వేలకొలఁది నలుదిశలనుండి యరుదెంచిరి. ఈక్రింది పద్యములానాఁటి సమావేశములో భావావేశమునఁగూర్చి చదివినవి.]

శా. కల్యాణాఖ్యపురంబ! పశ్చిమ చళుక్యాధీశ సంస్థానమై
కల్యాణాత్మకుఁడై, సమస్తజగతీ కల్యాణసంధాయధీ
కుల్యాశ్రేణుల నోలలాడు బసవాఖ్యుండిచ్చు సాన్నిధ్యసా
కల్యంబొందుచు ధన్యవయ్యునిటు దుష్కాల ప్రభావంపు వై
కల్యంబందిన నిన్ను నేఁడుగనులన్ గాంచంగఁ గట్టా! మన
శ్శల్యంబౌ చది గూర్పకున్నె భరమౌ సంతాప మెవ్వారికిన్.

ఉ. భారతభూమియందు నలువైపులనుండియుజ్ఞానవృద్ధులిం
పారఁగనిందుఁ జేరుచును నాత్మ శివానుభవంబులెల్ల వె
ల్వారఁగ గేయరూపముల వర్ధిలఁజేసిరటంచు విందుమా
ధీరుల దివ్యసన్నిధిని దేజము నొందిన నీదు భాగ్యమే
తీరునఁ గల్గనేర్చు మఱి దేనికినైనఁ బురీవతంసమా!

శా. తల్లీ! నీదగు పూర్వవైభవముఁ జిత్తంబందు ధ్యానించుచో
యుల్లంబూఱటనొందు సాధనముగా నూహింతు మేమింక నీ
తొల్లింటున్నతి నేఁడు లేశమయినన్, దోఁపంగరానీకదా
నెల్లన్ మాయఁగఁజేసినట్టి విధినే యేరీతి దూ అందగున్.

సీ. మడివాలు ♦ బిజ్జలు మత్తకరిమదమ్ము
నణఁగించి చెండాడి నట్టిచోటు
గేయచారిత్రుఁడౌ కిన్నర బ్రహ్మన్న
కభవుఁడోయని పల్కినట్టి నెలవు

♦ మడివాలు మాచయ్య

పరవాదులు భజింప బసవయ్య శివనాగ
మయఁగొని యూరేఁగినట్టి రథ్య
అల్లమ ప్రభునకు సర్మిలి బసవేశుఁ
డాత్మార్పణ మొనర్చినట్టి వసతి

గీ. ఎంతొ దూరంబునుండి యే తెంచినట్టి
మమ్ముఁ గరుణించి కడునాద రమ్ముతోడఁ
జూపఁగదవమ్మ ! మేము విశుద్ధులమయి
జన్మము తరింప నిండ్లకుఁ జనకమున్న.

చ. అనుపమభక్తియుక్తి బసవాఢ్యుఁడు మున్నిట మూఁడుప్రొద్దులం
దను దినముల్ మహాప్రమథు లట్టులుగూడెడు భక్తకోట్ల య
ర్చనముల వేడ్కఁ జేసినతె అంగునొకించుక తెల్పనోయనన్
ఘనమతి నిష్ఠకూడిన గణంబుల కంజలిగూర్చి మ్రొక్కెదన్.

చ. బసవని తోడమున్నతని పజ్జనుసిందు వసించి సత్క్రియా
వసరములందు నాతనికి బాసటయౌచును జిత్సుఖాబ్ధి వె
క్కసముగ మగ్నులై గణనగాంచిన మాచయ బ్రహ్మయాదులన్
అసమగుణాఢ్యులన్ దలఁతు నందఱ నేఁడిటఁజిత్సుఖార్థినై.

---

బసవ కల్యాణమందలి భక్తి కలన
నేఁడచటఁగూడు షోడశ నిఖిలభార
తీయ వీరశైవ సభాంగ దివ్యసన్ని
వేశములయందు భక్తిసంవేశమునను
ఆపురీ విభవప్రశం సాత్మకముగ
భక్త బండారు తమ్మయా హ్వయుఁడుగూర్చు
పద్యషట్కంబిది యభవు భవ్యకరుణ
వఱలుఁగావుత శివభక్త వర్గములను.

# వ్యక్తివివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ,

అనౌచిత్యభేదములు.

అనౌచిత్యము రెండు విధములుగ నున్నది. (1) అర్థ విషయము (2) శబ్దవిషయము. ఇందు మొదటిది అన్తరంగానౌచిత్యము. రెండవది బహిరంగానౌచిత్యము. విభావానుభావవ్యభిచారి భావములను రసానుగుణముగ వర్ణింపవలసిన తీరున వర్ణింపకుండుటయే యన్తరంగానౌచిత్యమునకు లక్షణము. అన్తరంగ మగు నీ యర్థానౌచిత్యమును, ఆనందవర్ధనాచార్యప్రభృతులే "వ్యభిచారి రస స్థాయిభావానాం శబ్దవాచ్యతా— అనంగస్యాభిధానం చ రసే దోషా స్స్యురీదృశాః" "అనౌచిత్యాదృతే నాన్యత్ రసభఙ్గస్య కారణమ్ ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యోపనిషత్పరా" మొదలగు శ్లోకములయందు నిరూపించిరి. అందుచే దాని నిటఁ దిరిగి వర్ణించుటలేదు. బహిరంగ మగు శబ్దానౌచిత్యము బహుప్రకారముల నున్నది. (1) విధేయావిమర్శము (2) ప్రక్రమభేదము (3) క్రమభేదము (4) పౌనరుక్త్యము (5) వాచ్యావచనము.

ఒక వృత్తముయొక్క "దుశ్శ్రవత్వము" కూడ శబ్దానౌచిత్యమే యగును. కాని, అనుప్రాసాదులవలె దీనికిఁగూడ రసానుగుణ్యముండుటయే యభీష్ట మగుటచే నర్థాశ్రయముగూడ నగుచున్నది. విధేయావిమర్శాదులవలెఁ గేవలము శబ్దాశ్రయము కాదు. అందుచే దుశ్శ్రవత్వదోషమునుగూడ విధేయావిమర్శాదులతోఁ గలిపి శబ్దానౌచిత్య భేదముల క్రింద నీయలేము.

అనౌచిత్య లక్షణము.

"వివక్షితరసాదిప్రతీతి విఘ్నవిధాయిత్వము"— ప్రతిపాదింపఁ దలఁచిన రసాదుల ప్రతీతికి విఘ్నమును గలుగఁజేయుట"యే యనౌచిత్యమునకు, సామాన్య లక్షణము.

ఇఁక శబ్దార్థానౌచిత్యములకుఁ గల భేద మేమన, అర్థానౌచిత్యము రసప్రతీతికి సాక్షాత్తుగ విఘ్నమును గలుగఁజేయును. అందుచేతనే యిది యన్తరంగమైనది. శబ్దానౌచిత్యము పరంపరా సంబంధముచే రసప్రతీతికి విఘ్నము నాపాదించును. అందుచే నిది బహిరంగమైనది.

విధేయావిమర్శము మొదలుగాఁ గల యీ యనౌచిత్యములే విధేయావిమర్శాదిదోషము లని పిలువఁబడుచున్నవి. ఖలులవలె నీ దోషముల నన్నిటి నిఁక వ్యాఖ్యానింతును

అనౌచిత్యమునుగుఱించి బోధింపుఁడని శిష్యు లడిగినారు. ఎవ్వరైన నొక ప్రశ్న నడిగినపుడు సమాధాన మీయనిచో నీతనికి సమాధానము తెలియదా? తెలిసినను, ప్రశ్నకు సమాధానము చెప్పవలెనను నాచారము నితఁడు పాటించుటలేదా! లేక యితరులకు సమాధానము చెప్పవలయు నను మాత్సర్యముచే మౌనము వహించినాఁడా! యని పలుపలురకముల సంశయింతురు. ఆ సంశయములకుఁ దావు లేకుండుటకై, కేవలమభాగ్యులుమాత్రమే యనుసరించునట్టియు, సత్పురుషులు సేవింపనట్టియు, ఇతరుల దోషములనే చూపునట్టియు నీ మార్గము (పౌరోభాగ్యమును) నవలంబించి యీ వ్యాఖ్యానమున కుపక్రమించుచున్నాను.— "నీ వ్రాఁతలలో దోషములు లేవా! నీ రచనము లన్నియు దోషభూయిష్ఠములుగ నుండఁగనే యితరులలో దోషముల నెంచద వేల!" అని యెవ్వరైనను నన్ను బ్రశ్నింపవచ్చును—వారికి నేఁ జెప్పున దిదియే. వైద్యుఁడితరులకు "అపథ్యము సేయవల"దని చెప్పును. తాను మాత్ర మా యుపదేశమును బాటింపక యపథ్యమునే సేయును. ఇఁక విధేయావిమర్శాది దోష వ్యాఖ్యానమున కుపక్రమింతును—

విధేయావిమర్శదోషము:

ప్రధానముగఁ జెప్పఁదలఁచిన యర్థము విధేయము. ఇంతకుఁ బూర్వమే సిద్ధించియున్న వస్తువునకు నూతనముగ నే ధర్మమును విధించు

చున్నానో యది విధేయ మగును. ఇంతకుఁబూర్వమే సిద్ధించియున్న యర్థమును "ఉద్దేశ్య"మని చెప్పుదుము. ఈ యుద్దేశ్యవిధేయములలో నుద్దేశ్య మప్రధానము,విధేయము ప్రధానము నగును. ఉద్దేశ్య వాచకము పూర్వపదముగను, అప్రధానముగను నుండవలయును. విధేయ ముత్తర పదముగను, ప్రధానముగను నుండవలయును. ఇందుకు వ్యత్యాసముగ నున్నచో, విధేయావిమర్శదోష మున్న దని చెప్పుదుము.

ఉదా॥ "సంరంభః కరికీటమేఘశకలోద్దేశేన సింహస్య యః
సర్వస్యైవ స జాతిమాత్రనియతో హేవాకలేశః కిల
ఇత్యాశాద్విరదక్షయాంబుదఘటాబన్ధేప్యసంరబ్ధవాన్
యోఽసౌ కుత్ర చమత్కృతే రతిశయం యాత్వంబికాకేసరీ"

అర్థము:—

కరికీటమేఘశకలోద్దేశేన=ఏనుఁగు లనెడు పురుగులను, మేఘము లనెడు చిన్నముక్కలను (తుచ్ఛములగు నేనుఁగులను, చిన్న మేఘపు ముక్కలను) నుద్దేశించి, సింహస్య = సింహమునకు, యః, సంరంభః = ఏ యాటోపము గలదో, సః హేవాకలేశః=అల్పమగు నాయాటోపము, సర్వస్యైవ=అన్ని ప్రాణులకును, జాతిమాత్రనియతః = జాతిచేతనే సిద్ధమైనది; ఇతి = విషయమిట్లుండ, ఆశాద్విరదక్షయాంబుదఘటాబన్ధేపి—దిగ్గజముల యొక్కయు, ప్రళయకాల మేఘముల యొక్కయు సమూహమునందు, యః = ఏది, అసంరబ్ధవాన్ = సంరంభములేనిదై యుండునో, అసౌ=ఆ, అంబికాకేసరీ=శ్రీపార్వతియొక్క సింహము, కుత్ర = ఏవిషయములో, చమత్కృతేః అతిశయం = చమత్కారాతిశయమును (తన గొప్పఁదనమును) యాతు=పొందును (ప్రదర్శించును) ఇచట 'అసంరబ్ధవాన్' = 'సంరంభములేనిది' అను పదప్రయోగము వలన—"సింహమునందు సంరంభక్రియ లేదు"అనియే కవి చెప్పఁదలఁచి నాఁడు—అనఁగా సంరంభక్రియను నిషేధింపఁదలఁచినాఁడు—సంరంభ

క్రియానిషేధ మిచట ప్రధాన మన్నమాట. కాని, "న సంరబ్ధవాన్" అని విడిగాఁ బదములను బ్రయోగింపక, "అసంరబ్ధవాన్" అని సమాసము చేయుటచే, ఈ నిషేధము సమాసములో గుణీభూతమై, ప్రధానముగ భాసించుటలేదు. మనకుఁ గావలసినది నఞ్, క్రియతో నన్వయించు, ప్రసజ్య ప్రతిషేధమే. ఉత్తరపదముతో సమసించి నఞర్థమగు నిషేధమున కప్రాధాన్యత నిచ్చు పర్యుదాసముగాదు. ఇచట నఞ్ సమాస ముండుటచే నిషేధ మప్రధాన మగుచున్నది. కావున సమాస మనుపపన్న మగుచున్నది.

పర్యుదాసలక్షణము :

ప్రధానత్వం విధే ర్యత్ర ప్రతిషేధేఽప్రధానతా
పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్

ఎచ్చట విధికిఁ బ్రాధాన్యము, ప్రతిషేధమునకు నప్రాధాన్యము, 'నఞ్'నకుత్తరపదముతో సంబంధము, (సమర్థసమాసము, ఏకవాక్యత్వము గూడ) నుండునో, యచట పర్యుదాస మని తెలియవలెను.

ఉదాహరణము :

జుగోపాత్మాన మత్రస్తః భేజే ధర్మ మనాతురః
అగృధ్నురాదదే సోఽర్థ మసక్తః సుఖ మన్వభూత్

అర్థము :

సః = ఆ దిలీపమహారాజు, అత్రస్తః = భయములేనివాఁడై, ఆత్మానం=తనను, జుగోప=రక్షించుకొనెను : అనాతురః = ఆపన్నుఁడు కాకయే, ధర్మం = ధర్మమును, భేజే = అనుష్ఠించెను. అగృధ్నుః = లోభములేనివాఁడయియే, అర్థం=ధనమును, ఆదదే = గ్రహించెను ; అసక్తః=సంగములేనివాఁడై ,సుఖ మన్వభూత్=సుఖము ననుభవించెను.

ఇచట, అత్రస్తుఁడై యున్న దిలీపమహారాజు నుద్దేశించి, ఆత్మరక్షణము విహిత మగుచున్నది. త్రాసరాహిత్య మింతకుఁబూర్వమే

సిద్ధ మైన యర్థము. "భయః షేధమును, కవి క్రొత్తగ విధించుటలేదు. అందుచే నది ప్రధానము గాదు.—న+త్రస్తః=అత్రస్తః అని నఞ్ స కుత్తరపదముతో నిట సమాస ముండుటచే నిది పర్యుదాస మైనది. ఇందులో, త్రాసనిషేధము ప్రధానముగాదు. త్రాసరాహిత్య విశిష్టుఁడగు నతని నుద్దేశించి విధింపఁబడిన "ఆత్మగోపనమే ప్రధానముగ భాసించుచున్నది.ఇ ట్లిచట పర్యుదాసలక్షణము సమన్విత మగుచున్నది. అ ట్లగుటచే "నఞ్ సమాస మిచట నుచితముగనే యున్నది. ఇటులనే, అనాతురః, అసక్తః, అను పదములవిషయమైనకూడ సమాస ముపపన్నమే యగుచున్నది.

ప్రసజ్య ప్రతిషేధము- లక్షణము: ప్రజన్యప్రతిషేధ మనున దిందాకు విపరీతముగ నుండును.

"అప్రాధాన్యం విధే ర్యత్ర ప్రతిషేధే ప్రధానతా
ప్రసజ్యప్రతిషేధోఽసౌ క్రియయా సహ యత్ర నఞ్".

తా॥ ఎచట విధికిఁ బ్రాధాన్యము లేదో, ప్రతిషేధమునకే ప్రాధాన్య ముండునో 'నఞ్' క్రియాపదముతో నన్వయించునో యచట ప్రసజ్య ప్రతిషేధ ముండును.

ఉ దా హ ర ణ ము :—

"నవజలధర స్సన్నద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధను రిదం దూరాకృష్టం న తస్య శరాసనమ్
అయమపి పటు ర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా న మమోర్వశీ".

అ ర్థ ము.

సన్నద్ధః=చంపుటకు సిద్ధముగ నున్న,అయం=ఆ కన్పడువ్యక్తి,నవజలధరః=క్రొత్తమేఘము, దృప్తనిశాచరః=మదించిన రాక్షసుఁడు, న (భవతి)=కాఁడు.. దూరాకృష్టం=బాగుగా లాగబడిన, ఇదం=ఇది సుర

ధనుః=ఇన్ద్రధనుస్సు; తస్య=ఆ రాక్షసునియొక్క శరాసనం=ధనుస్సు, న భవతి=కాదు.పటుః=తీవ్రమగు, అయం=ఇది, ధారాసారః=ధారలుగ కురియుచున్న వర్షమే, బాణపరంపరా = బాణములయొక్క వరుస, న (భవతి) = కాదు కనకనికషస్నిగ్ధా = బంగారుగీతవలెమెఱయునది, విద్యుత్ = మెఱపే, మను, ప్రియా, ఊర్వశీ=నాప్రియురాలగు ఊర్వశి, న భవతి=కాదు.

ఇచట దృప్తనిశాచరుఁడు లేఁడను నిషేధము ప్రధానముగ భాసింపవలయును. అందుచే నఞ్ నకుత్తరపదముతో సమాసముఁజేసి "అదృప్త నిశాచరః" అని ప్రయోగింపక దృప్తనిశాచరః న, (భవతి) అని వ్యస్తముగఁ బ్రయోగించినాఁడు. 'న' యనునది, భవతి యను క్రియతో నన్వయించుచున్నది.

ఇట్లు,నిషేధమునకుఁ బ్రాధాన్యము,విధి కప్రాధాన్యము,నఞ్ నకు సుబన్తముతో సమాసము లేకుండుట యను నంశములు మూఁడును నిచటఁ గన్పడుచున్నవి. కాఁగా నిది ప్రసజ్యప్రతిషేధ మైనది.

ప్రస్తుతము "అసంరబ్ధవాన్" అనునపుడు పర్యుదాసము నాశ్రయించి నఞ్ సమాసముచేయుటవలన నుచితమగు నర్థముభాసించుటలేదు. సంరంభక్రియను నిషేధించుట మన కభిమతము. ఉదాసీనుఁ డగు, సంరంభవదృశకిర్యాకర్తను బ్రధానముగా విధించుట మన కభిమతము కాదు. ('అబ్రాహ్మణః' అనునపుడు, బ్రాహ్మణసదృశుఁడు, బ్రాహ్మణభిన్నుఁడు నగు క్షత్రియాదులను బ్రాహ్మణశబ్దము తెల్పును. అటులే అసంరంభవత్ శబ్దముకూడ సంరంభవత్సదృశ మగు నసంరంభవత్ వస్తువును దెలుపును. కాని యీ యర్థ మిచట మన కభిమతము కాదు) సంరంభక్రియను నిషేధింపవలయు నన్నచో నఞ్ నకుఁ గ్రియతో సంబంధ ముండవలయును. కాని యీ సమాసమున నఞర్థము (సంరంభనిషేధము) గుణీభూత మైపోయినది. సంరంభవత్సదృశ మగు మఱియొక యర్థము

ప్రధానమై భాసించుచున్నది. నఞ్ నకుఁ గ్రియాభి సంబంధము ప్రధాన ముగ భాసించుటలేదు. అందుచే మనము ప్రతిపాదింపఁదలఁచిన యర్థము సిద్ధింపదు. వివక్షిత మగు నర్థము (సంరంభ క్రియా నిషేధము ప్రధాన ముగ భాసించుట)సిద్ధింపవలయు నన్నచో సమాస ముపపన్నము గాదు. సమాసమునందు నఞర్థము గుణీభూతమై, దాని తరువాత నున్న పద మొక్క యర్థము ప్రధానముగ భాసించును. కాని మనకు నఞర్థము ప్రధానముగను, ఉత్తరపదార్థము గుణీభూతముగను భాసింపవలయును. ఇట్లు, సమాసము చేయుటచే విధ్యనువాదభావము తలక్రిందైనది. నఞ ర్థము గుణీభూతముగను, ఉత్తరపదార్థము ప్రధానముగను భాసింపవల యు నన్నచో నట్టి తావున సమాస ముపపన్నమే యగును.

ఉదా॥ కావ్యార్థతత్త్వావగమో న వృద్ధారాధనం వినా
అనిష్టవాన్ రాజసూయం కః స్వర్గం ముఖ్య మశ్నుతే"

అర్థము :

వృద్ధారాధనం వినా=వృద్ధులను సేవింపకయే, కావ్యార్థతత్త్వావ గమః=కావ్యార్థముయొక్క తత్త్వజ్ఞానము న (భవతి) = కలుగదు— రాజసూయమ్=రాజసూయయాగమును, అనిష్టవాన్ = చేయనివాఁడు, కః=ఎవఁడు, ముఖ్యం స్వర్గమ్=ముఖ్య మగు స్వర్గమును, అశ్నుతే=పొం దును?

"అనిష్టవాన్" అనునపుడు, నఞర్థ మగు నిషేధమునకుఁ బ్రాధా న్యము లేకుండుటచే సమాస ముపపన్నమే యగుచున్నది. అసంరబ్ధ వాన్, మొదలగు సమాస స్థలములలోఁగూడ నఞర్థము క్రియతో నన్వ యించు ననియే యేల చెప్పఁగూడదు? అని ప్రశ్నింపవచ్చును. దీనికి సమాధాన మిది—క్రియాంశము, కర్త్రంశము, నను రెండంశములు కృదన్తములలో భాసించును. ధాతువు క్రియను దెలుపును. ప్రత్యయము కర్తను దెల్పును. ఒక వాక్యములో క్రియాంశ కర్త్రంశములగు నర్థము

లను నిషేధింపవలసి వచ్చినపుడు, "నఞ్"చే క్రియాంశమునే నిషేధింపవలయును. ఉదాహరణమునకు—"న ఇష్టవాన్;"ఇది యొక వాక్యము. ఇష్టవాన్ అనుచో 'యజ' క్రియయు కర్తృవాచకమగు "క్తవతు" ప్రత్యయము నున్నవి. ఇందులో నఞ్ చే క్రియాంశమునకే నిషేధమును జెప్పవలెను. ఇష్టవాన్, న (భవతి) అనునపుడు, "భవతి" అను క్రియ ప్రతీయమాన మగుచున్నది. "భవతి" అనునది "సత్త"ను ("ఉండుటను") బోధించును. "నఞ్" ఈ ప్రతీయమాన మగు సత్తాక్రియాంశమునే నిషేధించును. సమాసమందు దగుచో 'నఞ్' కర్త్రంశమును నిషేధించును.

అకుంభకారః

ఇచట "కృ" ధాతుబోధ్య మగు "చేయుట" యను క్రియయు, అణ్ ప్రత్యయబోధ్య మగు కర్త్రంశము నున్నవి. ఇది సమాస మగుటచే, నఞ్, ఇందలి కర్త్రంశమునే నిషేధించును. అనగా కుమ్మకార నిషేధమే యిట భాసించునుకాని, చేయుట యను క్రియకు నిషేధము భాసింపదు. ఇట్లొకచోట క్రియాంశమునకును, మఱియొకచోట కర్త్రంశమునకునుమాత్రమే నిషేధ ముండు ననుట శబ్దశక్తికి స్వభావము—

క్రియాకర్త్రంశభాగర్థో వాక్యేఽపోహ్యో నఞా యది
క్రియాంశ ఏవాపోహ్యస్స్యా న్నేష్టవానితివత్ తదా (3)
అకుంభకార ఇతివత్ వృత్తౌ తు స్యా ద్విపర్యయః
ఇత్యేష నియమోఽర్థస్య శబ్దశక్తిస్వభావతః (4)
(అన్తరశ్లోకములు)

శబ్దశక్తి స్వభావము ననుసరించి యర్థనియమ మిట్లున్నను, వ్యామోహముచేతనే గొందఱు కవులు నఞర్థము గుణీభూతమైనపుడుకూడ సమాసము నుపయోగించుటలేదు.

ఉదా॥ (1) నను సాధుకృతం ప్రజాసృజా।శశికాన్తేషు మనో న కుర్వతా
నహి చేతనతా మవాప్య తే । విరమేయు ర్గలితేన కేవలమ్"

అర్థము :

శశికాన్తేషు=చన్ద్రకాన్తశిలలయందు, మనః=మనసును, నకృత్వా=సృజింపని, ప్రజాసృజా=బ్రహ్మదేవునిచేత, సాధుకృతం ననుఁ=మంచి పనియే చేయఁబడినది; చేతనతామ్=ప్రాణమును, అవాప్య=పొంది, తే=ఆ శశికాన్తశిలల, గలితేవ కేవలమ్=ద్రవించుటతోనే, నవిరమేయుః=విరమించెడివి కావు—

నకుర్వాతా-అనునపుడు నిషేధమునకుఁ బ్రాధాన్యములేదు, అందుచే నిచట "అకుర్వాతా" అని సమాసము చేయవలయును. చేయకుండుట వ్యామోహము.

(2) "గృహీతం యేనాసీః పరిభవభయాన్నోచితమపి-"

యేన=నాతండ్రియగు నే ద్రోణాచార్యునిచేత, పరిభవభయాత్=అవమాన భయమువలన, నోచితమపి=అనుచితమైనను, (అగ్రాహ్యమైనను) గృహీతమ్ ఆసీః=గ్రహింపఁబడితివో—

ఇచటఁగూడ న+ఉచితమపి—నోచితమపి, అని సమాసముఁ జేయకుండుటచే, ఉచితశబ్దముచే బోధింపఁబడు, గ్రహణ క్రియతో, నఞర్థ మన్వయించుచున్నది. గ్రహణ నిషేధము భాసించుచున్నది. గ్రహణ నిషేధము ప్రధానముగ భాసించుట కవికభిమతము గాదు. అందుచే నిచటఁగూడ నఞర్థమునకు గుణీభూతత్వము సిద్ధించుటకై, "అకుర్వాతా" అని సమాసము నుపయోగింపవలెను.— న, కుర్వాతా అని వ్యస్తప్రయోగము కూడదు.

ప్రశ్న :

"అశ్రాద్ధభోజీ" "న శ్రాద్ధం భుంక్తే" అని విగ్రహ వాక్యము.

ఇచట "నఞ్" సమాసముతోనుండి గుణీభూతమైనది. అయినను, "భుజి" క్రియతో నన్వయించి, శ్రాద్ధభోజనాభావమును, (భోజన క్రియా నిషేధమును) తెలియజేయుచునే యున్నది. క్రియాన్వయ ముండుటచే

నిది ప్రసజ్యప్రతిషేధమేయైనను,నఞ్ సమాసము పొసఁగుచునేయున్నది. అటులే, అసంరబ్ధవాక్ - అని సమాసములోమాత్రము ప్రసజ్యప్రతిషేధ మేల సమన్వితముకాదు? ఇచటఁగూడ సంరబ్ధనిషేధమే భాసించుఁగాక, అసంరబ్ధవద్విధి భాసింపనే భాసింపదు. అందుచే నిదియు ప్రసజ్య ప్రతిషేధమేగాని, పర్యుదాసమే కా దని యేల చెప్పఁగూడదు?

సమాధానము :—

"శ్రాద్ధం భోక్తుం శీల మస్య"ఇతి శ్రాద్ధభోజీ"—న శ్రాద్ధభోజీ" అశ్రాద్ధభోజీ శ్రాద్ధమును భుజించుట యతనికి శీలము కాదు. కాన నశ్రాద్ధభోజీయని సమాసము వచ్చినది. ఇందులో భుజించుట యను క్రియయు, తచ్ఛీలార్థములో విహితమైన 'ణిని' యను కర్తృవాచక ప్రత్యయమును నున్నవి. ఇచ్చట'నఞ్'ఉత్తరపద మగు 'శ్రాద్ధము'తో సమసింపదు. శ్రాద్ధభోజీయను పదముతోనే సమసించును.'శ్రాద్ధభోజీ'అనుశబ్దమునందు'ణిని' ప్రత్యయమును కర్త్రర్థమున విధించుటచే, నిచటఁ కర్త్రంశమునకే ప్రాధాన్య మున్నది. కేవలము శ్రాద్ధభోజన క్రియ ప్రధానముగాదు. అందుచే'నఞ్'నకుఁకర్త్రంశముతోనే శాబ్ద మగు సంబంధ ముకలదు. భోజన క్రియతో లేదు. క్రియాంశసంబంధము లేనిదే, కర్త్రంశముతోనైనను సంబంధము కుదరకపోవుటచేఁగ్రియాంశముతోఁగూడ సంబంధ మున్న దని చెప్పుచున్నాము. అందుచే నీ క్రియాంశసంబంధము సామర్థ్యబల కల్ప్యమేకాని, సహజముగాదు. భుజక్రియాశ్రవణముగూడ నుండుటచే, నంతమాత్రముతో,నఞ్నకు క్రియాసంబంధ మున్న దని మనము మోసపోయి, యిచట ప్రసజ్యప్రతిషేధమే యని భ్రమించుచున్నాము. వాస్తవమున నచట నఞ్నకుఁగ్రియాసంబంధమే లేదు. సమాసమునందు నఞ్ సిద్ధమైన యర్థముతో నన్వయించును. వాక్యమునందు సాధ్య మగు నర్థముతో నన్వయించును. వాక్యమునందుఁ గ్రియ ప్రధానము. అందుచే నఞ్నకుఁ గ్రియతోనే సాక్షా దన్వయముండును. సమాసమునందుఁ

క్రియ గుణీభూతమగుటచే నఞ్ నకుఁ క్రియాన్వయముండదు. ఇట్లు వాక్య సమాసములు భిన్నార్థకము లగుటచేఁ బ్రసజ్యప్రతిషేధ మనునది వాక్యమున నే భాసించును. సమాసమున సమన్వితము గాదు. శ్రాద్ధభోజీ యనునది పర్యుదాసమే యగుటచే నచట సమాస ముండు టన్యాయమే యగును. సమాసమే యుండవలెను. "అసూర్యంపశ్యాః" మొదలగు పదములందుఁగూడ నిట్లే తెలియనగును. అసంరబ్ధవత్ పదమున, సంరంభప్రతిషేధము ప్రధానముగ వివక్షితము. విధిప్రాధాన్యము వివక్షితము గాదు. ఇట్లు, ప్రధానముగ భాసింపవలసిన నిషేధ మప్రధానముగ భాసించుచు, నప్రధానముగ నుండవలసిన విధి ప్రధానముగ భాసించుటచే నుద్దేశ్య విధేయభావము తాఱుమాఱై, విధేయావిమర్శదోషమున కాలవాల మైనది.

వాక్యసమాసములలో నఞన్వయభేదము గల దను విషయము నీక్రింది యుదాహరణమువలనఁ దెలిసికొనవచ్చును.

"భుంక్తే సదా శ్రాద్ధమయం పరాంశ్చోపతాపయేత్ ఇత్య యథార్థ మేవ
సమ్యక్ స్వభావోఽవగతోఽస్యతావన్న శ్రాద్ధభోజీ నప రోపతాపీ",

<u>అర్థము</u>: అయం=ఇతఁడు, సదా—ఎల్లప్పుడును, శ్రాద్ధంభుంక్తే= శ్రాద్ధాన్నమును భుజించును, పరాన్=ఇతరులను, ఉపతాపయేత్ చ= పీడించునుగూడను, ఇతి=అనునీవిషయము, అయథార్థమేవ=అసత్యమే అస్య=ఇతనియొక్క, స్వభావః=తావత్=శీలము, సమ్యక్=లెస్సగా, అవగతః=తెలిసినది. వీఁడు శ్రాద్ధభోజీ న (భవతి)—శ్రాద్ధాన్నమును భుజించువాఁడుకాఁడు, పరోపతాపీ న (భవతి)—ఇతరులను పీడించువాఁడునుగాఁడు.

"శ్రాద్ధభోజీ నభవతి" అను వాక్యమున 'నఞ్' 'భవతి' యను క్రియతో నన్వయించి, క్రియాప్రతిషేధమును దెల్పుచున్నది. ఆ క్రియానిషేధము ప్రధానమును, వివక్షితమునుగూడ నై యున్నది.

ఇఁక,'అశ్రాద్ధభోజీ' అను సమాసస్థలమున, 'నఞ్', "శ్రాద్ధభోజీ, పదముతో నన్వయించుటచే శ్రాద్ధభోజిపదము శ్రాద్ధభోజిభిన్నుఁడును, శ్రాద్ధభోజిసదృశుఁడును నగు 'విఘసాశుని'(యజ్ఞశేషమును, లేక భోజన శేషమును భుజించువాఁడు విఘసాశుఁడు) దెల్పును. ఇట్లు వాక్యసమాస ములకు రెంటికిని భేద మున్న దని తెలియవలెను.

ఈ రెంటిలో "శ్రాద్ధభోజీ న భవతి" అనువాక్యమే ప్రసజ్య ప్రతిషేధమునకు విషయ మగును. అశ్రాద్ధభోజీ ననునది కాదు. అశ్రాద్ధభోజీ యనునదికూడ ప్రసజ్యప్రతిషేధమే యగుచో,నిఁకసమాసమున కును వాక్యమునకును భేదమే యుండదు, సమాసమున కర్థము మన యిష్టమువచ్చినట్లు చెప్పుట కవకాశము కల్గును.

అసంరబ్ధవత్పదమున వాస్తవముగ నఞర్థము విధేయము, ప్రధాన మును. సంరబ్ధవత్పద మనూద్యమానము (ఉద్దేశ్యము) నప్రధానమును- కాని యిట, ఆ "సంరబ్ధవత్పదము,సమాసములో నుండుటచే విధేయము, ప్రధానమునై, వాస్తవిక స్వస్థితికి విపరీత స్థితి నందినది-ఇట్టి యీ సంర బ్ధవత్పదముతో నఞ్ నకు సమాసము చేయుట సదాచారనిరతునకుఁ బతి తునితోఁ గల్గిన స్నేహముతోఁ దుల్యమై సత్పురుషులనిందకు మాత్రమే విషయ మగును.

"నఞర్థస్య విధేయత్వే నిషేధ్యస్య విపర్యయే
సమాసో నేష్యతేఽర్థస్య విపర్యాస ప్రసంగతః"(11-51 సంగ్రహ శ్లోకము)

ఇంతవఱకు సంరబ్ధవత్పదములో నున్న విధేయావిమర్శాదోషము నిరూ పిత మైనది. "సంరంభః కరికీట" అను పద్యయునందే మఱియొక విధేయా విమర్శదోషమును నిరూపించుచున్నాము.

కేవలయచ్ఛబ్ద ప్రయోగము దుష్టము—

"యోఽసౌ" అనునపుడు యచ్ఛబ్దమును మాత్రమే ప్రయోగిం చుటయును సమంజసము కాదు.ప్రసజ్యప్రతిషేధమునందు నఞర్థము విధే

యము, నిషేధ్య మగు నర్థము అనువాద్యము నైనన్లై యత్ తత్ శబ్ద ములలో, యచ్ఛబ్దము అనువాద్యవిషయ మనియు, తచ్ఛబ్దము విధేయ విషయమనియు,శబ్దశక్తి స్వభావము ననుసరించిన యర్థనియమముకలదు. ఈ శబ్దములు రెండును బరస్పరనిత్యసాపేక్షములు. అందుచే నొక వాక్యమును యచ్ఛబ్దముతో నుపక్రమించినపుడు తచ్ఛబ్దముతో సమాప్తిం జేయవలయును. తచ్ఛబ్దముతో (బ్రారంభ మైనచో యచ్ఛబ్దముతో నుప సంహార ముండవలయును. "యత్తదోర్నిత్య మభిసంబంధః"అను వాక్య మీయర్థము నే తెల్పును.—ఈ శబ్దములయుపక్రమోప సంహారములు శాబ్ద మనియు, ఆర్థ మనియు రెండు రకములు, రెండు శబ్దములును ప్రయుక్తము లగుచో నచట శాబ్ద మగు నుపక్రమోపసంహారమున్న దని తెలియవలెను. శాబ్దోపక్రమోపసంహారము.

ఉదా॥ "యదువాచ న తన్మిథ్యా యద్దదౌ న జహార తత్" యత్= దేనిని, ఉవాచ=పలికెనో, తత్ = అది, మిథ్యాన=అసత్యముగాదు. యత్=ఏది, దదౌ=ఇచ్చెనో,తత్=దానిని, న జహార=అపహరింపలేదు- మఱియొక యుదాహృతి—

"స దుర్మతిః శ్రేయసి యస్య నాదరః స పూజ్యకర్మా సుహృదాం శృణోతి యః"

యస్య=ఎవనికి, శ్రేయసి=శ్రేయస్సునందు, ఆదరః, న=గౌరవము లేదో, సఃదుర్మతిః=వాడు దుర్బుద్ధి; యఃసుహృదాం శృణోతి=ఎవఁడు స్నేహితుల (మాట) వినునో,సఃపూజ్యకర్మా=మంచివాఁడు.

ఆర్థ మగు నుపక్రమోపసంహారము—

యత్తచ్ఛబ్దములలో నొకదానిని మాత్రమే ప్రయోగించుచో నది యార్థోపక్రమోపసంహార మగును. అట్టి తావున నర్థబలమువలన రెండవ శబ్దము నూహింతుము. అందులో, తచ్ఛబ్దమును మాత్రమే ప్రయోగించినపు డర్థసామర్థ్య బలమునఁ గల్పింపఁబడు యత్ శబ్దము

ప్రసిద్ధ విషయమునుగాని, అనుభూత మైన విషయమునుగాని, ప్రకాశ్రస్త మైన విషయమునుగాని బోధింపవచ్చును. ఇట్లు కేవల తచ్ఛబ్ద ప్రయోగ విషయము మూఁడు రకములుగ నున్నది.

ప్రసిద్ధార్థ విషయమున కుదాహరణము :—

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం, సమాగమప్రార్థనయా కపాలినః కలాచ సా కాన్తిమతీ కలావతః త్వమస్య లోకస్య చ నేత్ర కౌముదీ.

అర్థము :

కపాలినః = కపాలమే (భిక్షాపాత్రముగా) గల శివునియొక్క సమాగమప్రార్థనయా = సమాగమమును ప్రార్థించుటచేత, సంప్రతి= ఇప్పుడు, ద్వయం=రెండు, శోచనీయతాం=దుఃఖింపఁదగినవి, గతం= ఆయినవి—కలావతః = చంద్రునియొక్క, కాన్తిమతీ – కాంతిగల (యా = ఏప్రసిద్ధమైన కళకలదో) సా=ఆ, కళాచ = కళయు, అస్య లోకస్య = ఈలోకమునకంతకును, నేత్రకౌముదీ=కనులకు వెన్నెలయగు త్వంచ=నీవును.

ఇచట 'సా కళా' యనునపుడు తచ్ఛబ్దమే యున్నదిగాని, దీనికి సరిగా "యా" యను పదము లేదు. కాని శివుని వరించిన చంద్రకళ యనఁగానే, శివుని శిరస్సు నలంకరించు చంద్రకళ యని యందఱకును నర్థ మగును. ఎవరును ఆ చంద్రకళ యేది? యని ప్రశ్నింపరు. అది జగత్ప్రసిద్ధ మగుటయే యిందుకు హేతువు. కావున, తచ్ఛబ్ద సాపేక్ష ముగ నిట నుండ వలయు నని మన మూహించిన యచ్ఛబ్దము ప్రసిద్ధ విషయక మని తెలియుచున్నది.

**అనుభూత విషయక యచ్ఛబ్దము :**

(1) " తే లోచనే ప్రతిదిశం విధురే క్షిపన్తి ".

"చంచల మగు నా నేత్రములను బ్రతి దిశకును బ్రసరింపఁజే యుచు"—వనుటలో, ఏనేత్రముల నిదివఱకు నాయకుఁడనేకపర్యాయ

ము లనుభవించియున్నాఁడో యానేత్రము లని యర్థము—యచ్ఛబ్ద మిచట ననుభూతము లగు నేత్రములను బరామర్శించుచున్నది.

(2) తద్వక్త్రం యది ముద్రితా శశికథాతచ్చేత్ స్మితం కా సుధా
సా దృష్టి ర్యది హారితం కువలయై స్తాశ్చేద్గిరో ధిఙ్మధు
సాచేత్కాన్తిరతస్త్రమేవ కనకం కిం వా బహుబ్రూమహే
యుత్సత్యం పునరుక్తవస్తు విముఖః సర్గక్రమో వేధసః.

అ ర్థ ము :

తద్వక్త్రం, యది=ఆ ముఖ మున్నచో, శశికథా, ముద్రితా= చంద్రుని ప్రసక్తియే అక్కఱలేదు—తత్ స్మితం, చేత్—ఆ నవ్వే యున్నచో, సుధా, కా,=అమృత మేల (అమృతమే నిన్దిత మగును) సా దృష్టిర్యది=ఆదృష్టి (నేత్రము) యున్నచో, కువలయైః, హారితం=కలువలు తిరస్కృతములైనట్లే; తాఃగిరఃచేత్ — ఆ పలుకులే యున్నచో, ధిఙ్ మధు= తేనెతోఁ బనిలేదు; సాకాన్తిఃచేత్=ఆ కాన్తియే యుండుచో, కనకం అతస్త్రమేవ=బంగారము వ్యర్థమే, వేధసః = బ్రహ్మయొక్క సర్గక్రమః=సృష్టిక్రమము, పునరుక్తవస్తువిముఖః ఇతియత్ = చేసినవస్తు వునే చేయుటయైన దని విచారముతోఁ బరాఙ్ముఖ మైనది యను మాట, సత్యం=నిజమే. ఇందు మనకుఁ గావలసిన యంశ మిది—ఈ శ్లోకములో తత్ , సా, మొదలగు తచ్ఛబ్దములే యున్నవి, యచ్ఛబ్దమును మన మూహింపవలయును. ఊహ్యమగు నీ యచ్ఛబ్దము, ఇంతకుఁబూర్వము వక్తచే ననుభూతములైన వస్తువులను పరామర్శ చేయుచున్నది.

ప్రకాన్తవిషయకయచ్ఛబ్దము :—

"కాతర్యం కేవలా నీతిః శౌర్యం శ్వాపదచేష్టితమ్
అతస్సిద్ధిం సమేతాభ్యాముభాభ్యా మన్వియేష సః".

అ ర్థ ము :— కేవలా, నీతిః=రాజనీతి యొకటియే (యాశ్రిత మగుట) కాతర్యం=పిఱికితనము, శౌర్యం కేవలం=కేవలశౌర్యము నాశ్రి

యించుట, శ్వాపదచేష్టితమ్=క్రూరమృగవ్యాపార మగును. అతః=అందువలన, సః=అగ్నివర్ణుఁడనురాజు, ఉభాభ్యాం సమేతాభ్యాం=రాజనీతి శౌర్యములను రెంట నాశ్రయించి, సిద్ధిః అన్వియేష=కార్యసిద్ధి నాశించెను.

ఇచటఁగూడ, తచ్ఛబ్దమే (సః) యున్నది. యచ్ఛబ్దమును మన మూహింపవలయును. ఇంతకుఁబూర్వమే యగ్నివర్ణుఁడనురాజును వర్ణించుటకుఁ గవి మొదలిడినాఁడు. ఆ యగ్నివర్ణుని, ఈ యచ్ఛబ్దము తెల్పును.

ఒకానొకచో నాసందర్భము ననుసరించి యత్, తత్ శబ్దములు రెండునుగూడ నాక్షేప్యము లగుచుండుటచే నది నాల్గురకములుగూడ నున్న దని చెప్పుచున్నారు.

"యేనామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జాన న్తి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ."

అర్థము:—యేనామ=ఎవరైతే, ఇహ=ఇచ్చట సః=మాయొక్క, అజ్ఞానం=తిరస్కారమును ప్రథయన్తి=విస్తరింపఁజేయుదురో, తే, కిమపి జానన్తి=వారికేదియో తెలియును. (1) వారికి బ్రహ్మస్వరూపము తెలియును (2) వారి కేమియును దెలియదు. తాన్ప్రతి=వారినిగుఱించి, ఏషః యత్నః న=నేనీకార్యనిర్మాణ ప్రయత్నముఁ జేయుటలేదు. మమ=నాకు,సమానధర్మా=సమానముగుగుణములుకలవాఁడు,కోఽపి=ఎవఁడో ఉత్పత్స్యతే=పుట్టఁగలఁడు. హి=ఎందువలననఁగా, అయంకాలః=ఈకాలము, నిరవధి=అంతులేనిది. పృథ్వీచ=భూమియును విపులా = విశాలమైనది.

ఇచట మనము గమనింపవలసిన యంశ మిది—"మమ తు కోఽపి సమానధర్మా ఉత్పత్స్యతే" "మంచికాని, చెడుగాని, నాతో సమాన

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

| | | |
|---|---|---|
| 1. | అకారాద్యముద్రితగ్రంథసూచిక | 0-8-0 |
| 2. | అమరుకము-జయంతి రామయ్యపంతులుగారు | 1-0-0 |
| 3. | అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము-అ. ఉమాకాంతముగారు | 0-4-0 |
| 4. | ఆర్యభాషావిభాగము | 0-4-0 |
| 5. | ఆంధ్రధాతుమాల | 1-0-0 |
| 6. | ఆంధ్రసాహిత్య పరిషద్వృత్తాంతము | 0-8-0 |
| 7. | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0-12-0 |
| 8. | ఆంధ్రశబ్ద చింతామణి—ఎలకూచి బాలసరస్వతి | 0-12-0 |
| 9. | అఘునికాంధ్రవాఙ్మయవికాసశైఖరి-జ. రా. పం. | 1-8-0 |
| 10. | ఉత్తరరామచరిత్రము-జ. రా. పం. | 1-0-0 |
| 11. | ఉన్మాదసహస్రము (వెఱ్ఱి వేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0-12-0 |
| 12. | ఉషాపరిణయము—పసుపులేటి రంగాజమ్మ (అచ్చులో) | 1-4-0 |
| 13. | కవిజనోజ్జీవని-సమస్యలు-శ్రీకోటి రఘునాథ తొండమాన్ | 0-4-0 |
| 14. | కవిజనాశ్రయము (అచ్చులో) | 0-10-0 |
| 15. | కావ్యాలంకారచూడామణి— పాఠభేదములు | 0-8-0 |
| 16. | ,, చూడామణి 8-9 ఉల్లాసములు—విన్నకోటి పెద్దన్న | 0-8-0 |
| 17. | కాళిందీకన్యాపరిణయము-అహోబలపతి (ప్రథమభాగము) | 1-0-0 |
| 18. | డిటో (ద్వితీయభాగము) | 0-8-0 |
| 19. | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | 1-0-0 |
| 20. | చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పం. | 1-0-0 |
| 21. | ,, ఋగ్వేదకవి వెంకటాచలపతి (అచ్చులో) | 1-0-0 |
| 22. | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0-8-0 |
| 23. | జ్ఞానప్రసూనాంబికా శతకము | 0-4-0 |
| 24. | జైమినిభారతము-సముఖము వేంకటకృష్ణప్పనాయఁడు | 1-8-0 |
| 25. | జ్యోతిశ్శాస్త్రసారము-కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0-8-0 |
| 26. | నమస్కారములు-కొత్తపల్లి సూర్యారావు | 0-4-0 |
| 27. | నారసింహపురాణము-హరిభట్టారకుఁడు | 1-0-0 |
| 28. | సూత్రాంధ్ర వ్యాకరణము-చిన్నయసూరి | 0-12-0 |
| 29. | నీతిపద్యముక్తావళి-బద్దెన (అచ్చులో) | 0-12-0 |

30 [illegible] — 0-4-0
31 పరిషత్పుస్తక [illegible] 2 వ భాగము — 1-0-0
32 ,, 3 వ భాగము — 1-0-0
33 ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు — 0-12-0
34 బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) — 1-8-0
35 మన్నారు దాసవిలాస నాటకము-రంగాజమ్మ — 0-12-0
36 యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము — 1-0-0
37 రసాభరణము-అనంతకవి — 0-12-0
38 రసార్ణవాలంకారము—ప్రకాశవర్ష కవి — 0-8-0
39 రఘునాథ రామాయణము (ప్రథమభాగము) — 0-12-0
40 రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) — 1-8-0
41 రాయవాచకము-విశ్వనాథనాయని స్థానపతి — 1-0-0
42 రాధికాసాంత్వనము-సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడు — 1-0-0
43 రెడ్డిరాణి రెండు శాసనములు — 0-8-0
44 లక్షణసారసంగ్రహము — 1-0-0
45 విప్రనారాయణ చరిత్రము-చదలవాడ మల్లన — 1-0-0
46 లౌకికన్యాయవివరణము-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు — 0-12-0
47 శతకసముచ్చయము (మొదటిభాగము) — 1-0-0
48 ,, (ద్వితీయభాగము) — 1-0-0
49 శాసనపద్యమంజరి (మొదటిభాగము) — 1-0-0
50 ,, (ద్వితీయభాగము) — 0-8-0
51 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి — 1-4-0
52 షోడశకుమార చరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య — 1-0-0
53 సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య — 0-4-0
54 స్వప్నవాసవదత్త-భాసకృతి కనువాదము — 1-6-0
55 సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు — 1-0-0
56 సింహాసనద్వాత్రింశిక-కొఱవి గోపరాజు — 1-0-0
57 ,, (ద్వితీయభాగము) — 1-0-0
58 శివశాసనసంహిత — 0-8-0
59 ప్రాస్తావిక పద్యావళి — 0-8-0
60 49-వార్షిక [illegible] వ్యాసములు-250 పుటలు — 1-8-0

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

శ్రీ ఏచూరి సీతారామారావుగారు, బి. ఏ.,

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక



దేశభాష లందుఁ దెలుఁగు లెస్స


సంపుటము ౪౪

సంచిక 3

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయ సూచిక

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౪ | మన్మథ సంవత్సరము శ్రావణభాద్రపద మాసములు | సంచిక 3

## సంస్కృతభాష

మన దేశమున సంస్కృతభాష పొందిన యౌన్నత్య మందఱికిఁ దెలిసినదే. రామాయణభారతాదుల దిలకించినవారికి వ్యవహారసిద్ధమని కూడఁ దెలియఁగలదు. ఆనాఁడు దానిప్రభావము కేవలము మన దేశముననే గాక మన చుట్టుప్రక్కల దేశములలలోఁగూడ వ్యాపించెను. మన దేశమున నుత్పన్నములైన సంస్కృత గ్రంథములెన్నో మధ్యాసియాయందుఁ గానవచ్చుచున్నవి. పడమరఁ బారశీకమునను, దూర్పున బర్మాదేశమునను,దక్షిణసయామున(ద్వారవతి)కంబోడియాలో(కంబుజ) అస్సాంలో నున్న సంస్కృత శాసనములఁబట్టి,యాయా భాషలయందలి సంస్కృత పదజాలమునుబట్టి సంస్కృతప్రభావము తెలియనగును.ఇండోనేషియాలో నిప్పటికిని రామాయణభారతాదుల ప్రచార మగ్గలముగా నున్నది. ఈవిధముగా సంస్కృత మానాఁడు అడిగినవారి కెల్ల విజ్ఞానభిక్ష పెట్టి తరింపఁజేసినది.

కాలగతి కుటిలముగదా! మహమ్మదీయుల రాకతో సంస్కృత భాషకుఁ బతన మారంభమయ్యెను. పాశ్చాత్యులు మన దేశమునఁ బాదుకొని యాంగ్లమునకుఁ బ్రాధాన్యమొసంగుటతో సంస్కృతభాష పతన మతిశయించి వారు మన దేశమును విడనాడునప్పటికిఁ బూర్తియయ్యెను. పూర్వము సంస్కృత విద్వాంసుఁడు చిన్నపాఠశాలవంటి వాఁడు. ధనవ్యయములేకయే నాఁడు విద్యాలాభము కల్గుచుండెను. గురుశుశ్రూష యొనర్చి యెందఱో విద్యానిధులై జ్ఞానదీపముల దశదిశల భాసిల్లఁజేసిరి. దేశములో నాఁడు సంస్కృతభాషకు, తద్విదులకు

మును గాంక్షించియే సంస్కృతము నభ్యసించిరి. నేఁ డా గౌరవమం తయు నాంగ్లభాషకు దక్కినది. అది రాజభాష. చదువుకొన్న వారి కింతభుక్తికల్గుచున్నది. ప్రస్తుత మది రాజభాష కాకున్నను రాచకీకము చేయుచున్న వారిభాష యదియే. చిన్ననాఁటినుండియు నింకొక భాషవంకఁజూడక దానిని గష్టపడి చదువుకొన్న వారు చూచిచూచి దానినెట్లు వదలుకొనఁగలరు ? కావున వారింకను నాంగ్లమును బట్టు కొని యూఁగులాడుట న్యాయమే.

స్వరాజ్యము వచ్చినది మొదలు భారతీయులకు దేశభాషలపై దృష్టిమళ్లినది. రాజకీయవేత్తల యనుగ్రహము, దేశభాషల నన్ని టిలో హిందీకిఁ బట్టముకట్టినది. కొన్ని దేశభాషలకంటె, నేఁటికిని వెనుకఁబడి,విజ్ఞానాసంపన్నమైన "హిందీ"ని యావద్దేశభాషగాఁ జేయుట కంటె దేశభాష లన్నిటికిఁ దల్లియై, దేశదేశముల గౌరవముపొందిన సం స్కృత భాషను దేశభాషగాఁ జేయుట లెస్స యని తలంచుట న్యాయ్యము. సంస్కృతభాషాభ్యాసమువలన దేశభాష లన్నిటికి నూత్నవికాసము గల్గుట యొక విశేషము గాదు. ఇందు మన నాగరికత నెఱుంగుట కవ కాశము గలదు, మనచరిత్ర తెలిసికొనుటకు నాధారములు గలవు. విజ్ఞా నము నార్జించుటకు వీలుగలదు. విశుద్ధప్రవర్తనమునకు వెల్లువుగలదు. ఇది యది యన నేల? తుదకు జన్మాంతరించుటకుఁగూడ నిందు మార్గములు గలవు. నూతనభాషావిష్కరణమునకు విధేయమైనవచ్చో విలాసము సంస్కృతమునఁగాక మఱి యేభాషయందుఁ గలను ?

ఈస్థితిగతులఁ బరికించి సంస్కృతభాషావ్యాప్తికై తదభిమా నులు, పరిపరివిధములఁ బ్రయత్నించుచున్నారు. శ్రీ కే. మున్షీగారు సంస్కృతభాషావ్యాప్తికై 'సంస్కృత విశ్వపరిషత్తు' ను బొంబాయి నగరమున నెలకొల్పిరి. ఈసంవత్సరం మాపరిషత్తు చతుర్థవార్షికోత్సవము తిరుపతినగరమున నవంబరునెలలో జరుగఁగలదు. సంస్కృతభాషాభి మాను లెల్లరు నందుఁబాల్గొని దానిని జయప్రదము గావింపవలె ననియు సంస్కృతమును భారతదేశభాషగా సాధింపవలె ననియు నాశించు చున్నాము.

# విజయాశ్వ చరిత్రము

శ్రీయస్వీ. జోగారావు, ఎమ్.ఏ.

కీ. శే. శ్రీ పురాణం పిచ్చయ్యగారొక నెల్లూరు మండలాంధ్రి మహాకవి. క్రీ. శ. 1871—1951 సం॥ల నడుమ నుండినవారు. వీరిది పుదూరు ద్రావిడశాఖ, శ్రీవత్సగోత్రము, ఆపస్తంబసూత్రము. వీరి తలిదండ్రులు సావిత్రీ లక్ష్మీనృసింహులు. తాతముత్తాతలు కేశవకృష్ణార్యులు. ఆ కృష్ణార్యుఁడే రాజాస్థానపౌరాణికుఁడై నేఁటి పురాణంవారి వంశకర్తగా నెగడినవాఁడు. శ్రీ నేలటూరి వేంకటరామార్యులు పిచ్చయగారి గురువు. నేఁడు సుప్రసిద్ధాంధ్ర చరిత్రవాఙ్మయపరిశోధకులైన డాక్టరు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారికిఁ బిచ్చయగారు మేనమామ.

పిచ్చయ్యగారు సహజపాండితీధురీణులయ్యు మహాకవిపదవి కర్హత గలవారు. వీ రనేక యక్షగానప్రాయములైన నాటకములను, విజయాశ్వచరిత్ర మను నొక ప్రబంధమును రచించినారు. ఆ ప్రబంధ మొక్కటి చాలు వారి కీర్తి నాంధ్రవాఙ్మయచరిత్రమున సుప్రతిష్ఠిత మొనర్పుటకు.

బహుధా నవ్యచైతన్యప్రచుర మగు నధునాతన కావ్య ప్రపంచమునందుఁ బురాతన ప్రౌఢప్రబంధగిరాంప్రపన్నాతలగు కవుల రచనలు గలవు. కాని యా ప్రాబంధిక ఫక్కిక ననుసరించి ప్రాచీనకృతి ప్రతిష్ఠల నతిశయించినట్టివి గాని యా చాయలకుఁ బోయినట్టివి కాని మిక్కిలి యరుదు. ప్రాచీనకవులందుఁ జాలమంది మహాపండితులు. వారి ప్రబంధమార్గము క్షుణ్ణము, రానురాను గతానుగతికము నైనది. ఇఁక నీనాఁ డేదో యొక నవ్యత చూపక యా మార్గమునఁ బోయి రసజ్ఞులను

మెప్పించుట కష్టము. ప్రతిభ కొడిగట్టి, వ్యుత్పన్నత సన్నగిలి యల్పపాం డిత్యముతో క్షుణ్ణమార్గమునఁ బోవుట క్షీణయుగలక్షణము. ఆధునిక యుగకవులం దధికసంఖ్యాకులితో౽ధిక ప్రతిభా సంపన్నులు నింతవ్యుత్ప న్నులు. ప్రాచీనపక్షి నాదరించినవారును బ్రతిభాసహకృతముగాఁ దమ రచనలలో యుగసహజముగాఁ గొంతకొంత నవ్యత నుటంకించినారు. అట్టివారిలోఁ బిచ్చయగా రొక రెన్నఁదగినవారు. వారి కావ్య రచనలో సమీచీన మగు ప్రాచీనతయు, ననవద్య మగు నద్యతనతయు గోచరిం చును.

'కలవు మహాకవీంద్రకృతకావ్యము లెన్నిరెయు, నైన నన్నియున్
సలలితభంగి మున్ను గల సంస్కృతమాతృకలం గ్రహించి యిం
పలరఁ దెలుంగు చేయఁబడినట్టివి కావున నిప్డు పూన్కిమై
నలుపుము నే స్వతంత్ర మగు సన్నుతహృద్యనవ ప్రబంధమున్'

అని కవిగారి పూనిక.

విజయాశ్వచరిత్ర మనఁగనే యువనాశ్వకువలయాశ్వబహుళా శ్వాదిరాజ చరిత్రలు స్ఫురించి వానివలె నిదియు నేదో పౌరాణికేతి వృత్త మనిపించును.

'సూతుఁ డిది శౌనకాదిఋషులకుఁ జెప్పె
ననియు నెందో పురాణంబునందుఁ గలుగు
ననియుఁ గొంద ఱీ కథఁ జెప్ప విని రచనకుఁ
బూని తదియ యాధారంబు దీని కగయ'

అని కవిగారే వక్కాణించి యున్నారు. కాని యిది యీ కవిగారి కల్పన యనియే తెలియవచ్చుచున్నది. కల్పనాకథలు కృత్రిమరత్నము లని విశ్వసించు సంప్రదాయవిధేయు లగు పాఠకుల యామోదము నందుట కట్టి యాథార్థ్యము కల్పించుచుటయుఁ బౌరాణికతావ్యంజన మొనర్చుటయు నూత్నకథాప్రియ లగు ప్రత్నపథానుయాయికవుల

పరిపాటి. పింగళిసూరన కళాపూర్ణోదయ విషయమున నట్లే చేసెను. పిచ్చయగారు నా పరిపాటిఁ బాటించిరి.

అసలు మన ప్రబంధములు శబ్దప్రధానములు. అందుఁగథ యాలంబనమాత్రము. కట్టుకథల పిట్టకథల యనిబద్ధకావ్యముల మాట యటుండఁ గథాప్రధానము లైన కావ్యములు కళాపూర్ణోదయము వంటివి లెక్కకుఁ గలవు. అట్టివానిలోఁ గళాపూర్ణోదయముతరువాత, నంతటి నిగూఢనిబిడసన్నివేశసౌభాగ్యము లేకపోయినను గడమగుణముల మున్నెన్నఁదగిన దీ విజయాశ్వచరిత్రము.

విజయాశ్వచరిత్ర కథాసంగ్రహము :

ఇరువురు నిశాచర మిత్రు లొకనాఁటి రేయిఁ గలిసికొని లోకములోఁ దాము కన్న వింతలు ముచ్చటించుకొందురు. అం దొకఁడు శ్రీపురాధిపతి యగు రుచిరాస్యుని పుత్రుఁడు విజయాశ్వుఁ డను లోకోత్తర సౌందర్యవంతుని గాంచితి ననును. రెండవవాఁడు పాండ్యమండల కనకపురరాజధాని శశిబిందుభూజానిపుత్రి యగు యశోవతి యతిలోక సౌందర్యవతి; ఆమె కెవ్వరు నీడు రా రనును. వారల సౌందర్యచర్చపై నా నిశాచరమిత్రులకుఁ బంతములు పడినవి; చివరకు సిగపట్లగోత్రము నకును సిద్ధపడిరి. మఱియొక నిశాచరుఁడు వచ్చి మాయచే నా యిరువుర నొక్కచోటఁ జేర్చి, ఒక రెఱుఁగకుండ నొకరిని లేపినచో నచ్చెరువుపడి యం దెవ్వ రెక్కువ 'బాళిగొందురో చూచి తారతమ్యము నరసి తగవు తీర్చెద ననును. వా రట్లే చేయుదురు. కాని తగవు తెగదు. మూఁడవ నిశాచరుఁడు వా రొకరి కొకరు తీసిపోవువారు కా రని తీర్పు చెప్పును. రాజపుత్రియంతఃపురమున కెత్తుకొని రాఁబడిన రాజకుమారుఁడు స్వస్థానమునకుఁ జేర్పఁబడును. తదుపరి యశోవతి కల ననిరుద్ధుని గన్న యుషాకన్యవలె వాపోవుచుండును. అంతఁ గలభాషిణికడకు వచ్చు మణిస్తంభునివలె నొక సిద్ధుఁ డొకనాఁ డామెకడకు వచ్చి ప్రియునికడ కామెను

గొనిపోఁగల నని నమ్మఁబల్కి తన యోగాశ్వముపైఁ గూర్చుండఁబెట్టి కొని యొక కుటిల నట్టడవిలో దింపును. అట నొక కాళికాలయము గల దా దేవిని బూజించి మఱి పోవుద మని. సిద్ధుఁడు దేవిపూజకుఁ బూలు తేరఁబోవును. యశోవతి అటునిటుఁ దిరుగుచుండ నట నున్న కాళికాలయకుడ్య శిలాప్రతిమ యొక్క టామెను జూచి ఫక్కున నవ్వును. యశోవతి యా వింతఁ గనుఁగొన నటుఁబోవ నా ప్రతిమ తాను హేమ యను నొక యచ్చర ననియు, జటిలుఁ డను నొక ముని శాపమున నశ్మీతి ననియు, కాళికకు బల్యర్థము కపటసిద్ధునిచేఁ గొనిరాఁబడిన రాజకన్యను రక్షించినఁ దనకు శాపమోక్ష మగు ననియుఁ జెప్పి యం దుల కుపాయము నుపదేశించును. యశోవతి యామె చెప్పినట్లు, సిద్ధుఁడు కాళికకు సాష్టాంగ నమస్కారము చేయు మనఁగా నెన్నఁడుఁ దన కా తీరు తెలియ దని యాతనినే చేసి చూపు మని యడిగి యతఁ డట్లు చేయువేళఁ జేరువ నున్న ఖడ్గముఁ గైకొని యతని పీఁక నుత్తరించును. అంత హేమ శాపము తీఱి నిజరూపముఁ బ్రాపించును. తల తెగిన సిద్ధుని కళేబరము మాయమగును. అతఁడు నొక దివ్యాకృతిఁ దాల్చి వచ్చును. యశోవతి యతనియుదంత మడుగును. తాను పుష్కరుఁ డను గంధర్వ కుమారుఁడ ననియు, నలకూబరున కాప్తసఖుఁడ ననియు, హేమ శప్త యైన తరువాత నిందుఁ బంపున జటిలు నాశ్రమమున నున్న రంభను మొదట రంభ యని తెలియక మోహించి యా మునిచేఁ దానును నట్లు శప్తుఁడనైతి ననియుఁ దెలియఁజెప్పును. అంత జటిలుఁడు నట వచ్చి యశోవతి యడిగినమీఁదట రంభా నలకూబరులును దనచే శప్తులు గావ లసి వచ్చిన దని చెప్పును. తరువాత హేమాపుష్కరులు తమ శాపవిము క్తికిఁ గారణభూతురాలైన యశోవతి కభీష్ట మగు ప్రియసమాగమము సంఘటింతురు. యశోవతీ విజయాశ్వులకుఁ గల్యాణ మగును. యశోవతీ పాతివ్రత్యము పొలుపుగా విజయాశ్వుఁడు సత్యవ్రతుఁడై వదాన్యశేఖ రుఁడై కడు విభవముతో రాజ్యము సేయుచుండును. ఇది పూర్వభాగము.

ఉత్తరభాగము: నారదునివలన విజయాశ్వుని ఘనత విని నారాయణుఁ డతనిని బరీక్షింపఁగోరును. నారాయణ నారదులు మాఱువేషముల గురుశిష్యులై విశ్వంభరాగ్నిశర్మ నామములతో నతనికడ కేఁగుదురు. విజయాశ్వుఁడు తన సర్వస్వము విశ్వంభరున కర్పించును. భల్లాణునివలె భార్యనుగూడ నర్పించును. హరిశ్చంద్రునివలె నామె తల తెఱుగుటకును సిద్ధపడును. అప్పుడు విశ్వంభరుఁడు నిజస్వరూపము నిరూపించి యశోవతీ విజయాశ్వులను మీరే జటిలముని శప్తు లగు రంభానలకూబరు లని చెప్పి యిఁకఁ గొంత కాలమునకు సద్గతి నందుదు రని దీవించి యంతర్ధాన మొందును.

ఇందలి కథానాయకున కాకాశవాణి యతఁ 'డశ్వం బారోహించిన నెట్టివారికిని నజయ్యుండై యుండఁగలవాఁడు కావున విజయాశ్వుండని నామకరణం' బొనర్పు టుచిత మని వక్కాణించినది. కాని నామకరణమునకుఁ దగినట్లుగా నాయకు నశ్వారోహణప్రసక్తి పిసరంతయు నీ గ్రంథమున రాదు. అసలు హరిశ్చంద్రకథయందువలె సత్యవ్రత పాతివ్రత్య మాహాత్మ్యము నిరూపించుట యీ గ్రంథపరమార్థము. కాని నలకూబరుని సత్యవ్రత మప్రసిద్ధము. రంభ పాతివ్రత్య మడుగ నక్కఱలేదు. ఆ విషయమున వారిని నాయికా నాయకులుగా గ్రహించుటలో నౌచిత్యము గల దనలేము. వారు దివ్యులుగా నున్నప్పటికంటె మానవులుగా నున్నప్పుడే మహానుభావులైరి. శాపముతో పాటు రూపము మాఱుట కాదు. శీలమున కొక నూత్న మగు నౌన్నత్యము వచ్చినది. రంభ యసలు వేల్పులవెలవెలఁది యైనను నలకూబరునియందనురక్తయే. నలకూబరుఁడు హరిశ్చంద్రునివలె సత్యవ్రత విషయమున నంత ప్రసిద్ధుఁడు కాకపోయినను నబద్ధము లాడినట్లు గానరాదు. అందుచే నట్టివారిని నాయికానాయకులుగా గ్రహించుటలో నంత యాక్షేపణ లే దనియే చెప్పవచ్చును.

ఇందుఁ గవి తానై కథ చెప్పిన పట్టులు తక్కువ. కథాకల్పన మునకంటెఁ గథన శిల్పమున నాటకపువైపు వాటము లెఱిఁగిన నైపుణి ప్రదర్శించెను. ప్రతిసన్నివేశమును నందందుఁ బాల్గొను పాత్రల హృదయంగమ ప్రసంగములతో నాటకీయముగా నడిపించెను. అస లాశ్వాస విభాగమే నాటకీయముకా నున్నది. ఇందలి పాత్రలు చర్మపుత్రికల వంటి శ్రవ్యకావ్యపాత్రలవలెఁ గాక నాటకములోని నటకులవలె మెలఁగును. కవి బహునాటకకర్త యను సంగతి మనము జ్ఞప్తియందుంచుకొనవలె. ఆపాత్రపోషణము-కాదు-చిత్రణము కడుఁ జక్కఁగఁ సాగినది. పాత్రపోషణమునకుఁ జిత్రణమునకు నొక యంతరవు గలదు. ప్రసిద్ధేతివృత్తము లగు కావ్యములందుఁ బాత్రలప్రవృత్తులు సమయబద్ధములు. అట నా సమయముల (Conventions) కనుగుణముగా నాపాత్రల స్వరూపము నావిష్కరించుటయే పాత్రపోషణము. ఉదా: రాముఁడు ధీరోదాత్తనాయకునిగాఁ బ్రసిద్ధుఁడు. ఈ నాఁడు రామకథను గ్రహించిన కవి యతనిధీరోదాత్తత నా సమయబద్ధముగా నిరూపించినయెడల నది పాత్రపోషణము. కాని ప్రసిద్ధపాత్రలనే కవి యొక ప్రయోజన మాశించి సమయమున కన్యథా తత్స్వరూపమును నిరూపించినచో నది చిత్రణము. ఉదా: శకునిదుష్టచతుష్టయమున కనిష్ఠికాధిష్ఠితునిగాఁ బ్రసిద్ధుఁడు. అతని నొక కావ్యమున సజ్జనుఁ డని సమర్థింపఁగలిగినచో నట నా పాత్రకుఁ బట్టిన యోగము చిత్రణ మన్న మాట. ఇఁక నుత్పాద్యేతివృత్తములం దంతయుఁ గల్పన గావునఁ బాత్రచిత్రణము నకుఁ గవికిఁ గావలసినంత యవకాశ ముండును. అటఁ గవి తా నాశించిన ప్రయోజనముల కున్ముఖముగా నాపాత్రలను మలఁచినచో నదియే చిత్రణము. పాత్రపోషణమునందుఁగంటెఁ జిత్రణమునఁ గవికి నేర్పెక్కువ కావలె. విజయాశ్వచరిత్రమునందలి యితివృత్త ముత్పాద్యము కదా! నాయికానాయకులు ప్రసిద్ధులైనను నిందువారిగుఱించి కొం

గోత్ర సంగతులు వినవచ్చినవి. కపటసిద్ధుఁడు మహేస్తంభునివంటివాఁడే యైనను సచ్చికబుచ్చికలాడుటలో నతనికంటె ఘనుఁ డనిపించుకొనినాఁడు. విశ్వంభరోగ్రశర్మలు విశ్వామిత్రనక్షత్రకుల గోత్రమునకుఁ జెందినవా రైనను, వారు ధనముచు గొని మనుష్యులను విడిచిరి, వీరు విజయాశ్వనైశ్వర్యము నిలువుదోఁపిడి దోఁచి యతనికి నతనిసతికిని గతి నము లగు కట్టడులు చేసిరి. ఇఁక జటిలుఁడా! ఆతనితపఃపటాటోప మప్సరసలతో సరస మాడుటకే; అతనికోపము శాపములకే. ఈకథా ప్రవృత్తి కతఁడే కీలకము. ఇవి ముఖ్యపాత్రలు. చక్కఁగాఁ జిత్రింపఁబడినవి. కడమపాత్రలు హేమాపుష్కరులు, మిత్రరాక్షసులు వారివారి స్వభావముల కనుగుణముగఁ బోషింపఁబడిరి.

కొన్ని సన్నివేశములు: కథకు సన్నివేశము జీవగఱ్ఱ. అది యెంత నాటకీయముగ నున్న కథ కంత రక్తి. ఈ కథ యంతయుఁ దాదృశసన్నివేశ ప్రధానముగనే నడచినది. ఆ సన్నివేశ విశేషము లన్నియు వివరింపఁబోయిన గ్రంథము పెరుఁగును. కొలఁది విషయములనిం చుక తడవి చూపుదును. 1. మొదటిది యశోవతీ విజయాశ్వుల సౌం దర్య విషయము రాక్షసులు చర్చించుట. వారి సౌందర్య మిట్లుండు నని వరుసగా నొక వందపద్యము లేకరువుపెట్టి వర్ణించుటకంటె నిట్లు పాత్రాంతరములచేఁ జర్చకు దింపుట కథాశిల్పములోని యొక గొప్ప మెలఁకువ. అదిగాక యిందలి యా నాయికానాయకులు సామాన్యులు గారు కదా! అందమునకు వారిది పెట్టినది పేరు. అందును నసురులచే నగ్గింపఁజేయు టొక విశేషము. రాక్షసులు సహజముగా నంత సౌందర్య తృష్ణ గలవారు కారు. ఎంతో యిఁక భరింపరానంత సౌందర్యమైనఁ గాని వారి నాకర్షింపదు. 2. తరువరి నాయికానాయకుల ప్రథమసమా వేశ మొక వింతైన సన్నివేశము. అప్పటివారి యచ్చెరువు, తొలిచూ పువలపు, చెప్పనలవి కాదు. ఆ మఱునాఁడు యశోవతి యంతఃపుర పాలి

కలను రాత్రి జరిగిన సంగతిగూర్చి గద్దించి యడుగును. వా రది కల యని నిర్ధారణచేయుదురు. ఆమె కల కా దని నిదర్శనముగా నారాచ వాని కంఠహారము చూపి 'ఇదియును స్వప్నములో లభించెనో !' అని మఱల గద్దించును. వారలు వెలవెలఁబోవుదురు. అది యొక చిత్ర మైన సన్నివేశము— అద్భుతరసావహము. ౩. జటిలు నాశ్రమమున నున్న రంభ నామె రంభ యనియుఁ, దన కాప్త సఖుఁ డగు నలకూబరుని ప్రియురా లనియుఁ దెలియక మోహించి శప్తుఁ డైన పుష్కరుఁడు నలకూబరునితోనే తన శాపవృత్తాంతముఁ జెప్పుకొనుట యొక సున్నితమైన సన్నివేశము. 4. విజయాశ్వనికడ విశ్వంభరుని కాపట్యవిజృంభణ మొకటి దీర్ఘముగా సాగినది. త్రివిక్రమునివలె నతనిసర్వస్వము నాహరించినాఁడు విశ్వంభరుఁడు. అతని ధర్మపత్నినే ప్రతిగ్రహించినాఁడు. ఆమెతో నతని సమావేశముహృదయము నుదిలగొను ఘట్టము. అతఁడేదో యొకనెపము వెట్టి తప్పు లెన్నువాఁడు. విశ్వంభరుఁడు కడు ముదుకఁడు, 'కొకిబికి లైన దంతములుఁ గొంకిరిపోయిన కాళ్లు వాఁడి గోళ్లుఁ జూ, డ్కికి వెగ టైన యెమ్ములును- గిల్లిన నెత్తుకు లేని దేహముఁ ।వికృతపురోమముల్, వడఁకు వేసటయున్, ముదికంపు, కాసలోనికిఁ జనినట్టి కన్నులును' ఇది యతనివాలకము. చెలు లెంత వల దని చెప్పినను వినక మగనియాశ మానక యతని కడ కేఁగినది యశోవతి. అతఁడు నిద్ర నభినయించుచుండెను. అపు డామె 'కూరుకుఁ జెంది యున్నపుడు గొబ్బున మేల్కొనఁ జేయు టెంత యు న్నేరము ... మిన్నకుందునో। చేరువ కేఁగి లేపుదునా, చీరిన నెవ్విధి కోపగించునో" వల దని యున్న లేచి కని వచ్చినదానవు వచ్చినప్పుడే । దెలియఁగ మేలుకొల్పఁదగదే యని నాపయిఁ దప్పుఁ బూన్చి తా నలుక వహించునో' యని కొంకుచునే సెజ్జపట్టున కింత చేరినదో లేదో —

'తటుకున మేలుకొల్పినవిధంబున నై సడలంగ నీల్గి తా
నటునిటు శయ్యపైఁ బొరలి యల్లనఁ గన్నులు విచ్చి యంగుళు
ల్చిటచిట నెట్టిక ల్విఱిచి చేతులుఁ గాళ్లు విదిర్చి లేచి యం
తట నతఁ డావులించి కనెఁ దచ్ఛయనాగ్రతలస్థఁ గోమలిన్'
'కని కినిసి పండ్లు గీటుచుఁ
గనుదోయిని నిప్పు లొలుకఁగా భీతిలు లా
గున నార్చి యశోవతిపైఁ
దన యధికారంబు నెఱపఁ దలఁచి యుదయుఁడై'
'ఆజ్ఞ గొనక శయ్య నంటఁ దగునె' యని
'ఈ సౌధంబున నిట్లలంకృతులు నీ శృంగారముల్ చిత్రముల్
వీసంబుం గొఱగాని వాసనలు దివ్వెల్ గిన్నెలీ యందముల్
మా సంపత్తికి లోటు వచ్చునని యేమాత్రంబు యోజింపవా!
రా, సంసారుల కిట్టి వైభవము ఘోరం బాడియే చెప్పుమా!!
'ఈ కార్యంబుల నేమి లాభ మయయో యిబ్భంగి నా విత్తముల్
బోకార్పం దలపెట్టు టేల? ఇది యింపో పెంపో యే మానాకో
నాకుం దోఁచఁగ లేదు నీదుమత మన్యాయంపు గా జెప్పెదిన్
నీకున్ బోధనఁ జేసి పంచెనో ననున్ నిర్భాగ్యునిం జేయఁగన్'
'సీ! పొగరు నడంచి నీ మగని బూని మేకుఁగఁ జేతుఁ జూడుమీ!
"ఆలరి వృద్ధుఁ డీ ఖలున కంగనయౌ కొఱ? పుట్టి ముగ్గైనా
వైళమ బోవకున్న? పయివచ్చిన దేమియు లేదు; ఇంతలో
బాళి సహింపలేఁడొ! యని భక్తియు రక్తియు వీడి యుండి యీ
వేళకు మెల్లఁగాఁ బరిభవింపగ వచ్చితివే ననుం బళీ!"

అని మొక్కబట్టున ఝుణాయించినాఁడు విశ్వంభరుఁడు. తరువాతఁ దల్పముక్రిందఁ దానే దాఁచిన యొక కత్తి తీసి 'నను ... ఖండింప దీనిని నీవే యునిపించియుందు' వని యామెపై నేరము మోపెను.

ఆమె తా నే పాపము నెఱుఁగ నని వాపోవుచుండఁగా నది సరే కాని నేను మును శివునివలనఁ బొందిన యొకానొక వరముప్రకార మిపుడు నీచే ఖండింపఁబడితినేని వెంటనే యౌవనవంతుఁడ నగుదు ననెను. ఆమె ననేమిరా యని తెనవల్లఁ గా దనెను. అతఁడు తానే తలఁ దఱుగుకొనుటకు సిద్ధపడెను. అంతట నామె యెట్లును దప్పదుగదా యని, అతని మాట యథాక్షరముగాఁ బాటింపు మని మగనియాజ్ఞ కదా యని విధిలేక తానే యతనితల ఖండించెను. అంతవిశ్వంభరుఁడు "ఆ నారీమణి యవ్విధంబున నిజాజ్ఞాధీనయై చరింప, నుగ్రా నేఁ జచ్చితిఁ జచ్చితిం జెవికి నన్ ఖండింపఁగాఁ బూనె రమ్మా న న్గావుమ యంచుఁ జచ్చునపు డా మూర్ఛిచుఁ దెట్లార్చెనో। తా నా లక్ష్మణుఁ జేరి, యట్లటచి యంతం గ్రింపఁ గూలెఁ 'వెపఁ' మఱి లేవలేదు. అది గురుశిష్యు లిరువురు నిదివఱకే చేసికొనిన యేర్పాటు. వెంటనే యుగ్రుఁ డింతంతనరాని గల్లంతు చేసెను. అప్పు డా మొగసాలకావలి గాయుచున్న విజయాశ్వుఁడు రయమున వచ్చి యుగ్రునివలన జరిగిన యుదంతము విని తా నుగ్రుఁడై భార్యను జంప నుంకించెను. అంత విశ్వంభరుఁడు నిజస్వరూపమునఁ బ్రత్యక్ష మయ్యెను.

కథ యద్భుతముగాఁ బ్రారంభింపఁబడినది. అద్భుతముగా నంతమైనది. నడుమను నద్భుతరసమ్మునకు వలసినంత ప్రసక్తి గల్గినది. కావున నిందలి యంగిరస మద్భుత మగునా ? అంగిరస నిర్ణయ మాధికారికేతివృత్త పర్యవసానమునుబట్టి యుండును. ఉదా: మహాభారతము నవరసభరితమయ్యు శాంతరసప్రధాన మైన దని యార్యులమతము. అట్లే చూచినచో విజయాశ్వచరిత్ర మద్భుతరసపర్యవసాయి కాబట్టి యది యద్భుతరస ప్రధాన మైన దనియే యనవలసివచ్చును. కాని యిందలి పూర్వోత్తరభాగములు రెండును రెండు ప్రత్యేకకథలవలె నున్నవి. ఉత్తరార్థకథ పూర్వార్ధపరపేక్షముగ సాగిపోయినది అందుచే నేభాగ

ముస కా భాగమునకే రసనిర్ణయము చేయుట సమంజసము. పూర్వార్ధము శృంగారసారాంశ మగు నాయికానాయకుల సౌందర్యప్రశంసతోఁ బ్రారంభమై వారి సంగమముతో నంతమైనది. ప్రాసంగికేతివృత్త మగు జటిలోపాఖ్యానమునందును శృంగారముగలదు. కావునఁ బూర్వార్ధమందలి ప్రధానరసము శృంగారము. అద్భుత మంగము. ఉత్తరార్ధమున శృంగారపుటుబు సాక్కింతే పుట్టినది కాని యట నది రసస్థితికి రాలేదు. విజయాశ్వుని దానవీరము ధర్మవీరము బాగుగనే ప్రదర్శింపఁబడినవి. కరుణము పొడసూపినది కాని యంతమున నాకస్మికవిష్ణుసాక్షాత్కారము, నాయికానాయకాదులజన్మరహస్యములుఁ దెలియవచ్చి యచ్చెరువు గొల్పుటఁ జూడ నద్భుతమే యుత్తరార్ధాంగిరస మనవచ్చును.

రచన: నెల్లూరిసెటిజాణ తిక్కనగారిలేఖినిపోకడ యొరవడిగాఁ దీర్పఁబడినది, పాత్రిబంధికము లగు వర్ణనములును బలుకుబళ్లును గలవు-కాని 'ముక్తసరి'గా. స్తుతులందు నాశ్వాసాంతములందుమాత్రమే గర్భబంధాదిచిత్రకవిత్వపుకసరత్తు. వర్ణనలందే యింత యనుపాత్రిసప్రచురమైన రచన. కడమగ్రంథ మంతట (అసలుగ్రంథమునఁ బద్యములు రెండువేలపైచిలుకు. ఆపైచిలుకుపోను) నిరాడంబరము, ధారాళము నై సార్థకముగా సాగినది రచన. ఆలంకారికముగాఁ జెప్పవలె నన్న వైదర్భీరీతి, కైశికీవృత్తి, ప్రసాదగుణము, ద్రాక్షాపాకము నిందలిరచనకుఁ బ్రధానలక్షణములు.

> 'ఎక్కుడు తత్సమోక్తు లెనయింపక దీర్ఘసమాసకల్పనల్
> దక్కి విశేషవర్ణనల దవ్వానరించి నిగూఢశబ్దముల్
> పిక్కటిలంగనీయక నవీనముగాఁ గనుపట్టుభంగి నే
> నిక్కృతి సల్పి వేంకటగిరీశ్వరునిం దదధీశుఁ జేసెదన్'.

ఇది యీ కవిప్రతిజ్ఞ. యథాక్షరముగా నిర్వహింపఁ బడినది. అస లీ పద్యమునందే శబ్దార్థము లెట్లు పొందుపొసఁగి యున్నవో గ్రంథ మంతట రచన యట్లే యున్నది.

గ్రంథమునం దలఁతియలఁతి దోషము లటనట లేకపోలేదు. కాని యింతటి యుత్తమకావ్యమునుండి యెత్తి చూపింపఁ దగినంతటివి కావు. యన్వేషింపవలయును. చూడుఁడు కవిగారి వాక్యములు:

'ఇలను మహాప్రవీణు లన నెన్నిక కెక్కిన కాళిదాస ము
ఖ్యులు సయితంబు దాము జనకోటికి నెల్ల మనఃప్రియంబుగాఁ
బలుకఁగలేకపోయిరఁట! పండితసంతతి తృప్తిఁ జెందఁగాఁ
బలుకుట కింక నా తరమె పావనుఁడన్ రహితావధానుఁడన్'
'ఐనను వేంకటేశ్వరదయాపరిలబ్ధ కవిత్వధార నా
లోన నడంపలేక కవిలోకము మెచ్చిన మెచ్చకున్న నే
మైనను నయ్యెనం చిటు మహాకవియుంబలె యీ ప్రబంధముం
బూని రచించినాఁడను; అపూర్వమనోగతచాపలంబునన్'
'ఇది చదివిన మఱియొక కథ
మది కింపుగఁ దోఁప దెట్టి మనుజున కైనన్
ముదమున రేలుంబవళులు
వదలక యిదె తలఁచుచుండవలయుఁజుండీ'

తుదిపద్యమునఁ బ్రకటింపఁబడిన కవిగారి యాత్మవిశ్వాసము ప్రశంసనీయ మైనది. ఇది పండితప్రకాండులు శ్రీయుతులు వేదము వేంకటరాయశాస్త్రిలుగారికి,దుర్భా సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారికిని గడుఁ బ్రియము గొల్పిన కావ్యమఁట. ఈ యిరువదవశతాబ్దియుత్తమకృతులలో నిది యొకటి యని నిక్కచ్చిగా వక్కాణింపవచ్చును.

---

# ఆంధ్ర గేయ వాఙ్మయము.

శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి M. A.

ప్రతిభావ్యుత్పత్తు లాధారముగఁ గల్పనావైశిష్ట్యముతో సహృదయ హృదయంగమముగ రసపరిపుష్టి గావించు వచస్సమూహమే వాఙ్మయము. అందు, మేధాశక్తి సంయతమును, సంభావితమునై తంత్రీలయసమన్వితమైన భాషలో భావోజ్జృంభణముగ మనోహరముగ, నుత్కృష్టముగ వ్యక్తీకరింపఁబడినచో నది కవిత్వము. ఆంధ్రకవిత్వము నాల్గు విధములుగ విభాజ్యము. ఆశు, మధుర, చిత్ర, విస్తరములను భాగము లవ్వి. మార్గ, దేశి యను నింకొక విభాగమును ప్రచారమున నున్నది. మధురకవితాశాఖకు దేశియు, మిగిలిన శాఖలకు మార్గయు సంబంధించినవి. తంత్రీలయ సమన్వితత్వ మనునది గానాంశము. ఇది ప్రధానముగాఁ గలిగినది 'గేయము. గాతుం యోగ్యం గేయమ్'. ఈ గానాంశమును గర్భమునం దిముడ్చుకొని మిగిలిన కవితాగుణములను జూచాయగాఁ గలిగినది పదము. గానాంశమును లెక్కచేయని కవితాగుణముల ప్రోగు పద్యకవిత. కనుక గేయమును, పదమును, పరస్పరసంబంధము గలవి గనుక రెండింటిని బదకవిత్వ మనవచ్చును. అపుడు కవితాశాఖలు రెండగును. పద్యకవిత, పదకవిత. ఈ రెండును రెండు ప్రయోజనముల నాశించి ప్రాదుర్భవించినవి. విద్వల్లోకము నలరించి, సారస్వతప్రతిష్ఠ సంపాదించి, యుగములతరబడి స్థిరత్వము నంది మార్గదర్శియగునది పద్యకవిత. పామరజనానందప్రతిపాదియై గానాంశమాత్రముగాఁ గలిగి తనయస్తిత్వమును నిలుపుకొనుటకు యత్నించునది పదకవిత. ఇది కేవలము లయనియమబద్ధము. అధికనియమవంశము చేసి దీనికిఁ బద్యకవితతోఁ దౌల్యము నేర్పఱచుటకుఁ జేసిన యత్నమే ద్విపదకావ్య విరచనము.

మార్గ, దేశి, విభేదముల ననుసరించి పదకవిత దేశీయము, అనఁగా మధురకవితాశాఖకుఁ జెందినది. ద్విపదను వదలినచో గానప్రధాన మైన రచనయే మిగిలి గేయకవిత యగును. ఈ గేయకవితను నెనిమిది విధములుగ కీ॥ శే॥ వంగూరు సుబ్బారావుగారు విభజించిరి. 1. కృతులు. 2. కీర్తనలు. 3. మంగళహారతులు. 4 ఏలపాటలు. 5. తత్త్వములు. 6. చూర్ణికలు 7. జావళీలు. 8. హరికథలు. (కవిత్వవేది) మొదటి రెండింటిని నటుంచి మిగిలినవానిని బరిశీలింతము. మంగళహారతు లనునవి స్త్రీలపాటలు. అందుఁ గేవలము మంగళహారతులే గాక, నోములపాటలు, జోలపాటలు, తలుపుదగ్గఱపాటలు, మేలుకొల్పుపాటలు, పాన్పుపాటలు, బొమ్మపాటలు, తలంటుపాటలు, తలంబ్రాలపాటలు, దంపుడుపాటలు, తిరుగలిపాటలు, ఇత్యాదినానావిధములైన స్త్రీలు పాడుపాట లన్నియు నందుఁ జేరును. ఈ విధములైన పాటలను శ్రీ నందరాజు చలపతిరావు మొదలైనవారు సేకరించి ముద్రించినారు. ఏలపాట లనునవి సవిలాసముగా యువకులు కూనరాగము దీయుచుఁ బాడుకొను శృంగారాన్వితము లైన పాట లని, కదిరీపతి వ్రాసిన శుకసప్తతిలోని "వీథి నేఁగెడు ప్రౌఢవిటుఁడు పాడెడు వింత యేలపదా లట్టె యాలకించు"(సూర్య. ని)అను పద్యములవలన నూహించుటకు వీ లగుచున్నది. తత్త్వములు వైదాంతికములు. యాథార్థ్యప్రబోధకములు. యాథార్థ్య మనఁగా బ్రహ్మపదార్థము. పోతులూరి వీరబ్రహ్మముగారి రచనలు తత్త్వములే. అందు సాంకేతికత యధికము రసభావములకు స్థానము లేదు. చూర్ణికలను జూర్ణకము లనియు నందురు. ఇది వచనరచనాభేదమని గీర్వాణాలంకారికుఁ డైన వామనుఁడు పేర్కొనెను. తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు దీనిని గ్రహించి 'తాళగంధిచూర్ణకపదము'లని పదకవితలోఁ జేర్చి వ్రాసెను. ఇవి విరక్తభావమును సూచించు పదములు. జావళీ లనునవి కేవల శృంగారాన్విత

ములు. దాసు శ్రీరామకవిగారు జావళీలు వ్రాసిన వాలమందిలో ముఖ్యులు. హరికథ లనునవి నేఁటి మనకును సుపరిచితములే. ఏకపాత్రి చేతఁ బ్రయోగింపఁబడు నాటకమువంటి దీ హరికథ. భగవంతుని విలాస క్రీడలను రాగతాళాభినయములతోఁ బ్రదర్శించుట కను వగు రచన హరికథ. నేఁడు కాంగ్రెసు హరికథ, గాంధీహరికథ మొదలైనవి పుట్టినవి. ఈ హరికథతోపాటు బుఱ్ఱకథను, జంగంకథను గ్రహింపవచ్చును. ఈ మూఁడును పామరజనోపయోగమునకే యుద్భవించినను హరికథ యనునది పైస్థాయిలో నున్నట్లు కనుపించుచున్నది. ఇఁక మిగిలినవి కృతులు-కీర్తనలు. 'కృతు లనుట తోడనే శ్రీ త్యాగరాజు స్మృతికిఁ దగులుచున్నాఁడు' అని 'కవిత్వవేది'. ఈ యభిప్రాయముతో సుబ్బారావుగా రట్లు విభజించియుందురు. కాని దేశమునఁ ద్యాగరాయకృతులని యెంత వ్యవహార మున్నదో త్యాగరాయకీర్తన లనియు నంత యున్నది. కృతి యను శబ్దమునకు గ్రంథ మను నర్థమే రూఢము. కీర్తన యనఁగాఁ గథనము, స్తుతి యను నర్థము లున్నవి. ఇట్టి విశేషార్థము కృతికి లేదు. కనుకఁ గృతి యనునది యొక విశేషాంశముగాఁ బేర్కొనకుండఁ గీర్తన యనుటయే చాలు ననియు, సమంజస మనియు నా యభిప్రాయము.

కీర్తనయందు విషయకథనము, ఎదిరి స్తుతియు నుండవలసిన గుణములు. ఈ రెండింటిని నిముడ్చికొని ప్రాచీనములై మనకు లభించినవి కృష్ణమాచారి సంకీర్తనములు. సింహగిరి నృసింహస్వామి వారి నుద్దేశించి చేసిన ప్రార్థనము లవి. వానికి సింహగిరి నరహరివచనము లనియుఁ బేరు గలదు. భక్త్యావేశముతోఁ గూడిన విషయకథనము, అనఁగా స్వామివారిచరిత్రి చెప్పుట, కృష్ణమాచారి రచనయం దధికము, అదియే స్తుతియందుఁ బర్యవసించును. వానినడకనుబట్టి చూడఁగ వానిని వచనము లనుటయే యుక్త మనిపించుచున్నది. అనఁగా గానాంశము

చాల తక్కువ యనుట. తరువాతఁ జెప్పఁదగినది తాళ్లపాక అన్న మాచార్యునివి. ఇతనివి నిజమైన కీర్తనలు. ఇతఁడు విష్ణుభక్తుఁడు. ఇతని కీర్తన లన్నియుఁ దిరుపతి వేంకటేశ్వరస్వామివారికి సంబంధించి నవి. ఇతని కీర్తన లన్నియు నేఁడు లభింపవు. లభించిన వానిలో స్తుతి యంగి. కథన మంగము. ఈ కీర్తనలయందు భక్త్యంశ మెంత యున్నదో, శృంగారాంశ మంత యున్నది. రెండును భగవంతునియందే యైక్య మగును. తరువాతివాఁడు తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు. ఇతఁడు రచించినవి వేంకటేశ్వర వచనము. కృష్ణమాచారివలె వచన ములు వ్రాసినాఁడు. వీనికి 'వైరాగ్యవచనమాలికా గీతము'లను పే రున్నది. వచనములే యయ్యును సంగీతాంశ మధికముగ నున్నట్లు మన మందువలన గ్రహింపవచ్చును. ఈ గీతములం దధికముగా వేదాం తము, పరమార్థము, శరణాగతి మున్నగునవి నవదరింపఁబడినవి. ఇతఁడు శృంగారసంకీర్తనలు, శృంగారదండకము, అధ్యాత్మ సంకీర్తనలు మొదలైన యితరకృతులనుగూడ రచించెనఁట. అటుతరువాతఁ బ్రసిద్ధి చెందినవాఁడు క్షేత్రయ్య. ఇతఁడు వ్రాసినవి పదములుగా వాడుకలో నున్నవి. ఇందు శృంగారభావవ్యక్తీకరణ మధికము. ఇవి యభినయాను కూలములు. శ్రీ విస్సా అప్పారావుగారు "క్షేత్రయ్యపదములు" అను గ్రంథమును బ్రకటించినారు. ఈ పదములను బ్రచారములోనికిఁ దెచ్చి నది వారే. నటరాజ రామకృష్ణ యీ పదముల నభినయించుచు దేశ సంచార మొనర్చినారు. ఒనర్చుచున్నారు. సంగీతమునకును, అభిన యమునకుఁ దగినవి యీ పదములు. తరువాత వచ్చినవి త్యాగరాజు కీర్తనలు. ఇం దంతయు భక్త్యంశమే, గానయోగ్యమే. అన్నమయ్య శృంగారసంకీర్తనాంశ మిన్నూఱేండ్లతర్వాత క్షేత్రయ్యగాను, అధ్యాత్మ సంకీర్తనాంశ మటుతర్వాత నూఱేండ్లకుఁ ద్యాగయ్యగాను నవతరించె నను కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాక్యము సమంజసముగా

నున్నది. రామదాసు కీర్తనలును నీ సందర్భమునఁ బేర్కొనవలయును. ఈకీర్తనలయందు భక్తి, దైన్యము, నిరసన, ముప్పేటగాఁ బెనవేసికొని భగవంతునియందు లీన మగు గుణవిశేష మొకటి యున్నది.

ఈ భక్తి, శృంగారగేయములతోపాటు వీరగేయములును గొన్ని యున్నవి. వానిలో ముఖ్యములు బొబ్బిలికథ, దేసింగురాజుకథ, కాటమరాజుకథ, కామమ్మకథ, చెన్నపరెడ్డికథ, గాంధీపదము మొదలైనవి. వీనియందుఁ గథాకథనము ముఖ్యము. దేశీయమును స్థానికమును నైన యభిమానమును రేకెత్తించు గుణ మీ గేయములం దున్నది. ఈ గేయవాఙ్మయమున స్తుత్యంశముకంటెఁ గథాకథనాంశమే మిక్కుటముగా నున్నది. సుబ్రహ్మణ్యకవి విరచితమైన యధ్యాత్మరామాయణము, ఇతరుల లక్ష్మణమూర్ఛ, కుచ్చెలకథ, లంకాయాగము, ఊర్మిళనిద్ర, పాటలభారతము, ఇత్యాదు లన్నియుఁ గథనప్రధానములే.

నేఁటికాలమున జానపదవాఙ్మయ మనుపేర నీ జాతిరచన లధిక ప్రచారమున నున్నవి. వీనిని సేకరించి ప్రచార మొనరించువారిలోఁ బ్రముఖులు శ్రీ నేదునూరి గంగాధరము, శ్రీ ఓకుమళ్ళ కామేశ్వరరావు, శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ బి. రామరాజు, శ్రీఎట్లూరు మాధవాచార్యులు, శ్రీ తూమాటి దోణప్ప, శ్రీహరి ఆదిశేషు మొదలైనవారు. జానపదవాఙ్మయ పరిశీలన మనునది వాఙ్మయజిజ్ఞాసువునకు నేఁడొక కొలమానము.

ఈ గేయవాఙ్మయమున గానాంశమే గాని, కవిత్వాంశ ముండదనియు, ఈ గేయము పామరులకేగాని, పండితులకుఁ గా దనియునందే వ్రాసియున్నాను.నియతము కాకపోవుటచేత గేయములు విరివిగాఁ బుట్టుచుండును. ఈ రచనకు భాషాపాండిత్య మక్కఱలేదు. భావౌన్నత్య మక్కఱలేదు. అనువుగా నోటికి వచ్చినట్లు పామరుఁడు పాడుకొనుపా

టయే గేయము. ఇది నిరసన గాదు. యథార్థము. అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగరాజు మొదలైనవారి రచనలలో భావుకత లేకపోయినను, భక్తి, సుష్ఠుత కలిగిన భాష, యున్నవి. అవి గానముకొఱకే యేర్పడిన వగుటఁ గొంత పరిచారములో నున్నవి. భక్తి విషయమునఁ బండితపామరులకు భేదము లేదు. గానము సర్వజనసేవ్యము. కనుక నీ రెండింటిని నిముడ్చుకొనినందున వారి గేయము లుచితపరిచారమున నున్నవి. సంగీతవిద్వాంసుఁడు రాగ మాలపించి పాడినపుడే యీ గేయములు ప్రాణవంతము లగును. ప్రతిభావమును వ్యక్తముచేయుటకు భాష యవసరము. సంగీత మాలపించవలయు నన్న భావమును వ్యక్తము చేయుట కెంత భాష యవసరమో యంతమాత్రమే యీ గేయములం దున్నవి. ఆ గేయము లాధారముగా మనము సంగీతము నాస్వాదింప వలయునేగాని కవిత్వ మాశింపరాదు. కనుక గేయములు వాఙ్మయమునఁ జేరఁగలవుగాని కవిత్వమునఁ జేరవు.

ప్రతివాఙ్మయమును మొదట గేయరూపముననే యుద్భవించి తరువాతఁ గ్రమోన్మీలనము చెంది పద్యకవిత పెంపొంది వచన మావిర్భవించు నని వాఙ్మయవేత్తల యభిప్రాయము. కావచ్చును. ఈ గేయములకు సార్వజనీనత, సార్వకాలికత పట్టవు. వీనియస్తిత్వము నశ్వరము. లేకపోయినచో నన్నయకుఁ బూర్వమం దున్న గేయము లన్నియు భారతముతోపాటు మనకు లభించవలసినవి. ఈ గేయములు కావ్యములవలె నుత్కృష్టము లైన వే యైనచో నాఁటిప్రజలు వానిని భద్రపఱచియుందురు. తాత్కాలికప్రయోజనము నాశించి యుద్భవించినందునఁ బ్రజలకు వానియం దలసభావ ముండుట సహజము. జ్ఞాపక మున్నవారు కులాసగ బాడుకొనుచుందురు. వానిని విన్నవారు పాఠభేదములను లెక్కచేయక తాముసు బాడుదురు. ఈ విధముగా విచుకలిమూలముగాఁ గొంతకాలము ప్రచారమున నుండును. నశించును. మఱలఁ గ్రొత్తగేయ

ములు పుట్టును. అవియు నంతియు. ఈనాఁడు మనకు లభించిన జానపదము లన్నియు నర్వాచీనములే. అందలికాలకవైచిత్రిగాని, పదగుంభనముగాని యర్వాచీనతనే నిరూపించును. అనఁగా ప్రాచీనము లైన జానపదగేయములు నశించిన వన్నమాట. నశింపు వాని కొక లక్షణము. నేఁడు ముద్రణము మన కున్నందున లభించిన వానిని నచ్చొత్తించుకొనుచున్నాము. అచ్చువేయించుట శాశ్వతత్వమును నేర్పాటు చేయుట గాదు. అది యా రచనలో నుండవలసిన గుణము. జానపదము లం దది లేదు. శ్రీయుత పింగళి లక్ష్మీకాంతముగా రనినట్లు 'పదకవిత్వ' మెంత నిసర్గమధురమును నిరాడంబరమును నయినను ప్రౌఢవాఙ్మయమున స్థాన మాసింపక, గాలిలోనే సంచరించుచుఁ, బుట్టకదార్ఢ్యమును బట్టి కొంతకాలము సజీవమై యుండును. (ద్వి. భా. ఉపో. 17 ♦ )

ప్రతిజాతికిని జానపదగేయవాఙ్మయావిర్భావ మనివార్యము. ఆంధ్రభాష యజంత మగుట సంగీతానుకూలత నైసర్గికము. కనుక నీ భాషయందు గేయవాఙ్మయము విరివిగాఁ గలుగుట కవకాశ మెక్కువ. వాఙ్మయప్రయోజనములలో బుద్ధివికసనము, హృదయానందము, ప్రముఖములు. దేశీయ మైన జానపదగేయసముచ్చయము హృదయమున కార్ద్రత చేకూర్పఁగలదు గాని బుద్ధివికాసమునకుఁ దోడ్పడ దని నా యభిప్రాయము. అనఁగా నీ గేయవాఙ్మయమునకు నానంద ప్రతిపాదన సామర్థ్య మొకటియే గుణ మనుట. వాఙ్మయప్రయోజనద్వయమును నిముడ్చుకొనునదియే ప్రౌఢవాఙ్మయము. అదియే నన్నయమార్గానుయాయులసృష్టి. ప్రజాబాహుళ్యముపై గేయమున కున్న ప్రభుత్వము పద్యమునకు లే దనవచ్చును. ఈ రహస్యమును గ్రహించియే పాల్కురికి సోమనాథాదులు శైవమత ప్రచారమునకు ద్విపదను గ్రహించిరి. గ్రంథ మంతయు నొకేఛందమున వ్రాయు నాచారము సంస్కృతమునను, ఆంగ్లమునను నున్నది. సంస్కృతమున గ్రంథ మంతయుఁ

♦ ద్విపదభారతము. ఉపోద్ఘాతము. పుట. 17.

గాక పోయినను సర్గ మొకఛందమున వ్రాయుట కలదు. భావానుగుణ ముగ ఛందమును మార్చుకొనుటలోని గుణమును గ్రహించిన మొదటి వాఁడు నన్నయయే. తాను శైవుఁ డయ్యును మతప్రచారమునకుఁ గాను కావ్యత్వమును జాఱవిడువఁ జాలనివాఁడు కవిరాజశిఖామణి యైన నన్నెచోడుఁడు.

ఇతఁడు తన కుమారసంభవమును భావానుగుణముగ ఛందము లను మార్చికొనియే రచించెను. పాల్కురికి సోమనాథుఁడు మతప్రచా రము ముఖ్యముగ నెంచినవాఁ డగుటచేత నేకధాటిగ జానపదులు పాడు కొనుటను వీ లగునట్లు ద్విపదలనే గ్రహించినారు. అనఁగా నేకాగ్రత కలిగి, భావరహస్యగ్రహణశక్తితో, నానందముద్రాముద్రణమున కర్హ మైన హృదయపుటమును విప్పి చదువవలసిన గ్రంథములు నన్నయమా ర్గానుయాయులవి. ఆవేశముతో, వేగవంతముగఁ జదువవలసినవి సోమ నాథాదులవి. ఇట్లనుటవలన నా యా గ్రంథపఠనములవలన నా యా గుణములు పాఠకుల కేర్పడఁగల వని చెప్పుట. ఆనందము రెండింటివల నను బొందవచ్చును. సోమనాథుఁ డా ప్రచారము నాశించియే గానాను కూలత యధికముగాఁ గల దేశిచ్ఛందము లైన రగడలనుగూడ వ్రాసి నాఁడు. బసవరగడ, సద్గురురగడ, గంగోత్పత్తిరగడ, బసవాఢ్యరగడ మొదలైన రచనలు పండితులకు సుపరిచితములే. రగడసంగీతానుకూలము నవ విధరగడలకును రాగతాళానుసంధానము కస్తూరి రంగకవి మొద లైన వారు చేసియున్నారు.

దేశీయము లైన యీ రగడలు మాత్రాఛందస్సంబంధములు. నన్నయకుఁ బూర్వమం దున్న శాసనములం దీ రగడ లక్కడక్కడ నున్నను నన్నయ తన భారతమున వాడలేదు. నన్నెచోడుఁడు వాడలేదు. 1. తిక్కన వాడలేదు. ఎఱ్ఱనయుఁ దన గ్రంథముల వ్రాసినట్లు కానరాదు. శ్రీనాథుఁడు వ్రాసినాఁడు. పెద్దనాదులు వ్రాసినారు. శ్రీనాథుఁడు

మణికర్ణికాప్రభావవర్ణనమున హరిగతిరగడ వాడినాఁడు.[1] పెద్దనాదిప్రాబంధికులు వనవిహారపుష్పాపచయ సందర్భమున రగడలను వ్రాసినారు. ప్రాచీనకాలమున నీ రగడలు దైవస్తుతిపరము లనియుఁ బ్రబంధము లందుఁ బుష్పాపచయసందర్భమున నాడుచుఁ బాడుచు, యువతు లుందురు గాన, నట్టి సందర్భమున గానయోగ్యము లగు నీ రగడలను ప్రబంధకర్త లుపయోగించియుందు రను[2] శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి యభిప్రాయము సమంజసముగనే యున్నది. కాని తరువాతిప్రబంధకర్త యైన, చింతలపూడి యెల్లనార్యుఁడు తన రాధామాధవము ద్వితీయాశ్వాసమున రాయబారము నెఱపుటకుఁగాను ప్రత్యక్షమైన శారద శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమున హరిగతిరగడ వ్రాసియుండుటచేతను, పింగళి సూరన్న తన కళాపూర్ణోదయ ద్వితీయాశ్వాసమున మణికంధరునితీర్థయాత్రాసందర్భమున రామభద్రుని స్తుతించుటకుఁ దురగవల్గన రగడ వాడియుండుటచేతను, ప్రాచీనకాలముననే రగడలు దైవస్తుతిపరము లని యనుకొనుట కవకాశము లేదనియు, గానయోగ్యమైన సందర్భములందు నెల్లయెడల నైచ్ఛికముగ రగడలు మార్గకవితాగ్రంథము లందు వ్రాయుట కలదనియు మన మూహించుకొనవచ్చును. ఎట్లైనను వృత్తముల కున్న యాదరణ కావ్యములందు రగడలకు లేదు. అసలు వానియందు గానయోగ్యతయే గుణవిశేష మగుటవలన నవి యా స్థితియం దున్నవి. దేశీఛందస్సుప్రభావము మార్గకావ్యములపై నంతమాత్రమే.

శ్రీకృష్ణరాయల తరువాత దక్షిణాంధ్రదేశమున యక్షగానాది దేశీరచన లభివృద్ధియైనవి. అవి ప్రౌఢవాఙ్మయనిర్మాణమునకుఁ దరువాతివారికి మార్గదర్శకము లగుట కశక్తములైనందున క్షీణదశ యని

1 కాశీఖండము. ఆశ్వా. ఆ. పుట. 355

2 ఉదాహరణ వాఙ్మయ చరిత్ర - సాహిత్య సమీక్ష. పు 71

వార్య మైనది. క్రమముగా దేశమునఁ బండితదోషము సడలినది. పాండిత్యతృష్ణ నశించినది. రాజ్యము పరహస్తగత మగుటవల దేశీయ భాషావాఙ్మయములు మూలఁబడినవి. పరభాషావాఙ్మయపఠన మని వార్య మైనది. దేశభాషాజ్ఞానము లేమిఁ బూర్వగ్రంథములు కొలుకు షు వకుట మానినవి. ఆంధ్రశబ్దజ్ఞానము లేని ప్రజాబాహుళ్యమునకు దేశ భాషయందలి మాధుర్యమును జవి చూపించి, యభిమానమును రేకెత్తించి, దేశభాష మూలఁబడకుండఁజేయవలసిన తరుణము వచ్చినది. ఆ తరుణమున జన్మించినవారే కందుకూరి వీరేశలింగము, తిరుపతి వేంకటకవులు, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి ప్రభృతులు. మునుముందు వీరేశలింగముపంతులుగారు కర్తవ్యమును గుర్తింపకపోయి నను దేశమునఁ బ్రబలిన మానవోద్యమప్రభావమునకు లొంగుటచేత వివిధవిషయముల సాంఘికాభ్యుదయమునకుఁ బాటుపడిరి. శతావధానము నొనరించుచుఁ దిరుపతివేంకటకవులు దేశాటన మొనరించియాంధ్ర ప్రజానీకమునకుఁ దమ మృదుమధురపద్యరచనాపాటవమునఁ జక్కిలిగింతలుపెట్టి మేలుకొలిపిరి. దేశీయాభిమానమును, దానివలన దేశభాషాభిమానమును బ్రస్ఫుట మొనరించుటకుఁ బూనుకొనిన గురజాడ అప్పారావుగారు గేయరచన కుపక్రమించిరి. చాలకాలము తవ పెరుఁగు దల నాఁపుకొనిన ప్రామాణికాంధ్రము వాడుకభాషనుండి తనను దూరము చేసికొనినది. శబ్దజ్ఞానము లేనినాఁటి యాంధ్రప్రజకు విషయము బోధింపవలయు ననినఁ బ్రామాణికాంధ్రము నిరుపయోగ మని గురజాడ, గిడుగు, తలంచిరి. వాడుకభాషలో రచన ముపక్రమించిరి. ప్రామాణ్యమును గౌరవించువారి కది విడ్డూరముగఁ దోఁచినది. వాదోపవాదములు బయలుదేఱినవి. జనబాహుళ్యమునకు నియమము నతిక్రమించుటలోఁ గల యుత్సాహము నియమబద్ధ మగుటలో నుండదు. జనత యంతయు గిడుగు,గురజాడలజాడ ననుసరించినది. రచనకు నాఁటుక

భాష నుపయోగించుట సముచిత మను వివాదము దశదిశల మాఱుమ్రోగినది, వాదములు ప్రతివాదములు నున్నవి. గురజాడ గేయరచన సాగించినాఁడు. వాడుక భాష గేయరచన కనుకూలించు గుణము గలది. గురజాడతోపాటు చాలమంది గేయరచన కుపక్రమించిరి.

మొదటినుండియు మనకు మార్గ, దేశి యనువాఙ్మయ సంప్రదాయము లున్నవి. కాని మార్గ యభివృద్ధి యైనట్లు దేశి కాలేదు. అందు కనేక కారణము లున్నవి. నన్నయాదులు వాడిన వృత్తములలో వాడుకభాష యిముడదు. పొందిక కుదురదు. కనుక గురజాడ అప్పారావు గారు దేశి (జానపద) వాఙ్మయమువైపు చూచిరి. సామాన్య ప్రజానీకముపై దాని ప్రభావ మధికముగ నుండుట గమనించిరి. తన రచనలకు నట్టి ప్రచారము వచ్చి ప్రజాబాహుళ్యమును జైతన్యవంత మొనరింపవలయు నన్న భావము కలవాఁడగుటచేత గురజాడ గానయోగ్యము లైన దేశీఛందములను గ్రహించి గేయములు వ్రాసినాఁడు. తమకు సులభగ్రాహ్యముగ నున్నందునఁ బ్రబంధములకంటె నీరచనలు తమకు సన్నిహితము లైనందునఁ బ్రజలలో నీరచనలయం దొక గురుభావ మేర్పడినది. ఇంతలో భావకవిత్వపువెల్లువ వచ్చినది. ఇది దేశీమార్గము కాకపోయినను రసభావపరిపుష్ట మైన నవ్యమార్గ మగుట యతిత్వరితముగ దేశమున వ్యాపించినది. ఈ వెల్లువలో గురజాడ కొంత కాల మణఁగిమణఁగి యుండవలసినవాఁ డాయెను. భావకవిత్వపువెల్లువ యొక కెరటముతోనే యాఁగినది. అంత యతివాస్తవికత (సర్రియలిజం) బయలు దేఱినది. దీనితత్త్వపరిశీలనము శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు కొంతచేసి యున్నారు.[1] మన కా విషయమిటఁ బ్రసక్తముగాదు, విశేష మే మనఁగా నీయతివాస్తవికరచనలు గూడ దేశీయమైన గేయములలోనే జరిగినది. శ్రీరంగము శ్రీనివాసరావుగారీ రకపురచనకు మూలస్తంభము. తమ

1 స్రవంతి, సం. 1.

గేయములు ప్రచారమున నుండుట కనుపుగ వెనుక గురజాడ యేర్పఱి
చిన మార్గమును బునరుద్ధరించిన రచయిత శ్రీ. శ్రీ. ఇతని యనుయా
యులు దేశమునఁ జాలమంది గలరు. వీ రందఱకును నభ్యుదయకవు
లని,ప్రజాకవు లని,యతివాస్తవికకవు లనిపేర్లు. గేయకవు లనియుఁ గొంద
ఱనుచున్నారు. నిజమునకు గేయములు వ్రాయుచున్నట్లా యా కవు
లంగీకరించుచున్నారు. వీరిలోఁ గొంద ఱతివాదులు. కొందఱు మిత
వాదులు. వారివాదము లెట్లున్నను వారు నేఁడు వ్రాయు గేయములు
చాలవఱకు మాత్రాఛందస్సంబంధు లైన రగడభేదములలో నున్నవి.
వా రా విషయము పేర్కొనకుండుటచేఁ బ్రస్తరించి చూపవలసివచ్చినది.
ఈ రగడలు పూర్వమునుండియుఁ గల ఛందములే. వీనియం దాద్యంత
ప్రాసములు, యతి, మాత్రలు (లఘువులు) గణింపఁబడుట యాచారము.
ప్రామాణికభాష పనికిరా దని వాదించిన గురజాడ ప్రామాణికరచనల
యం దున్న ఛందోనియమములనుగూడ నుల్లంఘించెను. వాడుకనుండి
దూర మైన ప్రామాణికభాష యెట్లు సర్వజనగ్రాహ్యము కాదో యట్లే
యా భాషయందలి ఛందోనియమములును గా వని యతిప్రాసాదికము
లను గురజాడ విడనాడినాఁడు. విప్లవదృష్టియే ప్రధానముగాఁ గలిగిన
శ్రీ. శ్రీ. ప్రభృతులు గురజాడకును నా భావ మంటఁగట్టి, వానిమార్గ
మనుసరించి క్రొత్తసృష్టి యనిరి. యతిప్రాసలనియమము సర్వత్ర గోచ
రింపకపోయినను మాత్రానియమము జానపదగేయములం దంతటను
గలదు. నేఁటిగేయరచయిత లందఱును బుద్ధిపూర్వకముగ మాత్రాని
యమము పాటించుచున్నారో, లేక యొక లయ తప్పక యుండవలయు
ననుకొనుటచేత మాత్రానియమము వీరిరచనలయం దేర్పడుచున్నదో
చెప్పలేను గాని మొత్తముమీఁద విశృంఖలప్రవృత్తి గలిగి యిష్టము వ
చ్చినట్లు వ్రాయుదు మని చెప్పు నీ నేఁటి కాలపుగేయకర్తలలో
నొక నియమము స్పష్టముగా గోచరించుచున్నది. నేను గొన్ని గేయ

ములను బ్రస్తరించి చూచితిని, రగడభేదములలో నున్నవి. ప్రముఖ రచయిత రచనలను గొన్నింటిని మాత్ర ముట్టంకింతును.

ఏదేశచరిత్రచూచినా - ఏమున్నది గర్వకారణం ?
నరజాతిచరిత్ర సమస్తం - పరపీడన పరాయణత్వం.
నరజాతిచరిత్ర సమస్తం - పరస్పరాహరణోద్యోగం
నరజాతిచరిత్ర సమస్తం - రణరక్త ప్రవాహసిక్తం......[1]

ఇది శ్రీ. శ్రీ వ్రాసిన 'దేశచరిత్రలు' అను గేయములోని యుపక్రమణిక. ఇది వృషభగతిరగడ. ప్రతి రెండు పాదములకును నాద్యంతప్రాసము, ప్రతిరగడకును నుండవలయు నని లక్షణము. [2] వృషభగతిరగడలో 15వ యక్షరము యతి. పాదమునకు 28 మాత్రలు. శ్రీ. శ్రీ. గేయమున మాత్రలు సరిపోవుచున్నవి. ఆదిప్రాస లేదు గాని యంత్యప్రాసయున్నది. గేయ మం దంతటను నీ యంత్యప్రాస లేదు. మాత్రానియమము సర్వత్ర పాటింపఁబడినది. అనఁగా శ్రీ. శ్రీ. వ్రాసిన యీ గేయము యతిప్రాస ములు లేని వృషభగతిరగడ యనుట కాక యొక్కొక్క పాదమును రెండు పాదములుగాఁ బ్రస్తరించిన హరిణగతిరగడ యగును. ఇతనిదే

పాపం, పుణ్యం, ప్రపంచమార్గం
కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా
అయిదారేడుల పాపల్లారా[3]

అను 'శైశవగీతి' గేయము మధురగతిరగడ. యతిప్రాసలు లేవు. పాద మునకు 16 మాత్రలు. రెండు పాదములను గలిపి యొక పాదముగా వ్రాసిన హరిణగతిరగడ యగును.

---

1 కల్పన. పుట 49.

2 పూర్వులును యీ లక్షణమును పూర్తిగ పాటించలేదు.

3 కల్పన. పుట 60.

మంచువంటిది గతం - మళ్ళీకనిపించదు
వెనక్కు చూడకు మరి - వెళ్ళి పోయిం దెపుడో
నీలో కుసుమించిన - పూలను చిదిమేస్తూ
గతం వెళ్ళిపోయింది - స్మృతి గర్భంలోనికి[1]... ...

అను 'కాలరథం' గేయము ద్విరదగతిరగడ. ఆద్యంత్యప్రాసములు లేవు. మొదటి రెండు పాదములలో 11 వ వర్ణము యతి పాటింపఁబడినది. మూఁడు నాల్గు పాదములఁబ్రాసయతి వాడఁబడినది. ఇది లాక్షణిక సమ్మతము కాదు. పాదమునకు 20 మాత్రలు. 'ఆరుద్ర' వ్రాసిన 'ఎంచక్కనికల' అను గేయమునందలి

నిన్న మన తండ్రులు చాలా నిస్సహాయులు
వాళ్ళతండ్రులు అంతకన్నా అసహాయులు
వాళ్ళచుట్టూ తా మైళ్ళకొద్దీ బీళ్లు
ఎప్పుడో ఇంకిపోయిన వాళ్ళకన్నీళ్ళు [2]

అనునది ద్విరదగతిరగడలోనే ప్రారంభ మైనది. అంత్యప్రాస యున్నది. యతి లేదు. మాత్రానియమ మున్నది. మూఁడవ పాదమున నొక మాత్ర తగ్గినది,
అనిసెట్టి సుబ్బారావు వ్రాసిన

వచ్చాను వచ్చాను వ్యాసపంక్తివాణ్ణి!
వెళ్ళిపోయిన కోటికోట్ల జీవులు విడిచి
కుళ్ళిపోయే నేటి కోట్లజీవులకొఱకు
పోర్లివచ్చే కోటి కోట్ల జీవులకొఱకుతి

---

1. కల్పన. పుట 61.
2. కల్పన పుట 281.
3. కల్పన పుట 93.

అను 'వ్యాసనంతతి వర్ణ్ణి' గేయము యతిప్రాసములపొంతఁబోని ద్విరగతిరగడ.

'బైరాగి' వ్రాసిన 'నూతిలోని గొంతుకలు' అను గేయమునందలి

ప్రతిమనిషీ ఒకగదిలో - చెదపురుగులు ప్రతిమదిలో
ప్రతిమనిషీ ఒకనదిలో - సుడిగుండం ప్రతియెదలో
ప్రతిమనిషీ ఒకచెరలో - ఉరికంబం ప్రతిమదిలో
ప్రతిమనిషీ ఒకమరలో - మరమేకులు ప్రతిహృదిలో[1] ..

ఈ భాగమంతయుఁ దురగవల్గనరగడయే. ఆద్యంతములయందుఁ బ్రాసపాటింపఁబడినది. యతి 13 వ వర్ణము. ఈగేయమున లేదు. పాదమునకు 24 మాత్రలు.

పిలకా గణపతిశాస్త్రి వ్రాసిన 'మూదాకబళం'

ఘోరని గాలిదుమారము లెగసెన్
భోరని ధారావర్షము కురిసెన్
చీకటిలో ఎవరో ఆసీడలు
ఆకలితో ఏవేవో ఘోషలు.[2]

అను గేయము యతి లేని మధురగతిరగడ. ప్రాస మున్నది.

బాలాంత్రపు రజనీకాంతరావు వ్రాసిన 'మాధురులు'

ఊరకేమాధురులు - ఊరిపోతున్నాయి
ఆవైపు ఈవైపు - అని కాదు అలముకొను
అందమే వెలుఁగైన - అన్నివైపులగూడ
అంధకారప్రభలు - మందువైపులగూడ.[3]

అను నీ గేయము ద్విరదగతిరగడ. మొదటి మూఁడు పాదములందున యతి యున్నది. ప్రాసనియమము లేదు.

దాశరధి వ్రాసిన 'రక్తారుణవైజయంతి'

---

1 కల్పన పుట 239.
2 కల్పన పుట 297
3 శతపత్రసుందరి పుట 20.

అర్థరాత్రి అడుగుజాడ లగుపించని అరణ్యాన
నల్లరంగు పూసుకున్న కళ్లులేని గాడుపులో
చెవులు చిటిలి చిల్లులుపడు నిశ్శబ్దనినాదములో
పిశాచాలు పిట్టపీఁగు పర్వతాలలోయలలో[1] ......

అను గేయము యతిప్రాసముల నియమము లేని తురగవల్గనరగడ. పాదమునకు 24 మాత్రలనిలయము.

సి. నారాయణరెడ్డి వ్రాసిన 'తరంగాలు'

ప్రాచీదిశాకుడ్యభాగాల నెగఁబ్రాకి
రోచిర్లతలు తొంగిచూచినవి, పూచినవి.
క్రొమ్ముళ్లై పెనవేసుకొన్న యువదంపతుల
గాఢోపగూహనగ్రంథులు సడలునేమొ[2] ... ...

అను గేయము ద్విరదగతిరగడ. ప్రాసనియమములేదు. 1,3,4 పాదములందు యతి నియమ మున్నది. 2 వ పాదమునఁ బ్రాసయతి గలదు. పాదమునకు 20 మాత్రలు. ఇతనిదే మఱొక గేయము 'అంతశ్చిత్రాలు'.

చీకటిపెదవులు నాలోపల - జీవనవేణువు పూరించెను
కాంతికరమ్ములు నాకన్నుల - గాఢతమోభారం దించెను
హైమంతనిశీథం నాలో - అంగారం రేకెత్తించెను
ఆషాఢపయోదం నాలో - యోషావిరహాం పొరలించెను[3] ...

ఇది వృషభగతిరగడ. అంత్యప్రాసము పాటింపఁ బడినది. 1,2,3 పాదములలో యతి నియమ మున్నది. నాల్గవపాదమునఁ బ్రాసయతి కూర్పఁబడినది: ఇందలి యొక్కొక్క పాదమును రెండుపాదములు చేసినచో హరిణగతిరగడ యగును. ముద్రణమున హరిణగతివలెనే యున్నది. యతిప్రాసలనియమము కుదురదు. కనుక వృషభగతి యని

1. కల్పన పుట. 163
2. స్రవంతి. సం॥ సం. 3
3. ఆంధ్ర (వార) పత్రిక. 12-1-1954.

వ్రాసిచూపించినాను. ఇంకను జూపవచ్చును. ఇట్లు నేటి గేయము లన్నింటిని ప్రస్తరించుటకుఁ బ్రారంభించినచో నిది వ్యాసము కాక లక్షణగ్రంథ మగును. ఆ గ్రంథరచనావశ్యకతయు వచ్చును. పైన నేను ప్రస్తరించి చూపిన వన్నియు, రగడభేదములే. నేటి గేయరచయిత లందఱును రగడభేదములనే వాడుటలేదు. ద్విపదభేదములు - అక్కరభేదములు కూడ విరివిగా వాడఁబడుచున్నవి. నీతినియమములు లేకుండ నిచ్చవచ్చినచోటఁ బాదము నాఁపి వరుసగా క్రిందికి వ్రాసికొను పోవు రచనలే గేయము లనుకొనువారికి, ఈ గేయములందును నొక నియము మున్న దని చూపుటకే పైన జరిపిన ప్రస్తారము. నీతినియమములు లే వను వారివాదమును నిర్హేతుకము కాదు. పద్యములు వ్రాయుట తమకుఁ జేత కా దనియు, గేయములుమాత్రమే వ్రాయఁగల మనియు, గనుకఁ దాము గేయకవితలరచయితల మనియు నెలుగెత్తి పలుకు వారు దేశమున నేఁడు కలరు. ఏదో యొక లయ యుండవలయు నను కొని గేయము వ్రాయుచుఁ బాదవిభజన చేయుటలో మాత్రానియమ మెఱుఁగని యువకులు చాలమంది గలరు. ప్రముఖరచయితల గేయములు, పూర్వప్రబంధముల (వృత్తములను) నిరసించుటయే యువకులకు నేర్పినవిగాని తమలోని నియమవిశేషములను వారి కెఱుకపఱచలేదు. వా రట్టినియమము లుండు నని గ్రహించుటయులేదు. ఏది యెట్లున్నను నేఁడు గేయరచయితే కాని యక్షరాస్యుఁడు లేఁ డనుటలో నతిశయోక్తి యున్నను స్వభావోక్తి కాకపోదు.

పద్యములు వ్రాసిన ప్రతివాఁడును వెనుకఁ గవియైనట్లు గేయము వ్రాసినప్రతివాఁడును నేఁడు కవి యనఁబడుచున్నాఁడు. పద్యము వ్రాసిన ప్రతివాఁడు నెట్లు కవికాడో, అట్లే గేయము వ్రాసిన ప్రతివాఁడును కవి గాఁడు. కవిత్వము వ్రాసినవాఁడుమాత్రమే కవి. గేయకవిత్వము నకును బద్యకవిత్వమునకును నన్నయాదులకాలమునుండి పల భేదము

ముందే వివరించితిని. గేయ మనునది గానాంశమును మాత్రము తనలో
నిముడ్చుకొనిన దనికూడ వ్రాసితిని. దాని ప్రయోజనము హృదయము
నార్ద్రి మొనరించుటయే గాని బుద్ధివికసనమునకుఁ దోడ్పడుటగా దని
నుడివితిని. జానపద గేయములను హృదయముతోఁ బరిశీలించినపుడు
నాకుఁ దోఁచిన భావము లవ్వి. కొందఱు జానపద వాఙ్మయపరిశోధకులు
"ప్రబంధాలలో నూటికి తొంభదింటిలోకంటె హరిహరీనారాయణ
పదాలలో మేలైన కవిత్వము కనపడుతుంది" అను నభిప్రాయము
కలిగియున్నారు.[1] ఇది యత్యుక్తి. మఱికొందఱు జానపద గేయపరిశోధ
కులు "ఈరకం (హరిహరీనారాయణ) పదాలలో స్వకపోలకల్పితా
లించుమించుగా సున్న. ఇవన్నీ ఇతరరచనలను చూచి రచించినవే"
అను భావమునుగలిగియున్నారు.[2] కల్పన యనఁగా భావయిత్రి. కవి
త్వమున కా శక్తిప్రధానము. అది లేనివాఁడు కవి కాఁడు. ఆ రచన
కవిత్వము గాదు. కనుకనే జానపద గేయములందుఁ గవిత్వాంశము
పూజ్య మనియు, గానాంశము ముఖ్య మనియు నేను వ్రాయుట. మేధా
గత మైన కాల్పనికజగత్తున విహరించుటకు సామాన్యమానవునకు
యోగ్యత లేదు. ఆ యోగ్యత నాతఁడు సంపాదించుకొనవలయును.
సంపాదించుకొనలేని వారికిని హృదయమున్నది. కనుకను, దాని కాస్వా
దన మనునది గుణ మగుటను క్లిష్టములును, ఉన్నతములును, కాని భావ
ప్రపంచన మనివార్యమైనది. దానిస్వరూపస్వభావములే పదము, తదం
తర్గతమైన గాన యోగ్యత. వెరసి గేయము. మహోన్నతభావవ్యక్తీకరణ
మం దుండకపోవుటవలననే జనబాహుళ్యమున వానికిఁ బ్రచారము.
జానపదుల కది యొక విలాసక్రీడయే గాని మఱొండు గాదు. ఆంధ్ర
దేశమున 19 వ శతాబ్ద ముత్తరార్థమునఁ బ్రభవించి జాతిని పునరు

1 కిన్నెర జనవరి 1955 పుట 95

2 కిన్నెర జనవరి 1954 పుట 100

జీవింపఁజేయు భారము వహించిన తిరుపతి వేంకటకవులు, గురజాడ మొదలైనవారు ప్రజాబాహుళ్య మందుకొని యాస్వాదించి, యానందింపఁగలిగిన భావములనే వ్యక్తీకరించిరి. అందులకుఁ దిరుపతివేంకటకవులు శతావధానము లాధారముగాఁ గొనిరి. దైనందిన నోపయోగమున నున్న శబ్దములనే గ్రహించి చక్కఁగా మలఁచి పరిచితపూర్వములైన వృత్తచ్ఛందములనే గ్రహించి యాశువుగాఁ జెప్పుటకుఁ బ్రారంభించుటతో జనసామాన్యమున కొక యుత్సాహము, నభినివేశము, నేర్పడినవి. ఆంధ్రభాషయందును, గవితారీతులయందును జనత కొక యభిమానము రేకెత్తినది. ఈ యభిమానము, పండితులలోఁ బ్రబలిన ప్రామాణిక వ్యావహారిక భాషాభేదములవలనఁ బుష్టిని గూర్చికొనినది గాదు. సులభసాధ్యమైన వ్యావహారికమునకే జనత యంగీకారము చూపినది. అది సహజము. భాషతోపాటు ఛందోనియమములను వ్యావహారికమునకు దించినవాఁడు గురజాడ. ఇట వ్యావహారిక మనగాఁ దేశి యని. గురజాడ తన గేయములు ప్రజాబాహుళ్యమున కని నమ్మినవాఁ డగుటచేత పాడుకపదములనే వాడినాఁడు. కనుకనే మహోన్నతము లైన భావసముదాయముతోఁ గాల్పనికజగత్తును గురజాడ సృష్టింపలేకపోయినాఁడు. తాను వ్రాసిన గేయములు ప్రజలకు జీర్ణము కావలయు ననుకొనినాఁడు. కాని గురజాడ, ప్రజలకు వాఙ్మయపరిపుష్టి యేర్పడవలయు నని యనుకొనలేదు. ఆ కాలమున నిట్లనుకొనరాదు. తల్లి యేమి చేయును! బిడ్డలకుఁ జిన్నతనమున జీర్ణ మగు పదార్థములనే పెట్టును. జీర్ణకోశ మభివృద్ధి యైనతరువాత బలము చేకూర్చు పదార్థములను బెట్టును. భాషావాఙ్మయవిషయమున వసవల్పువారి వలె మన్న నాఁటి ప్రజలకుఁ దిరుపతివేంకటకవులు, గురజాడ తల్లుల వంటివారు. కాని వారికృషి యాంధ్రప్రజలకు భాషావాఙ్మయజీర్ణకోశము వృద్ధిచేయుటతోడనే ముగిసినది. వారు పుష్టిని గూర్పలేక

పోయిరి. శ్రీముద్దుకృష్ణమాటలలో వీరు వైతాళికులు. వైతాళికుల పనియే వారుచేసిరి. తరువాతఁ బుష్టిని గూర్చి, మార్గదర్శి కావలసిన వాఙ్మయధురంధరుఁ డైన మహాపురుషునియావిర్భావ మనివార్యము. అతఁడే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. కారణజన్ముఁ డైన యతని దొడ్డ దీక్ష. అది యవిచ్ఛిన్నము.

కాలప్రభావ మేమో ప్రపంచ మంతయుఁ జైతన్యపూర్ణ మైనది. ఆ చైతన్యము సంఘర్షణాత్మకము. ప్రపంచకమందలి ప్రతి ప్రాంతమును మిగిలిన దానిని దనదిగాఁ జేసికొనుయత్నమున కుపక్రమణము చేసినది. చేయుచున్నది. ఆధునికవిజ్ఞానము, శాస్త్రాభివృద్ధి దానికి దోహదకారి యైనది. అగుచున్నది. సంఘర్షణాత్మక మైన చైతన్యము విప్లవ మను పేరు గైకొనినది. అన్ని రంగములయందును దానివిశ్వరూపసందర్శన మప్రధృష్యము. ఆ విప్లవదృష్టిని భారతావనియు, నాంధ్రదేశమును నల వఱచుకొనినవి. వివిధరంగములఁ బ్రతిఫలించిన యాదృష్టికి వాఙ్మయ రంగ మపవాదు కాదు. కాలేదు. ఆ దృష్టికి నియమోల్లంఘన మాత్మ. స్వేచ్ఛ ప్రాణము. ప్రపంచమున వీనిప్రచారము నాంగ్లభాషాముఖమున గ్రహించిన యాంధ్రమేధావు లా యుద్యమము నిట లేవఁదీసిరి. మిగిలిన రంగములం దేకీభావము కుదిరినను భాషావాఙ్మయరంగముల నాంధ్రుల కేకత్వము కుదురలేదు. భాషయే యిందుకు హేతువు. అన్ని దేశకాల ప్రభావములను దమలో నిముడ్చుకొనిన వారిలోఁ గొందఱు తిరుపతి వేంకటకవుల మార్గమున ననుగమించిరి. కొందఱు గురుజాడ మార్గము ననుసరించిరి. గురుజాడతోనే భాషయందును, ఛందమునందును సంప్రదాయవ్యతిక్రమణ మున్నది. అట్లు వ్యతిక్రమించుటలో గురజాడ వారి భావము వేఱయినను నీరంగమునను విప్లవము రావలయు నను వారికి గురజాడ విప్లవకవిగాఁ గనిపించినాఁడు. అతని మార్గ మనుసరించవలసిన తమకు నతనికి మహాకవిపట్టముగట్టుట అనివార్య మైనది. గురజాడ మేలు

కొలుపు పాటల పద్ధతిని గవిత వ్రాయుట కతని యనుయాయు లుపక్రమించిరి. కవిత యనఁగానె వ్యావహారికశబ్దజాల మశక్తమై ప్రక్కకు నొదిగి తీరవలయును. ఛంద మేదైనను నంత బాధ లేదు గాని భావానుగుణ మైన శబ్దప్రయోగము కవితకు ముఖ్యము. కనుకనే గురజాడ భాషాప్రయోగమునకును దరువాతివారి భాషాప్రయోగమునకుఁ బొత్తు కుదురలేదు. మహాకవిత్వము వ్రాయు తలంపు లేనివాఁ డగుటచే, ప్రజాబాహుళ్యమునఁ బ్రచారము మేలుకొలుపు నాశించినవాఁ డగుటచేతను గురజాడ

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్[1]

అని వ్రాసినాఁడు. ఆ మార్గమున నున్నతభావవ్యక్తీకరణమున కుపక్రమించిన శ్రీ శ్రీరంగము శ్రీనివాసరావు

కవితా! ఓ కవితా!
నా యువకాశల నవపేశల సుమగీతావరణంలో......
నీ ప్రాబల్యంలో
చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో
నిశ్చల సమాధిలో.........
నేనే యే చిత్రవిచిత్రశ్వ్యమంత
రోచిర్నివహాం చూశానో.........
అందీ అందకపోయే

1. వైతాళికుడు. పుట. 2.

నీ చేలాంచలముల విసరుల
కొస గాలులతో నిర్మించిన
నానుడి నీ గుడిగా
నా గీతం నైవేద్యంగా, హృద్యంగా
అర్పిస్తానో
నా విసరిన రసవిస్మృమర
కుసుమ పరాగం

అని వ్రాయవలసి వచ్చినది. గురజాడవలె వాడుకశబ్ద ప్రయోగము శ్రీ. శ్రీ. చేసినాఁడని యెవరును ననరు. ఇంత సంస్కృత శబ్దభూయిష్ఠమైన వాడుక భాష లేదు. కారణము వాడుకలో విశిష్టమైన భావవ్యక్తీకరణమున కగత్యము లేదు. దేశమును ప్రేమించుమని చెప్పుట హితముపదేశించుటే. అందు విశేషము లేదు. కనుక వాడుకమాట సరిపోయినది. క్రాంతదర్శిత్వమున కవితాసరస్వతీమూర్తిని గని అందీ యందనట్లుగానున్న యామె విసరుచేలాంచలములనుండి వెడలిన కొసగాలులు తన్నుచేరఁగా వానిని గ్రహించి నుడికారముగా మార్చుకొని, ఆ నుడికారపు గుడిలో ఆమెను ప్రతిష్ఠించి, తన గేయములను నైవేద్యమొసఁగ సంకల్పించిన శ్రీ. శ్రీ. భావము జనసామాన్యమైనది గాదు. అట్టి భావమును వ్యక్తీకరించుటకు జనసామాన్యోపయుక్తములైన శబ్దము లశక్తములు. కనుకనే శ్రీ. శ్రీ. గ్రహించిన శబ్దసామగ్రి గురజాడకంటె భిన్నము. శ్రీ. శ్రీ గేయరచన కుపక్రమించుటతో నీవాఙ్మయమున నొకగొప్పమార్పు వచ్చినది. జానపదులలో గానాంశ మధికముగ సామాన్యభావములు గలిగి పుట్టుచు గిట్టుచునున్న పదములు, సంస్కరింపఁబడి ద్విపదలుగా, సోమనాథాదులచేత గ్రంథస్థములై, రగడలుగా, శ్రీనాథాదులచేత మార్గకవిత కెక్కి, కీర్తనలుగాఁ తాళ్ళపాకవారిచేతఁ గేషలము సంగీతమున

కల్పన. పుట. 17.

కుపయోగింపఁబడి, క్షేత్రయ్యచేత నాట్యమునఁ బ్రయుక్తములై, నిద్రాణ మైనజాతికి మేలుకొలుపుపాటలుగా గురజాడచేత వాడఁబడి, శ్రీ శ్రీ చేతిలో సంగీతమును ద్రోసిరా జనఁగల కవిత్వాంశచేత మాంస లములైనవి. పదములు గేయములగుటవలన వెనుకటి వన్నియు సంగీత గేయములుగాను, శ్రీ శ్రీనుండి సాహిత్యగేయములుగాను మనము గేయవాఙ్మయమును విభజించుకొనవలయును. నేఁడు ప్రచారమున నున్న గేయకవిత యనువ్యపదేశము సంగీకరించి కవితావిమర్శనము నకుఁ బూనుకొనవలయును. నేటి గేయకవులకు ప్రధానాచార్యుఁడు శ్రీ. శ్రీ. ఈగేయరచయితలు మాత్రాఛందములైన రగడలను వాడుచున్నారని వెనుక నిరూపించితిని. ఆధునికులైన కన్నడ కవులును రగడలనే వాడుచున్నట్లు తద్భాషావేత్తలు చెప్పుచున్నారు. దేశీఛం దములను ఆధునికాంధ్రకవులు వాడుట సంతోషదాయకమేగాని శ్రీ.శ్రీ. అనుయాయులలోఁ జాలమందికి భావవ్యక్తీకరణకుఁ దగిన ఆంధ్ర భాషాపాండిత్యము లేకపోవుట నిసర్గలోపము. సంస్కృతమువలె ఆంధ్రముతో నాంగ్ల మిముడదు. ఐనను, నేఁటి గేయకవులు చాల వఱకు విప్లవదృష్టి కలవారగుటచేత, ఆంధ్ర కవితలో ఆంగ్లశబ్దజాల మును విరివిగా వాడుచున్నారు. శ్రీ. శ్రీ. కున్నభాషా పాండిత్యము వారికి లేకపోవుటయే యందులకు హేతువు. దీనికి హేతువు వెనుకచూపు లేకుండుటయే. భావమునకుఁ దగిన భాష లేనపుడు కవిత రసవంతము గాదు. ఈ యవస్థ నేఁటి గేయములందున్నది. ఇట్లనుటచేత గేయ కవు లందఱును పాండిత్యము లేనివారని భావముకాదు. స్ఫుటమైన భాషా పాండిత్యము కలిగి శబ్దశక్తిని గుర్తించి ప్రయోగించువారు కలరు. వారు కవులుగా నిలువఁగలరు. వారి కవితా విమర్శన మిట నప్రస్తుత మగుట వదలుచున్నాను.

# సీతాకోకచిలుక.

శ్రీ భమిడి సత్యనారాయణశాస్త్రి.

వర్షపుఁగల్మి, సస్యము, న - వాంకుర కోమల పల్లవంబులన్.
హర్షముతో లతాంతముల - నల్లెడివేళల, మిత్రివై, కటా!
కర్షకు లెల్లఁ దిట్ట నటు - కంబళిపుర్వుగఁ బీడవెట్టి, యు
త్కర్షముతోడ నేఁ డెగురఁ - దజ్ఞులు నిన్నిఁక నాదరింతురే?॥

చిక్కనిరంగు ఱెక్కలకుఁ - జిక్కె నటంచును మూఢకీటమా!
నిక్కుచుఁ బువ్వుపువ్వునకు-నీటుగఁ బోకుము, నిన్ను జూచినన్
ఫక్కున నవ్వి యవ్వి, తమ-పచ్చనియాకుల మున్నుదిన్నయా
ముక్కును గుర్తుపట్టి యల - ముష్కరికంబళి వంచు నాడరే?॥

పువ్వుల మోసగింప నటు - పూర్వపుఁదుచ్ఛకళేబరంబు, దా
దవ్వుల డుల్చి, ఱెక్కలను - దాల్చిలుఁ జక్కఁగ వచ్చినంతనే
మవ్వపుఁదేనియల్ గుసుమ-మంజరు లిచ్చునె? రూపు మాఱెనన్
నొవ్వఁగ ఱేకులం దినెడి - నో రెట డాఁగును? కీటకాధమా!॥

తగుదు నటంచు మాటికిని - దబ్బరకీటమ! ఱివ్వుఱివ్వునన్
ఎగురుచు నీవు పుష్పముల - కేఁగినయంతనె నేమి లాభమా
సొగసగు మాధవీమధుర - సూక్ష్మసుసారము లేర్పఱింతువే?
జగతి మధువ్రతంబువలె - సౌరభవైభవ మెవ్వఁ డొందెడున్?॥

పురువుగఁ బుట్టినైనఁ దన - పూర్వతపఃపరిపాకయుక్తి, స
ద్గురువులఁ జే-, విశ్వ నతి - దుస్సహవేదనఁ జెంది నేర్చుచుం
బరగెడిబంభరంబుగతిఁ - బద్మమరందము గ్రోలలే కిఁకన్
పరువునఁ బోయి దాసి సుకు-మారదళంబులఁ ద్రుంతువంతెగా!॥

సల్లఁగ నున్న నేమొకో! వ - నాంతరసీమల కెంత దూరమో
చల్లఁగ నేఁగి, దివ్యసుమ - సారములెల్ల నెఱింగి, జాణవై
యుల్లము కందకుండఁ గడు - నూర్జితమందరనాద మొప్పఁగన్
వల్లరి చిందకుండ, రతి - వల్లభురీతిని, దమ్మి మధ్యఁ జి
పిల్లెడు తేనెఁ దెచ్చి, తగు - పెద్దల కీయఁగ షట్పదాళికే
చెల్లెడుగాని, నీ కటుల - జెల్లునె? రంగుల నెన్ని మార్చినన్?॥

పండితుఁ డీతఁ డంచు, నిను - బామరు లన్నను సంభ్రముగాక! నీ
కుండిన హేయరూప మటు - లొక్కొక వేళ విచిత్రవిస్ఫుర
న్మండిత మైననేమి? యది-మాయ యటంచు జగం బెఱుంగు; నీ
మొండిమొగంబునోరు నటు-మూసిన డాఁగునె! కంబళోద్భవా!॥

రూపుపసందుఁ జూడ నవ-రూపము! నిక్కడిఱెక్కలందమో!
బాపురె! దీనిజన్మ కడు - భాగ్య మటంచును నజ్ఞు లెంచినన్
చూపులసోయగంబు, భువి - సొంపగు బుద్ధిని దెచ్చియిచ్చునే?
తీఁపగు పుప్పొడు జెఱుపఁ-ద్రిమ్మరుచుందువు పువ్వుపువ్వునన్॥

తుమ్మెదనట్టెచూచి, తమ - తోరపుఁదేనియ లీయ, నెంతయో
కమ్మని తావులం బిలిచి - కౌఁగిళు లిచ్చుచు నెల్లతమ్ములున్
సమ్మద మొంది సత్కృతులఁ-జక్కఁగఁ జేతురు; నిన్ను గాంచి తా
మెమ్మెయి గారవింతురు? తమ - కెగ్గు దలంచెడి దుష్టకీటముల్॥

నిముసము నీదుజన్మ మతి - నీచపుఁబువ్వుల నైనఁ జేరఁగాఁ
దమకము చెందెఁ దీ వకట! తాదృశదైన్యభవమ్ము వీడియున్
విమతివెగాని, యెందునవి - వేకముశూన్యము దివ్యసుంజనీ
సుమనసులందుఁ జేరి గుణ-శోభను గాంచని యంద మెందుకో!॥

*రూపముఁ జూచినంతటనె-రూఢిగ నా మహిమంబుఁ దెల్పు నం
చా పగిదిఁ వచించు నిగ - మాములఁగూడను ద్రోసిరా జనక్
చీపురువోలు నీ మొగము - చిక్కని మీసము చాటు సేసెనో!
వాపిరికీటకంబ! గుణ వైభవ మంతయుఁ జేష్ట చాటదే!॥

సీతపుగావు చూడ, నటు - చిత్రపుఁగోకయుఁ గావు నీవు; నీ
మూతిని జూడఁ జిల్కవలె - ముద్దులు గుల్కదు; నీదురంగులన్
నాతులు గాంచి, సీత కల-నాఁ డనసూయ యొసంగినట్టి యా
నూతన మైన కోకవలె - నున్నగ, నున్నను నిన్ను బోల్చిరో॥

ఱెక్కలఁ దాల్చినీ వటుల - ఱివ్వున నిట్టటుఁ బాఱినంతనే
చక్కని చిల్కవౌదువా కొ!-సారెకు ముద్దుగఁ బల్క నాల్క నీ
కెక్కడిదమ్మ? కీరముల - నెంతయు నింతులు జేరఁబిల్తురో!
చుక్కలకీటకంబ! నిను - సోకినయంతనె ఱెక్క లూడెడిన్!॥

తిట్టితి నే నటంచు, నలు - దిక్కులఁ ద్రిమ్మర నేమి లాభమా?
పుట్టుకపూర్వముం దలఁచి - బుద్ధిని జక్కఁగ దిద్దుకొమ్మ; నీ
వట్టివిశాలభావమున - న య్యళిరీతి మెలంగకున్న చో
వట్టివి దేహసంపదలు వమ్మని నమ్ముము, రూపురేఖలున్॥

---

* రూప మేవాస్మిన్ మహిమానం "వ్యాచష్టే" అనిశ్రుతి.

# శ్రీ మద్రామాయణము-మానవత్వప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

శ్రీరామచంద్రునిపాత్రనుగూర్చి యీ వ్యాసమునందు విమర్శనము ప్రారంభించెద నని గతవ్యాసమునందుఁ జెప్పియుంటిని. కాని యందులకు ముందుగ శ్రీరామచరిత్రనుమాత్రమే వాల్మీకి రచింప నమకట్టుటకును నిక్ష్వాకు, రఘు, మాంధాతాదిమహాపురుషులచరిత్రముల నందే పాటియుఁ జేర్కొనకపోవుటకును గారణ మేమి యనియు నొక్క-శ్రీరామోదంతమునుమాత్రమే యతివిపులముగ,నతిసూక్ష్మముగ రచించుటకును గారణ మేమి యని కొంత ప్రస్తావించు టావశ్యక మని యెంచి యా, యా, కారణములను యథాశక్తిగ నిందుఁ గొంత వివరింపఁదలంచితిని. అందులకుఁ దొలుదొల్త మన మాలోచింపవలసిన విషయము వాల్మీకి యెట్టివాఁడు? అతనికి శ్రీరామచారిత్రమును రచించుటకుఁ గుతూహల మేల కలిగెను? కావ్యప్రసక్తి తొలుత నాతని యందె ట్లావిర్భవించెను? ఈ విషయములనుగూర్చి సమగ్రముగఁ గాకున్న నా నేర్చినకొలందియైన శ్రీమద్రామాయణమునందు సూచింపఁబడిన యాధారలేశములం గైకొని సోపపత్తికముగ నిచ్చట నుదాహరింపఁగడంగుట యప్రస్తుతము కాదు. ఆ రీతిగఁ గవిని గూర్చి నాతఁ డే పరిస్థితులలోఁ దన కావ్యమును రచింప నమకట్టెనో యా పరిస్థితులనుగూర్చియు ముందుగఁ గొంత మన మెఱింగినంగాని యాతనికృతియందు వచ్చు వివిధపాత్రములను బూర్తిగఁ గాకున్న గొంతవఱకైన మనము సమన్వయము సేసికొనఁజాలము. కవి యెద్దియే నొక మహత్తరాశయముతోఁ దన హృదయమునందుఁ గలిగిన యొక యపూర్వసంచలనమును గావ్యరూపమున నావిష్కరింపఁజేసి చిత్రవిచిత్ర వాఙ్మయముచేఁ దన సమకాలికమానవహృదయముల నాకర్షించు

టయగాక తన యప్రతిహతశబ్దసామర్థ్యముచేఁ దన కృతి కమరత్వము గూడ సాధింపఁగలఁడు! శబ్దమున కెంతటి శక్తి కలదో పాశ్చాత్య మన స్తత్త్వశాస్త్రజ్ఞులలోఁ బ్రముఖుఁ డగు "Sigmund Freud" అను మహాశయుఁ డిటులఁ దెలుపుచున్నాఁడు:—

"Words and magic were in the beginning one and the samething, and even to-day words retain much of their magical power. By words one of us can give to another the greatest happiness or bring about utter despair; by words the teacher imparts knowledge to the student; by words the orator sweeps his audience with him and determines its judgments and decisions. Words call forth emotions and are universally the means by which we influence our fellows".

కావున శ్రీమద్రామాయణమువంటి యొక విలక్షణశబ్దమహార్ణవమును సృజింపనెంచిన వాల్మీకి యెట్టివాఁడు? అతని కట్టి యప్రాకృతశబ్దశక్తి యెచ్చటనుండి వచ్చినది? అతఁడు చిత్రించిన పాత్రపోషణములో నవ్యాహతచలనశక్తి నేఁటికిఁగూడ మన కన్నులయెదుటఁ దాండవించి యా యా పాత్రలరసానుభూతియందు మనలనుగూడ ద్రవింపఁజేయునట్టి యాకర్షణశక్తి యెచ్చటనుండి యా కవికి వచ్చెను? ఈ విషయములను గొంత మన మాలోచింపవలసిన యగత్యము కలదు.

వాల్మీకిమహర్షి నిగూర్చి వ్యాసాచార్యుఁ డీ తీరునఁ దన శ్రీమద్భాగవతమునందుఁ జేర్కొనియున్నాఁడు:-

శ్లో. "చర్షణీ వరుణ స్యాసీ ద్య స్యాం జాతో భృగుః పునః
వాల్మీకి శ్చ మహాయోగీ వల్మీకా దభవ త్కిల."

కావున వాల్మీకి తొలుత దేవక్షత్రియుఁ డైన వరుణునికుమారుఁడై ప్రాచేతసుఁ డని పిలువఁబడుచుండెడివాఁడు. తరువాత నాతఁడు కాల కర్మవశంబున యోగభ్రష్టుఁడై యొక బోయవనితతో సాంగత్యము కలిగి తునపఁ దన క్షాత్రముచేఁగాఁబోలు భిక్షావృత్తికిఁ గడంగక

దారిదోఁపిడివృత్తిచేఁ గుటుంబభరణమునకు దిగి క్రమక్రమముగ నొకనాఁ డతఁడు సప్తమహర్షులు భార్యాసమేతులై యరుగుచుండ వారి నడ్డగించి వారివలనఁ "దారక" మంత్రోపదేశ మొంది తన దారుణవృత్తిని వీడి మహత్తరతపోనిష్ఠయందు నిమగ్నుఁ డయ్యెను ! కట్టకడ కాతఁడు వల్మీకసంభవుఁడై వాల్మీకి యను యోగి యయ్యెనని వ్యవహరింపఁ బడెను. ఇది యాతనిసంగ్రహజీవితచారిత్రము.

శ్లో. "ఋషయోఽప్యుగ్రతపసో దైవే నాభిప్రపీడితాః
ఉత్సృజ్య నియమాం స్తీవ్రా న్భ్రశ్యంతే కామమన్యుభిః".

అని వాల్మీకియే వ్రాసికొనెను. తొలుత యోగభ్రష్టుఁడై మరల మహత్సంగముచేఁ దన యోగనిష్ఠను గొనసాగించుకొనఁగలిగెను. "మహత్సంగ స్తు, దుర్లభో, అగమ్యో, అమోఘశ్చ"యనినాఁడు నారదమహర్షి.

ధర్మవ్యతిరిక్త మగు కామమువలన మానవున కెటుల ముప్పు వాటిల్లునో రామాయణమునందు వాల్మీకిచేఁ బూర్తిగ వివరింపఁబడె నని నే నీవఱకె వ్రాసియుంటిని. దశరథుఁ డే తీరునఁ దన కామవివశత్వముచే మృతి నొందెనో కూడ వాకొనియున్నాను. కాని వాల్మీకి యరిషడ్వర్గములోఁ గామమునకే తన కావ్యమునందంత ప్రాముఖ్యము నిచ్చుటకుఁ గారణ మేమి? ఆ కామమే ధర్మబద్ధ మైనచో నయ్యది మానవునిమోక్షమున కెటులఁ గొంపోవును? ధర్మబద్ధ మగు కామ మెట్లుండును? ధర్మవ్యతిరిక్తకామ మన నేమి? వానియందలి భేదము వాల్మీకి యే తీరున గుర్తించెను? మున్నగు విషయములు మనము తెలిసికొనవలసియున్నవి. కింబహునా? శ్రీమద్రామాయణరచనకు వాల్మీకిమహర్షియం దుద్భవించిన కామమే మూల మని నే నీ వ్యాసమునందుఁ బొందుపఱచుచున్నాఁడను.

కామమే యీ నవరసాత్మక మగు ప్రపంచసృష్టికి మూలము "రసోవై సః"యను శ్రుతి యీశ్వరునిరసస్వరూపునిగాఁ బ్రతిపాదించుచున్నది. కావున నీ సృష్టి యంతయు రసమయ మనుట నిర్వివాదము. కామమునుండియే నవరసములందుఁ బ్రధానమగు శృంగారము పుట్టినది. అట్టి శృంగారరసముయొక్క పరిణామములే మిగిలిన రసము లనినఁ దప్పు కాదు. శృంగారము లేనిచోఁ గామోద్దీపనము కాదు. ఉద్దీపితకామమున కుపహతి కలిగినప్పుడు క్రోధ మావిర్భవించుచుండుట సహజము. శృంగార రసోత్పత్తికి స్త్రీ పురుషు లిరువురుఁగూడఁ గారణములు. ఒక్కపురుషునివలనంగాని యొక్కస్త్రీవలనఁగాని యీ ప్రవాహరూపమైన భూతసృష్టి నిర్వహింపఁబడఁజాలదు. వ్యాసాచార్యులు:—

శ్లో॥ "విలోక్యైకాంతభూతాని భూతాన్యాదౌ ప్రజాపతిః
స్త్రియం చక్రే స్వదేహార్ధం యయా పుంసాం మతి ర్వృతా॥"

(శ్రీమద్భాగవతము) అని కాశ్యపుఁడు దితియందు మోహాతిరేకముచేఁ దవులుకొని, తన కుమారుఁ డైన యింద్రునే జయించునట్టి పుత్రుఁడు తనకుఁ గలుగవలె నని దితి కోరుటచే నట్టి పుత్రు నామెకుఁ బ్రసాదింపవలసివచ్చె నని చెప్పియున్నాఁడు. భూత సృష్టికి వలెనే వాఙ్మయ సృష్టికిఁ గూడఁ గామమే మూల మని వేదము చెప్పుచున్నది. "ప్రజాపతి ర్వై ఇద మాసీత్ - తస్య వాగ్ద్వితీయా ఆసీత్ - తం మిథున మభవత్ - సా గర్భ మాధత్త - సాఽస్మా దపాక్రామత్ - సా ఇమాః ప్రజాః అసృజత - సా ప్రజాపతి మేవ పునః ప్రావిశత్" ఇత్యాది ప్రజాపతిసరస్వతులకలయికచే నీ సృష్టియంతయు వాఙ్మయరూపమునఁ బ్రసరించుచుండె నని వేదమువలన సువ్యక్తమగుచున్నది. "వాగ్వా ఽజో- వాచో వై ప్రజాః విశ్వకర్మా జజాన" అనుటచే నీ సృష్టియంతయు శబ్దమయము. "H. Sperber" అను పాశ్చాత్యవాఙ్మయశాస్త్రజ్ఞుఁడుగూడ నీ తీరునఁ గామమే వాఙ్మయ

సృష్టికిఁ గారణ మని నిరూపించెను :- "The sexual needs have had the largest share in the origin and development of language. The first sounds uttered were means of communication and summoning the sexual partner; and in the later development the elements of speech were used as an accompaniment, to the different kinds of work carried on by primitive man''.
అనఁగా "భాషోత్పత్తికి స్త్రీపురుషులప్రథమసంయోగసంబంధమే విశేష కారణ మనియు, భార్యాభర్తలు తమ పరస్పరభావస్పష్టీకరణ మొన రించుటకే తొలుత వాఙ్మయ ముపయోగించికొని యనంతరము వారి సంసారపోషణము, లోకయాత్రలకొఱకై యయ్యది విపులీకరింపఁబడె ననియు నా పండితుఁడు వాకొనెను. ప్రకృతిపురుషప్రథమసమావేశ సంభాషణమె ప్రణవనాద మనియు నద్దానినుండియే శబ్దమయప్రపంచ మంతయు నుత్పన్న మయ్యె ననియు మన మహర్షు లీవఱకే సిద్ధాంతీక రించియున్నారు. వే యేల? అనాదినుండి నేఁటివఱకు స్త్రీపురుషుల భోగసాధనములకై యనేకశాస్త్రములు, వివిధకళలు, యసంఖ్యాతపరి కరములును గనిపెట్టఁబడిన వని "Nay, more, that the sexual impulses have contributed to the highest cultural, artistic and social achievements of the human mind". అని "Freud" తత్త్వశాస్త్రజ్ఞుఁడు తెలిపియున్నాఁడు. యజ్ఞములు, వ్రతములు, తపములు, దానములు తుదకుఁ ద్యాగములుగూడఁ గామసంభవములు. స్త్రీపురుషానురాగప్రబోధితములు. కావ్యములుగూడ నేల కాకుండ నుండఁగలవు. "సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః, అనేన ప్రసవిష్యధ్వమేష వోస్త్విష్టకామధుక్" అని గీత తెలుపుచున్నది. కావ్యము కవి యొక్క యజ్ఞము. శబ్దములు మంత్రములు, రస మాజ్యము, పాత్రలు పాత్రములే, కామ మగ్ని. రామాయణకర్త యగు వాల్మీకి మూఁటితేఁటిన రసికుఁడు. అతఁడు జన్మచే దేవక్షత్రియుఁ డగుటచే స్వచ్ఛ మగు సాత్త్వికప్రవృత్తి హృదయమున సహజ

ముగఁ గలవాఁడు. అతఁడు "తారక" మంత్రోపదేశానంతరము తన పూర్వజీవితచరిత్రనుండి పూర్తిగ విముఖుఁడై యఖండితతపో నిమగ్నుఁ డయ్యెను. తన్మూలమునఁ దన పూర్వాశ్రమమునందలి దుష్ట కామము నంతయు నిరోధించివై చెను. కామమును నిర్జించుటకును నిరో ధించుటకును జాల వ్యత్యాసము కలదు. దానిని నిర్జించుటకుఁ బూర్వ మద్దాని నణంచినంగాని కేవల భోగమువలన నెన్నండును నుపశమిం పదు. ఆ విషయ మీవఱకే మనువుయొక్క వాక్యములచే నిరూపించి యుంటిని. చిరకాల మా ఋషిపుంగవుఁడు సమాధినిమగ్నుఁడై తన యోగసమాధిప్రభావముచేఁ దనయందలి నీచకామము నంతయుఁ బుట పక్వ మొనరించెను. కాని యియ్యది నిర్బీజము కాలేదు ! అతని మనో మయకోశమునం దెచ్చటనో యయ్యది డాఁగియుండెను. ఇటు లుండ నాయోగివర్యుఁ డొకానొక పుణ్యదివసంబునఁ(పుణ్యదివస మని నాయభి ప్రాయము. ఏలన నా దినముననే శ్రీమద్రామాయణమహాకావ్యము నకు బీజావాప మొనరింపఁబడెను కావున) దమసానదీజలంబులఁ గ్రుంకు లిడ నేఁగెను. అ ట్లేఁగినయాతఁడు జలంబుల దిగి స్నాన మాచరించుటకు మాఱుగ స్నానార్థము శిష్యునిచేతివల్కలమును గొనియు, నా నదీ తీరంబున నత్యంతరమణీయంబుగ వ్యాపించియుండిన వనప్రదేశంబున నటునిటుఁ దిరిగ్మ్సరఁజొచ్చెను ! కారణము ? దైవనియోగము! మానవ శక్తి కగోచరము. ఫలమువలన నా దైవము నెఱుంగవలసినదే. తమసా తీర మా ఋషిపుంగవుఁ డెఱుంగనిదా ? ఈవఱ కెన్నిసారు లా మహనీయుఁ డా నదియందుఁ దాన మొనరించియుండలేదు ? "Newton" మహాశయుఁ డా వఱ కెన్నిమాఱులు తన తోఁటలోని బదరీఫలములు నేల రాలుటఁజూచియుండఁడు ? ఎద్దియేని యొక నూతనవిషయమును లోకములోఁ బ్రవేశపెట్టుసంకల్ప మీశ్వరునకుఁ గలిగెనేని యాతఁడు తన యపూర్వచైతన్య మొక మానవమాత్రునియం దావిర్భవింపఁ

జేయుచుండుట క్రొత్త కాదు. కేవల మొక మనుష్యమాత్రుఁ డగు పరిపాలకున కొక వినూత్న సంకల్ప ముదయించెనేని యెందఱియం దా సంకల్పశక్తి సంచలనము కలిగింపదు ? ఈ సృష్టియందలి మనువు మొదలు మహామేరువువఱకుఁ బిపీలిక మొదలు బ్రహ్మపర్యంతము, ప్రతిచేతనాచేతపదార్థముకూడ నీశ్వరశక్తి ప్రేరితము లనుట యార్ష మతసిద్ధాంతము.

దానిని నేఁటిపాశ్చాత్య విద్యాప్రవీణులు "Determinism" అని యధిక్షేపించిన నాక్షేపింతురుగాక. అందునను మహత్తరోత్తేజకర సంఘటనములం దీశ్వరశక్తియు దాని యమోఘ సంచలనములు నీషన్మాత్ర జ్ఞానము గలవారలకు గోచరింపక మానవు. అయ్యది పై కేమియు నార్భాట మొనరింపకుండఁ జాపక్రింది నీరువలెఁ బ్రాఁకుచుండును. అట్టి యమోఘమహూర్తావిర్భావమునే శ్రీరామచంద్రుఁడు "నను దైవస్య కర్మ తత్" అనెను. కడకు సృష్టికర్త యగు బ్రహ్మ వాల్మీక్యాశ్రమమునకు దిగివచ్చి "మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ"యని యుద్ఘోషించినమీఁదటనైన నాస్తికవాదు లా దైవ నియోగమును నమ్మకుండిన నుండవచ్చునుగాని, యే యాస్తికుఁడు కా దని యనగలఁడు ? వాల్మీకి స్నానార్థ మా నాఁడుబయలువెడలి తమసాతీరవనవిహారమునకు దిగెను! దానివలనం గలిగిన సంఘటనము ? నాఁటితో నా మునివర్యుని హృదయకోశమునం దెచ్చటనో డాఁగియుండిన కామబీజము పై కుబికి యయ్యది యొక మహత్తర కావ్య రూపమున నీ లోకమునం దావిర్భవించెను ! ఆ మహాత్ముని హృదయక్షేత్రమందుఁ బూర్వాశ్రమమునందలి శృంగారరసానుభూతి సంస్కార బీజము కరుణారసతరంగితమై శోకరూపము దాల్చి యాతనికన్నీటి నుండి యసమాన క్రోధవహ్ని బయలువెడలి లోకమునందలి మానవ కోటి పాపాటవుల దహించు సామర్థ్యము గల శబ్దోత్పత్తికిఁ గారణ

మయ్యెను! ఆహా! మహాత్ముల కామమువలనఁగూడ లోకమున కంత యుపకృతి కలుగఁగలదు! దశరథుని పుత్రకామేష్టియం దెందఱు చేసనాఁడలు సత్కరింపఁబడలేదు! అందలి రహస్యము ఋషులకే తెలియును. కానున్న యజ్ఞసంరక్షణార్థము గొంపోయిన రామచంద్రునకు సీతాకళ్యాణ మేల నా విశ్వామిత్రుఁడు గావించును! త్యాగయ్య పైఁగ "మాజానకి చెట్టబట్టగ మహారాజవైతివని" ఎలుఁగెత్తి పాడెను! నీచులగువారికామమో? అది వాలిరావణాదులకామము వలె సర్వవినాశహేతు వగును. అయ్యది లోకోద్వేజనకము. తుచ్ఛము.

వాల్మీకి యా నాఁడు తమసాతీరంబునఁ దిరుగులాడుచుండిన సమయంబున నాతఁడొక క్రౌంచమిథునము కలియుచుండుట గమనించెను. మిథునవ్యాపారనిమగ్నమై, మహత్తరానందసుఖ మనుభవించుచుండిన యా క్రౌంచయుగ్మములోని మగపులుంగు నొక వ్యాధుఁడు తన బాణముచేఁ జంపివైచెను! ఆ పక్షిద్వయమిథునానందపారవశ్యముతో పాటుగ నా మానిహృదయ మొక విలక్షణ శృంగారరసస్థాయి నందెను. అట్టియనిర్వాచ్యరసానుభూతియం దోలలాడుచుండిన యా ఋషివర్యునిహృదయ మొక్కసారిగ వ్యాధబాణముచే నిర్భిన్నమైనట్లయ్యెను! తా ననుభవించెడి యానందమున కతినిష్ఠురమైన విరుద్ధపరిస్థితిఘటనము సంభవించుటం జేసి యా యుదారుని మానసమున విషాదము, జుగుప్స రేకెత్తి వానివలన శోకాగ్ని త్రుటిలో రగుల్కొని యయ్యది తన రసానుభూతి కంతరాయము కలిగించిన వ్యాధునిదెస క్రోధావేశముగఁ బరిణమించెను!

ఇచ్చటఁ బాఠకుల కొక సందేహము కలుగవచ్చును. వాల్మీకికిఁ గామోద్రేకము కలిగినటుల శ్రీమద్రామాయణమునం దెచ్చటను జెప్పఁబడియుండలేదా! "శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు

నాఽన్యథా''యనిమాత్రమే శిష్యునితో వాల్మీకి యనినటుల రామాయణ పీఠికయందు వ్రాయఁబడినదికదా యనవచ్చును. అయ్యది సరి కాదు. బుద్ధిమంతు లగువార లెవ్వరును దమకుఁ గామవికారము కలిగినప్పుడు దానివలనఁ గలిగిన మనోవైకల్యమును బైకి వెలిఁబుచ్చరు. దీనికి పాశ్చాత్యమన స్తత్త్వశాస్త్రజ్ఞుఁ డగు 'Freud' 'Sexual Censorsip' అని పేర్కొనెను.అతని కట్టి శృంగార రసాభినివేశము కలిగియుండనిచోఁ క్రౌంచమిథునములో నొక పక్షిని వేటకాఁడు కొట్టినందుల కేల నా ముని శోకింపవలెను? పక్షులను మృగములను వేటాడుట ప్రభువులకుఁ గూడ సలవాటు కదా? పాండురాజు వంటి ప్రాజ్ఞుఁడే మృగమిథునమును గొట్టె నని వ్యాసుఁడు రచించెను.దైవయోగముననయ్యది ఋషిమిథున మగుట తటస్థించుటచే నా రాజునకు శాపము గలిగెనుగాని యయ్యది సాధారణ మగు మృగమిథున మైనచో? ఇఁక నొకమూర్ఖుఁ డగు బోయవాఁడు కొట్టుటచే వాల్మీకియట్టిధీరుఁడు శోకింపవచ్చునా ? తొలుదొల్త నా మిథునము విహరించుచుండ నా ఋషి యచ్చట నేల నుండవలెను? యోగనిష్ఠ ననుష్ఠించువారు మిథునీభూత మగుచుండునట్టి కాలములందు జంతువులను జూచుట నిషిద్ధముకదా? కాలవశమున నట్టి సన్నివేశ మొకటి తనకంటఁబడిన నచ్చటనుండి యతఁడు పరాఙ్ముఖుఁడు గావలెను. అటు లగుటకుఁగూడ వీలు లేకున్నయెడ శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పినట్లుగ "సర్వస్వభావకర్మాణి న ప్రశంసే న్న గర్హయేత్ విశ్వ మేకాత్మకం పశ్య న్ప్రకృత్యా పురుషేణ చ॥ "సర్వస్వభావ కర్మాణి యః ప్రశంసతి నిందతి స ఆశు భ్రంశతే స్వార్థాత్ అసత్యాభినివేశతః॥'' ఆరీతిగ విహరించుట పక్షులస్వభావ మనియు వానిని వధించి తన్మాంసముచే జీవించు టా కిరాతుని స్వభావమని యేల తలంపలేదు? అట్టి విషయ సంభోగ సందర్శనాదులవలనఁ గలిగెడి సుఖదుఃఖములు నిస్సంగి యోగులకుఁ దగునా ? కావున నాతీరున వాల్మీకి

యీనాఁడు రాగవ్యసనగతుం డగుటకుఁ గారణ మామునివర్యుని హృదయ కుహరమును బూర్వాశ్రమవాసనాబీజము నిశ్శేషముగ వీడి యుండలేదనుట స్పష్టము. నిద్రాబలముచేఁ గుంభకర్ణుఁ డాహార వ్యవాయములను మఱచినటుల తన యోగబలముచే వాల్మీకి తనయందలి పూర్వ సంస్కారముల నణంచెనేగాని నిర్జింపలేదు. దానికాతఁ డింకొక జన్మ మెత్తవలసియుండెను. కాని యీశ్వరున కా ఋషివర్యునికి జన్మ పరంపర ప్రసాదించుట కిష్టములేదు. అందుచే నాతని కా క్రౌంచమిథున దృశ్యమును జూపి యా "వజ్ర పంజర నిభంబైన" యాతని హృదయ మును మథించి యందుండి మరందనిష్యంది యగు మహాకావ్యము నుప్పతిల్లునట్లుగ నావిష్కరించి యనుగ్రహించెను! మహానదులుకూడఁ దొలుదొల్త గిరి రంధ్రములనుండి స్రవించెడి చిన్నచిన్న నీటిబిందువు లచే నేర్పడినవే. కేవలమొక పక్షికైన కరుణరసమున కంత హృదయ మథనశక్తియుండుననుట లోక స్వభావ విరుద్ధము. కాలముచే నయ్యది క్రమక్రమముగ నుపహత మగును. కామమట్లు నశింపదు. గాంధి మహాత్ముఁడు తన స్వీయ చరిత్రయందు, తండ్రి మరణవేదన నొందుచుండి నను నాతఁడు భార్యను వీడి యీవలకు రాఁజాలకుండె నని వ్రాసికొని యున్నాఁడు!

సర్వసాధారణముగఁ గామోద్రేకము గల స్వభావము కలవా రొక శృంగారరసదృశ్యమును జూచుట తటస్థించెనేని వారుపూర్తిగ నా యా వస్తువులతోఁ దాదాత్మ్యమును జెందుట తప్పదని పాశ్చాత్య మన స్తత్త్వశాస్త్రజ్ఞుఁ డగు "Freud" తాను రచించిన "A General Introduction to psycho-Analysis" అను గ్రంథమునఁ జెప్పియు న్నాఁడు. ఆతఁ డొక సన్నివేశమును వర్ణించుచుఁ జెప్పిన వాక్యములు మన వాల్మీకి యెడ సందర్భించుటచే నిట నుదాహరించుచున్నాను :-

"But, when the condition of love is developed to its fullest intensity altruism coincides with investment of an object with libido. As a rule the sexual object draws itself a portion of the ego's narcissim, which becomes apparent in what is called the "sexual over-estimation", of the object. If to this is added an altruism directed towards the object and derived from the egoism of the lover, the sexual object becomes supreme ; it has evidently swallowed up the ego". ఈవాక్యముల నాతఁడు సమర్థించుటకు "Gothe's" "West Ostliche Divan" అనెడి కథనుండి విపులముగ నిరూపించెను. దిజ్మాత్రముగఁ బైదాని కర్థము నిందు సూచించుచున్నాను. "ప్రేమ యుద్రేకస్థితి నొందు నప్పుడు నిరవధికమై యా ప్రేమి తాను దర్శించెడి వస్తువుతోఁ దాదాత్మ్యముఁజెందును. అప్పుడావస్తు వాతని హృదయము నాకర్షించి యాతనివ్యక్తిత్వమును విలీనము గావించును. అట్టి తఱి నావస్తువు నా కామాతురుఁ డారాధించుట తటస్థించును. దానికిఁ దోడుగ నా విమోహితుని హృదయములోని ప్రేమరసము విజృంభించి యావస్తువు దెస వెల్లి విరియ మొదలిడెనేని యా ప్రేమాస్పద మగు వస్తువే విశ్వరూపమై ప్రియుని యాత్మవిస్మృతిని గూడ నాపాదింపఁగలదు." ఇట్టి యుద్రేకస్థితినే కాళిదాసు "కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు"అని యుల్లేఖించి యున్నాఁడు. అట్టి దిగ్భ్రమస్థితియే, నాఁడు వాల్మీకి కి సంప్రాప్తించెను. స్వప్నము నందు వ్యాఘ్రమును గాంచి భీతిచెందిన వాని భయోత్కంపము జాగ్రదవస్థ కాతఁడు వచ్చినను వీడని యట్లుగ, నా యుదారుఁ డా క్రౌంచమిథునదృశ్యమును వీడఁజాలకుండెను !

శ్లో॥ "ఉపవిష్టే తదా తస్మిన్ సాక్షా ల్లోకపితామహే

"తద్గతేనైవ మనసా వాల్మీకిర్ధ్యానమాస్థితః"(రామాయణము).

"సాక్షాల్లోకపితామహుం" డావిర్భవించినను, వచ్చి కూర్చుండియున్న

నాతని కాపూర్వోద్రేకస్థితి యుపశమింపలేదు! హేతు వేమి? కేవల కరుణమా! "ఈ నీరాశ నిశేల వచ్చితి" నని గజేంద్రునివలె నొక వంక కామసంజనితోద్రేకము, వేఱొకవంక వ్యాధబాణవ్యథ. అటు తరువాత వాని నప్రియత్నముగ శపించుటచేఁ గలిగిన జుగుప్స, సుఖానుభూతిసమయమునఁ జచ్చిన పక్షిపై కరుణ, తుదకట్టి విపరీత రసాభాసములచేఁ గలిగిన దన యోగభంగమునకుఁ బశ్చాత్తాపము, నందులకుఁ బ్రాయశ్చిత్త మేమనఁ బరితాపము. ఇన్ని విరోధరసము లాతని మానసము కలంచివైచి భూకంపము నందలి యగ్నిపర్వతమువలె నుడికించు చుండెను. స్మశానవాటిక దృశ్యమునందలి హరిశ్చంద్రున కింద్రాదులు ప్రత్యక్షమైన నాతఁడు సరకుగొననియట్లుగ నా బ్రహ్మ సత్యలోకమునుండి వచ్చి యెదుటఁ గూర్చున్నను వాల్మీకి మనసు ప్రసన్నత నొందలేదు! ఎదియో యభూతకల్పనములతో నొక విషమసంఘటనమును గల్పించి యారూఢులగు యోగులను భ్రష్ట మొనరించుట దేవతల కలవాటని యాతని హృదయము కొట్టుకొనుచుండెను. కాని దానికిఁ గారణ మాఋషి హృదయమందలి కామబీజమే యని యాతఁ డెఱుంగనంత సూక్ష్మతరముగ నయ్యది యాతని తబ్బిబ్బొనర్చె నని యాతఁ డూహింపలేదు! అటు లనుటచే నంతసూక్ష్మముగ నున్న బీజ మాక్రౌంచమిథునమును జూచినంతటనే యంతగ నుద్రేకించునా యని పాఠకులు ప్రశ్నింపవచ్చును. ఈవిషయమున Freud మహాశయుఁడొక యుదాహరణము నిచ్చియున్నాఁడు:—

"A man to whom genitals and all the attractions in a woman now mean nothing, can be aroused to irresistable sexual excitation only by a shoe-clad foot of a certain shape; he can remember an event in his sixth year which determined this fixation of libido",

"ప్రకృతమునఁ దనకు స్త్రీజనావయవ సందర్శనముచేఁగూడ నెట్టి కామోద్రేకము జనింపకున్నను, కాలవశమున నట్టి పురుషుఁడొకా

నొక విధమగు కాలిజోడు కలిగిన స్త్రీ పాదమును జూచుట తటస్థించె నేని యాతనియం దనివారణీయ మగు కామోద్రేకము పొడసూపఁ గలదు! అట్టి యపూర్వ సంఘటనమున కాతని యాఅవయేటఁజూచిన యొక పాదచిహ్న స్థానమే యని నిశ్చయింపవలసియున్నది”. మనము కళాపూర్ణోదయములోని శాలీనుని కథ జదివితిమేని యట్టి సన్నివేశము లెందులకుఁ గలుగునో కొంత యర్థము కాక మానదు. ప్రపంచములోని శక్తు లన్నింటిలోఁ గామమును మించిన శక్తి లేదు. అయ్యదియే గజేంద్రుని బంధించిన యహస్యశస్త్రము! అది అజేయము. “ఇంద్రియాణాం మనశ్చాస్మి” అని నాఁడు భగవంతుఁడు. కాముఁడు మనసిజుఁడు. అందుచేతనే బ్రహ్మాదిదేవతలు విష్ణువు నాశ్రయించి ““యీ దశముఖుని బాధ మనుష్యావతార మెత్తి నీవు తొలంగింపుమని” యాతనిపై సవాలు చేసినారు! ప్రహ్లాదునియట్టి పరమభక్త శిఖామణిగూడ నీ కామమునకు భీతిల్లినాఁడు :—

శ్లో॥ జిహ్వైకతోఽచ్యుతవికర్షతిమా వితృప్తా ।
శిశ్నోఽన్యతస్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యత శ్చపల దృక్క్వచ కర్మశక్తిః
బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి” (భాగవతము).

అట్టి మనసిజశక్తిని జయించుటకొక్కటియే మార్గమని బ్రహ్మ వాల్మీకి కుపదేశించి వెడలిపోయెను. అయ్యది నిర్జితకాముఁడగు రామునిచరిత్రను రచించినం గాని వాల్మీకి తరించు నుపాయము లేదు. కృష్ణభగవానుఁడు నుడివినటుల నొక్కటే మార్గము వాల్మీకికి సులభ మైనది.

శ్లో॥ “యోగినోఽపక్వయోగస్య యుంజతః కామ ఉత్థితైః ।
ఉపసర్గై ర్విహన్యేత తత్రాయం విహితో విధిః ॥
“కాంశ్చి న్మే మనుధ్యానా న్నామసంకీర్తనా దిభిః ।
యోగేశ్వరానువృత్త్యా చ హన్యాదశుభా ఞ్ఛుభైః”

(భాగవతము)

ఆ రీతిగ విరించి యా తపోధనుని హెచ్చరించి వెడలిపోయెను.

కామోద్రేకమునుండి కావ్యము వెడలునాయని శంకింపవలదు. అట్టి యుద్రిక్త హృదయమొక సాత్త్వికుని దయ్యేనేని యయ్యది రస భావబంధురమై దివ్యతేజముచే నలరారఁగలదు. "తేజో మ యీవా" క్కని వేదము చెప్పుచున్నది. స్వాత్త్వికుని హృదయ మెండు కట్టియవంటిది. రాజస తామస హృదయములు పచ్చికట్టెలు. మన మొక పచ్చికట్టెను గాల్చినచో నయ్యది యుడికి తన స్వరూపమును గోల్పోవుటయేకాక దానిని ముట్టినచో మనచేయికూడఁ గాలును. దానియందలి యుష్ణతచే నెట్టి యుపకృతి లోకమున కుండదు. ఎండు కట్టెను గాల్చినచో నందలియుష్ణముచే షడ్రసోపేత మగు చక్కని పాక మును దయారుసేసి దేవతాతిథిపూజన మొనరించి మనము సుఖముగ భుజించుటయే కాక నాకట్టెమండుటచేఁ గలిగిన దీప్తివలన మన పరిసరముల నావరించి బాధించునట్టి యంధకారమును బాఱఁదోలఁగలము. ఆ తీరు ననే పరమసాత్త్వికులయందలి కామక్రోధాదులు గూడ లోకోపకారక ములు. విశ్వామిత్రుని యలుకచే హరిశ్చంద్రుఁడు శాశ్వతకీర్తి గాంచెను. అగస్త్యుని శాపముచే నింద్రద్యుమ్నుఁ డొక్క జన్మలో విష్ణుని బ్రత్యక్ష మొనరించుకొనఁ గలిగెను ! వాల్మీకి మహర్షి హృదయముగూడ పరమసాత్త్వికమగుట చేతనే మెల్లఁగ నాతని హృద యావేదన మంతయుఁ గ్రమముగఁ దేఱికొనుటనే పాశ్చాత్యులు "Sublimation of sexual impulse" అందురు. అయ్యది యోగ్యులకే సాధ్యము. మహాభక్తుల కది తృణప్రాయము. Love is an intoxication" అనినాఁ డొక మహాకవి. అట్టి యున్మత్తత నుండి విడివడుట కీ తీరున వ్యాసుఁ డుపాయమును సూచించియున్నాఁడు. అయ్యది కృష్ణభగ వానుఁడు గోపికలతో ననియున్నాఁడు :—

శ్లో॥ "న, మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే ।
భర్జితాః క్వథితా ధానాః ప్రాయో బీజాయ నేష్యతే"॥

కావునఁ దన కామబీజము నీ శ్వరావతారమగు శ్రీరామచంద్రుని యశో వర్ణనముచే నిర్బీజ మొనరించుకొనఁ దలంచినాఁడు వాల్మీకి. తనశృంగార రసాభినివేశమంతయు సీతారాముల యందు మూర్తీభవింపఁ జేసెను. కాకున్న "దర్శయంతి శరన్నద్యః" "మీనోప సందర్శిత మేఖలానాం" "చంచచ్చంద్రకరస్ప" ర్శేత్యాది వాక్యములు రామచంద్రుఁడు తన సోదరునితోననునా! "రేమిరే ముదితాస్సర్వాః భర్తృభిస్సహితారహః" యని బాలకాండలో పండ్రెండేండ్ల బాలు రాఱు వత్సరముల బాలిక లతో రహస్యమునఁ గ్రీడించిరని వాల్మీకి రచించెనే! శ్రీరామచంద్రుని మర్మావయవములుగూడ నాంజనేయునిచే సీత యెదుట వర్ణింపఁజేయుట శృంగార రసానుభూతియా? కరుణరసమా? సుందరకాండ యన నర్థ మేమి? శ్రీరామలక్ష్మణు లింద్రజిత్తుని "సర్పశిలీముఖ" ములచే బంధింపఁబడినతఱి రావణుఁడు తన విమానములో సీతను గొనిపోయి, రామ లక్ష్మణులు తన కుమారునిచేఁజంపఁబడిన దృశ్యమును జూపుమని త్రిజట కాజ్ఞాపించిన తఱి యామె సీతను గొనిపోయి దారుణమగు నా దృశ్య మును జూపుచుండ సీతచే "స్తనౌ చావిరళౌ పీనౌ మమేమౌ మగ్న చూచుకౌ" అని వాల్మీకి యనిపించుట కేమన వలయును? ఎంత నిగ్రహించినను వాల్మీకి హృద్గత శృంగార రసోద్రేకమా తీరున ప్రతిఘట్ట మునందును బొంగి పొరలుచుండి నటుల మనకుఁ జూపట్టక మానదు. Signor Moravia యను ఇటలీ దేశ పండితుఁడు "I mean, rather, that the writer should become the preson he is writing about" "కవికిఁ దాను రచించెడి కావ్యములోని నాయకుఁడుగూడఁ దన ప్రతి బింబము కాకతప్ప"దని నిర్ణయించెను.

## వాల్మీకి శాపవాక్యము.

శ్లో॥ "మానిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితమ్"॥

ఈ శ్లోకమువిషయమై గోవిందరాజ మహేశతీర్థాదు లతివిపులముగఁ జర్చలకు దిగి విమర్శించి తమకుఁ దోఁచిన రీతి నర్థనిర్ణయము మొనరించిరి. వా రొనరించిన వ్యాఖ్యానము లన్నియు నిట నుల్లేఖించుట చర్వితచర్వణ మగును. ఇందు వాల్మీకి వ్యాధుని శపింపఁబోయి యప్రయత్నముగఁ దన జీవితచర్యనే ప్రతిబింబించునట్టి యొక స్తావక వాక్యమును పలికి యయ్యది శాపవాక్య మనియు శోకముచే నుత్పన్నమైన శ్లోకమనియు భ్రాంతి నొందెను. నేను రచించిన తీరునఁ బెక్కువిరోధరసము లొకేసారి యాపరమశాంతుని హృదయమునందుయ్యాఁతలూఁగుచుండుటచే నాతఁడు విభ్రమము చెందుట సహజమని లోకానుభవముగలవారి కెల్లరకును దెలియని విషయము కాదు. ధీరశాంతుని ముఖమునుండి యపశబ్ద ముచ్చరింపఁబడదు. వరూధిని ప్రవరు నాలింగన మొనరించుకొనినతఱి నాతఁడు "హా శ్రీహరీ" యని పలికెనే గాని "ఓసీ! ముండా" యని యనలేదు. ఈ శ్లోకమునందలి "మా, అగమః" యను పదములు వాల్మీకి సహజసాత్త్విక హృదయమును వ్యక్త మొనరించుచున్నవి. "Freud" మహాశయుఁడు తన "Psycho-Analysis" గ్రంథమున "Slip of the tongue" అనగా నోరు జాఱుటందువలననని విమర్శించి యీ క్రింది యభిప్రాయముల నొసంగియున్నాఁడు:—

"They are not accidents, they are serious mental acts they have their meanings, they arise through the concurrance, perhaps, better, the mutual interference, of the different intentions".

"The Commonest and also the most noticible form of slip of the tongue, however, is that of saying the exact opposite of what one meant to say".

# వ్యక్తి వివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.,

ధర్మములు కలవాఁడు పుట్టఁగలఁడు—అనినపుడు "స కోఽప్యుత్పత్స్యతే యం ప్రతి యత్నో మే సఫలీ భవిష్యతి— "ఎవని విషయమున నాయత్నము సఫలమగునో, వాఁడెవఁడో యొకఁడు పుట్టఁగలఁడు" అని యుండవలయును—అనఁగా యత్ (ఎవఁడు) శబ్దము, తత్ శబ్దము (వాఁడు) రెండును నిచట నర్థబల లభ్యములై, యూహ్యములే యగుచున్నవి —

"యశ్చైకవాక్యే కర్తృత్వే నోక్తో యశ్చేద మాదిభిః
తచ్ఛబ్దేన పరామర్శో న తయో రుపపద్యతే (6)
యతోఽ ధ్యక్షాయమాణోఽర్థః స తేభ్యః ప్రతిపద్యతే
న చాసౌ తత్పరామర్శసహిష్ణు రసమన్వయాత్" (7)

(అన్తరశ్లోకములు)

ఒకే వాక్యమునం దేది కర్తగాఁ జెప్పఁబడినదో, యేది "ఇదమ్" మొదలగు శబ్దములచేఁ జెప్పఁబడినదో, ఆ రెంటిని తత్ శబ్దముతోఁ బరామర్శ సేయఁగూడదు. ఏలన—కర్తృవాచక పదముయొక్క యర్థమును, "ఇదమ్, అదస్, ఏతత్" శబ్దముల యర్థములును, నెదుటఁ గన్పడునవిగ నుండును. (ప్రత్యక్షాయమాణములు) ఎచ్చటనో యున్న వస్తువును దెల్పు తచ్ఛబ్ద మెదుటనున్న యర్థములను, పరామర్శించుట యుచితముగ నుండదు.

ఉదా॥ (1) "స వః శశికలామౌళిః తాదాత్మ్యాయోపకల్పతామ్"

సః=ఆ, శశికలామౌళిః=శివుఁడు, వః=మీయొక్క, తాదాత్మ్యాయ=శశికలామౌళి స్వరూపమువచ్చుటకొఱకు, ఉపకల్పతామ్=అగుఁగాక—

(2) "ద్వైతబుద్ధి మపాస్యేమాం సా హి సర్వాపదాం పదమ్"

ఇమాం = ఈ, ద్వైతబుద్ధిం=నేను, నీవను ద్వైతబుద్ధిని, అపాస్య వదలి; సాహి = ఆ ద్వైతబుద్ధి, సర్వాపదాం=అన్ని ఆపదలకును, పదం=స్థానము—

(1) "శశికలామాలిః తాదాత్మ్యాయ"— ఈ వాక్యములో "శశికలామాలి" కర్త—శశికలామాలి పదము కర్తృవాచక పదము. "తాదాత్మ్యాయ" అను పదములో నన్తర్భూతముగ, తచ్ఛబ్ద మున్నది. సహజముగ దూరస్థమగు నర్థమునే పరామర్శించు నీ తత్ శబ్ద మచట, ప్రత్యక్షాయమాణమై, కర్తృవాచక మగు "శశికళామాలి"ని పరామర్శించుట యుచితము గాదు. అందుచే నిచట "ఐకాత్మ్యయోపకల్పతామ్" అని యున్నచో బాగుండెడిది.—అటులే రెండవ యుదాహరణములో "ఇమాం" అను శబ్దము, మన కెదురుగ నున్న యర్థమునే తెల్పును. ఇట్టి యీ పదమును దూరమునం దున్న వస్తువును దెల్పు తచ్ఛబ్దముతో ("సా") బరామర్శించుటయు నుచితముగాదు. "ఏషా హి విపదాం పదం" అని యున్నచో నిర్దుష్టముగ నుండును.— ఇపుడు "ఏతత్" (ఏషా)శబ్దముగూడ సన్నిహిత వస్తువునే తెల్పున దగుటచే పై దోషము రాదు. "ఇమాం" అను పదముయొక్క స్థానములో, సన్నిహిత వస్తువులనే తెలుపు "ఏతాం" "అమూం" పదము లున్నను నీ దోషములే సంభవించును. (సాహి సర్వాపదాం పదం-అను పాఠమే యున్నపుడు, ఏతాం, అమూం పదము లున్నను దోష ముండును.ఏషా హి అని పాఠ మున్నపుడు దోషము లేదు.)

యచ్ఛబ్ద సమన్వయ రీతులు—

ఇవి రెండు రకములుగ నుండును. (1) పూర్వమే యుపక్రాన్త మైన యర్థముఁ దెల్పుటకు మన మొక తచ్ఛబ్దము నూహింతుము. ఈ కల్పిత మైన తచ్ఛబ్దముతో యచ్ఛబ్ద మన్వయించును. కుమార సంభవ కావ్యమున "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః""హిమాలయ మను నొక నగాధిరాజము గలదు"—అని హిమాలయ పర్వత ముపక్రాన్తమైనది- దానిని బరామర్శించుటకు "సః" అను పదము లేదు. కాని మనము కల్పింతుము, కల్పిత మైన యీ

తచ్ఛబ్దముతో "యం సర్వశైలాః పరికల్ప్య వత్సం" అను శ్లోకములోని యత్ (యం)శబ్ద మన్వయించును. ("స మానసీం మేరుసఖః పితౄణాం" అను పద్యములో 'సః'అనుపదముతో నీ యచ్ఛబ్ద మన్వయించు ననుట యుచితము గాదు, గ్రంథకర్తకును నభీష్ట మైనది గాదు.)

(2) పూర్వము ప్రక్రాన్త మగు వస్తు వొకటి యున్నది-దానికిఁ గర్మగనో, కరణముగనో యన్వయించు మఱియొక పదార్థ మున్నది. ఈ యర్థముగూడ నచట శబ్దోపాత్తముగాదు. మనము కల్పింపవలసినదే.

ఇట్లు మనము కల్పించినయర్థమునే పరామర్శించుటకు "తత్" శబ్దమునుగూడ నొకదానిని మనము కల్పింతుము. శబ్దరూపముగ నుపాత్తమైన యచ్ఛబ్దము మనము కల్పించిన యీ తచ్ఛబ్దమును బరామర్శ చేయును.—పూర్వము విశేష్య ముపాత్తమైనది. తచ్ఛబ్దము నొకదానినే కల్పించినాము. ప్రస్తుతము కర్మాదికమును బోధించు విశేష్యవాచక పదమును, దానిని బరామర్శించు "తత్" పదమును గూడఁ గల్పించుకొనుచున్నాము.

ఉదా॥ ఆత్మా జానాతి యత్, పాపం మాతా జానాతి యత్ పితా॥
ఇచట "ఆత్మాజానాతియత్— అనుచోట—కర్మవాచకపదములేదు. "ఆత్మ దేనిని తెలిసికొనునో," అనునపుడు 'తెలిసికొనుట' యను క్రియకుఁ గర్మను దెలుపు పదము లేదు.—దానిని మన మూహింపవలయును. ఇట్లూహించిన కర్మాదివాచక పదమును బరామర్శించుటకుఁ దత్ శబ్దమునుగూడఁ గల్పింతుము. ఈ తత్పదముతో నిచట నున్న యత్ పదము సమన్వయించును.—

"యత్ తదూర్జిత మత్యుగ్రం క్షాత్రం తేజోఽస్య భూపతేః
దీవ్యతాఽక్షై స్తదానేన నూనం తదపి హారితమ్"

అర్థము—

అస్య భూపతేః= ఈ రాజునకు, తత్ =ప్రసిద్ధమైనట్టియు, ఊర్జితమ్, అత్యుగ్రం=దృఢమైనట్టియు, భయంకరమైనట్టియు, క్షాత్రం

తేజః = క్షత్రియ తేజస్సు, యత్ = ఏదికలదో, తదపి = అదియును, అక్షైః దీవ్యతా అనేన హారితమ్ = పాచికల నాడిన (జూద మాడిన) యితనిచేత బోఁగొట్టుకొనఁబడినది.—

ఈ పద్యములో రెండు తత్పదము లున్నవి. "యత్" పద మొకటియే యున్నది. అయినను, పూర్వము చెప్పిన రీతి నిచ్చటఁగూడ శబ్దార్థ సంబంధములు రెండేగాని యంతకు మించి లేవు.— "యత్తత్" అను చోట నున్న "యచ్ఛబ్దము" తదపి అనుచోట నున్న తచ్ఛబ్దముతో నన్వయించును.

ఇంతవఱ కిది శాబ్ద మగు సంబంధమే యగును. "తదూర్జితమ్" అనునపుడు లోకప్రసిద్ధమైన యీ తేజస్సును బరామర్శించుటకై మనము కల్పించుకొన్న 'యత్' శబ్దముతో నీ తచ్ఛబ్ద మన్వయించును. ఇచటఁ గల్పితమైన 'యత్' పదముతో శబ్దోపాత్తమైన తత్పద మన్వయించుటచే నీ 'యచ్ఛబ్ద' సంబంధ మార్థమైనది.

ప్రస్తుతము "సంరంభః కరికీట" అనుపద్యములో నాల్గవపాదములో 'యోఽసౌ' అనుచోట 'యచ్ఛ' బ్దమొకటియే యున్నది. దానికి సరియగు తచ్ఛబ్దములేదు. ఇంతకుఁబూర్వము ప్రక్రాన్తమైన యర్థమును బోధించు తచ్ఛబ్దముతో దీనికి సమన్వయముఁ జేయుద మన్నను, ముక్తకజాతికిఁ జెందిన యీ పద్యమునకుఁ బూర్వోత్తరపద్యసందర్భములతో సంబంధము లేకుండుటచే నదియును బొసఁగదు. 'యోఽసౌ' అను పదములతో నుపక్రాన్తమైన యీనాల్గవపాదములోనే పైనున్న 'అంబికాకేసరీ' అను పదమును బరామర్శించు తచ్ఛబ్దమును మనము కల్పించి దానితో నీ యచ్ఛబ్దమునకు సమన్వయముఁ జేయరాదా యని యెవరైనఁ బ్రశ్నింపవచ్చును. కాని యట్లు చేయుట యుచితము గాదు. మొదటనే విశేష్యవాచకపదముండి, తరువాత యచ్ఛబ్ద ముండుచో, మొదటఁ దచ్ఛబ్దములేకున్నను నపుడు గల్పింపవచ్చును. మొదటనే యచ్ఛబ్ద

మున్నచో తరువాత తచ్ఛబ్ద మవశ్యము శబ్దరూపమున నుపాత్తము గా వలయునేగాని,యూహాకల్పితము గారాదు. అట్లు పీ లగుచో "యత్ కోపాగ్నౌ శలభతాం లేభే కామః శివోఽవతాత్ 'అనుచోట' సః శివోఽవతాత్' అని మనము 'సః' అను పదమును గల్పించి 'ఎవని కోపాగ్నికి, మన్మథుడు శలభమై పోయెనో, యాశివుఁడు మిమ్ము రక్షించుఁగాక' యని యర్థమునుఁజెప్పి యీవాక్యముగూడ సరియైనదేయని యంగీకరింపవలసివచ్చును. కాని యిట్టి వాక్యములు సరియైనవని విజ్ఞు లంగీకరించుటలేదు. కావున 'సంరంభః' అను పద్యములోఁ గేవలయచ్ఛబ్దప్రయోగ ముచితమైనదికాదు,

ఆక్షేపము:—కేవల యచ్ఛబ్దము లేయున్న శిష్టప్రయోగములు గూడ నున్నవి.

ఉదా:-'మీలితం యదభిరామతాధికే సాధు చంద్రమసి పుష్కరైః కృతమ్

ఉద్యతా జయిని కామినీముఖే తేన సాహస మనుష్ఠితం పునః'.

అ ర్థ ము :—అభిరామతాధికే=అధికసౌందర్యముగల, చంద్రమసి=చంద్రుఁడుండఁగా, పుష్కరైః=పద్మములచేత,మీలితంయత్=ముకుళింపఁబడినదనెడి దేదిగలదో (తత్=అది) సాధు=మంచిపని, జయిని కామినీముఖేసతి= అధికసౌందర్యముగల (తనను జయించుశీలముగల) స్త్రీ ముఖ ముండఁగా, ఉద్యతా=ఉదయించుచున్న, తేనపునః=ఆచంద్రునిచేతనైతే, సాహసమనుష్ఠితం=సాహసమే చేయఁబడినది.

ఇచటఁగూడ యచ్ఛబ్దమొక్కటియేయున్నను, పద్యము సమన్వితమగుచునేయుండుటచే 'సంరంభః కరికీట' పద్యములోఁగూడ యచ్ఛబ్దమొకటియే ప్రయుక్తమైనను దోషమేమియును లేదని యేల చెప్పఁగూడదు?

సమాధానము :— ఈపద్యములో యచ్ఛబ్దమునకుఁగల సంబంధములో దోష మేమియును లేదు. పద్యక్రమములోనే దోషమున్నది.

"సాధుచంద్రమసి పుష్కరైః కృతమ్, మీలితం యదభిరామతాధికే" అని పద్యపాదముల క్రమ మున్నచో బాగుండెడిది. ఇపుడు 'సాధు' పదార్థమును బరామర్శించుటకు తత్ 'సాధు' అని యార్థమగు నన్వయము వచ్చును. యచ్ఛబ్దము, చివరనుండుటచేఁ బూర్వభాగము నందుఁదచ్ఛబ్దమును గల్పింపవచ్చును. కల్పితమగు నీతచ్ఛబ్దముతో శబ్దోపాత్తమగు యచ్ఛబ్దము సమన్వయము నొందును. కావున నిచట మీరు చూపిన దోషములేదు. 'సంరంభః' అను పద్యమున దోష ముద్ధృతము గాలేదు.

ఆక్షేపము : "యోసావితి" పద్యమునందు, కేవలము యచ్ఛబ్ద మొకటియే ప్రయుక్తమైనదనియుఁ దచ్ఛబ్దము ప్రయుక్తము కాలేదనియు నెవరుచెప్పిరి ? తచ్ఛబ్దసమానార్థకమగు అదశ్శబ్దము ("అసౌ") ప్రయుక్తమైనదిగదా- "అసౌ" అను నీపదము నాధారముగ గ్రహించి వాక్యార్థమును బూర్తిచేయ వచ్చును. అందుచే మీరుచెప్పిన దోష మిచట లేనేలేదు.

సమాధానము: ఓ సాధూ, నీది కేవలము దురాశ. - అసౌ అనునది, తత్ అనునది. ఈ రెండును సభిన్నార్థకములు కావు. ఆ రెండును సమానార్థకములేయగుచో, "న కేవలం యో మహతోఽపభాషతే శృణోతి తస్మాదపి యస్సపాపభాక్" అను వాక్యము నిరాకాంక్షమైనట్లే, యిచట నీవాక్యముకూడ నిరాకాంక్షమే యయ్యెడిది.

అదశ్శబ్దమును, తచ్ఛబ్దమును, సమానార్థములేయగుచో, నీక్రింది ముక్తకపద్యములో దోషముండవలసివచ్చును.

"అసౌ మరుచ్చుంబిత చారుకేసరః,
ప్రసన్నతారాధిపమండలాగ్రణీః
వియుక్తరామాతురదృష్టివీక్షితో
వసన్తకాలో, హనుమానివాగతః",

ఈపద్యము, హనుమత్పరముగను, వసన్తర్తుపరముగనుగూడ నన్వయించును. మరుచ్చుంబితచారుకేసరః = వాయువుచే చుంబితమైన (స్పృశింపఁబడిన) మనోహరమైన కేసరపుష్పములు (పున్నాగపుష్పములు) కలదియు,ప్రసన్నతారాధిపమండలాగ్రణీః = కళంకములేని(స్వచ్ఛమైన) చంద్రమండలము ముందుగ నున్నట్టియు, వియుక్తరామాతురదృష్టివీక్షితః = వియోగమునొందిన స్త్రీలచే నాతురముగఁ జూడఁబడినట్టియు, అసౌ = ఈ, వసన్తకాలః = వసన్తర్తువు; మరుచ్చుంబితచారుకేసరః = తండ్రియగు వాయుదేవునిచే ముద్దుపెట్టుకొనఁబడిన కేసరములు (జూలు లేక జుట్టు) గలట్టియు, ప్రసన్నతారాధిప మండలాగ్రణీః = ప్రసన్నుఁడైన సుగ్రీవుని (తారకు భర్త) సైన్యమునకు నాయకుఁడైనట్టియు, వియుక్తరామాతుర దృష్టివీక్షితః = ప్రియా వియోగము ననుభవించుచున్న రామునిచే నాత్రముగ నిరీక్షింపఁబడినట్టియు, హనుమానివ = హనుమన్తునివలె, ఆగతః = వచ్చినది.

ఇచట "అసౌ" అను శబ్దము తచ్ఛబ్దార్థకమేయగుచో యచ్ఛబ్దములేనిదే, మనకు సంపూర్ణముగ నర్థమయ్యేడిదికాదు. కాని సంపూర్ణముగ నర్థమగుచున్నది. అసౌ అను శబ్దము యచ్ఛబ్దార్థము నపేక్షించుటలేదు.

యస్య ప్రకోపశిఖినా పరిదీపితోఽభూత్
ఉత్ఫుల్లకింశుకతరు ప్రతిమో మనోభూః
యోఽసౌ జగత్త్రియలయస్థితిసర్గహేతుః
పాయాత్స వః శశికలాకలితావతంసః.

యస్య = ఎవనియొక్క, ప్రకోపశిఖినా = గొప్పకోపమనెడు నగ్నిహోత్రముచే, పరిదీపితః = దహింపఁబడిన, మనోభూః = మన్మథుడు, ఉత్ఫుల్ల కింశుకతరు ప్రతిమః = వికసించిన మోదుగచెట్టు వలె, అభూత్ = అయ్యెనో, యోఽసౌ = ఎవఁడు జగత్త్రియలయస్థితిసర్గహేతుః = మూఁడు

లోకములయొక్క సృష్టిస్థితి సంహారములకు హేతువో, సః = ఆ, శశికలాకవితావతంసః = చంద్రశేఖరుఁడగు శివుఁడు వః = మిమ్ము, పాయాత్ = రక్షించుగాక.

ఇచట యః, అసౌ, సః అను మూడుపదములున్నవి. ఇందులో "అసౌ" అను పదము సః అను పదము సమానార్థకములే యగుచో, "సః" అను పదము పునరుక్తమని యనవలసివచ్చును. వాస్తవమున నిచటఁబునరుక్తత లేదు. అందుచేత తదశ్శబ్దములు సమానార్థకములు కావని తెలియుచున్నది.

ఆక్షేపము:—అగుచో యత్తచ్ఛబ్దములుండవలసి వచ్చినపుడు, కవులు తచ్ఛబ్దమును బ్రయోగించుటకు బదులు అయమ్, ఏషః అసౌ అను పదములను (ఇదమ్, ఏతత్, అదస్ శబ్దములను) బ్రయోగించుచున్నారు—తచ్ఛబ్దమునకును, ఆశబ్దములకును పర్యాయత్వమే లేనిచో స్వస్థచిత్తులగు కవులు వాని నావిధముగ నెందుకుఁ బ్రయోగింతురు? ప్రయోగింపరు—కావున ప్రయోగప్రవాహముయొక్క ప్రామాణ్యము ననుసరించి, ఇదమ్ తదశ్శబ్దములు తచ్ఛబ్దపర్యాయములని మన మనవలయును. ఈశబ్దమున కిది యర్థ మిదియర్థము కాదనుటకు ప్రయోగప్రవాహమేగదా యాధారము! వేఱొకయాధారము కన్పడదే!

సమాధానము: ఇంతకుఁబూర్వమే తచ్ఛబ్దమును, అదశ్శబ్దాదులును, పర్యాయములుగావని యుక్తిపూర్వకముగఁ జెప్పితిమి—కాని యీ క్రిందిపద్యములలో మేము చెప్పినదానికి విరుద్ధముగఁబ్రయోగము లున్నవి.

1. "యోఽవికల్పమిదమర్థమండలం పశ్యతీశ నిఖిలం భవద్వపుః.
స్వాత్మపక్షపరిపూరితే జగత్యస్య నిత్యసుఖినః కుతో భయమ్".

ఈశ=ఓ ఈశ్వరా! యః=ఎవఁడు, ఇదం = ఈ, నిఖిలం, అర్థమండలమ్= సమస్తమగు ప్రపంచమును, అవికల్పం=నిస్సంశయముగ, భవద్వపుః=

శ్రీశారదాంబాయైనమః

# శివలీలావిలాసము

## తృతీయాశ్వాసము.

క. శ్రీహిత మహితగుణక్రమ
సాహస నవవిక్రమార్క సన్నాహసము
త్సాహ విజయావహావహ
దోహల యల్లాడవిభుని దొడ్డమహీశా! ౧

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

ఆ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టి లీల
యదియు దారువన విహారణాహ్వయమ్మున
నలరు రసికజనము లభినుతింప. ౨

వ. అత్రిభృగువసిష్ఠ పులస్త్యపులహక్రతు విశ్వామిత్ర జాబాలి ప్రముఖులగు మహామునులు, దారువనంబున నెలఁతల వడిఁగూడఁ బడి చిత్తంబులు మాంద్యత నవిద్యాయత్తంబులుగా మహాదేవప్రభావజ్ఞానదూరులుం గేవలకర్మాచరణధీరులు నగుచు నిట్లని వితర్కించిరి. ౩

సీ. కడుభ్రాంతి రేయుఁబగలు దిరిగినచానఁ
దిరుగుచున్నాఁడు దివసవిభుఁడు
కుంభకారకుని లాగున నహర్నిశ సృష్టి
జడతఁ జేడ్పడుచుండు జలజభవుఁడు

వివిధావతార దుర్విషయాబ్ధిలోపల
మునఁగుచునున్నాఁడు వనజవిభుఁడు
సూనసక్రియఁ గృపాహీనత సంసార
పరతఁ బొల్పడ్డాఁడు ఫాలదృశుఁడు
తలఁపఁగా నిట్టిమహిమ నుదారు లెట్టి
గతిఁ జరించుచునున్నారు కర్మవలన
ననిన నింక నెవ్వారు కర్మహతులు గాక
యును విముక్తతఁ జెన్నారుచుండువారు. ౪

క. కర్మమునన జనియించుం
గర్మమునన పెరిగి మించుఁ గలజగ మెల్లం
గర్మమునన వినశించుం
గర్మముమహిమంబు దెలియఁగా వశమగునే! ౫

వ. అని విచారించి, యితరస్మరణంబు చాలించి, నిరంతర కర్మ తంత్ర పరతంత్ర హృదయంబుల మహేశ సముద్దేశహీనంబులుగా యజ్ఞాద్యనుష్ఠానంబులు నడుపుచుండి; రట్టియెడ బహుళంబులగు ధూమంబులు చటులసన్నాహంబుతో నంతః కటాహంబు గవియంబడినం దత్పరిభవక్లిన్నవీక్షణయగుచు దాక్షాయణి మహేశ్వరు...ప్రదీప్తతప్తాయాతతిమిరసంతానంబు తెరఁగుపఱచి, మంథానభూధర మథనసముద్భూతగరళ ప్రకారంబు క్రమము గెలిచి, ...సముత్తాల జీమూతజాలంబు చెలువు గెలిచి, యన్యగుణసూస్ఫూర్తి హరణవర్ధిత తమోగుణసముద్రేకంబు కొమరు గెలిచి. భువనము...గప్పినట్టి కసీసపుగండయ నంగ, నీల నీలప్రభాలీల నిగుడి కవిసె; నచటి ధూమంబు వివరింపు మది మహేశా!

క. అని గౌరి యడిగినంతనె
విని (శర్వుఁడు) మందహాస విశద ప్రభలం
దన శిరసు బాలచంద్రుఁడు
ఘనరుచి సాంద్రుఁడుగఁ బలికెఁ గ్రమ మేర్పడఁగన్. ౬

శ్రీశారదాంబాయైనమః

# శివలీలావిలాసము

## తృతీయాశ్వాసము.

క. శ్రీహిత మహితగుణక్రమ
సాహస నవవిక్రమార్క సన్నాహసము
త్సాహ విజయావహావహ
దోహల యల్లాడవిభుని దొడ్డమహీశా! ౧

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

ఆ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టి లీల
యదియు దారువన విహారణాహ్వయమ్మున
నలరు రసికజనము లభినుతింప. ౨

వ. అత్రిభృగువసిష్ఠ పులస్త్యపులహక్రతు విశ్వామిత్ర జాబాలి ప్రముఖులగు మహామునులు, దారువనంబున నెలఁతల వడిఁగూడఁ బడి చిత్తంబులు మాంద్యత నవిద్యాయత్తంబులుగా మహాదేవప్రభావ జ్ఞానదూరులుం గేవలకర్మాచరణధీరులు నగుచు నిట్లని వితర్కించిరి. ౩

సీ. కడుభ్రాంతి రేయుఁబగలు దిరిగినచాఁ
దిరుగుచున్నాఁడు దివసవిభుఁడు
కుంభకారకుని లాగున నహర్నిశ సృష్టి
జడతఁ జేయుచుండు జలజభవుఁడు

క. కందర్పలక్షశత సమ
సుందరరూపంబు గలిగి చూపుల కతులా
నందకరుఁ డయినపల్లవు
నందంబునఁ గొమరు మిగిలె నభవ్యుం డంతన్. ౧౧

సీ. మెఱుఁగెక్కు తగమిసి మెఱయుచు వెండిచి
ప్పలఁ బకపక నవ్వు పదనఖములు
కలదు లేదను మాట గలుగు సన్నపు నడుము
నం గ్రొత్త నలువారు మాడదరులు!
రంభాప్రసవకే సరముల రేకుల క్రియఁ
గడునొగలగుచున్న కరరుహములు
మిగుల వట్టువలునై బిగిసి జక్కవ సొబ
గున (వింతఁ) దనరు వక్షోరుహములు
గలికిపలుకులు బిత్తరి కన్నుఁగవయుఁ
దలరుఁగుసులును గర మద్భుతములుగాఁగ
సకలజనమోహనాకారసరణి నిట్లు
సరసిజాక్షుఁ డొప్పఁగ వారతరుణి యయ్యె. ౧౨

క. రతినాయకు గర్వసము
న్నతి సరస విలాసహావ లీలాభావా
న్వితి మెఱయ నిట్టితను సం
గతి దాల్చెనో యనఁగఁ గపటకామిని యొప్పెన్. ౧౩

వ. ఇట్లు హరుండును రమావరుండును ననురూపంబుగా విలాస విలాసినీ రూపంబు లలవరించి, మనంతుని బిలిచి, నీవు దారువనంబున కరిగి భవన్మహిమంబు ప్రకటింపుమని పనిచిన, తదాగమనవార్త ముం దటం జెప్పం జనినదో యనన మలయపవనం బచట నంతటంగలయం జరింపఁ, దదనంతరంబ పుష్పాచ్ఛాదచ్ఛలవంబునఁ బాొత

దొలంగ ముకులకులమిషంబునం బులకజాలంబులు మొలతేరం,
గిసలయవ్యాజంబున భావగతానురాగంబు ప్రకటింప, పుష్పకైత
వంబున మందహాసంబు తులకింప, వన్యప్రకృతి విరహిణులకు విభు
సమాగమోత్సవంబు నాపాదించుచుండె; నాసమయంబున. ౧౮

క. చల విటవిటీ విలాసము
లలవడ ధరియించి మించి హారపంకజనా
భులు చనిరి తద్వనమునకుఁ
జెలువుగ దిగ్వాసు లగుచుఁ జిత్రాకృతులన్. ౧౯

సీ. కలకలధ్వనులు మువ్వలు గిల్కరింపంగఁ
బరిచించు నొకచోటఁ జరియకోల
గానము ల్చెవులకు నానందములు గుల్క
నతిశయించు నొకచోట నలఁతిపాట
వింత మించుల దంతకాంతులు చిగురొత్త
నలయించు నొకచోటఁ గలికి నవ్వు
కెలవుల నును మెఱుంగులకై కేళ్లు దులకింపఁ
బరగించు నొకచోట మురియుఁజూపు
చారరీతులు పొదల సద్దారువనస
మజ్జ్వలాశ్రితు విశ్రాంతమునికదంబ
కులఁ బతీసమాకర్షణ కుశలుఁ డగుచు
విపులమోహానసంపదఁ గపటవిటుఁడు. ౨౦

మ. అపురూపంబును లెన్నలాగు నగు నొయ్యారంబున స్త్రీయున
చ్చపు రూపంబునఁ గ్రాలు నొక్కఁడిదె యిచ్చాభృత్తిమై వచ్చినాఁ
డిప్డు డిచ్ఛోటికి, వానిఁ జొక్కియలర స్వేచ్ఛింత యుంచు న్మ్నసిం
దిపురంధ్రుల్ హృదయంబులం దలఁచి రంతన్ శర్వమాయా
గతిన్. ౨౧

క. కలలందునైనఁ బర పురు
   షులఁ దలఁపం జూడ నాత్మఁ జొప్పడని మునీం
   ద్రుల కాంతలు వచ్చిరి యి
   చ్చ్పల నతనిం జూడ ననుచు సంభ్రమ సరణిన్. ౧౮

సీ. పాటించు టెఱుఁగక ప్రకటారు నడుపులు
      హంస యానంబుల నడటనొంప
   మెఱయించు టెఱుఁగక మెఱపారుఁ జన్నులు
      కనక కుంభంబుల గబ్బణంప
   పసరించు టెఱుఁగక మొసలారు చూపులు
      మరుని పూములుకులమద మణంప
   సవరించు టెఱుఁగక చదురారు నలకలు
      తుమ్మెదదాయల త్రుళ్లడంప

   నెఱిక కట్టిన పుట్టలనెఱతనంబు
   కొంతనము సన్న తురుముల వింతనళుపు
   తమకు నలవాటువడి యుండఁ దగిలి వచ్చి
   కనిరి తద్విటు దాపసవనితలపుడు. ౧౯

మ. ఒక విప్రాంగన యాత్మ భర్తకడకుం హోమార్థ మంగార కుం
   డిక యర్థింగొని యేఁగి యేఁగి యది యందింపంగ హస్తంబు లా
   డక యా చందముతోడ సంభ్రమవు వేడ్కన్ వీధికి న్వచ్చి పా
   యక వీక్షింపఁగఁ జొచ్చు దిగ్వసనరమ్యాకారు నాజారునిన్. ౨౦

మ. జలజాతానన వేఱయొక్కతె సమిత్సంభార సంవాహనా
   స్ఖలితాత్ముండగు భర్త చేరువన రాఁగా వాని విశ్రాంతి స్థం
   కలనం గాంచెకిఁ బాపఁజూడ కవిశంక న్వచ్చి చూచె న్విని
   శ్చలత న్నిల్చి సలీలయాన పదభాస్వత్పల్లవుల్ పల్లవుల్. ౨౧

మ. ధరణీ దేవవధూటి యొండొకతె యంతంబూని వంచింపకే
పరణి న్వేతగ రామిఁ గేల నొకమోజం దుంబి గీలించి స
త్వర యానంబున నూరిచెంగటినదీవాఃపూరముం దెత్తునం
చరుదారం జనుదెంచి కాంచె విటవేషాలంకృతుఁ శంకరుఁ. ౨౨

వ. ఇవ్విధంబున మఱియు ననేక కాంతాజనంబు లనేక విధంబుల నేతెంచి యన్యకార్య విముఖంబులగు హృదయంబులతోడం గ్రీడా రూపధరు నీశ్వరుంగాంచి, ఘృతకుండంబునకుం గవిసిన చీమలంబోలెఁ దత్పరతంత్రి లగుచుండి రంతకుమున్న తదనంతరంబ.

సీ. నలుపార నల్లన నడచులోతొడల సి
గ్గఱి తళ్కు లొనపరి పఱువు లిడఁగ
సలలితంబుగఁ గేలు మెలపఁ గడియము ద
త్తఱి మించు నడుదెసఁ బురలి నసఁగ
వెడనెపంబుల మాట నుడువు దంతములఁ దొ
ల్కరి కాంతు లొక లెన్న మురువు చూప
శుభగరీతులఁ గేళ్ళు చూచు నేత్రములఁ ద్రి
మ్మరి దీప్తు లటు నిటు కెరలి దాట
మఱియు బహువిధావయవసంపదలు తేట
పఱచు నానావిలాసము ల్దురఁగలింప
దారువన సంయమీంద్ర కుమారు లెల్ల
మరులు గొనునట్లుగాఁగ నమ్మాయ లేమ. ౨౩

క. అత్తఱిఁ బ్రాయపుఁ దపసులు
చిత్తంబులఁ గోర్కులెల్ల జిగురుకొనఁగను
ద్వృత్తత నేతేఁ దొణఁగిరి
తత్తన్మార్గములఁ గపటతరుణిం జూడఁ. ౨౪

సీ. వల్కలంబులఁ జాలవలనుగాఁ గూర్చిన
దోవతు లందంద తుళ్ళగింప
తెలిపట్టునూలునం బోలుపుగాఁ జేసిన
జన్నిదంబులఁ గేళ్ళ చౌకళింప
నుభయహస్తంబుల నొరపుగాఁ బూనిన
దర్భగుచ్ఛములు వింతగ నటింప
మృదుసరి న్మృత్తిక మెఱుఁగుగా హత్తిన
పట్టవర్ధనములు ప్రజ్వలింప
పల్లజడలఁ బదిలపడ ముడిచిన కప
ర్దములు వదలి జాఱఁదట మటింప
నరుగుదెంచి కాంచి రయ్యాళీకాంగనఁ
దరుణమునికుమారవరులు దగిలి. ౨౫

మ. ఒక విప్రప్రవరుండు శిష్యజనముల్ వెన్వెంట వేదంబు పా
యక సంధిస్వరవర్ణయత్నకరణవ్యక్తప్రకారంబునన్
ప్రకటిల్లం గ్రమసంఖ్యఁ జెప్పుచు సవేగప్రౌఢినా వీథి చా
యకు వేడ్కం జనుదెంచి కాంచె నృపకాంతాకారు నారాయణున్.

మ. ఘననిష్ఠానిరతిం దపస్విపరుఁ డొక్కం డగ్నిహోత్రాలయం
బున నాజ్యప్లుత హోమకర్మకలనంబుం దీర్చుచు న్మాన సం
బున నుత్కంఠ దలిర్ప నట్లు స్రుక్స్రువంబుల్ హస్తపద్మంబునన్
గను పట్టన్వడి వచ్చి కాంచెఁ గుహనాకాంతాసముద్రాభితన్ ౨౬

మ. యమినాథుం డొకరుండు వాహినికిఁ దోయస్నానదీక్షాసమం
భ్రమయాత్రం జని యావిధంబు సగమార్గం జల్పియుం జల్పమిం
గ్రమమేదంగ బహిఃపటాదికము దేరం దాల్మి గీలొక్కని చి
త్తముగ న్వేగమె యేగుదెంచి కనియెం దద్వారకాంతామణిన్. ౨౭

వ. మఱియుఁ బెక్కండ్రు మునీంద్రులు పెక్కుఁదెఱంగులం బరిత్యక్తాన్య
కార్యసమాచరణంబులగు నంతఃకరణముల వచ్చి, మచ్చికమెఱయ,
మధురమధురసధారకు మూఁగియున్న యీఁగలంబోలెఁ దన్మయా
వస్థ నుండి; రివ్విధంబున, ౩౦

క. దారువనస్థలమునఁ గల
నారులుఁ బురుషులును గపట నాటకలీలా
ధారులగు చంద్రధర దను
జారుల వెనువెంటఁ దగిలి రండఱుఁ గాంక్షన్. ౩౧

మ. మదనుం డత్తఱి వీరి వారి గెలిచె న్మాయాంగనా పల్లవా
భ్యుదయంబుల్ పొలుపారు దీమములుగా నొండొండ చండోద్ధతిన్
మదగంధగ్రహణాంధభృంగపటలీ మౌర్వీలతా విస్మయా
స్పదపుష్పాతత చాపముక్త విషయాస్త్రవ్రాత పాతంబులన్. ౩౨

ఉ. అమ్ముని పుత్రదారకుల కంతన వింతంగ నుద్భవించెఁ గం
పమ్ము నెలుంగు రాలుటయు బాష్పము ముత్పులకోత్కరంబు వ
ర్షమ్మునఁ జేష్ట దక్కుటయు భ్రాన్పడియుండుటయు న్వివర్ణభా
వమ్మున నొక్కపెట్ట రతివల్లభు పుష్పమయాస్త్ర ఘట్టనన్. ౩౩

వ. ఇట్లభిలాషంబున విగతపరితోషంబు లగుచుండఁ గామవికారంబులు
శరీరంబులఁ జాలఁగలిగి, లోలన్మనంబుల నా రెండుతెఱంగులవారును,
ధీరతాప్రాచుర్యంబుతోఁ దనకాలవ్రతాచార శీలతాత్పర్యంబు
లణంగి యనర్గళప్రకారంబున యదృచ్ఛా వ్యాపారంబులకుఁ
గణంగి, రాసమయంబున. ౩౪

క. తనతోడి రతికిఁ గూడిన
మునిసతులం జూచి హరుఁడు ముఖవనజాతం
బున విగతాదరభావము
దనరఁగ నిట్లనియె వారితలఁపులు చూడన్. ౩౫

ఉ. ఉన్నతవిప్రవంశమున నుద్భవమంది తపఃప్రభావసం
పన్నలఁ బుణ్యసంయముల భర్తలఁగా వరియించి సంతతా
చ్ఛిన్నపతివ్రతాత్వగుణ శీలములం గడముట్టియున్న యీ
రన్నన జారభోగముల నాత్మకుఁ దేఁదగునే సతీమణుల్. ౩౬

క. జారసమాగమ మెన్నఁడుఁ
గోరంగాఁ దగదు సతులకుర్ గతసుకృత
స్ఫారఫలఁ మణఁచు నొక మఱి
వారక యది యొదవినను ధ్రువంబు దలంపర్. ౩౭

సీ. భర్త యెఱింగినఁ బ్రాణగండంబును
బాంధవు లెఱిఁగిన బయలుపడును
నవనీశుఁ డెఱిఁగిన నర్థాపహరణంబు
పగవా రెఱింగిన నగవుఁబాటు
నేరా లెఱింగినఁ జాలఁ జులుకతనం
బనుయాను లెఱిఁగిన మానహాని
? మన్మయూ లెఱిఁగిన మహితాపరాధంబు
సవతు లెఱింగినఁ జనవుపోక
యెవ్వ రెఱుఁగకున్న నవ్వాలఁ దప్పదు
చండతరకృతాంత దండబాధ
అట్లుగాన వలవ దెట్లును పరనాథ
సంగమంబు జరుప నంగనలకు. ౩౮

క. తలఁపగ నరనిమిషములో
పలనఁ దగుం బుంశ్చలీత్వభవసుఖము లతాం
గులకుం దత్పాప ఫలమ్ములు
దొలఁగవు కల్పంబుదాఁక దుస్తర సరణిన్. ౩౯

వ. ఇది యంతయు విచారించి చిత్తంబులు మదన మదాయత్తంబులు
గాకుండ వారించి, మీ మీ యిండ్లకుఁ గ్రమ్మఱి పొం డనవుడు,
నపుడ కామతాపంబు లంగనా రూపంబులు గనినపగిది నందఱు
ముని సుందరులుం దాలిమిఁ దూలి, లజ్జాభారంబులు దూరంబులు
గా నక్షణంబ. ౪౦

ఉ. కొందఱు పాదపద్మములు కొందఱు జంఘలు కొంద ఱూరువుల్
కొందఱు మధ్యమస్థలులు కొందఱు చూపులు కొందఱంగుళుల్
కొందఱు కంధరాంతరము కొందఱు మస్తక మిట్టు లందఱుం
బెందమకంబుతోడ చికుబీకులు చేసిరి పట్టి యవ్విభున్. ౪౧

క. అతఁడును దన్మానసములు
చతురత నిట్ల పహరించి
యుతముగఁ దత్తత్క్రియమున
నతులితరతితంత్రకలన కాదటఁ దొణఁగెన్. ౪౨

సీ. ఒకతెఁ గేళ్లగఁజూచి యుల్ల మేర్పడఁ దేల్చి
యొకతె మక్కువఁ బల్కి యుక్కడంచి
యొకతెఁ జేఁబట్టియు నొక వింతగతిఁ దేల్చి
యొకతెఁ గౌఁగిటఁ జేర్చి యాదరించి
యొకతె మోవిఁ జెమల్చి యొసరఁ దియ్యము గ్రోలి
యొకతెఁ జుంబనచేసి యుపచరించి
యొకతె సెజ్జకుఁ దార్చి యొదవు తేఁకువ వాపి
యొకతెఁ గూటమిఁ దేల్చి యొగిఁ గరంచి
యిట్లు పలుదెరంగుల నేర్పు లెసక మెసఁగ
నొకతె నొకతెను సుఖలీల నోలలార్చి
తనదు దక్షత్వప్రౌఢి యంతయును దెలిపి
లలితభంగులఁ గపటవల్లవవిభుండు. ౪౩

క. మునిరాజసతులు మఱియును
దనియని భావమున హరుఁడు తత్తద్గతులన్
మనసిజ విజయ మహోత్సవ
మున కాయతపఱిచె నిపుణముగ నట్టియెడన్. ౪౪

చ. గరువపువేడ్కఁ బల్లవశిఖామణి యొక్కతె ధేనుకాసన
స్థిరరతిఁ గూడునప్పుడు తదీయశరీరము వక్రతా మనో
హర మగుచుం బొసంగె విషమాస్త్రుఁడు దిక్కుల గెల్వఁబూనిభా
సురముగ నెక్కువెట్టిన ప్రసూనపుఁ జాపము తోడి జోడునై ౪౫

చ. ఉపరిరతంబు నిమ్మని తలోదరి యొక్కతె శంభు బొందుచు
న్విపుల విజృంభణం గరము వీఁగుచుఁ గౌను నటింప మీఁద న
చ్చపుఁ గణఁకం దదున్నతకుచంబులు చెన్నువహించె గంధవా
హపరిచలన్నవీనలతికాగ్రసుపుష్పగుళుచ్ఛగుంఫనన్. ౪౬

చ. ఇతర మునీంద్రకాంతను మహేశ్వరుఁ డాదట నొప్పవేణు దా
రితకరణంబున న్సరసరీతులఁ గూడుతఱిన్ శిరస్స్థలిం
గతమగు తత్పదాబ్జమునఁ గన్నులపండువుచేసె నాతఁ డం
చితగతిఁ గ్రొత్తగాఁ జిగురుఁజెందిన మోహనపుష్పమో యనన్. ౪౭

చ. ఒక మునిరాజ సుందరి విటోత్తమునుల్లము పల్లవింప జృం
భక కరణంబునం గదిసి భావజతంత్రము సల్పుచుండ మీఁ
దికిఁ జనఁజాచి పట్టిన తదీయపదద్వయి యొప్పెఁ జిత్తరం
జక మదనాలయాంగణ లసత్కదళీతరు పుష్పకల్పమై. ౪౮

చ. నలువుగఁ జక్రపాద కరణంబునఁ గాముక రాజశేఖరుం
డొరలఁగ నొక్క తాపసవధూమణి వొందఁగఁ దచ్ఛరీర ము
జ్జ్వలతర విభ్రమంబునఁ బొసంగె మనోభవుఁడుండు కొల్వులో
నలవడు తాంత కాంచనమృగాదిపటీరముఁ గ్రేణి సేయుచున్. ౪౯

క. ఈ విధమున మఱియును నా
నావిధ రతిబంధగుంభనమ్ముల నమ్మా
యావిటుఁడు మునీశ్వర కాం
తావితతులఁ దనిపెఁ గామదర్పం బెసఁగన్. ౫౦

సీ. ఆశ్లేషపుల కాంకురంబులు నూత్నమహా
భావకుట్మల కదంబములు నెనయ
నఖపదా కలితస్తన ద్వయంబులు రత్న
ఫలకాప్త కనకకుంభములఁ జెనయ
నభిరామ దంతక్షతాధరంబులు శుక
పరిదష్ట పక్వబింబములు దొరయ
నవచుంబ నార్ద్రగండస్థలంబులు జతు
రవలిప్త దంతపత్త్రములు నెనయ
నలఁతి చెమటను వడసిన లలితదేహ
లతలు మకరంద పరిషిక్త లతలఁ దెగడ
దారువన మహామునినాథతరుణు లపుడు
వరలి రసమాస్త్రి భాగ్యదేవత లనంగ. ౯౧

వ. అంతకు మున్న యచ్చటఁ గపట కాంతా భావగత భావజ వికారు
లగుచు నిలుపోపమింబైఁబడిన మునికుమారులం గదిసి మదను
పూఁదూపులకుం బ్రాపులగు కటాక్షవీక్షణంబులం గొదఱను,
విషమశరు నట్టహాసంబులకు ననుప్రాసంబులగు కటాక్ష వీక్షణంబు
లం గొందఱను, మకరధ్వజుని యాగ్రహంబులకుఁ బరిగ్రహంబులగు
లాలితాలింగనంబులకుం గొందఱను, రతీశ్వరుని విహారంబులకు
నొయ్యారంబులగు సరసతాలంబచుంబనంబులకుఁ గొందఱనుగాఁ
గ్రమంబుగ నందఱను వివిధ విలాస విభ్రమంబుల నలరించుచుం
దన మధురనిధువన చాతుర్యంబును గళాప్రాచుర్యంబును నెఱిఁగించి
పరవశులం జేసె; నివ్విధంబున ౯౨

క. అక్కపట పురుష తరుణులు
తక్కక మునినాథసతులఁ దాపసనుతులన్
మిక్కిలియుం దమవలలం
జిక్కించిరి యొక్కమాఱ చిత్రం బరయన్. ౯౩

చ. కులములు గూల్చి, శీలములుగూడను గాల్చి, వ్రతంబుఁ జించి, ల
జ్జలు నణఁగించి, ధర్మములు చేరను రోసి, తపంబునిష్ఠలన్
వెలువడఁ జోపి తాలుములు లేపి, తదేకనిషక్త మానసం
బులఁ జరియింపఁజొచ్చి రతి మూఢత నింతులు తాపసేంద్రులున్. ౫౪

క. ఇది ముంగిలి యిది యంగడి
యిది మఱఁ గిది బయలు నాక యిచ్ఛాగతులన్
మదిఁ బుట్టిన యెడలన నె
మ్మది రతి సల్పుదురు వారు మదనాతురతన్. ౫౫

ఉ. అత్తలు మామలు న్సుతులు నయ్యలు నమ్మలు మున్నుగాఁ గడుం
దత్తర మందుచుం బధము తప్పుట కోర్వక బంధువుల్దము
న్మెత్తన బుద్ధిచెప్పి తగనిల్పిన నేమియు నుండనొల్ల రు
ద్వృత్తత నాపురంధ్రులును విప్రులు నీశ్వరుమాయ ద్రిప్పఁగా. ౫౬

వ. ఇట్లాము గవిసి తలచీర యెఱుంగక మానంబులు దీనంబులుగా వివే
కంబులు వెడలి యంగీకృతభంగి రతిలోకంబులగుచు మెలంగు నిజ
పుత్రికళత్రి సముదయంబుల మదనవికారంబులు మాన్పరాక
దుర్వారంబులగుటయు నోసి గాసిలిపడి దారువనాశ్రియులగు వృద్ధ
సంయము లందఱు నొక్కయెడం గూడఁబడి, యిట్లనివితర్కించిరి. ౫౭

క. ఇమ్మాయ వల్లవుండును
నిమ్మాయా వల్లవియును నెటనుండియొ వా
రిమ్ముల నియ్యాశ్రమ వా
సమ్మునకున్వచ్చి రతివిడంబన సరణిన్. ౫౮

గీ. అకట! వీరిద్దరును మన యన్వయములు
దపములును యజ్ఞములు జపతంత్రములును
ఉగక యేచూరఁబుచ్చుచున్న వారు
వలయు మనకిప్పుడిది మాన్పవలను వెలయ. ౫౯

చ. అనితలపోసి రట్టియెడ నాతతబుద్ధుల నొప్ప వృద్ధు లి
ట్లని రొకకొంద జేక్షణమ యందఱముందగ వేల్మివెట్టి యం
దొసరఁగ నుగ్రభూతముల నుద్భవమందఁగఁజేసి వానిఁ బె
ల్చన వధియింతమేల బహుచర్చల నూరక పొద్దుపుచ్చఁగా౯. ౬౦

వ. అనిన విని యమ్మునులు బహుధూమంబులు నిగుడ నాభిచారహో
మంబు దలపెట్టి వేలువఁ దొణంగి రాసమయంబున. ౬౧

చ. అదరులు వాఱుచు న్దశదిశావళి నిండఁగ మండుచున్న యా
స్పదరభసంబు చూపునఁ బ్రచండతరాశని వోలె విస్మయం
బొదవఁగ నుజ్జ్వలత్పరశు వొక్కటి వేలిమి నుద్భవించె ను
న్మదమునఁ దాపసు ల్పనుప మాయలపల్లవుఁ దాఁకె భోరనన్. ౬౨

ఉ. ఉక్కునఁజేసినట్టివగు నుగ్రఖురంబుల వజ్రతీవ్రత
న్బెక్కొనుచున్న శృంగములు నెట్టన చూపఱ పిచ్చలింపఁగా
నొక్కకురంగరాజము సముద్ధతి నంద జనించి ప్రౌఢి సొం
పెక్కఁగఁ దాపసాజ్ఞఁ జనియె న్శివుమీఁదికిఁ దాను న త్తఱిన్ ౬౩

క. హరుఁడును నీక్రియ వచ్చిన
పరశుకురంగముల రెంటేఁ బట్టి పరిభావం
బరుదారఁగఁ గ్రీడార్థము
కరపద్మములందుఁ దాల్చెఁ గౌతుక మెసఁగన్. ౬౪

వ. ఇట్లవి రెండును వమ్ముగం గలియుటయు మానసంబుల రోషంబులు
తులకింప నమ్మహామునులు మఱియుం బరికాళఘోరంబులగు మం
త్రజాలంబుల వేల్చుచుండఁగా. ౬౫

సీ. వజ్రధారలతోడి వాసి కారంభించు
ముఖవక్ర నవతిగ్మ నఖచయంబు
శమనపాశము తోడి సాటికుత్సాహించు
లోలతరాభీల వాలకంబు

గిరిగహ్వరముతోడి గరిమను జృంభించు
నాతతవిసృత్తాననంబు
దారుణోత్కరతటి ద్ద్రఢిమ నాకల్పించు
కపిలప్రభాయ తేక్షణయుగంబు

గలిగి విస్మయావహాచిత్ర కలిత
చండదేహంబు తా పెద్దకొండవోలె
హోమకుండాంతరంబున నుద్భవించె
నలఘు బలభాసురుండు వ్యాఘ్రాసురుండు ౬౬

ఉ. అప్పులిరక్కసుండు తను నామునినాథులు వంపఁగన్నుల
న్నిప్పులు రాలుచుండ నతినిష్ఠుర గర్జన లంబరస్థలిం
జప్పుడు పిక్కటిల్ల సురుసత్త్వసముజ్జ్వలయాన మొప్పఁగా
నప్పుడె యేఁగె నప్పరశుహస్తుని రుద్రునిఁ బోర మార్కొనన్. ౬౭

గీ. ఇటులఁ జని డాసి మేదినిఁ జటులకలన
రెండుపదములు వట్టి యారెంటినెత్తి
తరళ జిహ్వాకరాళ వక్త్రంబు దెఱచి
యుఱుకనుంకించె శంకింప కుగ్రుమీఁద. ౬౮

చ. అతఁడును వానియంఘ్రియుగ మంటఁగ నొక్కటఁ బట్టి వంచి యు
ద్ధతపద మంఘ్రికంబులను దారుణబాహునిపీడనంబులన్
ధృతి యగలించినన్ ధరణిఁ ద్రెళ్ళియు నంతన లేచి విక్రమా
న్వితుఁ బులి వేసి తాఁకె రణనిష్ఠురుఁ బల్లవరాజశేఖరున్. ౬౯

వ. ఆసమయంబున.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి ఇ డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

శ్రీ ఏచూరి సీతారామారావుగారు, బి. ఏ.,




# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాష లందు తెలుగు లెస్స

సంపుటము ౪౪

సంచిక ౪

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి ఇడి.

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

---

## విషయసూచిక

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక
(Journal of the Telugu Academy)
చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౪ | మన్మథ సంవత్సరము ఆశ్వయుజ-కార్తికమాసములు | సంచిక ౪



# ప్రామాణికభాష

ఈ నడుమ పత్రికలలోఁ బ్రామాణికభాషనుగూర్చి కొంత దుమారము రేఁగుచున్నది. ఈ సంవత్సర మల మెట్టిదో గాని యుగాదినాఁడే యిట్టి దుమారము భయంకరముగా రేఁగెను. చినుకులు లేకుండ దుమారమే హెచ్చుగా నుండుట యింకను విచారింపఁదగినది. నిజముగా సాహిత్యవివాదములకుఁ బత్రికలు స్థానమిచ్చి ప్రజలలో సాహిత్యాభిరుచి కలుగఁజేయుట సమంజసమే. కాని యట్టివాని నుదారముగా గ్రహించుట పత్రికాగౌరవమునకుఁ గారణ మగును గాని నష్టముకాదు. ఈ చర్చల నూరక పొడిగింపక నానురూపములు గలవారి యభిప్రాయములనూతి వే గ్రహించి యీ వివాదము నంతటితో విరమించుట భాషకు నిజమైన యుపకారము చేయుటయే. అట్లుగాక కానవచ్చిన వాని యభిప్రాయము నెల్లఁ గ్రోడీకరించుట వలన నేమి ప్రయోజనము? సారస్వతమున విషయనిర్ణయము ప్రజాబాహుళ్యాభిప్రాయములఁబట్టి జరుగదు గదా! అది యెప్పటికిని సహృదయుల సమ్మతిని బట్టి జరుగుచుండుట సారస్వతాభిమానులకు సువిదితమే.

ఇఁక ప్రామాణికభాషను గూర్చి చూతము. ప్రామాణికభాష యనఁగా (1) ప్రమాణములవలన సిద్ధించిన భాష[illegible] వ్యాకరణము, నిఘంటువును బ్రమాణములు. శబ్దసాధుత్వాసాధుత్వ నిర్ణయ మొనరించునవి యవియే గదా! అట్టి వ్యాకరణాదులవలన సిద్ధించిన సాధు శబ్దములతోఁ

గూడిన భాషయే ప్రామాణిక భాష యనఁబడును. (2) ప్రామాణికులు ప్రయోగించిన భాష, శబ్దముల సాధుత్వాసాధుత్వము లెఱింగిన యుత్తమ కవులు వ్రాసిన కావ్యములుగూడఁ బ్రామాణిక భాషయే. తేలిన సారాంశ మేమనఁగా వ్యాకరణ నిఘంటువులచేత నిర్దిష్టములై మహాకవులచేఁ బ్రయోగింపఁబడిన పదజాలము గల భాషయే ప్రామాణిక భాష యని యర్థము.

మొదట మహాకవులు తమ కాలమున వ్యవహార సిద్ధమైన భాష నుండి సాధు శబ్దముల గ్రహించి కావ్యముల రచించిరి. ఆ కావ్యముల యందలి పదముల నన్నిటిని విభజించి వైయాకరణులు సూత్రము లొనరించిరి. ఈ వ్యాకరణాదులు తరువాతి కవుల కావ్యరచన కాధారము లయ్యెను. ఈవిధముగా మహాకవుల ప్రభావము వ్యాకరణముల మీఁదను, వ్యాకరణముల ప్రభావము మహాకవులమీఁదను గన్పట్టును. ఇందు నన్యోన్యాశ్రయము తప్పదు. కాని మహాకవులు నిరంకుశు లగుటచే వ్యాకరణము నుల్లంఘించి,నాఁటి భాషా స్వరూపము ననుసరించి,స్వతంత్ర ప్రయోగములఁ గావింతురు. ''నిరంకుశాః కవయః'' అన్నారు గదా యని నేడు గణయతిప్రాసల నేర్చుకొనినవాఁడు గూడ స్వతంత్ర ప్రయోగములఁ జేయఁబూనిన హాస్యాస్పదుఁ డగును. సిద్ధహస్తులైన కవులకే యీ స్వాతంత్ర్యము చెల్లునుగాని సాధారణుల కది చెల్లదు. కొన్ని యెడల వ్యాకరణములు మహాకవుల ప్రయోగములను గూడ స్వీకరింపక పోవచ్చును. మహాకవులైనను వారు ప్రయోగించిన విరుద్ధపదము లన్నియు సాధువులుగా స్వీకరింపఁబడ జాలవు.'షేక్స్పియరు' ప్రయోగించిన శబ్దము లన్నిటిని నాంగ్ల వ్యాకరణములు ప్రమాణములుగా స్వీకరించుట లేదుగదా! ఒక మహాకవి ప్రయోగించిన విరుద్ధ ప్రయోగమును తరువాతి వారుఁగూడఁ బ్రయోగించుచు వచ్చినచో నది సాధువుగాఁ బరిగ్రహింపఁబడును. ఈవిధముగా మహాకవి ప్రయోగములఁ బట్టి

వ్యాకరణము మాఱుచుండును. వ్యాకరణము ననుసరించి మహాకవి ప్రయోగము లేర్పడుచుండును. భాష యభివృద్ధి చెందుచున్న కొలఁది యీ మార్పు కవుల ప్రయోగములలో వ్యాకరణములలోఁ గాన్పించును. కాలక్రమమునుబట్టి భాషలో నీ మార్పు సహజముగా జరుగుచునే యుండును. నన్నయ నాఁటి భాష తిక్కన నాఁడును, తిక్కన నాఁటి భాష పెద్దన నాఁడును, ఆనాఁటి భాష యీ నాఁడును మార్పు చెందుట దీనికి నిదర్శనము. ఆనాఁడు వ్యాకరణములు లేకపోలేదు. కవులు వ్యాకరణముల ననుసరింపక పోవనులేదు. ఇట్లున్నను భాషయందు నాఁటినాఁటికి మార్పు కానవచ్చుచునే యున్నది. మార్పు భాషకు స్వతస్సిద్ధముగాన బలవంతముగా భాషలో మార్పు దెచ్చుటకై ప్రయత్నించుట యనవసరము. అసహజము.

నేఁడు చాల మంది కవులు స్వేచ్ఛగా నసాధు ప్రయోగములఁ గావించుచున్నారు. వ్యాకరణములుగూడ సర్వజనీనములును, సాధుత్వార్హములైన శబ్దముల సాధింపలేకయున్నవి. అనఁగా వ్యాకరణములు మన భాషకు సమగ్ర వ్యాప్తములు గాకున్నవి. వ్యాకరణము లసమగ్రములు గావున వానిఁబాటింప నవసరములేదని తమ యిష్టము వచ్చినట్లెల్ల నపప్రయోగములఁ గావించుట "మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్ష" యగును. మనకుఁ దోఁచినట్లెల్ల నుచ్చావచముగా శబ్దములఁ బ్రయోగించినచోఁ జదువుకొన్న వాని కన్నఁ జాకలివాఁడే మేలగును. అప్పుడు నిరంతరాయాససాధ్యమైన విద్యాసంస్కారమే యనవసరమగును. కావున మనుజునకు నీతినియమము లెట్లవసరములో భాషకుఁ గూడ నీతినియమము లట్లే యవసరములు.

వ్యావహారికవాదులు భాషకు నియమ మవసర మని గ్రహించుట ముదావహము. కాని వా రొకవంక భాషకు నియమ మవసర మని చెప్పుచు వేఱొక వంక "వ్యావహారిక భాష సర్వత్ర పరిగృహీత

మవ్యె ననియుఁ విశ్వవిద్యాలయములలోఁ గూడ బరిగ్రహింపఁబడినచోఁ గృతకృత్యులము కాఁగల''మనియు భావించుచున్నారు. భాషాపరిశ్రమ మవసరము లేక తోఁచినట్లెల్లఁ బ్రయోగించుట కనుకూలముగా నుండుటచే వ్యావహారికభాష నితరు లంగీకరించిన నంగీకరింతురు గాని విద్యావేత్తలచేఁ బాలింపఁబడుచు, నున్నతవిద్యాశిక్షణ మొసంగు విశ్వవిద్యాలయము లనుగతి గలిగియుండుట కవకాశము లేని వ్యావహారికభాష నంగీకరింప వనియే మా యభిప్రాయము. భాష కనుగతి వ్యాకరణమూలము. నేఁటి వ్యావహారిక భాష కే వ్యాకరణమును బ్రమాణము కాదు. వారు వ్యాకరణమును బ్రమాణ ముగా నంగీకరించుచో మాకును వారికి నభిప్రాయ భేదమే లేదు. నేఁటి వ్యాకరణము లసమగ్రము లన్నచో సర్వసమ్మతము సమగ్రము నగు వ్యాకరణ రచనమునకై కృషి యొనర్చుట తగవు కాని యున్న నియ మముల నుల్లంఘించుట తగదు. సర్వసమ్మతము, సమగ్రమునైన వ్యాక రణ మవసర మని పరిషత్తు చిరకాలమునుండి తెలుపుచున్నది. వ్యాకర ణము సర్వసమ్మతము సమగ్రము కావలె నన్నచో నాంధ్రదేశమునఁ గల వైయాకరణులు, సుప్రసిద్ధ కవులు, భాషాశాస్త్రజ్ఞులు నొక సంఘ ముగా నేర్పడి దానికిఁ గృషి చేయవలెను. గత సంవత్సరము పరిషత్తీ విషయమై కొంత కృషి యొనర్చెను. కాని కార్యము బహు ధన సాధ్య మగుటచే ముందునకు సాగలేదు. మన ప్రభుత్వము, విశ్వవి ద్యాలయములు, భాషాసంస్థ లన్నియుఁ గలిసి గట్టి కృషిచేసినచో నీ ప్రయత్నము సుకరము కాఁగలదు. అప్పుడు భాషావిషయమున నెవ్వరికి నభిప్రాయభేదములులేక యేకముఖముగా భాషాభివృద్ధికై కృషి జరుగఁ గలదు. "దేశభాషలయందుఁ దెలుఁగులెస్స"యనుసూక్తి తథ్యము కాఁ గలదు.

---

# శ్రీమద్రామాయణము-మానవత్వప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

అనఁగా "ఇట్టి వాక్ప్రమాదములు కేవలము పొరపాటువలన సంభవించినవి మాత్రము కావు. అయ్యవి సకారణముగ నాలోచింపఁ బడిన విషయములవలనఁ బుట్టినవే. వాని కర్థము లేకపోలేదు. అయ్యవి సమానప్రతిపత్తి గల రెండు మనోభావము లొండొంటితో సమ్మిళితము లగుటవలననో, అంతకన్న ముఖ్యముగ రెండు విరుద్ధ భావము లొకదానితో నొకటి సంఘర్షణ మొందుటవలన యనుట లెస్సకావున నట్టి సంరబ్ధమువలననో, యట్టి స్ఖాలిత్యము లేర్పడుచుండును" అనివ్రాసెను.

"సర్వసాధారణమగు వాక్స్ఖాలిత్యమున మనకు విస్పష్టముగ గోచరించున దెద్ది యన, మన ముద్దేశించిన విషయమునకుఁ బూర్తిగ వ్యతిరిక్తమగు మాట మన నోటినుండి జాఱుట", అనికూడ ననెను. మన మా మునిపుంగవుని జీవితమును గమనించినచో నాతనికి సహచరిణియై యుండిన బోయవనిత తా నొనరించెడి పాతకములను బంచుకొనుట కేవలము నిరాకరించియుండెను. దాని దుస్సాంగత్యమువలననే యాతఁ డట్టి దారిదోపిడివృత్తికి దిగియుండె ననుట తప్పుకాదు. ఆమె యాతని నిరాకరించెను. అట్టి బోయతపీడ తనకు వదలించినది 'తారక' మంత్ర జపము. తారకమంత్రమునకు శ్రీ రామచంద్రుఁ డధిదైవము కదా! కావున నాతఁ డుత్కృష్ట మగు నా తారకమంత్రప్రభావంబున మహత్తరరామభక్తుఁడై నిరంతర మిష్టదైవోపాసన మొనరించుచుండె ననుట సత్యదూరముకాదు. నారదాదులు భక్తికూడ నొక విధమగు కామస్వరూప మని నిర్ధరించిరి. "సా త్వస్మిన్ పరమప్రేమరూపా" యని నారదుఁడు తన ప్రథమభక్తి సూత్రముననఁ బేర్కొనెను. అందులకుఁ ప్రమాణముగ "యథా వ్రజగోపికానాం" మ్మని గోపికాస్త్రీల నాదర్శ

ముగ నొసంగియున్నాఁడు. అంతటితో నూరకొనక "తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్" అని చెప్పుటచే భక్తుఁడు తనకు సంభవించిన కామక్రోధాదికమానసికోద్రేకములు తనవలన నారాధింపఁబడెడి యిష్టదైవమునందే పర్యవసింపఁజేయవలె నని హెచ్చరించియుండెను. రామదాసు తన ప్రాణము విసిగి కోపము వచ్చినతఱి "సీతమ్మకు చింతాకు పతకము చేయించితి నది నీ యబ్బసొమ్మనుకొంటివా?" యని శ్రీరామచంద్రునిగూర్చి కఠినముగాఁ బలికినట్లాతని కీర్తనలయందుఁ గలదు. కావున నా మహత్తరభక్తియోగి యగు వాల్మీకికిఁ దా నీవఱకు గామవిమోహితుఁడై బోయవనితచేతలలోఁ దగులుకొనిన దుర్గతినుండిఁ దప్పించిన పరిపూర్ణ విశ్వాసమా రామునియందుఁ గలదు. అదియే యతని హృదయమున నిరంతరము ప్రవహించెడి కృతజ్ఞతాసూచక మగు నానందము. అతఁడు తమసాతీరమునందలి వనసంచారమున నాయానందములో నిమగ్నుఁడై యే ప్రవర్తించుచుండెను. అంతటఁ గ్రౌంచమిధున మాతని కంటఁబడి పూర్వస్మృతి కలిగించి యాతని హృదయమందలి కామబీజము నుద్రేకింపఁజేసెను. దానివలన తన సహజభక్తిధోరణి యడ్డుతగిలి విషయానందస్ఫురణము కలిగెను. విషయానందముగూడ బ్రహ్మానందాభాసమే యని విద్యారణ్యులీ తీరునఁ దమ పంచదశియందు వివరించిరి.

శ్లో॥ "ఏషోఽస్య పరమానందో ఽఖండైకరసాత్మకః।
అన్యాని భూతాన్యేతస్య మాత్రామేవోపభుంజతే॥
(పంచదశి—విషయానంద ప్రకరణము)

కావున నా రెండిటికిని సన్నిహిత సంబంధ ముండుటచేఁ దన కీవఱకుండిన రాక్షస ప్రవృత్తిని నశింపఁజేసినందుననఁ దా నప్రయత్నముగ నుచ్చరించిన 'అవధీః' యను పదము తనయందే పర్యవసించెను. ఇఁక బోయవనిత తనను భ్రష్టు మొనరించిన దగుటచే నా బోయవానిపైఁ గోపము

కలిగెను :గాని యా ఋషి యొక్క పరమసాత్త్విక హృదయము వానిని శాపదగ్ధము సేయుటకు మాఱుగ నాతని నోరు జారించి పైఁగ స్తావక వాక్యముగఁ బలికించెను ! అవియే యా శ్లోకమునందలి మానవ సహజమగు నైజప్రవృత్తి.అందుచే నయ్యాది బ్రహ్మవలనఁ బ్రబోధింపఁబడువఱకు తా నా రీతి మంగళ వాక్యము పలికిన ట్లాతఁడెంచి గుర్తెఱింగియుండ లేదు! దీనికి "Freud" మహాశయుఁడు "The forgetting of impressions and experiences shows the working of the tendency to ward off from memory that which is unpleasant," అని చెప్పియున్నాఁడు: క్రౌంచమిథునసందర్శనముచే సంభవించిన దన పూర్వ విషయవాసనాస్మృతియు బోయవానిం జూచుటచేఁ దనను బూర్వ మధోగతిపాలు గావింప సమకట్టిన బోయవనితయు నాతనికి హృదయ వేదనము రగులు కొలిపెను. అందుచే నాతఁ డేమని శపించెనో గూడ నెఱుంగఁడు."సమాజ్యోగే"యను పాణిని సూత్ర మాతనిని రక్షించె నని యాతనికిఁ దోఁపలేదు! దానిని బ్రహ్మగారు విప్పి చెప్పిన యనంతరము తన హృదయమును బదిలపఱచుకొని యా బోయవాఁడు శ్రీరామచంద్రుఁడనియు క్రౌంచమిథున ముపలక్షణముగా (తానును బోయతెయనినం దప్పుకాదు) బ్రహ్మగారు రావణమండోదరు లని సూచించుటచే దాని నంగీకరించి నారదవచనములను దలంచి బ్రహ్మోపదేశమును సంస్మరించి:—

శ్లో॥ ఉపస్పృశ్యోదకం సమ్య ఙ్ముని స్థిత్వా కృతాంజలిః।
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేష తే గతిం॥"
"పురాయత్తత్ర నిర్వృత్తం పాణా వామలకం యథా।
తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ స మహాద్యుతిః॥"
"అభిరామస్య రామస్య చరితం వక్తు ముద్యతః
కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తరం".

(రామాయణము.)

ఆ తీరున శ్రీరామవృత్తాంత మంతయు "కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తర"ముగఁ గరతలామలకముగఁ బ్రసన్నమొనరించికొని కావ్య పరమార్థములలోఁ బ్రధానము లగు "శివేతరక్షతి" "సద్యఃపరనిర్వృతి"ని దనకును లోకమునకును సాధించెను ! ఇఁక నాతనికి శ్రీరామ చరిత్ర తప్ప తదితరులైన యిక్ష్వాకు, రఘు, మాంధాతాదు లెందులకు ?

ఇంక నొక చిన్నవిషయమును పాఠకమహాశయులకు సూచించి వాల్మీకి వృత్తాంతము నింతటితో ముగింతును. వాల్మీకి శాపవాక్యమున పదునొకండు శబ్దములుమాత్రమే గలవు. నారదుఁడు తన భక్తి సూత్రములయం దేకాదశవిధభక్తిని నిరూపించెను. వాల్మీకి శ్రీమద్రామాయణమునం దా పదునొకండు విధములగు భక్తిని ప్రదర్శించి యట్టి భక్తులే తీరున పరమధర్మమును సాధించి లోకధర్మమును నిర్వర్తించిరో సువిపులముగ వివరించెను. ఆ పదకొండువిధము లగు భక్తిని నుదాహరించి యా ఋషిశ్లోకమునందలి పదకొండు శబ్దముల నే రీతి నయ్యవి సంబంధించునో దఙ్మాత్రముగ సూచించుచున్నాను.

1. మానిషాద-గుణమాహాత్మ్యాసక్తి
2. త్వం - స్వరూపాసక్తి
3. ప్రతిష్ఠాం - పూజాసక్తి
4. శాశ్వతీః - స్మరణాసక్తి
5. సమాః - సఖ్యాసక్తి
6. అగమః - దాస్యాసక్తి
7. యత్ - వాత్సల్యాసక్తి
8. క్రౌంచమిథునాత్ - కాంతాసక్తి
9. ఏకమ్ - ఆత్మనివేదనాసక్తి
10. కామమోహితమ్ - తన్మయాసక్తి
11. అవధీః - పరమవిరహాసక్తి

ఈతీరున నాకు స్ఫురించిన విధమున,నారదుఁ డొనరించిన భక్తి విభాగము ననుసరించి సూచించితిని. బుద్ధిమంతు లగువార లిత్తోధికముగ సాధింపఁగలరు. రామాయణ మహార్ణవములో నెందఱికెన్ని రత్నములు దొరకవు? పైనఁ బేర్కొనఁబడిన యేకాదశవిధభక్తిని యెవ్వని

నెందులకు ప్రమాణముగ వాల్మీకి నిరూపించెనో గూడ నాకు దోచిన విధమున పాఠకుల యెదుట నుంచెదను.

1. దశరథుడు - మోహాసక్తి.

2. లక్ష్మణుడు-గురుమాహాత్మ్యాసక్తి. (గుణైర్దాస్యముపాగతః అని యతడే చెప్పుకొనెను).

3. భరతుడు - పరమవిరహాసక్తి.

4 శత్రుఘ్నుడు - స్మరణాసక్తి

5 కౌసల్య - వాత్సల్యాసక్తి

6 సుమిత్ర, జనకుడు - పూజాసక్తి

7. సీత - కాంతాసక్తి - (సీత - ఉత్తమస్థాయి, శూర్పణఖ - నీచస్థాయి యని చెప్పిన తప్పుకాదు)

8. ఆంజనేయులు - దాస్యాసక్తి (దాసోఽహం కోసలేంద్రస్య యని యతడే యనెను).

9. సుగ్రీవ - విభీషణులు - సఖ్యాసక్తి - లేక శరణాగతి

10. జటాయువు, శరభంగుడు, శబరి. } ఆత్మనివేదనాసక్తి

11. వసిష్ఠుడు, విశ్వామిత్రుడు } తన్మయాసక్తి

ఈవిధముగ వాల్మీకి తన కృతియందు తత్తదుత్తమస్థాయిని తానాచరించిన యేకాదశవిధభక్తిని వారివారియందు మూర్తీభవింపజేసి శ్రీరామచంద్రుని నవవిధరస స్వరూపుడగు పరమాత్మగా వర్ణించి తనహృద్గతకామబీజమును భగవంతునియందు పర్యవసింపజేసెను ! కృష్ణపరమాత్మ "విదుషాం కిమశోభనమ్" అని మహాత్ముల కెద్దియు నశుభము చెందదని వక్కాణించెను. కావున మహర్షి వాక్య

మగు "మానిషా" దేతి శ్లోకమునం దింకను విశేషార్థములు నెక్కుడుగ శ్రీమద్రామాయణార్థ ప్రతిపాదకములు కలవు. వాని నన్నిటిని వివరించుటవలన గ్రంథవిస్తర మగును. కావున బుద్ధిమంతు లగు పాఠకుల కవి వదలుచున్నాడను. ఇరువదినాలుగువేల శ్లోకములు, నిరువది నాలుగు గాయత్రీ బీజములు, నిరువది నాలుగు తత్త్వములు, నిరువది నాలుగు ప్రధానపాత్రములు, నా కవిబ్రహ్మ శ్రీమద్రామాయణము నందుఁ బ్రతిపాదించె ననికూడఁ బాఠకులకు విజ్ఞప్తిసేయుచు భవభూతి వాక్యముల నుదాహరించుచున్నాను.

శ్లో॥ "లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే।
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి"॥
(ఉత్తర రామచరిత్ర).

శ్రీ రా ముఁ డు.

వాల్మీకిశాపవాక్య మొక మంగళాశాసనముగఁ బరిణమించె ననియు, నయ్యది యా వాల్మీకి హృదయమునందు నిబిడీకృతమై నిరంతరానుసంధానముచేఁ బూర్తిగ నాతని మానసము నావరించియుండిన పరమపవిత్రభావ విశేష మగు ననన్యభక్తియు, నందు, క్షీరమక్షికా న్యాయంబున నాతని మానసమందు డాఁగియుండిన సూక్ష్మతర కామబీజ ముద్గతమై యాతని కొక శృంగారరసాభినివేశము కలిగించె ననియు, నవి రెండును శ్రీమద్రామాయణమునకుఁ బ్రధానకారణము లని వేరొకచో నియుంటిని. సహజ సాత్త్విక స్వభావుఁ డగు నా దేవ ఋషియునకుఁ గ్రౌంచమిథునవిపర్యయముచేఁ గలిగిన కరుణారస మంతయుఁ దన పూర్వజీవిత స్మృతిజన్య విషాద సమ్మిళిత మని గూడ సూచించియుంటిని. అ రీతిగ వివిధ రసభావజన్యమైన యుద్వేగముచేతనే యాతని కట్టి వాక్స్ఖాలిత్యము కలిగె ననిగూడ సహేతుకముగ నిరూపించి యుంటిని. ఇఁక నొక్క విషయమునుగూడఁ బాఠకులకు విజ్ఞప్తి యొనరించుటకై మఱలఁ

గొంత నా సందర్భమును బునరావృత్తి మొనరించు టావశ్యక మైనది. ఏల యన ఋషి యగు వాల్మీకి యొక్క పక్షిద్వంద్వముయొక్క రతిని గాంచి కామోద్రిక్తుఁ డయ్యె ననుట సమంజసమా యనియు, నట్టి తిర్య గ్యోని రతి సందర్శనముచేఁ గలిగిన రసోద్రేకము రసాభాసము కాదా యనియుఁ బొరకు లూహింపవచ్చును. ఆ విషయమునఁ గొంత సమా ధాన మవసర మగుటచే యథా శక్తిగ నిట నా వాదసామరస్యమును సప్రమాణముగ నిరూపించుచున్నాను. అందులకు ముందుగ రసాభాస మునుగూర్చి చర్చించుటకుఁ బూర్వము రస మనఁగా నేమియో యొక్కింత మనము తెలిసికొనవలసి యున్నది.

ఆలంకారిక శ్రేష్ఠులలో నొక్కఁ డగు పండితరాయలు తన రస గంగాధరమందు రస నిర్వచన మీ రీతి నొనరించి యున్నాఁడు:—

"సముచిత లలిత సంనివేశచారుణా కావ్యేన సమర్పితైః సహృదయ హృదయప్రవిష్టైఃతదీయ సహృదయతాసహకృతేన, భావవిశేషమహిమ్నా విగళిత దుష్యంత రమణీయత్వాదిభిః అలౌకిక విభావానుభావ వ్యభిచారి శబ్దవ్యపదేశ్యైః శకుంతలాదిభి రాలంబనకారణై శ్చంద్రికాదిభి రుద్దీపనకారణై ర శ్రుపాతాదిభిః కార్యై శ్చింతాదిభిః సహకారిభిశ్చ సంభూయ ప్రాదుర్భావితేనాలౌకికేన వ్యాపారేణ తత్కాలనివర్తితానం దాంశావరణాజ్ఞానేన ఏవ ప్రమృష్ట పరిమిత ప్రమాతృతాది నిజ ధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానం దేన సహగోచరీ క్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపోరత్యా దిరేవ రసః".

ఇందు "అలౌకికేన వ్యాపారేణతత్కాలనివర్తితానందాంశావరణాజ్ఞా నేన ఏవ...వాస్తవేన నిజస్వరూపానందేన సహగోచరీ క్రియమాణ ప్రాగ్వినివిష్టవాసనారూపో రత్యాది రేవ రసః" యని యా పండితుఁ

కుదాహరించుటచే, "సలౌకిక"మై, "తత్కాల నివర్తితానందాంశావరణా జ్ఞాన"ము కలిగి "వాస్తవ"మైన నిజస్వరూపానందములో "సహచరించెడి "ప్రాగ్వినివిష్ట వాసనారూప"మగు "రతి"యే "రస" మనుటలో, నిండుపారలౌకిక రసానుభూతియొక్క యంశము లౌకికానమని తప్పక గోచరింపకమానదు. ఏలన, పారలౌకికానందమునం దంతా వరణాజ్ఞానము నివర్తింపఁబడుట జరుగదు. అయ్యది తాత్కాలికము కాదు. అయ్యది తైలధారావతుగ నేకమై నిత్యమై యాదరణ జ్ఞాన రహితమై ప్రసరించుటంజేసి యయ్యది బ్రహ్మానంద మగుచున్నది. ఇఁక లౌకికానంద మనుభవించు నప్పు డన్ననో "నాభూన్న జా నేతరః" యను యద్వయభావ మేర్పడినను నయ్యది క్షణభంగురమై యనగాఁ దాత్కాలికమై ద్వితీయవస్తువుయొక్క యాలంబనముచేఁ దన కట్టిసౌఖ్యము, లేక యానందము కలిగె నను స్మృతి, వెంటనే తోఁచి మఱల తన కట్టి యానందానుభవమున కావస్తుసాహాయ్యము నపేక్షించుట తటస్థించుచున్న దనుట సర్వవిదితముకదా! కావున నట్టి లౌకికానందము సంసృతికి దారితీసి క్రమక్రమముగ దుఃఖహేతు వగుచున్న దనుట సర్వశాస్త్రసమ్మతము. కాని యట్టి సంసృతియందుఁగూడ యద్వయానందము కలిగిన స్త్రీ పురుషులిరువురుమాత్ర మొకరినొకరు విడిచియుండుట కొప్పుకొనరు. అందు స్త్రీ యానందము న్యూనమైనను, పురుషానందము న్యూనమైనను భావసంచలనము కలిగి స్వచ్ఛ మగునట్టియు, నిరవధిక మగునట్టియుఁ బ్రేమ మట్టి మిథునమునందుఁ బ్రసరించుట తటస్థించదు. దానికి వాల్మీకియు బోయితయే దృష్టాంతము. నిజ మగు నకృత్రిమ ప్రేమ మా బోయితకు వాల్మీకి దెస నుండెనేని యామె యాతని పుణ్యపాపములలోఁ దనకు నిమిత్తము లే దని చెప్పఁగలదా? శ్రీరామచంద్రుఁడు తాపసులను రక్షింతునని చేసిన వాగ్దానమునకై సీతామతల్లి తన సర్వస్వము త్యాగ మొనరించెను! అదియే "అశిథిల పరిరంభ వ్యాపృతైక

కదోష్ణః'' అని భవభూత్యాదులు గ్గడించిన యద్వితీయప్రేమ లక్షణము. అట్టి రసలేశమునే యానాఁడు వాల్మీకి యా క్రౌంచమిథునమునందు దర్శించెను. లేనిచో నొక పక్షి-యేకభర్తృ నియమము సృష్టియందే లేనట్టి విహంగము, పురుషపక్షి చచ్చినప్పుడు బోయవాఁ డచ్చట మృత్యువువలె నింక నున్నప్పు డా పురుషపక్షికై పలువిధముల నతికరుణముగ నేదు చేల తటస్థించును? కావున స్వచ్ఛ మగు ప్రేమరసానుభవ మెఱింగిన వారి దాంపత్య మనన్యసామాన్యము. ఇందుఁ బురుషునికన్న "స్త్రీయందే యా ప్రేమరసము స్వచ్ఛతర మని వాల్మీకి నిర్ణయించెను. చూడుఁడు! శ్రీరాముఁ డరణ్యములందలి లేడులను నెమిళ్లను నితరపశుపక్ష్యాదులను గాంచి యనేకవిధముల మన్మథసంతాపము నొందినటుల వాల్మీకి వర్ణించెనే గాని సీతవిషయమై చూడఁగ:—

"నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్।
ఏకస్థహృదయా నిత్యం రామ మే వానుపశ్యతి॥''
"సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః।
సంకల్పహయసంయుక్తైః యాంతీవ చ మనోరథైః॥''

(రామాయణము సుందరకాండ)

ఇత్యాదిగఁ గేవల శ్రీరామచంద్రబద్ధహృదయయై యుండె నని చెప్పెను. ఇందుఁ బరమార్థ మేమి? ఈశ్వరచైతన్య మన్నిటియందును బ్రతిబింబించు ను చేనిముందును సక్తము కాదు. కాని ప్రకృతి కటులగాక నీశ్వరచైతన్యస్పర్శ లేనిచో నయ్యది నశించును. అందుచే సృష్టియందుఁ బురుషనిష్ఠ మగు కామ మితరత్రి వ్యభిచరించుటయు, స్త్రీనిష్ఠ మగు కామము తాను వరించిన, లేక, వలచిన పురుషునియందే నిష్ఠిత మగుటకును గారణ మని నా యభిప్రాయము. జానకి తా నరణ్యమునకు వచ్చునపుడు "యా స్త్రీ యస్యాశ్చి ర్గత్వా ప్రేత్యభావేపి తస్య సా'' యనుటచే నందలి రహస్యము, స్త్రీ ప్రకృతిచేతనే భర్తృనిష్ఠ యైన

స్వరూపము కలది. ఆమె కీర్తిరతి యనికి యసంభవము. పురుషాశ్రి యము లేక స్త్రీ శోభింపజాల దని పెద్ద లనుటకుఁగూడ కారణ మద్దియే! ఇఁకఁ బురుషునకో? ఆతనికి రెండే రసానుభూతిమార్గము లని భర్తృహరి 'అభినవమదలీలాలాలసం సుందరీణాం। స్తనభరపరిఖిన్నం యౌవనం వా వనం వా' అని సూచించియున్నాఁడు! విషయానందమా? లేక బ్రహ్మానందమా! యని చెప్పెను. కావున నట్టి బ్రహ్మానందాంశమైన విషయానందము లౌకికరస మగుచున్నది. ఇయ్యది మేఘమందుండిన స్వచ్ఛనీరము, క్రిందకు దిగినకొలంది సాంకర్యమును జెంది లోకప్రవాహముచే మలిన మైనట్టుల నిర్దుష్టము లగు మిథునములందుఁ బ్రవహించెడి శృంగారరసము మలినమై రసాభాస మగుచున్నది! పైనఁ జెప్పఁ నఁబడిన పండితరాయలే యిట్టి రసాభాసమును నిర్వచించుటలో నీ తీరున సూత్రించెను. "అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వం" ఇఁక విద్యానాథాదులు 'ఏకత్రైవానురాగ శ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా" యని మూఁడువిధములుగ విభజించిరి. ఏ మైన నేమి? పర్యవసానమున ననుచితవిభావాలంబనాదులచే రసాభాసము కలుగుచున్నది. ఈ లోకప్రవాహమునందుఁ జరించు జీవులం దేది యుచితము? ఏది యనుచితము? ఏకత్రానురాగము గాక నిరువురయందును బరిపూర్ణ మగు ప్రేమరసము ప్రవహించుచున్నదా? ఈ తీరున మనము విమర్శింపఁగడంగుచో, బ్రహ్మాదులు మొదలు పిపీలికమువఱకు నీ లోకమునం దెచ్చటఁ జూచిన నుచిత మగు రసానుభూతి మృగ్య మని చెప్పకతప్పదు। అందువలననే దేవతలు, రాక్షసులు, దుర్మార్గులు, సన్మార్గులు, పుట్టుట తటస్థించుచున్నది! స్త్రీ, పుం, సంయోగఫల మానందము. అట్టి యానందమునుండియే జగము సృజింపఁబడుచున్న"దని 'ఆనందాదేవ ఇమాని భూతాని జాయంతే' త్యాదిగ శ్రుతి చెప్పుచున్నది. కావున సృష్టి మను సంతానము కలుగుటకును, లోకము భ్రష్టము

కాకుండుటకును వేదశాస్త్రపురాణాదులందును వాత్స్యాయనాది కామతంత్రములందును నేయేమానవులే తీరునఁ బ్రవర్తింపవలెనో నిర్వచించిరి. స్త్రీ పురుషప్రకృతులయందు భిన్నత్వ మేర్పడినంగాని ఋతు, కాల, దేశ, పాత్రానౌచిత్యముచేఁ గాని రాక్షసులు పుట్టుదు రని రావణజన్మవృత్తాంతము మనకు బోధించుచున్నది. సర్వసాధారణముగ లోక మంతేయు రసాభాసానందమయ మగుటచే శ్రీ సీతారాముల నిర్దుష్టానందమును వాల్మీకి వర్ణింప సమకట్టియే తన కావ్యము నారంభించెను !

పశుపక్ష్యాది శృంగారరసానుభూతిచేఁ గామోద్దీపనము కలుగుట గూడ స్వభావవిరుద్ధము గాదు. బ్రహ్మాదిస్థావరపర్యంత మీ కామరసము సర్వవ్యాపకత్వము నొందియున్నది. "ఋషీణా మప్యంతః ప్రవహతిహి మోహాయ జగతామ్" అని శ్రీశంకరభగవత్పాదులు చెప్పినటుల నది యెవ్వరి నాకర్షింపదు ? నిర్దుష్ట మగు బ్రహ్మానందరసానుభూతి నొందెడి కాలమందుఁగూడ నట్టి రసవిచ్ఛిత్తికిఁ గారణము లగు వారిని శపించినట్లు, విశ్వామిత్ర, అగస్త్య, నారదాదిమహర్షులచారిత్రములందుఁ గానవచ్చుచున్నది. ఇఁక రసాభాసవిషయములందుమాత్ర మడ్డు తగులువారిని శపించు నేల తటస్థింపదు? పైఁగ దానివలన క్రోధ ముద్భవించి జంతువుల ననేకక్రూరమారణకర్మలపాలు చేయు ననుట, వాలి, రావణ, అహల్యాదులవృత్తాంతములు మనకు బోధించును. క్రోధాది రసవిశేషము లన్నియు నొక్క కామవిచ్ఛిత్తి, యనఁగా, శృంగారరసవిచ్ఛిత్తిచేఁ గలిగినవేగాని వేఱొండు కా దనుటకు మనకు శ్రీమద్రామాయణము లక్ష్యగ్రంథము. ఈ తీరునఁ జూడఁజూడ నే రసము వస్త్వంతరాపేక్షచేఁగాని యనుభూతము కాదో యది యెల్ల రసాభాసమే యని మనకుఁ దోఁపకమానదు! ఏలయన, రెండవవస్తువుయొక్క యపేక్షచేఁ గలిగిన రసమునకు విచ్ఛిత్తి యేర్పడుట తప్పదు. రసవిచ్ఛి

త్తిచే హృదయమునం దావేదనము జనించి దానివలన మనస్సున కుల్లాసము నానందము చెడి క్రమక్రమముగ మానసికవ్యభిచారము ప్రారంభ మగును. తనకుఁ బరిపూర్ణానంద మొసఁగెడి వస్తు వెచ్చట లభించునా ? యని లోకమునంతయుఁ దిరుగుట కారంభింతు రట్టి స్త్రీ పురుషులు. అటుల తిరిగి తిరిగి యనేక దుష్కృత్యము లొనరించి యొనరించి తుదకు వస్త్వంతర నిరపేక్ష మగు రసానుభూతికై కృషి సేయనారంభింతురు. దానికై యితరవస్తువులను వీడి యాత్మానుభవ ముచేఁ దమకుఁ గావలసిన నిరతిశయానందపదవిని సాధింతురు. అప్పు 'డానందో బ్రహ్మేతి' యను శ్రుత్యర్థమునందలి యాథార్థ్యము గోచ రించును. వాల్మీకి యట్టి నిరతిశయానందపదవి నందుటకై యత్నిం చెడి స్థితప్రజ్ఞులలో నొకఁడు. అందుచేతనే వాల్మీకి యీ తీరున లౌకి కరసానుభూతి యంతయుఁ దుచ్ఛ మనియు క్షణిక మనియు శ్రీమద్రా మాయణమునందు వర్ణించెను.

శ్లో. సర్వే క్షయాంతా ఉదయాః పతనాంతా స్సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాంతాః మరణాంతం తు జీవితం.

(2-10-16).

కావున రసాభాసమునందుండిగాని విజ్ఞానము కలిగించు నుపాయము కేమరదు. అట్టి విజ్ఞానము సంపాదించుటకు మానవుం డనేకజన్మల యందు సుఖదుఃఖభాజనుఁడై మృత్యువుచే నుపహతుఁ డైనంగాని శక్తుఁడు గాఁడని మనకు వాలిరావణాదులచరిత్రము తెలుపుతున్నది. కాన యట్టి స్థితప్రజ్ఞునికూడ నే తీరున నాఁటి తమసాతీరక్రౌంచమిథున వృత్తాంత మాకర్షించెనో మనము తెలిసికొనినంగాని శ్రీరామచరిత్ర వాల్మీకి వ్రాయుటలోని ప్రధానాశయము మనకు సుబోధముకాదు.

సర్వసాధారణముగ నీ జగంబున రసాభాసమునకుఁ గారణము భ్రాంతి.భ్రాంతి యనఁగా నెట్టిదో కువలయానందకారు లగు శ్రీమదప్ప య్యదీక్షింతు లీ రీతిని వచించిరి:—

శ్లో. "కవిసమ్మత సాదృశ్యాద్విషయే పిహితాత్మని
ఆరోప్యమాణానుభవో, యత్ర స భ్రాంతిమాన్ స్మృతః".

ఎప్పుడు మనస్సు విషయస్ఫురణముచే పిహితమై తా ననుభవించెడి రసానుభూతికి సదృశమగు రసానుభవము ద్యోతకమగునో యట్టి సన్నివేశములందే భ్రాంతి కలుగును. వాల్మీకి యంతవఱకు బ్రహ్మానందరసానుభవము కలిగి తత్పారవశ్యంబున స్నాన మాచరింప నెంచి కాంబోలు శిష్యునివద్ద చేలముంగొనికూడ తత్తటస్థవనంబునం జరించుచుండెను! అతనికట్టెదుట నంతలో నా బ్రహ్మానందాంశలేశమగు విషయానందమునందు నిమగ్నమైన పక్షిమిథునము విహరించుచుండెను. కావునఁ దా ననుభవించెడి రసానుభూతికి సదృశమగు విషయానందమూర్తినిహృదయమందు, దృశ్యసన్నిహితత్వముచే నొక విద్యుల్లతవలె మెఱసి రసభావశబలత నది సాధించెను! బ్రహ్మానందానుభవము ఘనతరమై సర్వవ్యాపకత్వము నొందియున్నను దానికన్న విషయానందము తత్కాలమునందు మనకు దగ్గఱగా నున్న మన యఱచేయి దూరమునం దుండెడి కొండను బిహితమొనరించినటుల నా మునిమానసమందలి యఖండానందమును మఱఁగుపఱచెను! అచ్చట నారీతిఁ జిత్తవిభ్రాంతి కలుగుట కాఁ బఱ కాతనిమానసకాసారమునందు డాఁగియుండిన కామబీజము మత్స్యమే యుత్పతన మొనరించుటచే నాతని ప్రశాంతచిత్తమునఁ భావతరంగములు లేఁచెదీసెను! అటులఁ బ్రశాంతచిత్తము తరంగిత మగుసమయమున నాదృశ్యమునం దాతనికిఁ బూర్వస్మృతి జనించెను. అట్టి స్మరణమును రసగంగాధరకర్త యీ తీరున నిరూపించెను.

"సాదృశ్యజ్ఞానోద్బుద్ధ సంస్కార ప్రయోజ్యా స్మరణం".

ఏ నాఁటనో విస్మృత మైన యీ ఋషియొక్క పూర్వానుభవము జ్ఞప్తికి వచ్చి యందలివిషయవాసనాసంస్కార మూర్తినిమానసమునఁ గలం

చెను. సాదృశ్యజ్ఞానమునకుఁ గేవలము తేనయట్టి మానవుఁడే యచ్చట నుండ నగత్యము లేదు. గీతగోవిందమునందు జయదేవుఁడు శ్రీకృష్ణ పరమాత్మయొక్క విచిత్రాభినివేశముచేఁ గలిగిన సంస్కారస్మృతిని కేవలస్మారకమగు శృంగారరసానుభూతికాలమందుఁగూడ నా పీగుని మానసము కలంచిన స్మృతిరసనఁ జమత్కరించెను.

శ్లో. "స ప్రీతిం తనుతాం హరిః కువలయాపీడేన సార్ధం రణే
రాధా పీన పయోధర స్మరణకృత్కుంభేన సంభేదవాన్
యత్ర స్విద్యతి మీలతి క్షణమపి క్షిప్రం తదాలోకనాత్
కంస స్యాల మభూ జ్జితం జిత మితి వ్యామోహకోలాహలః".

అతీసనఁ గువలయాపీడముతోఁ బోరుచున్న శ్రీకృష్ణుని కా గజకుంభ స్థలమునందు గ్రుద్దుటకుద్యుక్తుఁడగుచుండ నా రాధికావక్షస్స్థలమున్స్మృతికి వచ్చెనఁట! ఇచ్చట భ్రాంతిచేఁ గలిగిన పూర్వసంస్కారస్మృతి యా రీతిని గృష్ణునిమానసము కలంచె నని కవి చెప్పుట యుక్తము కదా? "సదృశే ధర్మిణి తాదాత్మ్యేన ధర్మ్యంతరప్రకారకో ఉనాహార్యో నిశ్చయః సాదృశ్యప్రయోజ్య శ్చమత్కారీప్రకృతే భ్రాంతిః" యని పండితరాయలు చెప్పెను. కావునఁ దన యనుభవమునకు సదృశ మగు శబ్ద, స్పర్శ, రూపాదులందుఁ గలిగెడి విలక్షణానుభవమే భ్రాంతికి మూల మగుటనే నాఋషికి యా పక్షిమిథునముతో "తాదాత్మ్యము తటస్థించె ననుట చెప్పకతప్పదు. ఇచ్చట 'రస' శబ్దమునకు శృంగారము నర్థము చెప్పుటచేఁ బరమార్థమున కెట్టి బాధయు లేదు. ఆరీతి తాదాత్మ్యమే లేనిచో నాతని కంత "శోక" మునకుఁ దగిన కారణము దురూహ్య మగును. శోక మనఁగా "పుత్రాదివియోగజన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః" యని రసగంగాధరకారుఁడు వచించుటచే నా వాల్మీకి శోకమున కొక పక్షి కారణ మనుట పొసఁగదు. 'శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా"యనియుఁ జైగ

"'శోచన్నేవ ముహుః క్రౌంచీం'' అనుటచేఁ జచ్చిన మొగపక్షి నిఁగూర్చి కాక, విలపించుచుండిన యాడుపక్షి నాతఁడు తలంచి తలంచి విచారించుచుండెనని యనియుఁ బేర్కొనుటచే, నాతనియుద్రేక మంతయుఁ గేవల కరుణారసజన్య మందురా? సర్వసాధారణముగఁ గేవలకరుణారసముచేఁ గలిగిన యుద్రేకము పెద్ద లగు మహాత్ముల సందర్శనముచేత చల్లారక పోదు. కాని, కామముచేఁ గలిగిన యుద్రేక మటులు కాదు. 'జగామంతర్గతమనా భూత్వా శోకపరాయణః' యనుటచే నాతనికిఁ గలిగిన విశ్లేషము మిగుల తీవ్రముగ నుండుటచేతనే బ్రహ్మ నాత్మసాక్షాత్కరించిన నాతని కా శోకము చల్లారలేదు! వాల్మీకియట్టి యోగి యొక పక్షి యీ రీతి దుఃఖించె ననుట యసంగతము. ఆ క్రౌంచివిరహమే యన వియోగముచేఁ దన గృహిణి యగు బోయత యెంతదుఃఖించియుండునో యని యాతనిహృదయ మా క్రౌంచీదుఃఖసందర్శనముచే వ్యథ నొందెను. తన పాపమును బంచుకొనుట కాతనిభార్య నిరాకరించుటచేఁ గలిగిన యావేశమువలన వాల్మీకి తాపసి యయ్యెనే కాని కేవలమానసికపరిపాక మొంది వేదాంతార్థసందర్శనముచే నాతఁడు వైరాగ్యమును జెందలేదు. అట్టి యుద్రేకముచే నైన యోగులను విషయము లంతలో వీడవు. వసిష్ఠునిపై కోపమువలనఁ దపస్సు నారంభించిన విశ్వామిత్రుని కెన్ని విఘ్నములు కలిగెనో, మేనక యే తీరు నాతని వంచింపఁగలిగెనో మనకు రామాయణమే బోధించుచున్నది. అందుచే నా వాల్మీకి యొక్క హృద్గతపూర్వానుభవ మాతని నంతలో వీడుట యసంభవము. కాని యాతఁడు దేవఋషియుఁ నగుటచేతను, మహాతపస్వి యగుటచేతను బ్రహ్మసాక్షాత్కరించి యాతని శ్రీమద్రామాయణరచనయం దా యుత్సాహ మంతయుఁ బర్యవసించునటు లొనరించెను. 'తత మువాచ తతో బ్రహ్మా ప్రహసన్ మునిపుంగవం''. అనుటచే నా మునిపుంగవుని మోహాతిరేకముం గాంచి యా బ్రహ్మ ప్రహసించెను. ఈ శ్లోకమున

యర్జునునిమోహము గాంచి శ్రీకృష్ణుఁడు "త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత" యని భగవద్గీతయందుఁ జెప్పఁబడినది! వాల్మీకిమనోగతవిషయసంస్కారమే యాతనివ్యామోహమునకుఁ గారణ మని బ్రహ్మ కనుఁగొని, 'మచ్ఛందాదేవ తా బ్రహ్మ' న్నని యాతని నోదార్చి "నీ క్షేమముకొఱకే నేన ట్లొనరించితి" నని వాక్రుచ్చెను. అంత నా పక్షిసందర్శనజశోకము క్రమక్రమముగ నా శ్లోకార్థచింత నమై తచ్చింతనమం దా మునిహృదయము ప్రవేశించెను. కావున నా శ్లోకము కేవల కరుణారసజన్యముకాక మిక్కుట మగు శృంగారరసా విర్భావముచేఁ గలిగిన యానందమునకు విచ్ఛిత్తిచేఁ గలిగిన శాపవా క్యముగ నుండెను. ఇట్టి శాపవాక్యమె పార్వతి తనరసానుభూతి కాటం కము కలిగించిన దేవతలకును, తన భర్తృకార్య మ్మక్రమముగ ధరిం చిన ధరణికి నొసంగె నని గంగావతరణఘట్టమునందు శ్రీమద్రామా యణమునందే చెప్పఁబడెను. అందుచే, నేను వచించిన రీతిగ రసా భాసానందమునకు విచ్ఛిత్తి కలుగకుండ నుండ దనియు, నందువలన ననేకరసము లుత్పన్న మగుచుండు ననియు నందు ముఖ్యముగ 'కామా త్సంజాయతే క్రోధః' యనుటచే గామమునుండి క్రోధము, దానినుండి మోహము నీ తీరున బయలువెడలు ననియు లోకశాస్త్రానుభవములు చెప్పుచున్నవి. అట్టి రసవిచ్ఛిత్తిచేఁ గలిగిన క్రోధము వాల్మీకియందు స్థాన మగుటచేతను నాతనివాక్యమమోఘ మగుట చేతను నయ్యది దైవ నియోగముచే నొక మంగళాశాసన మయ్యెను. దానినుండి శృంగార కరుణారసప్రధానమును, వేదవేదాంతసారభూతము నగు రచన కాతఁ డారంభించి 'కృత్స్నం రామాయణం కావ్య మీదృశైః కరవా ణ్యహ' మ్మని యాతఁ డా శ్లోకార్థచింతముఁ గడంగెను! వాల్మీకి తన సుప్ర సిద్ధకావ్యమునందు శ్రీరాము నొక యుదాత్తవీరరససంభరితశృంగార నాయకునిగ సాధించుటకును, సీతను కేవలకరుణారసపాత్రముగ నిరూ

# తెలుఁగునందలి వృత్తగంధి గద్యములు

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ., ఆనర్సు.

ఆధునికకాలమున గద్య మన్నను వచన మన్నను సమానమే. ఇవి యొండొంటికిఁ బర్యాయపదములు. ఛందోబద్ధతగాని పాదనియమముగాని లేకుండ భావప్రకటనకై మాత్రము కూర్పఁబడు వాక్యముల నిప్పుడు మన మీ పేర్లతోఁ బిల్చుచుందుము. పూర్వ మీ పదములు తాళలయానుగుణముగఁ బాడఁదగిన పదపద్యరచనలకుఁగూడఁ జెల్లుచుండెను. ఇవి మాత్రాచ్ఛందము ననుసరించి నడచుచుఁ బాటగాఁ బాడుట కనువై యుండుటచే ఛందశ్శాస్త్రమునందే కాక సంగీతశాస్త్రములఁగూడ వీనికి లక్షణము చెప్పఁబడుచుండెను. ఇవి పాదనియమము కలవి, పాదనియమము లేనివి యని రెండు విధములు. రగడ, కళిక, ఉత్కళిక మున్నగునవి పాదనియమసాపేక్షము లైనవి. వీనినిగూడ నప్పుడు వచనమువలెనే యవిచ్ఛిన్నము లైన పంక్తులుగా వ్రాయుచుండిరి. క్రీ. శ. 940 ప్రాంతమున నుండిన సోమదేవసూరియశస్తిలకచంపువులో ద్విరదగతి రగడ యొకటి వచనభేదముగానే ముద్రిత మైనది. సోమనాథునిపంచప్రకారగద్య నిజమున కుత్కళికారూపమే యైనను వచనమువలె వ్రాయఁబడుచుండుట పరిపాటి. కోరుమిల్లిశాసనమునందలి రగడకూడ నట్లే వ్రాయఁబడినది. అదిగాక వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో గద్యభేదములలో నొకదాని నుత్కళికాప్రాయ మని స్పష్టముగాఁ జెప్పియేయున్నాఁడు. ఇంక వచనములు, గద్యలు మొదలైనవి పాదనియమ నిరపేక్షము లైనవి. కన్నడభాషలో బసవేశ్వరాదులను శివభక్తులు పలువురు పెక్కువచనములను రచించిరి. బసవరచితములైన షట్స్థలవచన కాలజ్ఞానవచన మంత్రగోప్యవచనములు సుప్రసిద్ధములైనవే. ఇవి పాటలవలెఁ బాడుట కనువుగా నుండును. ఇట్లే అక్కమహాదేవి, అల్లమప్రభువు, మోళిగ మారయ్య

మున్నగు భక్తులు రచించిన వచనము లెన్నో గలవు. తెలుగునఁ గృష్ణమాచార్యుఁడు క్రీ. శ.1300 ప్రాంతమున రచించిన సింహగిరి వచనములు, తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు రచించిన (1468-1553) వేంకటేశ్వరవచనములు, ఏగంటివారి వచనములు, చిలుకపాటివారి వచనములు మున్నగునట్టివే. అనంతుఁడు ఛందోదర్పణమున దీనిని ఇట్లు నిర్వచించినాఁడు.

కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెయోలె బహుముఖముల నలం
బున మెఱయు గద్యలది చాఁ
దెనుఁగుఁ గృతుల వచన మనఁగ దీపించుఁ గడున్.

అన్నమాచార్యుఁడు సంకీర్తన లక్షణమున దీనినే తాళగంధి యని పేర్కొనియుండెను. ఇది గద్యభేదములలోఁ జూర్ణికకు సంబంధించినది గావున దీనికే తాళగంధిచూర్ణిక యని యింకొక పేరు.

నన్నయకుఁ బూర్వము కన్నడమున గద్యపద్య మిశ్రితములైన చంపూకావ్యములు వెలసియుండెను. నన్నయయు నన్నిచోడుఁడును నాపద్ధతి ననుసరించియే తమ కావ్యములను గద్యపద్యమయములుగా నొనరించిరి. వారి గద్యములలో వృత్తగంధులు, చూర్ణికలు, ఉత్కళికాప్రాయములుకూడఁ గానిపించును. సరస్వతీకంఠాభరణములో భోజుఁడు "యదాహి అటవీవర్ణనాదౌ గద్యం ప్రగల్భతే" అని యడవి మున్నగువానిని వర్ణించుపట్లఁ బద్యముకంటె గద్యమే యుచితముగా నుండునని చెప్పియుండెను. ప్రాచీనులైన శిష్టకవు లా యాలంకారిక వచనము ననుసరించి కొన్ని వర్ణములను వచనములుగా వ్రాసియుండిరి. తిక్కన మాత్రము

వచనములేకయు వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయము పద్యములన పెం
పుచితంబుగఁ జెప్పుటొప్పు లుచితం బనఁ గే.

అని వచనము లేకుండనే నిర్వచనోత్తరరామాయణము రచించెను. మఱల నాతఁడు భారతమున మాత్రము గద్యపద్య మయమైన చంపూ పద్ధతినే యవలంబించి మహాకవిత్వదీక్షావిధి నొంది గద్యముల 'బద్య ములన్ రచియించెదం గృతుల్' అని చెప్పియుండెను. పాల్కురికి సోమ నాథుఁడు 'అగూఢ గద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠ రచన, మానుగా సర్వసామాన్యంబుగా' దని యీగద్యపద్యమయరచ ననే నిరసించి సాంతము ద్విపదచ్ఛందోమయమైన కావ్యములను రచింపఁ బూనెను.

ఈ విధముగా నిప్పుడు మనము గద్య మనియు వచన మనియు భావించురచనలకును బూర్వులు వ్రాసిన గద్యవచనములకును గొంత భేదము గోచరించుచున్నది. ఇప్పటివచనము విషయప్రధానమై చదువు టకుమాత్ర మనుకూలమైనది. పూర్వపువచనము భావవర్ణనా ప్రధానమై పాడుటకుఁగూడ ననువై యుండినది. అయ్యు నప్పుడుగూడఁ గేవల వచ నములుగాఁగాని గద్యములుగాఁగాని వ్రాయఁబడిన రచనలలో గద్యవచ నముల కున్నంత గేయతా సౌందర్యము చంపూకావ్యమునందలి వచ నముల కుండినట్లు తోఁపదు. దీనికిఁ బంచప్రకారగద్య వేంకటేశ్వర వచ నములు మున్నగువానియందలి గద్యవచనములకును నన్నయ తిక్క నాదులకావ్యములందలి వచనములకును గల భేదమే తార్కాణము. మన పద్యకావ్యములలోఁ గవు లాశ్వాసాంతములందు గద్యలు వ్రాయు చుందురు. ఇవి సంస్కృతసమాసభూయిష్ఠములై తాళబద్ధములై పాడుట కనువుగా నున్నట్లు తోఁచును. వీనిని గవులును నితరులును గద్య లనియే యందురుగాని వచనము లని పేర్కొనరు. కాని గ్రంథాం తర భాగములందలి ఛందోబద్ధములుకాని రచనలకుముందు వచన మునకు సంక్షేపరూపమైన 'వ' అను నక్షరమే గోచరించుచుండును. వీనిని గద్యము లని పేర్కొనుట యరుదు. ఆశ్వాసాంతగద్యల కున్నంత

గేయతాళ్వాత లోపలి వచనముల కుండకుండుటయే యీభేదమునకుఁ గారణమై యుండు నని చెప్పవచ్చును.

గద్యపద్యోభయమైన వాక్యమును 'చంపు' వందు రని దండియు న్నగు లాక్షణికులు చెప్పినను గన్నడమున నట్టి రచనలకు గద్య లను ప్రతీతియే కల దని నృపతుంగుఁడు కవిరాజమార్గములోఁ జెప్పిన యీపద్యమునుబట్టి తెలియుచున్నది.

మిగె కన్నడ కబ్బంగళొ
శగణిత గుణ గద్యపద్య సమ్మిశ్రిత మం
నిగది సువర్గద్య కథా
ప్రగతియుం తచ్చిరంత నాచార్యర్కళ్.

ఇట్లనుటకు బహుశః గద్యములుకూడ దాళబద్ధములై పద్యములవలె బాడుటకనువై యుండుటయే కారణమై యుండును. ఈ యాచారమునఁ గానఁబడుచున్నది. హరిభట్టుత్తర నాగసింహపురాణమును గూర్చియు, లోకేరావు సోమన శివరాత్రిమాహాత్మ్యమునుగూర్చియుఁ జెప్పునపు డవి పద్యగద్యమయకావ్యములే యైనను వచనప్రబంధము లనియే తెల్పియుండిరి. ఇప్పుడు కావ్యములలోని గద్యలనుగాని వచచనములనుగాని గేయరీతిని జదువు సంప్రదాయ మరుదై పోయినది. వాని నిప్పుడు మనము సాధారణవచన భాగములుగానే భావించుచుందుము.

ఏవాఙ్మయమునందైన వచనముకంటెఁ బదమో పద్యమో ముందు వెలువడుచుండు ననుమాట సత్యమే. లిపి యేర్పడునంత వఱకు నవి జనుల ముఖములందే యుండి క్రమముగా నాభాషయందలి వాఙ్మయముగా నేర్పడును. తరువాతఁ బదపద్యములతోపాటు వచనముకూడ వర్ధిల్లును. ఈ వచనము పండితప్రణీత మగునప్పు డందు సప్రయత్నముగనో యప్రయత్నముగనో పదపద్యభాగములు చొచ్చు

చుండును. అనఁగా గణబద్ధము కాని వచనమునందు గణబద్ధములైన పద్యపాదములుకూడ నక్కడక్కడఁ గనఁబడుచుండును. అట్టి గద్యమును వృత్తగంధి యనికాని పద్యగంధి యనికాని చెప్పవచ్చును.

"ఆంధ్రవచన వాఙ్మయమున" వృత్తగంధి కుదాహరణముగా భగవద్రామానుజ విరచితమైన వైకుంఠ గద్యమునందలి భాగ మొసంగఁబడినది. ఇందు వంశస్థ వృత్తమునందలి రైదు పూర్తిపాదములున్నవి. వ్రాఁతలోఁ బదవిభాగము చేయఁబడినదిగాని సంధులు కలిపి వ్రాసినచో దానిని వంశస్థ వృత్తమే యనవచ్చును. నాలుగు పాదములతో నాఁగక యింకను గొనసాగుటచేఁగాఁబోలు నది గద్యముగాఁ బరిగణింపఁబడినది. నన్నయ భారతమునుండి వృత్తగంధి వచనముల కొసంగఁబడిన యుదాహరణము లన్నియు నాయావచన భాగముల యారంభభాగములే. మఱియు నందు "నన్నయ వచనమును బ్రారంభించుపట్టుల పద్యమువలెనే నడపించు" నని స్పష్టముగాఁ దెల్పఁబడినది. దీనినిబట్టి వృత్తగంధి వచనము లారంభముననే పద్యగతిని బ్రదర్శింపవలెనన తెలియుచున్నది. ఈయఁబడిన యుదాహరణములలో యతి విషయ మంతగాఁ బాటింపఁబడలేదు. ఒక్కగణములుమాత్రమే సరిపోవుచున్నవి. ఉదా॥

అని నిశ్చయించి గొంతిని మాద్రినించూచి
మీారలిందుండి నవయక హస్తి
పురమునకుం జని

ఇందు మొదటియర్థమునఁ బ్రాస యతి వేయఁబడినది. రెండవయర్థమున యతి లేనేలేదు. కీ॥ శే॥ గిడుగు

వేంకటరామమూర్తి పంతులుగారు రచించిన ప్రాఁతెనుఁగుఁ గమ్మ వృత్తగంధి సంప్రదాయముతోనే వ్రాయఁబడినది. ఇందాదినుండి తుదిదాఁక నేదోయొక పద్యము పాదము కానఁబడుచునే యుండును. ఒక

చోట సీసపాదార్థము, తరువాత ద్విపదపాదము, మరల సీసపాదార్థము, మరల ద్విపదపాదము, మిమ్మట నగునగాఁ గొన్ని ద్విపదపాదములు, అనంతర మొక సీసపాదము, పిదపఁ గొన్ని తేటగీతపాదములు—ఈ విధముగా నాకమ్మ యంతయు సాగినది. కొన్నిచోట్ల యతి నియమము పాటింపఁబడలేదు. కొన్నిచోట్ల నొండు రెండు మాత్రలధికముగా నున్నవి. ఉదా :—

సిరిదాల్చుతేఁ డొగి—చిన్నిచూడ్కులఁ జూచు
తెనుఁగు చదువుల రచ్చ తీర్పరులార.

ఇందు మొదటిది సీసపాదార్థము. రెండవది ద్విపదపాగమువలె నున్నది. కాని యొక మాత్ర యధికముగా నున్నది.

అణఁకువమెఱయుచు నామోవుకోలఁది

ఇందు ద్విపదగణము లున్నవి కాని యతి నియమము పాటింపఁబడ లేదు.

అక్కడ సిగలోనఁ - జొక్కడ మోమున
సొనల నెలకొల్పు - మాను దొరలు

ఇందు సీసపద్యపాదము సలక్షణమై యున్నది.

ఇట్లు మీయడియరి సీడనే నిడితిఁ
గై వ్రాలు గిడుగు వేంకట రామమూర్తి.

ఇందు ద్విపదలక్షణము సరిగా నున్నది. ప్రాసలేదు. ఈ కమ్మ పద్యము కా దనియు గద్యమే యనియుఁ బంతులుగారే వ్రాసికొని యున్నారు.

ద్వి. ఇక్కమ్మ నుదుల నాయిచ్చమై నేను
గూర్చితి నానాల్క కనువగునట్లు
చదువరి వీనుల కింపెడునట్లు
పద్దెంబు లివి యని పేర్కొన్న నేను

సీ. పద్యంబు లివియని వ్రాయఁబడి పరికించి

ద్వి. కీడని నూఱంగఁ జగ నేఁకేని
గద్దె కూర్చున్నక్షైనఁ గట్టడి వేసి
గద్దియకా దీని గణియింపఁబడదె.

దీనినిబట్టి వృత్తగంధి గద్యమున నేదో యొక పద్యమునందు యాదృచ్ఛికం తము గోచరించుచునే యుండునవలెను. యతి ప్రాసల నియమము యథా సంభవముగాఁ బాటింపఁబడును.

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు శుద్ధాంధ్ర భారత సంగ్రహముఖ పత్రమున

శ్రీ ర స్తు
శుద్ధాంధ్ర భారతసంగ్రహము
మి నుఁ డి
ఇ ది

చెన్నపురిని మిగుల వాసిని గన్న
కొల్లాసుబ్బరాయలు సెట్టియు
గురుసామి సెట్టియుసను

ఇత్యాదిగా నొక సీసపద్యమువ్రాసి యున్నారు. పాదవిభాగ పూర్వక ముగా వ్రాసినచో నిది సలక్షణమైన సీసపద్యమే యగును.

శ్రీరస్తు శుద్ధాంధ్ర - భారత సంగ్రహ
మునినుఁడి యిది చెన్న - పురిని మిగుల
వాసినిగన్న కొ - ల్లా సుబ్బరాయలు
సెట్టియు గురుసామి - సెట్టియుసను

నిజమైన సీసమే యనవచ్చును. కాని యిది సాధారణముగా నితరులు గద్యము వ్రాయుచోట వ్రాయఁబడినది. అంతకంటె దీనిని గద్య మను టకు వేఱు కారణ మగుపడదు. ఇట్లే కీ॥ శే॥ మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు బిల్వేశ్వరీయమున

శ్రీ రస్తు

విశ్వేశ్వరీయము

విషయసూచిక

పీఠిక

కథాముఖము

ఇత్యాది నూటయిరువది సీసపాదములను చివర నొక తేటగీతి పద్యమును వ్రాసియున్నారు. చివర గీతమున నార

ఇదియు సప్తోత్తర శతాంధ్ర లసనసీస యుతి
సీసమాలిక నాదాత్మ సిద్ధలింగ
ముందు నీ తేటగీతియు బొందుపఱచి
మిది విషయసూచికయగు విశ్వేశమూర్తి !

యని పైని నూటనిమిది సీసపాదము లని సూచించినారు. ఇవన్నియు సర్వలక్షణ సమగ్రములైన సీసపాదములే. వీనినిగూడ నచ్ఛములైన సీసపాదములే యనవచ్చును. వీనిని వృత్తగంధు లనుట కిందలి వస్తువే కారణముకాని వేఱుకారణము లేమియునులేవు.

ఈ విధముగా వృత్తగంధి వచనమున కీఁబడిన యుదాహరణము లన్నియుఁ బద్యపదగంధులుగానే యున్నవిగాని వృత్తగంధులుగా లేవు. ఏలయన నందిమిడియున్న పాదములలో నొక్కటియు వృత్త పాదములేదు. శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు ఛందస్సాహితీ రీతు లను వ్యాసమున "గద్యమున పద్యభాగమువలె వృత్తగంధియై యుండుట యనఁగానేమో సంస్కృత కవితారచనలనుబట్టి తెలిసికొనుట సాధ్య మగునో కాదో, కాని దేశీయము లగు స్త్రీల పాటలు మొదలగువాని లోని కందార్థము లనఁబడునవి వీనిక్రిందఁ జేరవచ్చును. ఇవి ముందు గండాదిపద్యములధోరణి కల్గి తరువాత పాటగా మాఱు చుండుట కలదు. ఈ క్రింది పాటలోని పద్య ముత్పలమాలగా నున్నది.

# తెలుఁగునందలి వృత్తగంధి గద్యములు

శ్రీమధురాధరీ వినవె - శేషగిరీశుఁడ నీదు కేళికా
ధామమునందు నింతవడి - దర్పకలీలల నుండి యంతటన్
వేమఱు వేటలాడఁ జని- వేగమె వచ్చితి తల్పుతీయవే
భామాసద్గుణాగణా భామా లావణ్యచతురా సీమా
అలమేలుమంగనా.

ఇట్టి దేశీయరచనలనుబట్టి యీ విభాగము చేయఁబడినదా యను స హము కలుగకమాన" దని వ్రాసియున్నారు. దీనినిబట్టి వృత్తగ యనఁగా బాటలలో ముందేదో వృత్తమునకుఁ జెందిన పాదము లుఁ వలె నని తేలుచున్నది.

వామనుఁడు వృత్తగంధిని (పద్యభాగవత్ )పద్యభాగవత్ ః నిర్వచించెను. దీనికిఁ బద్యభాగము కల గద్యము వృత్తగంధి యగు యర్థము. ఆ పద్యభాగము మొదటనే యుండవలె నని కాని,ఆద తము నుండవలె నని కాని యిందుఁ జెప్పఁబడి యుండలేదు. అంద నెక్కడనైనసరే గణబద్ధములైన పద్యపాతములు గోచరించినచోఁ గద్యను వృత్తగంధి యని చెప్పవచ్చు నని నే నూహించుచున్నా. నన్నయకుఁ బూర్వమునందలి కొన్ని శాసనములలో నీ విధము వృత్తగంధు లని చెప్పఁదగిన వచనములు కొన్ని గోచరించుచున్న మిగిలినవి విషయపరిధానములై యిప్పటి మన వచనములనే పోలిన న్నవి అని తాళబద్ధములును గావు; పాడుట కనువైనవియుఁ గావు.

1. ఎరికలముత్తురాజు పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము
   పుణ్యకుమారుండు గణ్యమానుండు
   ఇది ద్విపదపాదము. ప్రాస యతి వేయబడినది.
2. పుణ్యకుమార చోళమహారాజు రామేశ్వర స్తంభ శాసనము
   విలిపత్తి (ఱితి) కమ్మరి - వినియన వ్రాసె.
   ఇదియును ద్విపద పాదమే. యతి సరిగా నున్నది.

శ్రీ మహేన్ద్రిన్ మాన రవిమాటు రాపిడుగు.

ఇందుఁ బంచమాత్రాకము లైన నాలుగు గణము లున్నవి.

ఇది ద్విరదగతి రగడపాదము. యతిలేదు.

ii. మగడు పుదలి ఏలువాడు కాపిచోళ ముత్తురాజు.

ఇందు నాలుగేసి సూర్యగణములతోఁ (త్రిమాత్రాగణము లతో) గూడిన రెండు దళము లున్నవి. తురగవల్గన రగడ పాదము. యతిలేదు.

iii. అచ్చెర్వ్వ గనుసది వరజముం డన్వాడు
దంతియ మంగుతో (శక్) పొడుచిపడియె(న్).

కొంచెము మార్పుతో నిది సీసపద్యపాదమువలెఁ గన్పట్టుచున్నది. యతులులేవు.

4. పుణ్యకుమారుని పొట్లదుర్తిమాలెపాడు శాసనమున ద్విరద గతి రగడగర్భితమై యున్న దని మొదటి పరిశోధన పత్రికలో శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు వ్రాసినారు.

'అణపోతులు రేవణకాలు పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్నాజ ఇశె రేనికిఁ.'

ఇందుఁ బాదమున కిరువదేసి మాత్ర లున్న వనియు మొదటిపాదమునఁ బ్రాస యతియు (అణ-ద్దణ) రెండవపాదమున సమాక్షరయతియు(ఇ-ఇ) వేయఁబడిన వనియు, యతిస్థానములు, సమస్థానములలో నున్న వనియు వారు వ్రాసియున్నారు. ఇం పరువదేసి మాత్ర లున్నమాట నిజమేకాని యైదేసి మాత్రలకు గణము విఱుగుటలేదు. (ఇచ్చిన పన్నస) గణములు తాళానుగుణముగాఁ బంచలఘువులతో లే వని వారే వ్రాసియున్నారు. ఇట్లు విఱుగకుండుట సంప్రదాయవిరుద్ధము, యతులు సమస్థానమున నున్న వని వారు సూచించిరి. మొదటిపాదమున 15

మాత్రల తరువాతను, రెండవపాదమున 13 మాత్రల తరువాతను యతి వేయఁబడినది. లక్షణము ననుసరించి మూఁడవగణము మొదట యతి యుండవలెను. ఇం దాద్యంతప్రాసలు లేవు. ఈ విధముగా నిందొక్క మాత్రా నియమము తప్ప మ తే ద్విరద గతి లక్షణములు నిందుగాన వచ్చుటలేదు.

5. రేమయ్య శాసనము S. I. I. X. 593.

వక్రంబువచ్చిన వారాణాసియు (నాగువా)

శ్రీపర్వతంబు వచ్చి(న)

ఇందు సీసపద్యలక్షణ మున్నది.

6. కొసినేపల్లి శాసనము. S. I. I. X. 598.

i. ప్రభుచోటి రట్టోడి పరహితుఁ డితఁడు.

ఇది ద్విపదపాదము.

ii. కట్టించె కనిక పొం - పట్టంబు హాయిలుగు

ఇది సీసపాద పూర్వార్థము.

7. పెద్దముడియం శివాలయశాసనము. S. I. I. X 611.

దేవస్వంబు లంచముగొన్న వాడు వార

ణాసి వ్రచ్చిన పాపంబు గొన్న వాడు.

యతులు లేవు గాని యివిరెండును తేటగీతి పాదములుగా నున్నవి. దేవ స్వంబు అనుచోట స్వను దేల్చి పలుకవలెను.

8. S. I. I. X 612.

ఏనియు బోగొన్న వాడు నిచ్చినవాడు

చేడువాడు క్రొచ్చిన వాడు వెంట.

యతులు లేని సీసపాదము.

9. వెంకయచోడుని చోంగలసాని శాసనములో మహాక్కర పాదములున్నవని శ్రీ ముట్లూరి వెంకటరామయ్యగారు త్రిలింగ ర

జత్ 'త్సిన సంచికలో వ్రాసియున్నారు. మహాక్కరలో బాద మునకు 1 సూర్యగణము 5 ఇంద్రగణములు 1 చంద్రగణము నుండవలెను. రెండు నాల్గుచోట్ల సూర్యగణమైన రావచ్చును. ప్రాస యుండవలెను. యతి యైదవ గణము మొదట.

వెంకయాచోడ్ష మహారాజు తెంకణాదిత్యుండు
కొమదుర భీముండు ప్రసి
ఇల్ల దాపజ్మనీ ధర్మమూ చంద్రార్క తారకం
బునువార్ద్ది లుచునుండు.

ఇందు గణములు కొంతవఱకు సరిపోవుచున్నవి. మొదటి పాదమునందలి చంద్రగణమున నొక మాత్ర హెచ్చుగను రెండవపాదమునందలి చంద్రగణమున నొక మాత్ర తక్కువగను గనఁబడుచున్నవి. ప్రాస యతి నాల్గవగణము మొదట వేయఁబడినది. (వెంక-తెంక) లక్షణము బట్టి యది యైదవగణము మొదట నుండవలెను. రెండవపాదమున యతిలేదు. ప్రాసకూడ లేదు. అందుచే దీనిని మహాక్కర యనుట కంటె నా పాదము లున్న వృత్తగంధివచన మనుట యుచితము.

10. జయసింహవల్లభుని విత్ప్రత్తిశాసనము. S. I. I. VI. 585

పద్యమయమువలెఁ గన్పట్టుచున్నది. కాని య ందే పద్యమున్నదో తెలియుటలేదు.

హాతకపుత్రకముని యా శ్రీశిలావిశాల విపుల,
అనుచోట సీసపాదచ్ఛాయ కనఁబడుచున్నది.

11. బెజఇత్త భటరళ నిల్పినదత్తి
కడల్దల ఇళరయ నిల్పిన గుడియు
కపిలేశ్వరపురపు శాసనము.(శ్రీవేంకటేశ్వర Vol. V. No. 2 పుట 41).

యతిప్రాసలులేని ద్విపదపాదము లివి. కడల్దల అను చోట ల్దను దేల్చి పలుకవలెను. (Cf. గొఱల్చియ, గొరగల్గా

12. చాళుక్య భీముని కొలనిశాసనము.

శ్రీవిక్రమాదిత్య - నృపాగ్రిత - నయుడైన
చాలుక్య - భీమునకు శౌచకం - దర్పునకు
వేగీశ్వ - రునకురణ - మర్దాన్వ - యకులతిల
కుండైన - కుసుమాయు - ఘండుగ - స్నరబల్లి
వరునికి నం - ప్రాప్తమై - నరన మ - ర్దక శ్రీ
మదనభుజ - వీర్యబల - పరాక్రమ - మునదచ్చి
కణ్ఠియం - గట్టి ప - ట్టంబెట్టి - ఖడ్గ

ఇందైదేసి మాత్రలు గల నాలుగేసి గణము లున్నవి. ద్విపదగతి రగడ పాదము లని చెప్పవచ్చును.మూడు పాదములలో యతి సరిపోయినది. ఆద్యంతప్రాసములు లేవు.

ii. 'వేగిదేశము విష్ణువర్ధనుతో నడ్డి'
రాజ్యంబుసేయుచున్న కుసుమాయు
ఇది యతిలేని సీసపాదము

iii. చేకొని కొలనికి - చ్చిన స్థితినిల్ప
ద్విపదపాదము.

పై సూచించిన పద్యము లన్నియు జాతులకుఁ జెందినివే. కాని వృత్తములకు సంబంధించినవి కావు. ఇట్టి వింకను బెక్కుగలవు. కాని జాతు లన్నియు మాత్రాగణబద్ధములే. కావున సందలి గణములు పద్యపాద క్రమమున వచనములోఁగూడఁ గానఁబడుట కవకాశ మున్నది. అందుచేఁ బై పద్యపాదములలోఁ గొన్ని యాదృచ్ఛికములు కావచ్చును.

# 'బహురూపము'

యస్వీ. జోగారావు

భరతమునికాలమునుండి మన దేశమున దశవిధ రూపకములు, తత్రాపి యష్టాదశాధికములైన యుపరూపకములు, బహువిధ నాట్య ప్రబంధములును బ్రసిద్ధి వడసినవి. కాని "రూపారోపాద్రూపకమ్", "అవస్థానుకృతిర్నాట్య" మ్మను నాభాణకముల యర్థములతో సంవదించునట్టి రూపకధర్మవిశిష్టములైన నాట్యప్రక్రియ లరుదు. అట్టి వానిలో నగ్రగణ్యము బహురూపము. దీని లక్షణ మిదమిత్థ మని నిరూపించుట కష్టము. నాట్యవిషయికములైన ప్రసిద్ధలక్షణ గ్రంథములం దెందును దీని ప్రసక్తి గానరాదు. తరతరముల మన వాఙ్మయమున మాత్రము తఱచు దీనిప్రసక్తి గన్పట్టును. అగుచో, ఆంధ్రదేశమునమాత్రమే యిది చిరప్రసిద్ధమైన నాట్యవిశేషముగాఁ బ్రచారము నందినదా యని పించును. ఆంధ్రవాఙ్మయమునుండి యీ బహురూప స్వరూపము నించుక నిరూపించ వచ్చును.

పాల్కురికి సోమనాథుని గ్రంథములనుండి ప్రాచీనాంధ్ర నాట్య సంగీత కళాస్వరూప విశేషము లనేకము మనకు దెలియ వచ్చినవి. అందు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున శివరాత్రి జాగరణ వినోదకాలక్షేప ప్రవర్తకులలో

'లలితాంగరస కళాలంకారరేఖ
లలవడ బహురూప మాడెడువారు'

పేర్కొనఁబడిరి. ఇట బహురూప మనఁగా నేపథ్య వైవిధ్యమే కాదు, అభినయవైవిధ్యమును సూచింపఁబడినవి. అభినయము-ఆంగిక వాచికాహార్య సాత్త్వికము లని చతుర్విధము. పాల్కురికి పంక్తులలో, అంగశబ్దముచే ఆంగికము, రస శబ్దమున సాత్త్వికము, కళాశబ్దమున గీతి

(పాట) పాడు నప్పుడు కళలు వేయుట పరిపాటి. అనఁగా 'వాచికము,' అలంకార రేఖ యనుటలో 'ఆహార్యము' స్ఫురించును. ఈ యర్థమునే మఱింత విపులముగా, నిపుణముగా నిరూపించినాఁడు పదునాఱవ శతాబ్ది పూర్వార్ధమున నుండిన తాళ్లపాక పెదతిరుమలయ్య తన వైరాగ్య వచన మాలికా గీతాలలో :-

ధన్యాసి—ఏకతాళి

"సర్వేశ్వరా యవధారు జగంబు నీ నాటకశాల
నేనెత్తిన తోలు జన్మంబుల యాకారంబులు
నీ ముందర నాడెడు బహురూపంబులు
దార సుత బంధుజనులు మేళగాండ్రు
నిన్ను నుతియించు వేదశాస్త్ర పురాణములు
తూర్యత్రయంబు"
మా పాద ప్రచారంబు నాట్యంబు
చేయు చేతలు నాడెడు మాటలు
క్రియాభాషాంగంబులు..." etc

ఇందలి మేళగాండ్రు, తూర్యత్రయము, నాట్యము, క్రియాభాషాంగములు నను మాటలు బహురూప స్వరూపమును బట్టి యిచ్చుచున్నవి. దీనినిబట్టి చూడ బహురూపము సామాన్యమైన నాట్యప్రక్రియల వంటిది గాదు. ఏదో కడు విశిష్టమైనదిగాఁ దోఁపక తప్పదు. ఇట్లు చతుర్విధాభినయమునకు లక్ష్యభూతమగు నిట్టి ప్రక్రియకు నాటకము (రూపక సామాన్య వాచిగా) తోఁగల విలక్షణత యెట్టిదో చూడవలసి యున్నది. ఆ విషయము పెదతిరుమలయ్యకు సుమారు మూఁడు శతాబ్దులు ముందుగనే యథావాక్కుల అన్నమయ్య* సూచించియున్నాడు:

---

* తిరుపతి దేవస్థానము ప్రచురణ (1935)—తాళ్లపాకము వారి రచనలు. సంపుటము 1—అధ్యాత్మకృతులు, పుట 108.

సర్వేశ్వర శతకము—ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణ 20 వ పద్యము.

"అనురంగన్ స్ఫుట భక్తి నాటకము భాషాంగ క్రియాంగాభిర
మ్యముగాఁ జూపిన మెచ్చి మీరలు పురే యన్నంతకున్
యోని గే
హములన్ హేయపుఁ బన్నికొంచును నటుండై వచ్చి సంసార రం
గ ముఖంబున్ బహురూప మాఁడు నెలయంగా జీవి సర్వేశ్వరా"

నాటకమునందు బహువేషము లుండును. కాని యవి వివిధ నట స్వీకృతము [illegible] బహురూపమునఁ బెడతిరుమలయ్యాయు. అన్నమయ్యయు సంకీర్తన యొక్క వివిధ జన్మము లందు జీవి బహురూపము లనుటలో, ఏకపాత్రధారి యనేక వేషస్వీకృతిద్యోతమాన మగు చున్నది. అట్లుకానిచో బహురూపమునకు పాత్రప్రక్రియల ప్రత్యేకతయే లేదు. అన్నమయ్య నాటక శబ్దమును రూపక సామాన్యవాచి యైనను విశేషవాచియైనను, నాభిప్రాయముగా వాడినాఁడు. నాటకమున 'ఐక్యము' (Unity) అను న దొక ముఖ్యధర్మము. ఇట భక్తికి నాటకముతో సాదృశ్యము, అనఁగా సర్వేశ్వరునితో జీవి కైక్యానుసంధానము ధ్వనితము. ఆ సర్వేశ్వర భక్తి లేని జన్మము లైక్య విరహిత మగు బహురూపము వంటి వని సారాంశము. ఇందు నాటకమునందు వలె నిదమిత్థమని యొక యితివృత్త ముండ దనుకొందును. బహురూప ప్రదర్శన మొక యనిబద్ధ కావ్యసంకలనము వంటిది పూర్వాపరసంబంధానపేక్షము లగు ముక్తకములు నెత్తి వ్రాయునటుల యొక నటుఁడు వివిధవేషము లను ధరించి సామాజికులకుఁ జమత్కారము గొల్పునట్లు వివిధపాత్రల నభినయింప వలెను. నిజముగా నదియొక గొప్పనేర్పు. దామరాజు సోమయ్య భరతము*లో బహురూప ప్రదర్శనము నటుని నేర్పులలో నొకటిగాఁ జెప్పబడినది. అం దిది కుండలిదండలాస్య విలాసములతో పాటు దేశినాట్య విశేష

* భరతరత్నావళి — శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము. పుట 142—[illegible] వ పద్యము.

ముగాఁ జేర్కొనఁబడినది. హరిభట్టు * (క్రీ. శ. 1500 ప్రాంతము) నారసింహ పురాణమున (1—213) భృంగీశ్వరుని నాట్యమును "...మార్గకుండలి దేశ్యాన్నత బహురూప కళాసంబు లసం బరగు షడ్విధంబులం' బరిగణించినాఁడు. అతనికి మిగుల నర్వాచీనుఁడగు అయ్యలరాజు నారాయణకవి హంసవింశతిలో (V —122)బహురూపమును షోడశ విధము లగు నృత్తములలో నొకటిగాఁ జెప్పెను. నారాయణకవినాఁటి కాయారు విధములు పదునాఱుగాఁ బెంపుచెందవచ్చు నను బహురూపము నృత్త మాత్ర మెట్లగును? నృత్త మనఁగా శారదాతనయ విద్యానాథాదు లే కొలఁదిమందిమతముననో తప్ప ధనంజయ చతురదామోదరాది బహుపూర్వార్వాచీన లాక్షణికులమతమునఁ దాళలయాశ్రితము మాత్ర మనియే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును తమ భరతకోశమున "దేశీనృత్తమ్- నానావేషధరం యత్తద్బహురూప మితీరిత" మ్మనియే నిర్వచించిరి. పోనీ, అయ్యలరాజువారి మాటలోఁగాని, మా. రా. కవిగారి మాటలోఁగాని యచ్చుపొరపా టేమైన నుండుననుకొందమన్న నచట శబ్దము నృత్తమునకు బదులు నృత్యము గావలెను. నృత్య లక్షణము చూచిన భావాశ్రయ మగు అంగికాభినయము మాత్రమే అదనము. బహురూప విషయమున నదియు నసమాప్తమే. అది చతుర్విధాభినయవిశిష్టము కావున నాట్య నిర్వచనమే నప్పుచును. *

---

* ఆంధ్రుఁడు,పదునాఱవ శతాబ్ది యుత్తరార్ధమున నుండినవాఁడు నగు నాతుగ దామోదర పండితుఁడు తన సంగీతదర్పణము (తంజావూరు సరస్వతీ మహలు ప్రచురణ, 1952) గ్రంథారంభమున "భరతాదిమతం సర్వం ఆలోడ్యాతిప్రియస్సతః శ్రీమతా హరిభట్టేన సజ్జనానంద హేతునా ప్రచరద్రూప సంగీత సాగరో గ్రథ్యతే" అను శ్లోకమునఁ జేర్కొనిన హరిభట్టు ఈతఁడే యయినచో నుని కాతని మాట అకళ్యము ప్రమాణము.

* సంగీత దర్పణము సప్తమాధ్యాయమున నృత్త నృత్య నాట్య లక్షణము లిట్లు నిర్వచింపఁబడినవి:—

ఎడపాటి ఎఱ్ఱన తన మల్హణచరిత్ర ద్వితీయాశ్వాసమున "ప్రేరణ బాగడ చర్చరీ బహురూప దండలాసాదిక భాండికములు" అని బహురూపము నొక భాండికముగాఁ బరిగణించెను. నారాయణకవి పరిగణనమున బహురూప భాండికములు భిన్నములుగా నున్నవి. అటు భాండికమును బహురూపమువలె నా పదునాఱింట నొకటి. భాండిక శబ్దమునకు ననేకార్థములు గలవు—అనుకరణ (Mimicry), పరిహాసము (Buffoonery) etc., అనుకరణ మన్నది సర్వనాట్య సామాన్యమైనది. బహురూపమున బహుధా యుండును. అందుచే, ఎఱ్ఱనభాండికమున హాస్యము, నారాయణకవి భాండికమున కన్యార్థమును జెప్పవలెను.

బహురూప మనఁగా కొంద ఱేకపాత్రాభినయము (Mono-action) అయి యుండునని భావించుచున్నారు. అది యథార్థమే కాని యంత మాత్రమే కాదు; రూపారోపణము గూడ నుండవలెను. ఏకపాత్రాభినయ మనఁగా, ఒక్క యనుకర్త వివిధానుకార్యులకుఁ బాత్రమై యభినయించుట. ప్రాయికముగా హరికథా కాలక్షేపములలో హరిదాసులు చేయునది యేకపాత్రాభినయమే అట రూపారోపణము లేదు.

---

నృత్తము:

"గాత్రవిక్షేపమాత్రం తు సర్వాభినయవర్జితమ్
ఆంగికోక్త ప్రకారేణ నృత్తం నృత్తవిదో విదుః॥
నృత్తం తత్కథితం తజ్జ్ఞై రర్థహీనం సురేఖకమ్
కేవలం తత్ప్రయోక్తవ్యం నృత్తం తాళలయాశ్రితమ్।"

"ఆంగికాభినయై రేవ భావానేవ వ్యనక్తి యత్
తన్నృత్యం మార్గశబ్దేన ప్రసిద్ధం నృత్యవేదినామ్॥"

"రసభావవ్యంజకం నాట్య ముక్తం మనీషిభిః"

కాని బహురూపమున నది విధాయకము గదా. అట్టిచో నర్ధనారీశ్వర, నరసింహావతారాది వేషములు వేయు పగటి భాగవతులను బహురూప పదర్శకు లనవచ్చునేమో! అసలు బహురూప మనఁగా ఊసరవెల్లి యని కదా యర్థము!

బహురూపము—(పరిశిష్ట భాగము)

తొలుత బహురూపము తెలుగు దేశమునకు మాత్రమే చెంది నదా యని యనుకొంటిని. కాని మిస్టర్ ఎఫ్. కిట్టెలు తన కర్ణాటాంగ్ల నిఘంటువులో బహురూపమునకు 'Theatrical representation' అను నర్థ మిచ్చి యది మైసూరు, మహారాష్ట్రములందుఁ బ్రచారమున నుండి నట్లు సూచించినాఁడు. హిందీ శబ్దసాగరమున బహురూపము

"ताण्डव नृत्य का एक भेद जिसमे अनेक प्रकार के रूप धारण करके नाचते हैं।

అనియుదాహృతము. అనఁగా నానావిధ రూపధారణముతోఁ బ్రయోగింపఁ బడు తాండవ నృత్య ప్రభేద మని. తాండవ మనఁగా 'ఉద్ధత ప్రాయ ప్రయోగము' (శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము) అనగా నిది పురుషు లకుఁ దప్ప స్త్రీలకు నిరవకాశ మైన దని తేలుచున్నది. కిట్టెలు 'బహు రూపిణి' యను శబ్ద ముదాహరించి దానికి నట్టువకత్తె యను సామా న్యార్థ మిచ్చియు వెనువెంటనే కోల్లాటకత్తె యని చతురాస్య నిఘం ట్వధికారమును జేర్చెను. ఈ బహురూపమునకు దానికి సంబంధము లేదు. హిందీ శబ్దసాగరమున 'బహురూపీ' లేక 'బహురూపియా' అను పుంలింగ వాచకము మాత్రమే ఉదాహరింపఁబడి,

अनेक प्रकार के रूप धारण करने वाला। नकल बनाने वाला। वह जो तरह तरह के रूप बना कर अपनी जीविका करता है।

అని యర్థము వ్రాయఁబడినది. వంగాంగ్ల శబ్దకోశమున 'బహురూపి' యను శబ్దమునకు ఇంద్రజాలికుఁ డని యర్థ మీయఁబడినది. దీనిని బట్టి బహురూప ప్రయోక్త లనఁగా మన రాయలసీమ విప్రవినోదుల వంటి వారను కొందును.

ఈ బహురూపము సేకరణమున నాకుఁ దోడ్పడిన శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారికిఁ గృతజ్ఞుఁడను.

ఇంత చెప్పియు నిది బహురూపము స్వరూపమును బూర్తిగా నిరూపించినట్లు కాదు. ఇది దానిని గురించిన వివిధవిచికిత్సల స్వరూపము మాత్రమే.

—రచయిత.

నీశరీరముగ పశ్యతి=చూచునో, నిత్యసుఖినః = నిరంతర మానందము ననుభవించు, అస్య=అతనికి, స్వాత్మపక్షపరిపూరితే=ఆత్మరూపముతో నిండిన, జగతి=ప్రపంచమునందు, భయం=భయము, కుతోభవేత్ = ఎచటనుండి కల్గును ?

2. "స్మృతిభూస్స్మృతిభూ ర్విహితో యేనాసౌ రక్షతాత్ క్షతాత్ యుష్మాన్-"

యేన=ఎవనిచేత, స్మృతిభూః = మన్మథుఁడు, స్మృతిభూః=స్మృతియే (స్మరణమే) స్థానముగాఁగలవాడుగ, విహితః=చేయఁబడినాఁడో, అసౌ= ఆ శివుఁడు,యుష్మాన్=మిమ్ము, క్షతాత్=నాశనమునుండి, రక్షతాత్ = రక్షించుఁగాక. ఈ రెం డుదాహరణములలోను,"తత్"అను పదమునకు బదులు, 'అసౌ'అనుపదమే యుపయోగింపఁబడినది—ఈప్రయోగములు గతానుగతికముగ, సంధపరంపరాన్యాయమునఁ బ్రియుక్తములైనవియే యైనను వీనిని జూచి, తచ్ఛబ్దమును, అదస్‌శబ్దమును పర్యాయము లని యనుచున్నారు. ఈప్రయోగప్రమాణమువలనఁ దచ్ఛబ్దమును, అదశ్శబ్దమును, పర్యాయము లని యంగీకరింపవలయుచో మన మీ విషయమును గమనింపవలయును. "యోఽవికల్ప" అను పద్యమునందు "యః" "అసౌ" (అస్య) శబ్దములు చాల దూరములో నున్నవి. "స్మృతిభూః" అను పద్యమునందు—ఆరెండు శబ్దములును చాలదగ్గఱగనే యున్నవి. కాని భిన్నవిభక్తులలో నున్నవి. (యేన అనునది తృతీయా విభక్తి - అసౌ అనునది ప్రథమా విభక్తిలోను నున్నవి)-కావున, మనముగూడ, యదదశ్శబ్దములు వ్యవహితములుగ నున్నపుడును, అవ్యవహితములుగనున్నను భిన్నవిభక్తులలో నున్నపుడును, అదశ్శబ్దము, తచ్ఛబ్దపర్యాయ మని యంగీకరింతము—కాని 'సంరంభః'

అను పద్యమునందు 'యోఽసౌ' అను పాదమునందు—'యః,అసౌ' అను రెండు పదములును దగ్గఱగ నున్నవి-సమానవిభక్తియందున్నవి. పైన మన మనుకొనిన రెండునియములలో నేదియును సరిపోలేదు. ఇట్టి తావులందుఁగూడ నదశ్శబ్దము తచ్ఛబ్దపర్యాయ మనుట యన్యాయమే యగును. పైఁగా నిట్టి తావులందు యత్తచ్ఛబ్దముల కవశ్యముగ నితరేతరాపేక్ష యుండును.

"య దేతచ్చన్ద్రాన్తర్జలదలవలీలాం వితనుతే,తదాచష్టేలోకః శశఇతి"

తా॥ చంద్రునియం దేది (య దేతత్)మేఘశకలములవలెనున్నదో, అది కుందేలని లోక మనుచున్నది."— ఈ వాక్యమునందు "యత్ ఏతత్" శబ్దములు రెండును, దగ్గఱగ సమానవిభక్తికములై యున్నవి. ఇచట "యత్" శబ్దము, తత్ శబ్దము నపేక్షించితీరును. అందుచేతనే "తత్"శబ్దప్రయుక్తమైనది.

"సోఽయం పట శ్శ్యామ ఇతి ప్రకాశః త్వయా పురస్తా దుపయాచితో యః".

తా॥ శ్యామ అను ప్రసిద్ధిగల పట మిదియే-యేది నీచేనింతకుఁ బూర్వము యాచిత మైనదో"—ఇచ్చట, అదశ్శబ్దముతోఁగూడిన తత్ శబ్దము యచ్ఛబ్దము నాకాంక్షించును. "యః"అను శబ్ద మా యాకాంక్షను బూర్తిచేసినది.

ఆక్షేపము:—"సంరంభః" అను పద్యమునందు "అసౌ" అను శబ్ద మవశ్యముగఁ బ్రయోగింపనక్కఱలేదు.ఊరకయే ప్రయుక్త మైనది.

సమాధానము—ఇచట "అదశ్శబ్ద మావశ్యకముగాదు. అదశక్తి వల్లనే ప్రయుక్త మైన దందురేని, మేము చెప్పినట్లు, విధేయావిమర్శ దోష మున్న దని యంగీకరించుఁడు.

ఇప్పటికిఁదేలిన సారాంశ మిది 'సంరంభః కరికీట' అను పద్యము ముక్తి మనుటచే నింతకుఁబూర్వ ముపక్రాన్తమైన యర్థముతో సం

బంధము గల తచ్ఛబ్ద మొకటి, యిచట నున్న యచ్ఛబ్దముతో సన్వ యించు ననుటకు వీలులేదు. ఇఁకమీఁద రాఁగల యర్థముతోఁగూడ నీ యచ్ఛబ్దమునకు సంబంధము లేదు. తచ్ఛబ్దము లేనిదే, యచ్ఛబ్దము 'అంబికాకేసరి'అను పదముతో సమన్వయింపదు.ఇట్టి యచ్ఛబ్ద మేకా కిదై, తోడు లేనిదై యున్నది. తోడిపధికులనుండి విడివడిన బాటసారి గతియే యీ యచ్ఛబ్దమునకుఁ బట్టినది. ఆ బాటసారికి మార్గముఁ జూపు మఱియొక పధికుఁ డవసరమైనట్లు, యీయచ్ఛబ్దమునకుఁగూడ తచ్ఛబ్ద మావశ్యకమే యగును. తచ్ఛబ్దము నధ్యాహారముగఁ దెచ్చు కొనవలయును. అదియే శరణ్యము. వేఱొక యుపాయమున నిచట నర్థసమన్వయము సంభవముగాదు.

ఇట్టి దోషములు లేశమాత్రమే యున్నను, సూక్తిరత్నములయం దలి కలంకములగును. కావ్య మను మాణిక్యమును బరిశీలించు సహృద యులకీ కళంకము హేయమే యగును గాని హృదయావర్జకముగాదు.

అనుక్త్వైవ పరామృశ్యం ప్రయోగో యత్ర యత్తదోః
నిరన్తరః పునస్తత్ర తయో రుక్తిర్న దుష్యతి॥ (8)
తయో ర్నిరన్తరోపాత్తే ష్విద మేతదదస్సుచ
తయోస్తేషాంచ నాపేక్షా తేష్వసత్స్వివ శామ్యతి (9)
ఉదాహరణజాతం యత్ తత్సాంకర్యసముద్భవమ్
తస్య దిఙ్మాత్ర మస్మాభి రుక్తం విస్తరభీరుభిః

—సంగ్రహశ్లోకములు (10)

తా॥ పరామర్శింపవలసిన యర్థమునుజెప్పకయే,అవ్యవహితముగ నెచ్చట యత్తచ్ఛబ్దములను బ్రయోగించుచున్నారో, అచ్చట రెండవ తచ్ఛబ్ద మున్నను, నిచట పునరుక్తదోషము లేదు-ఉదా = "యత్ర దూర్జిత" మను పద్యమున యత్ తత్ అని ప్రయోగించియు, తిరిగి "నూనంతదపి" అని రెండవ తచ్ఛబ్దము ప్రయుక్తమైనది. అయినను

నిచట "బునరుక్తదోషము లేదు;" యత్తచ్ఛబ్దముల తరువాత వ్యవధా నము లేకయే 'ఇద మేత దద' శ్శబ్దములను బ్రయోగించినపుడు, ఆ "ఇదమేతదద" శ్శబ్దములవలన "యత్తచ్ఛ" బ్దముల కుండు ప్రత్యా కాంక్ష శాన్తింపదు. యచ్ఛబ్దమునో తచ్ఛబ్దమునో ప్రయోగించి తీర వలసినదే. అచట "నిదమేతదద"శ్శబ్దములు లేకున్నను నున్నను నొక టియే—"యదేత చ్చన్ద్రాన్తర్జలద" "సోయం వట శ్యామ ఇతి" అను పద్యములయందు "యదేతత్" "సోయం" అను ప్రయోగము లలో "నిదమేతదద" శబ్దములు "యత్త" చ్ఛబ్దముల కవ్యవధానముగ నుపయోగింపఁబడినను వానికిఁ గల తద్యచ్ఛబ్దాకాంక్ష పోలేదు. అటు లనే "యోఽసౌ" అనునపుడుగూడ యచ్ఛబ్దమునకుఁ దచ్ఛబ్దాకాంక్ష నివర్తింపదు. ఈ విధముగ యత్ తత్, ఇదమేతదదశ్శబ్దములు సంకీ ర్ణములై యున్న యుదాహరణముల నల్పముగఁ జూపితిమి.

(సంగ్రహశ్లోక తాత్పర్యములు).

"అంబికాకేసరీ" - సమాసము దుష్టము:- ఇచట షష్ఠీసమాస ముపపన్నముగాదు. ద్వంద్వసమాసమును వదలినచో మిగిలిన సమా సము లన్నిటియందును, సమస్యమానపదములు విశేషణ విశేష్యవాచ కములై యుండును. ఇట్లు "విశేషణ విశేష్యాభిధాయిపదోపరచిత శరీరత్వమే" సమాసమునకు సామాన్యలక్షణ మని విచక్షణులు తెల్పి నారు. అట్లు కానిపక్షమున నా సమాసములకు సంగతార్థత్వము కుదురదు. సామర్థ్యము సిద్ధింపదు.

ఆ విశేషణవిశేష్యభావము రెండు విధములుగ నుండును. (1) సమానాధికరణము (2) వ్యధికరణము—అందులోఁ గర్మధారయ సమాసము సమానాధికరణము లగు విశేషణవిశేష్యములను గల్గియుం డును. (తత్పురుషస్సమానాధికరణః కర్మధారయః - అని వ్యాకరణ సూత్ర మీ యంశమునే తెల్పును. సమానాధికరణమనఁగా విశేషణ

విశేష్యము లోనే విభక్తియందుండు యని సామాన్యముగఁ జెప్పుకొన వచ్చును)—బహువ్రీహిసమాసముగూడ సామాన్యముగ సమానాధి కరణ మయియేయుండును. రెండు లేక యనేకము లగు పదములు వేఱొక పదముయొక్క యర్థమును బోధించుటకై విశేషణవిశేష్య భావము నందుట యనునది బహువ్రీహియొక్క తీరు. ఇందులోనే యెచట సంఖ్య విశేషణభావము నొందునో యది ద్విగుసమాసము. ఎచటఁ బ్రతిషేధము విశేషణముగ నుండునో యది నఞ్ సమాసము. ఇట్లు, కర్మధారయ, బహువ్రీహి, ద్విగు, నఞ్ సమాసములు సమానాధి కరణము లగు విశేషణవిశేష్యములను గలిగియుండును.

వ్యధికరణ మగు విశేషణవిశేష్యభావము. కారకములు, సంబంధ ములును నెచట విశేషణభావము నందునో యచట విశేషణశేష్య ములు భిన్నవిభక్తులలో నుండును—తత్పురుషసమాసమున నీ లక్ష ణము కన్పడును. అదును, అవ్యయముయొక్క యర్థ మెచ్చట విశేష్యముగ నుండునో యది యవ్యయీభావసమాస మగును.

ఈ రెండు విధము లగు సమాసములయందును, విశేషణవిశేష్య ముల సంస్పర్శ యుండనేయున్నది - కాని కొన్నిచోట్ల, విశేషణము, స్వాశ్రయ మగు విశేష్యమున కొక యుత్కర్షను గలుగఁజేయును. అందుచే నది వాక్యార్థచమత్కారమునకుఁ గారణ మగును — అపు డది ప్రధానముగ, వివక్షితమై, విధేయ మగును. విశేష్యము నుద్దేశించి యీ విశేషణమును మనము విధించుటచే, విశేష్య మనూద్యమానమై యప్రధాన మగును. విశేషణాంశము నిపుడు ప్రధానముగ మనము చెప్పఁదలచి యుండుటచే, విశేషణమే ప్రధాన మగును.— ఇటువంటి విషయములో విశేషణవిశేష్యములకు సమాసము చేయఁగూడదు. సమాసముఁ జేసినచో విశేషణమునకుఁ గల ప్రాధాన్యముః పోవును. విశేష్యమే ప్రధాన మగును. విశేష్యముయొక్క మఱుఁగునఁ బడి

పోయి విశేషణ మప్రధానమైన దగును. కావున విశేషణాంశము విధే యమైనప్పుడు సమాసముకూడ దని తెలియవలెను. ఆ విశేషణ మొకటియే యగుఁగాక, అనేకవిశేషణము లుండుగాక ; ఆ సంఖ్యవలనఁ గలుగు విశేష మేమియును లేదు.

ఆక్షేపము : విశేషణత్వ మనఁగా "అవచ్ఛేదకత్వము". ఈ విశేషణ ముండుటవలన నిచట విశేష్య మితరవస్తువులకంటె భిన్న మని తెలియుచున్నది. అనఁగా విశేషణము వ్యావర్తక మని తేలుచున్నది. విశేష్యము నితరవస్తువులనుండి వ్యావర్తింపఁజేయుటయే విశేషణము నకుఁ గల ప్రయోజనము. ఇట్లు విశేషణము విశేష్యమున కుపకారముఁ జేయుటకే యుపయుక్త మగుటచే, నన్యప్రయోజనకమై, యాత్మ ప్రాధాన్యము లేని దగుటవలన, నప్రధాన మైనది. కావున విశేషణత్వ మనఁగా నప్రధానత్వ మని యనుకొనవచ్చును. "విధేయత్వము" అనఁగా మనము ప్రత్యేకముగ నొక ధర్మమును నూత్నముగ నా విశేష్యమునందుఁ జెప్పఁదలచియుండుటచే, నది విధేయమై ప్రధాన మగును. విధేయత్వ మనుటతోడనే ప్రధానత్వము స్ఫురించును. ప్రధానత్వము, అప్రధానత్వము నను నీ రెండును, భావాభావములవలె పరస్పరవిరుద్ధములు. ఈ రెండు విరుద్ధములకును "విశేషణ" మను నొకే యర్థమునందు సమావేశ మెట్లు కలుగును ? అట్లు సమావేశము కల్గిన నాఁడుగదా, విధేయప్రాధాన్య మున్నపుడు సమాసము కూడ దనియు, సంబంధమాత్రప్రతీతియే యున్నపుడు సమాసము చేయవచ్చు ననియు నియమము పొసఁగుట ! కావున మీరు చెప్పిన నియమము చెల్లదు.

సమాధానము : మీరు చెప్పిన దోషమున కిచటఁ బ్రసక్తియే లేదు. విరోధ మనునది రెండు వస్తుల నాశ్రయించి యుండును. ఉదాహరణమునకు-శీతోష్ణములను గ్రహింతము. ఇవి విభిన్నమైన పదార్థములు. వానికి విరోధ ముండుట యుచితమే. కాని యిచట వాస్తవ

ములైన రెండు వస్తువులు లేవు. విశేషణగతమైన యప్రాధాన్యము సహజమగుటచే వాస్తవమైనది. విధేయత్వము మనము చెప్పఁదలచిన ధర్మమగుటచే నవాస్తవమైనది. అందుచే విధేయత్వమునందున్న ప్రాధాన్యముగూడ నవాస్తవమైనదియే. కావున నిందులో విశేషణత్వము వస్తువు. విధేయత్వము "అవస్తువు"—ఈ రెండును నొకే యాశ్రయమున నుండవచ్చును. ఇందు కాక్షేపము లేదు. నిజమగు నేనుఁగునకును, నసత్యమగు సింహమునకును విరోధ ముండునా? అటులే వీనికిని నేకాశ్రయవిరోధము లేదు.—ఈ రెంటికిని వస్త్వవస్తుత్వకృత మగు భేదమే గాక ఫలకృత మగు భేదముగూడ నున్నది. విశేషణత్వ మితరవ్యావృత్తిని జేయును. విధేయత యననది విశేష్యమునందు గుణోత్కర్షతను సంపాదించును.—పైనఁ దెల్పిన విషయము నీ యుదాహరణములయందుఁ జూడవచ్చును.

కర్మధారయసమాసమున కుదాహరణము :—

"ఉత్తిష్ఠన్త్యా రతాన్తే భర ముగరపతౌ పాణి నైకేన కృత్వా
ధృత్వా చాన్యేన వాసో విగలితకబరీభార మంసే వహన్త్యాః
భూయ స్తత్కాలకాన్తిద్విగుణితసురతప్రీతినా శౌరిణా వః
శయ్యా మాలింగ్య నీతం వపు రలసలసద్బాహు లక్ష్మ్యాః పునాతు॥

అర్థము:—రతాన్తే=రతిక్రీడావసానమునందు; ఏకేన, పాణినా=ఒక చేతితో, ఉరగపతౌ=ఆదిశేషునియందు, భరం, కృత్వా=భారమును మోఁపి (ఒకచేతితో శేషునిపై నానుకొని) అన్యేన పాణినా = వేఱొక చేతితో, వాసః ధృత్వా = వస్త్రమును బట్టుకొని, ఉత్తిష్ఠన్త్యాః=లేచుచున్నట్టియు, విగలితకబరీభారమ్ = విడిపోయిన కేశపాశమును, అంసే= భుజమునందు, వహన్త్యాః=వహించుచున్నట్టియు, లక్ష్మ్యాః = లక్ష్మికి సంబంధించిన (లక్ష్మీదేవియొక్క),అలసలసద్బాహు = అలసతచే శోభించు భుజము గలట్టియు, భూయః = తిరిగి, తత్కాలకాన్తిద్విగుణితసురత

ప్రీతినా = ప్రేమయున్న లక్ష్మీదేవిని జూచుకాలమున రెట్టింపైన సురతాసక్తి గల, శౌరిణా = విష్ణువుచేత, ఆలింగ్య = కౌగలించుకొనఁబడి, శయ్యాం నీతం = శయ్యను పొందింపఁబడినట్టియు, వపుః = శరీరము, వః = మిమ్ము, పునాతు = పవిత్రము సేయుఁగాక,

ఇచట విగలితకచభారత్వము, అలసలసద్బాహుత్వము ననునవి అంసకును, భుజములకును, శరీరమునకును విశేషణములు. ఇవి రతి యను భావమున కుద్దీపకవిభావములై వాక్యార్థమున కొక యపూర్వ మగు చమత్కారమును గలుగఁజేయును. అందుచే నివి కవిచేఁ బ్రధానముగ వివక్షితములైనవి. కావున వీనిని "అంసవపు" శ్శబ్దములతోఁ గలిపి సమాసముఁ జేయలేదు. అంసవపుశ్శబ్దములను విడిగనే యుంచినాఁడు. సమాసమే చేసినచో విశేషణములకుఁ గల ప్రాధాన్యము భాసించెడిది గాదు. అట్లైతే "తత్కాలకాన్తిద్విగుణితసురతప్రీతి" యను పద మొకటి హేతుభావగర్భ మగు విశేషణము. ఆతఁడు చేసిన యాలింగనాదికృత్యమున కీ విశేషణము హేతువును దెల్పి యాతని యందుఁ గల యుచితాచరణ మను నతిశయమును బ్రతిపాదించును. అందుచే నిది విధేయమై ప్రధాన మైనది. ప్రాధాన్యము భాసింపవలె నను నభిప్రాయముతోనే కవి యిచటఁగూడ "తత్కాలకాన్తిద్విగుణితసురతప్రీతిశౌరి"—యని సమాసముఁ జేయలేదు.

"పద మేక మనేకం వా య ద్విధేయార్థతాం గతమ్
న తత్సమాస మన్యేన న చాప్యన్యోన్య మర్హతి"

(సంగ్రహ శ్లోకము)

విధేయార్థక మగు పద మొకటి యగుఁగాక, అనేకపదము లుండుఁగాక.—ఆ పదము విశేష్యముతో సమసింపదు. అట్టి పదములు (విశేషణములు) తమలోఁ దాము పరస్పరముగూడ సమాసము నొందవు. ఒక విశేషణ మున్న కర్మధారయస్థలమున కుదాహరణము

నిప్పుడు చెప్పినాము. అనేకవిశేషణము లుండు కర్మధారయమున కుదాహరణము నిచ్చుచున్నాము.

"అవన్తినాథో౽య ముదగ్రబాహుః
విశాలవక్షా స్తనువృత్తమధ్యః
ఆరోప్యచక్రభ్రమ ముష్ణతేజా
స్త్వష్ట్రేవ యత్నోల్లిఖితో విభాతి"

అర్థము:—ఉదగ్రబాహుః = ఒలసిన పొడవైన భుజములుగల వాఁడును. విశాలవక్షాః=విశాలమగు వక్షస్థలముగల వాఁడును. తనువృత్తమధ్యః=సన్నని గుండ్రని నడుముఁ గలవాఁడును నగు, అయం = ఇతఁడు, అవన్తినాథః = అవన్తి దేశమునకు రాజు యః=ఏరాజు, త్వష్ట్రా=విశ్వకర్మచేత, చక్రభ్రమ మారోప్య యత్నోల్లిఖితః=సాన పెట్టఁబడిన, ఉష్ణతేజా ఇవ=సూర్యుడువలె, విభాతి = ప్రకాశించుచున్నాఁడో.

ఇచట, ఉదగ్రబాహుః, విశాలవక్షాః, తనువృత్తమధ్యః అనునీ మూఁడును అవన్తినాథః అను పదమునకు విశేషములు—ఇవి రాజునకుఁ గల ప్రతాపాతిశయముఁ దెలుపుట కావశ్యకమై ప్రధానములైనవి. అందుచే వానికి "అవన్తినాథ" పదముతో సమాసముఁ జేయలేదు—మఱియొక యుదాహరణము.

"విద్వాన్ దారసఖః పరం పరిణతో నీవారముష్టింపచః
సత్యజ్ఞాననిధి ర్ద్విధ త్ర్యహరణం హా నోమార్జునీ హేతుతః
రే దుఃక్షత్రియ! కిం త్వయా మమ పితా శాన్తం, మయా పుత్రవాన్
నీతః కీర్త్యవశేషతాం, తదిహ తే ధిక్ ధిక్ సహస్రం భుజాన్",

అర్థము:—రే దుఃక్షత్రియ = ఓ దుఃక్షత్రియుడా! శాన్తం = అమంగళము ప్రతిహత మగుఁగాక, త్వయా = నీచేత, విద్వాన్ =

పండితుఁడును, దారసఖః = భార్యకు ప్రియుఁడును, పరం, పరిణతః = వృద్ధుఁడును, నీవారముష్టింపచః = పిడికెడు నీవారములనుమాత్రమే తినువాఁడును, పుత్రవాన్ = నాచేత పుత్రవంతుఁడును, సత్యజ్ఞాననిధిః = సత్యజ్ఞానములకు నిధియగు నతఁడును, హోమార్జునీ హేతుతః = హోమమున కుపయోగించు (పాలిచ్చు) గోవును రక్షించుటకై, ప్రహరణం దధత్ = ఆయుధమును ధరించినట్టియు, మయా = నాచేత పుత్రవాన్ = పుత్రవంతుఁడైనట్టియు, మమ = నాయొక్క పితా = తండ్రి, త్వయా = నీచేత, కీర్త్యవశేషతాం నీతః = చంపఁబడినాఁడా!

ధిక్ ధిక్ సహస్రం భుజాన్ = ఛీఛీ నీ సహస్రభుజములేల (కాల్పనా!)—

కార్తవీర్యార్జునుఁడు, పరశురాముని తండ్రిని జంపినాఁడు-పరశురాముని తండ్రి చంపఁదగినవాఁడు కాఁడు. అతఁడు విద్వాంసుఁడగుటచే భూమి కలంకారప్రాయుఁడు, భార్యకుఁ బ్రియుఁడగుటచే నాతని మరణమును విన్నంతనే భార్యయు సహగమనము సేయును. అందుచేఁ గార్తవీర్యార్జునునకు స్త్రీహత్యాపాపముగూడ సంక్రమించును. అతఁడు చాల వృద్ధుఁ డగుటచేత నసమర్థుఁడు, గోసంరక్షణమునకయియే, బ్రాహ్మణుఁ డయ్యును నాయుధమును ధరించినాఁడు. బలపరాక్రములలో సాటిలేని నాకుఁ దండ్రి - అత్యల్పముగనే యాహారమును దినుటచే దుర్బలుఁడు గూడను. ఈ విశేషణబలమువలన నాతఁడు చంపఁదగని వాఁడు'— అనుభావము స్ఫురించును. ఆ విశేషణము లన్నియు జమదగ్నిమహర్షి గతములగు విశేషములను చెప్పి యతని యవధ్యతను నిరూపించుటచే సార్థకములైనవి. అందుచే వీని నన్నింటిని గలిపి సమాసముఁ జేయరాదు.

ఇంకొక యుదాహరణము :—

రాజ్ఞో మానధనస్య కార్ముకభృతో దుర్యోధనస్యాగ్రతః
ప్రత్యక్షం కురుబాంధవస్య మిషతః కర్ణస్య శల్యస్య చ

పీతం తస్య మయాద్య పాండవ వధూకేశాంబరాకర్షిణః
కోష్ణం జీవత ఏవ తీక్ష్ణకరజక్షుణ్ణా దసృగ్వక్షసః''.

అర్థము:—రాజ్ఞః = రాజగునట్టియు, మానవధనస్య = అభిమానమే ధనముగాఁ గలట్టియు, కార్ముకభృతః = ధనుస్సును ధరించియున్నట్టియు, దుర్యోధనస్య, అగ్రతః = దుర్యోధనుని యెదుటను, (దుర్యోధనుఁడు చూచుచుండగనే, అతనిని లక్ష్యము సేయకయే యని భావము) కురుబాంధవస్య = పాండవు లగు మమ్ము వీడి, కౌరవులకు బంధువైనట్టి, కర్ణస్య, శల్యస్య, చ, ప్రత్యక్షం మిషతః=కర్ణుఁడును, శల్యుఁడును, ప్రత్యక్షముగఁ జూచుచుండగనే, పాండవవధూకేశాంబరాకర్షిణః = ద్రౌపదియొక్క కేశములను, వస్త్రములను లాగినట్టియు తస్య, జీవత ఏవ = జీవించియే యున్నట్టియు నా దుశ్శాసనునియొక్క (ఆ దుశ్శాసనుఁడు సజీవుఁడై యుండగనే యని భావము) తీక్ష్ణకరజక్షుణ్ణాత్ తీక్ష్ణ మగు నా గోళ్ళచేఁ జీల్పఁబడిన, వక్షసః = వక్షస్థలము నుండి వచ్చు, కోష్ణం రక్తం = నులివెచ్చని నెత్తురు, అద్య = ఇప్పుడు, మయా = నాచేత, పీతం = త్రాగఁబడినది.

ఇందు దుర్యోధనునకుఁ గల విశేషణము లన్నియు నతనియతిశయమును జెప్పునవియే యగుటచే, వాని ప్రాధాన్యము తగ్గకుండుటకై కవి సమాసముఁ జేయలేదు. ఆ పదముల నన్నిటిని వ్యస్తములుగనే యుంచినాఁడు.

ఉదాహరణాన్తరము :—

''రే హస్త దక్షిణ మృతస్య శిశోః ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ, కృపాణమ్
రామస్య పాణి రసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే.''

అర్థము :— రే హస్త, దక్షిణ=ఓదక్షిణహస్తమా, మృతస్య=చనిపోయిన, ద్విజస్య=బ్రాహ్మణుని యొక్క, శిశోః=పుత్రుని యొక్క, జీవాతవే=జీవించుటకొఱకు, శూద్రమునౌ=శూద్రమునియందు, కృపాణం, విసృజ = ఖడ్గమును వదలుము; నిర్భరగర్భఖిన్నసీతావివాసన పటోః=నిండుచూలాలా లగు సీత నరణ్యములకుఁ బంపుటయందు సమర్థుఁడైన, రామస్య=రాముని యొక్క, పాణిః=చేయి, అసి=అయితివి. తే=నీకు, కరుణా కుతః=కరుణ యేడ.

ఇచట, 'మృతస్య,' 'శిశోః', 'ద్విజస్య' అను పదములు వ్యస్తములుగనే యున్నవి. ఇట్టుండుటచేతనే రాముఁడు చేయఁబోవు హనన కర్మయుచితమే యను భావము కల్గును. అటులే రామపాణిః అని సమాసము సేయుటకు బదులుగ, "రామస్య" అని విడిగఁ బ్రయోగించుటలో నౌచిత్య మున్నది. ఇపుడే రామునకుఁ బ్రాధాన్యము వచ్చును. రామగతము లగు కాఠిన్యాదులు కూడ బాగుగ స్ఫురించును.

ఈక్రిందివాక్యములందుఁగూడ నిట్టి యౌచిత్యమునే మనము చూడవచ్చును.

"ఏవ మంగరాజ సేనాపతే, రాజవల్లభ, ద్రోణాపహాసిన్, రక్ష భీమాత్ దుశ్శాసనం".

ఓఅంగదేశపురాజా! సేనాపతీ, రాజున కత్యంతము ప్రియుఁడైనవాఁడా, ద్రోణుని బరాభవించినవాఁడా! (కర్ణా) భీమునుండి, దుశ్శాసనుని రక్షింపుము.

కర్ణుని దెల్పుటకై ప్రయుక్తములైన 'సేనాపతే' మొదలగు విశేషణము లిచ్చుట, కర్ణునియసామర్థ్యము నెక్కువగ స్ఫురింపఁజేయును. అశ్వత్థామకుఁ గర్ణునెడల నుదయించిన పరిహాసదృష్టికి మెఱుఁగిడును. సమాసమే యగుచో నింతటి చమత్కార ముదయించెడిదిగాదు.

విధ్యనువాదభావముగూడ విశేషణవిశేష్యభావముతోఁ దుల్య

మైన ఫలము గలదియే. అందుచే విధ్యనువాదభావమునందుఁగూడ సమాసము చేయఁగూడదు. ముందుముం దింకను నీ విషయమును “వ్యాసఃపారాశర్యః” అనుచో నిరూపింతుము.

ఉదాహరణము :—

చాపాచార్య స్త్రిపురవిజయీ కార్త్తికేయో విజేయః
శస్త్రవ్యస్తః సదన ముదధి ర్భూ రియం హన్తకారః
అస్త్యేవైతత్ కిము కృతవతా రేణుకాకంఠబాధాం
బద్ధస్పర్ధ స్తవ పరశునా లజ్జతే చన్ద్రహాసః.”

రావణుఁడు పరశురామునితో ననువాక్యములు:— రామ! = ఓపరశు రామా! త్రిపురవిజయీ= ఈశ్వరుఁడు, చాపాచార్యః—నీకు ధనుర్విద్యను నేర్పిన గురువు; కార్త్తికేయః=కుమారస్వామి, విజేయః = నీకు జయింపఁ దగినవాఁడు (నీచే జయింపఁబడినవాఁడు) శస్త్రవ్యస్తః = శస్త్రములచే దూరముగఁ ద్రోయఁబడిన, ఉదధిః = సముద్రము, సదనమ్ = నీకిల్లు ఇయంభూః = ఈభూమి, హన్తకారః=అతిథి కీయఁదగినట్టియు షోడశ గ్రాసపరిమిత మగునట్టియు భిక్ష; (కశ్యపునకు దానముగ నీయఁబడినది) అస్త్యేవైతత్ =ఇదియంతయు నిట్లున్నమాట సత్యమే (అనఁగాఁబ్రశంస నీయమే) కిము=కాని, రేణుకా కంఠ బాధాం కృతవతా=రేణుకాకంఠ మునకు బాధను గలుగఁజేసిన, తవ పరశునా=నీగొడ్డలితో బద్ధస్పర్ధః = వైరమును బెట్టుకొనినదై, చన్ద్రహాసః=నా ఖడ్గము, లజ్జతే=సిగ్గిలుచున్నది.

ఇచటఁ దిత్రిపురవిజయి నుద్దేశించి చాపాచార్యత్వము విధింపఁబడు చున్నది. కార్త్తికేయుఁ డుద్దేశ్యము, (అనువాద్యము) విజేయత్వము విధే యము—త్రిపురవిజయి చాపాచార్యఃఅనియు, విజిత కార్త్తికేయఃఅనియును నిచట సమాసములఁ జేయవచ్చును. — కాని త్రిపుర విజయీ, చాపాచార్యః, అను పదములు విడిగ నున్నపుడు పరశురాముఁడు మహా దేవునంతటివానియొద్ద విలువిద్య నభ్యసించి, మహాదేవుని శిష్యుఁ

హైనాఁ డనియు, దేవతలకుఁగూడ సేనాని యగు కుమారస్వామి నోడించినాఁ డనియు నర్థములు ప్రతీతములై పరశురామునియొక్క పరాక్రమాతిశయము నుద్ఘోషించును. కాని యవియే పైనఁ దెల్పిన రీతిని, సమాసము లే యగుచో నీ చమత్కారాతిశయము భాసింపదు.

ఈనియమమునకుఁ బ్రత్యుదాహరణము :—

తం కృపామృదు రవేక్ష్య భార్గవం రాఘవః స్ఖలితవీర్య మాత్మని స్వం చ సంహిత మమోఘసాయకం, వ్యాజహార హరసూను సన్నిభః".

అర్థము—హరసూనుసన్నిభః =కుమారస్వామిని బోలినట్టియు, కృపామృదుః =దయచే మెత్తనివాఁడైనట్టియు, రాఘవః=రాముఁడు, ఆత్మని = తన విషయమై, స్ఖలితవీర్యం = విఫలమైన బలముగల, తం భార్గవం = ఆ పరశురాముని, స్వం = తనదగు, సంహితం = ఎక్కుపెట్టఁబడిన, అమోఘసాయకంచ = వ్యర్థముకాని బాణమును వీక్ష్య =చూచి, వ్యాజహార = పలికెను.

ఇచట సాయకము నుద్దేశించి, 'అమోఘత్వము' విధింపఁబడు చున్నది. కాని "అమోఘసాయకం" అని సమాసమునం దుండుటచే "అమోఘత్వ" మునకుఁ బ్రాధాన్యముగ భాసించుటలేదు. దానికిఁ గూడ ప్రాధాన్యము భాసింపవలె నన్నచో "సంహిత మమోఘ మాశుగం" అని పాఠమున్నచో. (నిర్ణయసాగర ముద్రణాలయపువారి రఘువంశమునందు "సంహిత మమోఘ మాశుగ"మనియే యున్నది) సమాసము చేయఁగూడని తావున సమాసము చేయఁబడుటచే నిది ప్రత్యుదాహరణమయినది.

ఇంకొక యుదాహరణము:—

స్రస్తాం న్నితంబా దవలంబమానా
పునఃపునః కేసరపుష్పకాంచీమ్
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
ద్వితీయ మౌర్వీమివ కార్ముకస్య

అర్థము:—స్థానవిదా = ఏది యేస్థానమున నుండవలయునో తెలిసిన స్మరేణ = మన్మథునిచేత, న్యాసీకృతా = నిక్షేపముగా నుంచఁబడినట్టియు, కార్ముకస్య, ద్వితీయమౌర్వీమివ = ధనస్సుయొక్క రెండవ వింటినారియా యన్నట్లున్నట్టియు, నితంబాత్ = కటి ప్రదేశమునుండి, పరిస్రస్తాం = జాఱినట్టియు, కేసర పుష్పకాంచీమ్ = కేసర పుష్పములతోఁ జేయఁబడిన, కాంచీం = ఒడ్డాణమును, పునఃపునః = మాటిమాటికి, అవలంబమానా = పట్టుకొనుచున్న (పార్వతి చూడఁబడెనని శేషము).

ఇచట "రెండవ వింటితాడా యనునట్లు" అనుటచే వింటితాటియందు ద్వితీయత్వము విధేయ మగుచున్నది. అందుచే ద్వితీయత్వమునకుఁ బ్రాధాన్యము రావలయును. "ద్వితీయాం" అను పదము విడిగ నున్న = నీ ప్రయోజనము సిద్ధించెడిదే. కాని యిచట సమాసములో నుండి యప్రధానమై పోయినది. ఇట్లుండఁగూడదు "మౌర్వీం ద్వితీయాం"అని యున్నచో బాగుండెడిది. ఇట్లు మార్చినపుడు "ఉపేన్ద్రవజ్ర" యను వృత్తమునకు బదులుగ నిది యిందవ్రజ వృత్త మగుటచే వృత్తభంగము కలుగదా యని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మిది. వృత్త మనునది శ్రావ్యముగనుండుటకే యుద్దిష్టమైనది. వృత్తమునకు "శ్రవ్యత"యే ప్రధానలక్షణము. అందువలననే వృత్తవిశేషములను బాగుగ నెఱిఁగినవారుఁగూడ,వసన్తతిలకాది వృత్తములయందుఁ జివర "గురు వుండవలయు"నను నియమము నంతగాఁ బాటించుటలేదు—వృత్తముయొక్క దుశ్శ్రవత్వముగూడ శబ్దానౌచిత్యములలో నొకటియే. అందువలననే, అనుప్రాస, యమకములవలె వృత్తముగూడ శబ్దాలంకారములలో నొకటి యనియే మే మంగీకరించుచున్నాము. ఇట్లి వృత్తము మాఱినను, దుశ్శ్రవత్వ దోషముపోయి. యీ వృత్తముగూడ నలంకారముగనే పరిణమించుచుండుటచే వృత్తభంగదోషమున కిచటఁ బ్రసక్తియే లేదు.

మఱియొక యుదాహరణము:—

> కారణగుణానువృత్త్యా ద్వౌ జ్ఞానే తపసి చాతిశయ మాప్తౌ
> వ్యాసః పారాశర్యః స చ రామో జామదగ్న్య ఇహ.

(సూచన—ఇది ప్రత్యుదాహరణము గాదు—విధేయానువాద్య భావ మున్నప్పుడు సమాసము లేని తావుననే యిది యుదాహరణము. "చాపాచార్యః" అను పద్యము తరువాతను, "తం కృపామృదు రవేక్ష్య" అను పద్యమునకుఁ బూర్వమును నిది యున్నచో బాగుండెడిది.)

అర్థము:—కారణగుణానువృత్త్యా="కారణగుణములు కార్యమునందు సంక్రమించును—" అను న్యాయము ననుసరించి, కారణమునందలి గుణములు కార్యమునకు వచ్చుటచే, పారాశర్యః=పరాశరునికుమారుఁడగు, సః=ఆ, వ్యాసః=వ్యాసుఁడు, జామదగ్న్యః=జమదగ్నికుమారుఁడగు, రామః=పరశురాముఁడు నను, ద్వౌ=ఇద్దఱు, జ్ఞానే=జ్ఞానమునందును తపసి చ=తపమునందును, అతిశయ మాప్తౌ=అతిశయమునుబొందినవారు.

ఇచట "పారాశర్యః" అను పదము వ్యాసునకును, "జామదగ్న్యః" అనునది రామునకును విధేయములు, ఉత్కర్షాధాయకములును. అందుచే నిట సమాసము లేకుండుటయే మంచి దైనది.

ఆక్షేపము:—"నీలోత్పలము" అను పదమునందు, విశేషణ విశేష్యము లున్నను, వానికి విధ్యనువాదభావము వివక్షితము కాన నచట సమాసము చేయఁబడినది. అట్లే "వ్యాసఃపారాశర్యః" మొదలగు ప్రయోగములయందుఁగూడ. విధ్యనుభావ మభిమతముగాదు— అందుచే సమాసము చేయవచ్చును. సమాసము కూడ దనుటలోఁ గారణ మేమి?

సమాధానము:—పారాశర్యత్వ మను నసాధారణ ధర్మముతోఁ గూడినవాఁడు వ్యాసుఁడని యే మనము తెలిసికొనవలయును, పారాశర్యత్వము వ్యాసున కొక యుత్కర్షను గలుగఁజేయును. అందుచే "పారాశర్య" పదమును వ్యస్తముగ నుండుటయే మంచిది—కానిచో, పారా

# శివలీలా విలాసము

## తృతీయాశ్వాసము

వ. ఆ సమయంబునందుఁ గుహనా విహారియగుచుఁ దాఁకినఁ దదీయ శౌర్యంబు గణింపక మాత్సర్యంబు దిలకింపక...యుగళంబునం దన్మ స్య గళంబు నొక్కటిగాఁ జిక్కం బట్టి ముద్దగావించి, కందుక క్రీడాలోలుండగు బాలు ననుకరించుచు ననార్యగతిఁ దిర్యగూర్ధ్వ భాగంబులఁ జిమ్ముచు విహరించుచున్న తఱి నతని తల ప్రహారంబులం దనశరీరంబు పచ్చిపుండుగా, వాఁడును విపరీత నవనింబడినం గని యా చిత్రకాయుఁ జిత్రకదనంబునం జంపఁ దలంచి, గండ గొడ్డలిఁ గరస్థలంబున నలవరించి, యుదగ్ర రభసంబున:— 68

క॥ అడుగులు మొదలుగఁ దొడలును
గిడుపును నందం దభయదగతిఁ బరశుహతిన్
దడఁబడక చీరియాక్రియ
నొడలఁ గల చర్మమెల్ల నొలువం దొణఁగెన్

సీ॥ అప్పుడు కంఠగత ప్రాణ మగుచునున్న
యమ్మహా వ్యాఘ్రము మొక్కట నాత్మలోన
నెఱుక వొడమిన నీశ్వరు నెఱిఁగి కరము
భక్తి జనియించి యిట్లని సంస్తుతించె

సీ. జయ ఫాలలోచన చటులాఘమోచన
జయకర స్థపూతాశ సత్ప్రకాశ
జయ లోకరంజన సంసార భంజన
జయ గతభోగాశ శమనకాశ

సంధిభాగంబుల చాయదప్పక యుండఁ
జిత్రంపు టోరపుసఁ జించి చించి
మొత్తనితావుల మిగులఁ బౌజుక యుండ
నిద్దంపుఁ బరుసున నిల్పి చిల్పి
యురకనెలకట్ల కందంద యెడలనెల్ల
నలఘుతరరక్త వాఃపూర మొలుకుచుండ
నొలిచెఁ దద్వ్యాఘ్రరూపమహోగ్రదనుజ
పరుషతరచర్మ మమ్మహాపరశుధరుఁడు.

ఉ॥ ఏపది నాల్గుదిక్కుల మునీశ్వరు లెల్లను వచ్చి మూఁగి హే
లాపరతంత్రవిభ్రమములం దిలకించినఁ దన్నుఁ జూచుచుఁ
బాపుర పీని బల్మి యని పల్కుచు నివ్వెరఁ గందుచుండఁగా
నాపులితోలు గట్టె శివుఁ డప్పుడ యంశుకభావ మొందఁగాఁ.

వ॥ ఇవ్విధంబున నవ్విభుండు నిజతత్త్వజ్ఞాన దూరస్థులగు దారువనస్థులకు శితివ్రతానుష్ఠానంబులతోడ తత్సతీప్రకల్పిత కృత్రిమ వితానంబులఁ జలంబులు విఫలంబులు గావించి, క్రీడ చాలించి, వారల ముందటఁబడునట్లుగా హరియుపస్త్రయుఁ దాను మేహానంబునుంబుచ్చి నైచి, యంతర్హితుఁడయ్యెఁ; నత్తపోధనులు హృదయంబులు కలితవిస్మయంబుగా, వారలు నెవ్వార లనియుం దెలియనేరక, విచారమూఢతఁ నీరజభవుం గాన నరిగి, యతని పాదకమలంబులకు నమస్కారంబులు సలిపి యిట్లని విన్నవించిరి.

చ॥ అరుదుగ మంచిప్రాయమున సంగకము ల్దనరార నొక్క సుం
దరుఁడును నొక్కసుందరియు దారువనంబున కర్థి వచ్చి మా
తరుణులఁ బుత్రులం బథముతప్పి యభీప్సిత వర్తనంబులన్
మరుగ విరాళిగొల్పి నెటిచూల్పిరి యన్యాయ ధర్మశీలముల్.

క॥ విస్మయ మెసవురునుం గ
ర్వస్మరభావమున నీల్గు వర్తిల్లుచు సా
రస్మత్తపః ఫలంబులు
భస్మంబుగఁజేసి చనిరి భాసితమహిమన్,

క॥ అక్కమల ముఖియుఁ బురుషుఁడు
నెక్కటి వారెచటనుండి యేతెంచిరి మా
కిక్కులమానగమేగతిఁ
దక్కుం దయ నానతిమ్ము తామరసభవా ?

వ॥ అని యంతయు విన్నవించిన విని విరించి యొకింత విచారించి యామునినాథులతోడ మీరు దారువనంబున మనంబుల నీశ్వర ప్రభావంబు దెలియక కేవల కర్మపరతంత్ర భావంబులం దదుపదేశ విహీనంబులగు తపోనుష్ఠానంబు నడుపుచునికిం గినిసి, యమ్మహాదేవుండు హరియును దాను గపట విలాసినీరూపంబుల నట్లు చనుదెంచి యిచ్ఛానురూపంబుగా వ్యవహరించి యరిగి రని మఱియు నిట్లనియె.

క॥ దుర్మతముల హరదూషణ
కర్మతులగు పాతకులకుఁ గలుగవు సుమహా
ధర్మములు గలిగెనేనియు
నిర్మలతం బారమేద నేరవు జగతిన్.

చ॥ అడుగులు బాహువుల్ వదన మక్షులు కర్ణము లట్టి జాతిగా
నొడలికి నన్నియుం గలిగియు న్మఱి జీవము లేక యున్న నే
యొసికములేని భంగి నిగమోదిత కర్మములెల్లఁ జెందియున్
మృడుని భజింపలేని క్రియ నిష్ఫలత న్వినశించు నెంతయున్.

క॥ శివపరము మతము మతమున్
శివపరమగు కృతము కృతము శివపరమగు ను
ద్భవ ముద్భవ మందునఁ దా
శివపరభావంబు క్రతు విచిత్రము తెలియన్.

ఉ॥ నల్ల లిత ప్రభావమున సర్వగతుండగుచున్న శాంకరీ
వల్లభుఁ గొల్వనొల్లమి శివస్థితు లొల్లమి భాగ్యవర్తనం
బొల్లమి పుణ్యగణ్యతల నొల్లమి యంచిత కీర్తి విభ్రమం
బొల్లమి మోక్షసంపదల నొల్లమి యే టికి వేయుఁ జెప్పఁగా.

క॥ ఫలభోక్తయు ఫలయోక్తయుఁ
దెలుపఁగ శంకరుఁడె కాఁద తత్కర్మం
బుల యెడల నభావంబున
ఫలము శివార్పితముఁగాఁగఁ బలుకఁగ వలయున్

ఆ॥ మీరు మూఢు లగుచు మృడు సముద్దిష్టంబు
గా ఘటింప రాత్మకర్మకలన
మట్టి యవినయమున నిట్టి విధం బావ
హిల్ల మీరు లోకమెల్ల నుఱుఁగ

వ. కావున నవిద్యా నిరాసకుండును విద్యావిలాసధరుండును నగు భక్త శివంకరుశంకరు నాశ్రయింపక యపచార పరంపర నిస్తరింపరాదని, తదారాధన ప్రకారం బుపన్యసింప నవధరించిన విని, విరించికిం దా పసవరులు పునః పునః ప్రణామంబులు సలిపి, శివార్చన సంభ్రమంబున మరలి దారువనాశ్రమంబున కరిగి, యథోచిత రూపంబుగా శివాలయంబు నిర్మించి, యందు శివలింగంబుఁ బ్రతిష్ఠించి, విధి సముపదిష్టసరణిం దదీయ పూజాతత్పరు లగుచుం బెద్దగాలంబు ఘోరాతపంబు సేయుచుండఁగా:—

సీ॥ రింగులువారు తెరంగునఁ గట్టిన
నాసరుచారల తోఁడియెల్లి యయును
శరము జంగాళంబుగా మేనఁగప్పిన
నొప్పునేనిక తోలు దుప్పటియును

నిజ్జీయుఁ డాసను చెజ్జొక కేలను
గుఱుతుగాఁ గొను గండ్రగొడ్డలియును
నొడికంబు నెఱపార జడముడిఁ దుఱిమిన
గొప్పవన్నెల పన్నె క్రొవ్విరియును
నెఱతనం బెంప్రలును జూచు నెలవులందుఁ
దివుటఁ దొడిగిన మలకల కంకణములును
గలిగి తపసులఁ బ్రోవును దలఁచి యంత
మూఁడుఁ గన్నులు గలవేల్పు జేఁటు వచ్చె.

క. ఇట్లు సన్నిధి సేసిన యిందుధరుని
గన్నుఁగవలందుఁ గలిగిన గఱువుదీఱఁ
దగిలి దర్శించి ప్రణమిల్లి తపసి మొత్త
మర్థిఁ గరములు మోడ్చి యిట్లని నుతించె.

చ॥ విడువడి కర్మతత్పరత విశ్వజగత్పరిపూర్ణ లీలను
గ్గడువుగ నందు మిమ్ము నెఱుఁగంగఁ దలంపక యింత గాలమున్
బడితిమి మోహపంకమునఁ బాయక యింకఁ గృపాజలంబులన్
గడిగి వినిర్మలాత్మకులఁగా మముఁ జేయఁ గదయ్య యీశ్వరా!

ఉ॥ తామసజీవులం బరమధర్మవివర్జితభావులన్ సదా
కామనిబద్ధుల న్భవాళి కల్మష మార్గనిబద్ధులం గడు
నోసమరిపోతుల న్నతతశోక విగర్హితుల న్మమున్
నేమమునన్ రచింపుము విశిష్టచరిత్రులఁగా నుమాపతీ !

చ॥ చలవిటరాజవేషము పొసంగ మహాశ్రమభూములందు వి
చ్చలవిడి నీవు క్రిమ్మఱుటఁ జాలపవిత్రము లయ్యె మాతపః
ఫలములునుం గులంబులు మ బాకవిమూఢత నప్పు డేముతాన్
దెలియక యున్న యయ్యవమతిన్ మఱువందగు నేఁడు ధూర్జటీ

కం॥ ముక్తికి నిదానమును శుభ
యుక్తికి మూలంబు నగుచు నురుమహిమ గుణా
సక్తిం దనరుభవత్పద
భక్తి గలుగ నిమ్ము మాకుఁ బరమేశ శివా!

కం॥ అనుచున్ బహువిధ ఫణితులఁ
దను నిల్లు నుతించుచున్న తాపసవరులన్
ఘనతర కరుణార్ద్రవిలో
కనముల నలరించుచును జగత్పతి పలికెన్.

కం॥ మీ యజ్ఞానము వుచ్చెదఁ
బాయక మత్పాదకమల భక్తి నిషక్త
ధ్యేయత మది కిచ్చెద నిం
కేయనువున్ మఱువుఁ డిపుడు హృదయంబులలో.

వ॥ అని పలికి వేదంబులు శాస్త్రంబులు నితిహాసంబులుఁ బురాణంబులు మఱియు నాగమంబులం బరిపూర్ణగా నానాక్రమములును దన నిజ తత్త్వంబుప్రసాద పరశత్వంబున వారలకుం దెలియ దక్షిణామూర్తి కలనం బలికి మునీంద్రుల నందఱి రక్షించి తమ జ్ఞానసాంద్రుం గావించి తదజ్ఞాన తిమిరంబు దూలించి యెప్పటి యట్ల నిజస్థానంబు నకు విజయంచేసి యుచిత వినోదంబుల నుల్లసిల్లె.

కం॥ దారువన విహారణంబన
నారూఢిఁ దలిర్చు నిట్టి హరలీలఁ బ్రియం
బారఁ బఠించిన వినఁ
జేరును జనులకు నభీష్ట సిద్ధి సమృద్ధుల్.

ఆ॥ వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించునట్టి లీల
నలరు దిగరంబునల వొందు విషభక్ష
ణాహ్వాయంబు గలిగి యుపనియందు

క॥ దుర్వార దమ శీలాఢ్యుఁడు
దుర్వాసుఁడు విగత సకల దోష మహాత్త్వా
ఖర్వుఁడు నిక్కము రెండవ
శర్వుఁడు మునినాథుఁ డొకఁడు జగమున నొప్పున్.

ఉ॥ అమ్మౌని యొక్కనాఁడు జగదార్తిహరున్ హరుఁ గొల్చి తత్ప్రసా
దమ్మునఁ గల్పక ప్రసవదామము నొక్కటిఁ గాంచి దివ్యయా
నమ్మున వచ్చి వచ్చి వచ్చి సురనాథుని సభ్ర గజాధిరూఢున
గ్రమ్మునఁ గాంచి యిచ్చెఁ గుతుకంబున నాత్మశిరస్థ మాల్యమున్.

క సుర పతియును నదియంకుశ
మరచాటి నిరాదరమున నందుకొని మహా
స్ఫారిత మగు కరి నుం
దగదంతాగ్రంబునందుఁ దగిలించుటయున్.

వ॥ తదనంతరంబ తదీయ చాంచల్యంబున నాదివ్య మాల్యంబు మేదినిం గూలి బ్రుంగినం గాంచి మనంబునఁ గోపించి, యమ్మునీంద్రుండు మహేంద్ర! నీవు సంపన్మదంబునఁ బుష్పదండ నెపంబుగా నన్ను నవమానించితి విట్టి దుర్నయంబునకు నుచితంబుగా నమరలక్ష్మి యంతయు నబ్ధింబడుఁగాక యనుచు శాపవచనంబులు పలికి యదృచ్ఛాగమనంబునం జనియె; నా సమయంబున—

క. మునినాథు శాప భయమునఁ
జనకుండఁగ రామిఁ జేసి తామర ననివా
సిని యిందిర యత్క్షణమున
వనధి జలాంతరమునకు నవారణఁ జనియెన్.

క॥ సిరిచన్న తెరువుననయ
ప్సరలును వెలియావుఁ గల్పశాఖలు సితకుం
జరమును సుధయును మున్నగు
సురవివిధ పదార్థ సమితి చొచ్చెఁ బయోధిన్.

# ఉషాపరిణయము

## పసుపులేటి రంగాజమ్మ

### కథాప్రారంభము.

క. జనమేజయ జనపాలుఁడు
విని వీనులవిందు గాఁగ వెన్నునికథలన్
తని వొందక వైశంపా
యనునకు నిట్లనియె మఱియు నాదర మొప్పన్

సీ. కృష్ణుని మనుమఁడై కీర్తుల వెలసిన
యనిరుద్ధుఁ డెట్టుల య్యసురపుత్త్రి
యగు నుషాకన్యక నంతఃపురంబున
వరియించెఁ బ్రియలుఁడై వచ్చిసత్త్రి
బాణుఁడు శౌరితోఁ బవరంబు గావించి.
ప్రాణంబుతో నెట్లు పాఱిపోయె
మును మాకు సంక్షేపముగ నెఱింగించితి
విస్తరంబుగఁ జెల్పు వేడ్క నొడమ

ననుచు వేఁడిన భరతవంశాగ్రణికిని
సావధానంబుగా విను జనవరేణ్య
వినికిఁ జేసెద సర్వంబు వీను లలర
ననుచు న వ్యాస శిష్యుఁ డిట్లనియె నపుడు

వ. ఓ వైష్ణవాగ్రేసర! బలితనూభవుం డగు బాణాసురుం
డొక్కనాఁడు సకలవిలాసంబులు మీఱి షణ్ముఖుం

జేతేర నతని వైభవంబుఁ జూచి యచ్చెరువడి తానును భవరింబుగా రుద్రు నారాధించి యాతని కుమారుండ నయ్యెద నని మది నెంచి తీవ్రంబగు తపంబు సేయు నంతఁ గొంత కాలంబునకుఁ బార్వతీసమేతుండై ముక్కంటి యక్కడికి వచ్చిన న య్యసురవరుండు బహు విధంబుల స్తుతియింప నా భర్గుండు ప్రసన్నుండై యోయి బలినందన! హెచ్చైన నీ తపంబునకు మెచ్చితిని నీవు గోరినట్లు యి కుమారునకు సోదరుండవై సకల వైభవంబుల సాటిలేని మేటివై శోణితపురంబునకు నాయ కుండవు గమ్ము. ఏను నీవాకిలిఁ గాచియుండెద నని వరం బొసంగిన

క. వరగర్వంబున బాణుఁడు
సరిమన్ దిక్పతులఁ గెల్చి కదనములోనన్
సరిలేరు తనకు నిపు డని
పురహరునిం జేరఁబోయి పొంగుచుఁ బలికెన్

ఉ. శంకర! దేవ దానవుల
సంగరమందు ననేకభంగులన్
బింక మడంచితిం గనుక
భీతిని జెంతలఁ జేర రిప్డు మా
కిం కిట వేయిచేతులకు
నేమిపరిశోధన మెంచిచూడఁగా

బొంకము మీఱ నొక్క యని
భోగివిభూషణ! కల్గఁజేయవే

క. అని పల్క నవ్వి రుద్రుఁడు
విను బలిసుత నీదు డాలు విఱిగినయపుడే
ఘన మగు కయ్యము కల్గును
మనమున యోజించ కిపుడు మగుడుము వేడ్కన్

వ. అని యిట్లు రుద్రుండు పలికిన బాణాసురుండు సంతసంబున మగిడి వచ్చి మంత్రిపురంబునఁ గొలువుండు సమయంబునఁ గుంభాండుండను మంత్రివరుండు బలినందనుం గనుంగొని యో స్వామీ! మీకు నింత సంతోషంబు కల్గుటకుం గారణం బేమి యని యడిగిన నమ్మంత్రివరునకు నా దైత్యవరుఁ డిట్లనియె.

సీ. వినవోయి కుంభాండ వివరంబుగాఁగ నే
ఫాలలోచనుఁ జేరి భక్తి మీఱ
జగడంబు వేఁడంగ సమ్మతి నతఁడును
డాలు ధరిత్రిని వ్రాలునపుడె
కయ్యంబు కల దని నెయ్యంబుతోఁ బలికె
ననిన బాణునిమాట కతఁడు వెఱచి
శంకరుకడ కేఁగి సమరంబు వేఁడంగ
బలితనూభవ! నీకుఁ బాడి యగునె?

తే॥గీ॥ ఏపినవేళనె యతని దా లవసిఁ బడిన
ఎందు నుత్పాతములు గనుపించ మఱియు
సక్త సేయక వాఁడును సంతసమున
కింతులును దాను సుఖగోష్ఠి నెసఁగుచుండె.

వ. అంత.

సీ. పార్వతి వరమున బాణాసురేంద్రున
కల యుషాకన్యక యవతరించె
దాదులు పోషింపఁ దనరెడు వేడ్కచే
శశిరేఖకైవడిఁ జాల ప్రబలి
పరగ గుజ్జనఁగూళ్ళు వండి నెచ్చెలులతోఁ
బెండ్లిర బొమ్మలపెండ్లి సేయు
వెన్నెలబైటను గన్నెయలుం దాను
మొనయుచు దాఁగుడుమూఁత లాడు

తే. ఇంతులను గూడి బంగరుబంతు లాడు
బాలికలతోడ నారామకేళి సల్పుఁ
జదువు ముద్దుకోకిలాలాపసరణి మీఱ
వీణె వాయించుఁ జెవులకు విందుగాఁగ

వ. అంత

సీ.1 మోముదామరమీఁద ముద్దుగుల్కుచు వ్రాలు
గండుమీలనఁగను గన్ను లమరె

సౌందర్యనదిలోనఁ జక్కఁగా విహరించు
చక్రవాకము లనఁ జన్ను లమరె
సరసోత్త్ర బాహులతాయుగ్మమున నొప్పు
చివురుటాకు లనంగఁ జేతు లమరె
నాభివల్మీకంబునను వెలువడివచ్చు
చిలువ నా నూఁగారు చెలువ మమరె

తే. మెఱసి తొలఁగని తొలకరి మెఱుఁగు వంగ
మిసుల సొబగైన కాంతిచే మేనుదీప
కలిత లావణ్యవాహ శృంగార గరిమ
కలిగి చెలువొందు నల యుషాకన్య కపుడు

క. ఇవ్విధంబున నవ్వాటిల్లు జవ్వనంబున వర్తిల్లు
చు నా జవ్వని యొక్కనాఁడు

సీ। పల్లవంబుల మించు పదముల రతనంపు
టందియల్ ఘల్లుఘ ల్లనుచు మ్రోయ
ఘననితంబములందుఁ దవరాలు బంగారు
మొలనూలిఘంటలు మురువుఁ జూప
శృంగారముల మీఱు కెంగేలుదమ్ముల
నీలంపుగాజులచాలు మెఱయ
తపనీయమయరత్న తాటంకములు మించి
నిద్దంపుఁజెక్కిళ్ళ ముద్దు లీన

తే. సరులఁ బెనఁగొని పాలిండ్లు సారెఁ గులుకఁ
గౌను లసియాడ మదహంసగతులు మెఱసి

వనితలును దాను శృంగారవనముఁ జేరె
భావ మిగురింప నల యుషాభామ యపుడు

క. ముక్కంటి గౌరి యవ్వని
మిక్కిలి ప్రేమంబు మీఱ మెఱయఁగా నా
మక్కువఁ గని యుష తన మది
నక్కట! యిట్లుండవలదె యనుచున్ దలఁపన్.

చ. అల యుషఁ జూచి గౌరి వద
నాంబురుహంబున మందహాసముల్
వెలుఁగఁగ మమ్ముఁ జూచి యిటు
చింతిలనేటికి నిట్టిభాగ్యముల్
గలుగును నీకు నింక ననఁ
గల్గునొ యెన్నటి కంచు సిగ్గునన్
బలుకక మోము వంచు నల
భామినిఁ గన్గొని పల్కెనీ గతిన్.

సీ. జలజాక్ష వినుము వైశాఖమాసమునందు
భాసురం బగు శుక్లపక్షమునను
రహిమించు ద్వాదశిరాత్రిని గలలోన
నెవ్వండు పొందు ని న్నెలమి నతఁడె
పతి యగు నీ కని భావంబు రంజిల్లఁ
బార్వతి పలికిన పలుకులకును
హర్షించి యెంతయు నాత్మలో నుప్పొంగి
శౌరికి మ్రొక్కుచు గారవమున

తే. బంతి గూర్చుండి యంతట బాగు మీఱ
రమణులును దాను వనభోజనము నొనర్చి
పరగ బాణాసురునిముద్దుపట్టి యపుడు
నిజనివాసంబుఁ జేరెను నెమ్మిఁ గోడ

వ. అంత.

క. సుర గరుడ యక్ష రాక్షస
నరకన్యలు చేరి కొలువ వైభవ మమరన్
పౌరతనము మీఱ నెంతయు
సరసిజముఖి యుండెఁ జాల సంతస మెసఁగన్

క. కలగనెఁ గన్యక పల్కిన
చెలువున వైశాఖమాస సిత పక్షమువం
దలరెను ద్వాదశిరాత్రిని
జలజేక్షణ నిదురబోవు సమయమువందున్

సీ. చంద్రిక నిరసించు సరణిచే రాణించు
చిరునవ్వు మోమునఁ జెలఁగువాఁడు
తామర రేకులఁ దా నెంతలే యను
వెడఁదకన్నులు కల్గి వెలయువాఁడు
తులకించుదొండపండులచాయఁ దెగడెడు
మురువుచే మించు కెమ్మోవివాఁడు.

పాంచజన్యముఁబోలఁ బ్రతివచ్చు ననవచ్చు
కలితరేఖలఁ బొల్చు గళమువాఁడు

తే. నురము బంగరు తల్పన నొప్పువాఁడు
భోగిభోగాభభుజములఁ బొల్చువాఁడు
లలితగజరాజగమనంబు గల్గువాఁడు
కనకముల మించి సరసించు కాంతివాఁడు

సీ. సంపంగి పువ్వులు సరసత సిగఁ జుట్టి
బురునాసుమాల్ గట్టి పోఁక మరల
అర్ధచంద్రుని మించు నం(దంపునుదుట)ను
తిరునా(మ)తిలకంబు దిద్దివేడ్క
శ్రీకారముల మించు చెలువంబు కల్గిన
వీనులఁ జోకట్లు నెలయ నుంచి
బటువుముత్తియముల బాగుగాఁ గూర్చిన
*కంఠసరుల్ దాల్చి ఘనత మీఱ

తే. తనదు నురమున వజ్రాలతాళి వైచి
హస్తములఁ గెంపులకడియా లలరఁబూని
వసుధ (జిగిమిం) చుచెంగుల వన్నెగాంచు
మేటికనకాంబరము నలెవాటు వైచి

---

* కంఠసరి — అని నిఘంటువులలో—
(1) శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.
(2) వావిళ్లనిఘంటువు. పర్యాయపదము—కట్లదండ.

క. బంగరు మంచము మీఁదను
సంగతిఁ గూర్చుండి మిగుల సరసతఁ (దా నా)
నంగవఁ దగ రా ర మ్మని
శృంగారరసంబు మీఱు చెలువం బమరన్

సీ. గంధంబు మైఁ బూసి కౌఁగిటఁ జేర్చుచుఁ
గస్తూరి దిద్దు (చు) గారవించి
సంతసంబునఁ జేరి చక్కెరమో వాని
బటువుగుబ్బలు జీరి బాగుమీఱ
గళరవంబులు చేసి కళ లంటి సొక్కించి
చెక్కిలి నొక్కుచుఁ (జెలు) వ మమర
తొడలపై నిడికొని తొయ్యలి ర మ్మని
పుక్కిటివిడె మిచ్చి బుజ్జగించి

తే॥గీ. చాల చన విచ్చి మిక్కిలి సరసముగను
కొప్పు దువ్వుచు విరిసరుల్ గూర్చి వేడ్కఁ
దేటమాటల లాలించి తేనె లొలుక
రతులఁ దేలించెఁ గలలోన రమణుఁ డొకఁడు

చ. కల గని మేలుకాంచి తన
కంఠము నంటిన గోటిజీరలున్
బలుచని మోవిపై మిగుల
బాగుగ నుంచినయట్టి కెంపులున్

గులుకు మెఱుంగు గుబ్బనలి
గుబ్బల సించిన గంధసారముల్
బలుమఱుఁ జూచి చోద్యపడి
భావములోనఁ గలంక చెందఁగన్

వ. అప్పటికి నెచ్చెలి యగు చిత్రరేఖ వచ్చి మాన్యగుణ
మహాకన్యం జూచి యి ట్లనియె.

సీ. అక్కరో! నీ వేల యాత్మలోఁ గలఁగెదు?
వేగంబ తెల్పవే వివరముగను
సకల దిక్పతులను సమరంబులోఁ గెల్చి
సరిలేక యుండిన జనకు నండ
నైరావతము నెక్కి నా యింద్రుఁ డెప్పుడు
చెప్పిన యుడిగంబు సేయుచుండ
ఫాలలోచనుఁడును ప్రమథులతోఁగూడి
గొల్ల మై వాకిటఁ గొల్చియుండ

తే.గీ. నొవర సంతఃపురంబున నున్న నీకు
నింత భయ మేమిటికి వచ్చె? నిందువదన!
భావ మిది యని పల్కవే పద్మగంధి !
చెలియ నాకన్న నాప్తులు కలరె నీకు

వ. అని పల్కిన చిత్రరేఖను జూచి యుష యి ట్లనియె.

సీ. మొలకనవ్వులవాఁడు కలువలచెలికాని
మురువు గైకొను ముద్దుమోమువాఁడు

పెడఁదకన్నులవాఁడు వేదండతుండాభఁ
గొమరొందు బాహుకాండములవాఁడు
చిన్నప్రాయమువాఁడు చిగురుకైదువుజోదు
కతి నొప్పెడు రూపరేఖవాఁడు
నిద్దంపు జిగివాఁడు నీలమేఘములీల
రహిమించు చికురభారంబువాఁడు

తే.గీ. కలితశృంగార లక్షణగరిమవాఁడు
చెలువుఁ డొక్కఁడు నను జేరి చెలువు మీఱఁ
గౌఁగిటను జేర్చె మోవాని కంతుకేళిఁ
గలియ నంతట మేల్కాంటిఁ గలువకంటి !

క. కలలోఁ జేసిన చిన్నెలు
దలఁపఁగఁ బ్రత్యక్షమౌనె ? దా మేల్కనినన్
నెలకొని యున్నవి యిపుడును
బలుకుదు నే మనుచు నీకుఁ బద్మదళాక్షీ !

సీ. తండ్రిదగ్గఱఁ బోయి తలిరాకుబోణిరో
యే గతి నిల్తునే యెమ్మెమీఱ
కన్నె యి దే మని కన్నత ల్లడిగిన
నుత్తరం బే మిత్తు నువిద యిపుడు
అన్నదమ్ములు చూచి యాత్మసంశయ మంద
నే మని తెల్పుదు నిందువదన

బంధువర్గము లెల్ల భావించి పరికింప
మఱుఁ గెలువలె నేతు మచ్చెకంటి

తే. గీ. కులసతుల్ప్రోల నెలువలె నిలుతునమ్మ
అట్టి బలివంశమునఁ బుట్టినట్టి తనకు
వసిత రావచ్చునా ? యపవాద మిట్లు
జగతి సరివారిలో నెట్లు సంచరింతు.

క. ఇటు పలికిన యుషఁ గనుఁగొని
కటకట యనుచుం జెలుఁలు చాల కళవళపడుచున్
కుటిలాలకమది కప్పుడు
దిటవు కలుగఁ బలికి రిట్లు తేటపడంగన్

మ. వినవమ్మా దనుజేంద్రపుత్రి వలదే
వేమాఱు చింతింపఁగా
నెనయ న్నీ చరితంబు లే మెఱుఁగమా ?
యే కార్యముల్ సేసినన్
తనరన్ మంచివె కాని కాని వగునే ?
ధర్మంబు నీ సామ్మగున్
వనజాక్షీ ! కలలోని సంగమమునన్
బాపంబు రానేర్చునే

వ. అని మఱియు నిట్లనిరి
సీ. కల: మనోవాక్కాయకర్మంబులందుఁ దా
నెవ్వండు కలుషంబులే యొనర్చు

సని పాప మగుఁ గాని యతివరో నీకనుం
గలఁ బురుషుని గూడఁ బాప మగునె ?
సఖ్యుల మందున సరసత జన్మించి
రూపరేఖలచేత రూఢి కెక్కి
నలుగు రౌ నన మంచినడత గల్గిన నీకు
నీ విచారం బేల ? యిందువదన !

తే. అనుచు నూఱటఁ బల్కఁగ నతివ లెల్ల
మది విచారంబు మానని మగువ కడకుఁ
జేరి కుంభాండపుత్త్రి యా చిత్రరేఖ
పలికె నిట్లని యాయింతిభాన మలర

సీ. వనజాక్షి. యుద్యానవనములోపల నాఁడు
పార్వతి పలికిన పలుకు లెల్ల
మఱచితికాఁబోలు మక్కువ మీఱఁగ
నే వివరించెద నిపుడు వినుము
శుకవాణి వైశాఖ శుక్లపక్షంబున
నలువొందు ద్వాదశినాఁటిరాత్రి
కలఁ గూడు పురుషుఁడె కాంతుఁడౌ ననియును
నతఁడును శౌర్యాఢ్యుఁడౌ నటంచుఁ

తే.గీ. బలికెఁగదవమ్మ నీతోడఁ బంత మలర
గౌరిపలు కేల దప్పును? గలఁక మాని

సంతసంబున నుండుము సకియ యనినఁ
జిత్రరేఖకు నిట్లనెఁ జెలువ యపుడు

ఉ. మఱచిన కార్య మియ్యెడను
మానిని! నీవు తలంపఁ జేసి తోఁ
బరగఁగ నాఁడు గౌరి తగఁ
బల్కినపల్కిఁ గంటి స్వప్నమున్
సకుణికిఁ యింకఁ జేయఁదగు
తక్కిన కార్య మదేమి యన్న భా
సురగతి నిన్న నేఁ గలను
జూచిన చెల్వుని జూపవే సఖీ!

క. అని పల్కిన చెలిమాటలు
విని భావమునందుఁ జాల వేడుక మీఱన్
వనజాక్షిఁ జూచి ప్రేమం
బెనయఁగఁ గుంభాండపుత్రి యిట్లని పలికెన్

సీ. కమలదళాక్షి! నీ కలలోన వచ్చిన
పురుషుఁ డే కులమునఁ బుట్టినాఁడొ
పరికింప నెటువంటి బలిమి కల్గినవాఁడొ!
యెటువంటి కీర్తిని నెలయువాఁడొ!
రూఢిచే నెటువంటి రూపు కల్గినవాఁడొ!
కనుపట్టు నెటువంటి కాంతివాఁడొ

తెలియఁగ నెటువంటి దేశ మేలెడివాఁడో!

యే విలాసముచేత నెసఁగువాఁడో!

తే.గీ. ఒక్క గుఱుతైన నాకొసఁగ నువిద నీవు
తెల్పకుండిన నెటు నేఁ దెలియవచ్చు
జోసఁ దైయంతిపురమునఁ దెచ్చి వచ్చి
మగువ నిను గూడు నతఁడు సామాన్యుఁ డగునె?

క. పతిసుతుఁ డేలెడి నీ పురి
బలివైరియుఁ జేరవెఱచు బాణాసురునిన్
గెలువఁగఁ జాలిన పురుషుఁడు
కలుగుట నీ భాగ్యవశము కంజదళాక్షీ!

ఉ. గౌరియనుగ్రహంబునను
గల్గెను నీ కిటువంటి భాగ్యముల్
నీరజనేత్ర! తామసము
నీ వొనరింపఁగ నేల? వేగమే
యూహను బేరునుం దెలిసి
యొద్దికఁ జేయుద మెల్ల కార్యముల్
శ్రీరమణుండు నీ తలఁపు
చేకుఱఁ జేయును నేఁట రేపటన్

వ. అని పలికిన

క. మరుకాఁకలచే మిక్కిలిఁ
బరవశయై చాల భ్రమసి భామామణి నా
వరుఁ దోడ్తెప్ప మాంద్యము
పొసఁగన్ సరివారి కెల్లఁ బ్రస్తుతిసేయున్

వ. అని మఱియును

చ. మలయజగంధి యెంతయును
మాటికి మాటికి వెచ్చ నూర్చునన్
బలుమఱు దాను గన్న కల
భావములోపల నెంచి చూడుచున్
దలపులవిఁటివాఁడు కను
వాఁడిశరంబుల నేయ సోలుచున్
జెలిఁతుక చిత్రరేఖఁ గని
నెమ్మిని నిట్లని పల్కెఁ గ్రమ్మఱన్

క. కలలోఁ జూచిన పురుషుని
చెలిఁతుక యిటు దెచ్చి కూర్చు నేనను ననుచున్
బలుమఱు నీ గతిఁ బల్కిన
జలజాక్షికిఁ జిత్రరేఖ సరసత ననియెన్

సీ. ఉవిదరో! వినవమ్మ! యూరుపే రెఱుఁగక
యే రీతిఁ దేవచ్చు నిటకు నతని?
నయినను నానేర్పు నా యుపాయంబునఁ
జిత్రపటంబునఁ జెలువు మీఱఁ
త్రిజగంబులందును దేజంబు [illegible]
బలపరాక్రమము [illegible] ప్తి
గీర్వాణ దానవ కిన్నర గం[illegible]
వసుమతీనాథుల వ్రా[illegible] తెత్తు

తే.గీ. సప్తదినములలో నను సరవి మీఱ
నపుడు నీభర్త యీఁతని యంటివేని
నతని దోడ్తెచ్చి నినుఁ గూర్తు ననుచుఁ బల్కి
పటము వ్రాయంగఁ జనియెను బద్మగంధి

వ. అంత

క. కటకట సప్తదినంబులు
నెటువలె నేఁ గడచుదాన నీ విరహాబ్ధిన్
దిటముగఁ బల్కిన నెచ్చెలి
బట మెప్పుడు దెచ్చు ననుచు భామామణియున్

సీ. చెక్కిటఁ జేయిడి చింతచే నొక్కిలి
కంతుని బారికిఁ గలఁగుచుండు
నిట్టూర్పు పుచ్చుచు నెమ్మోముతో నెంతయుఁ
దుమ్మెద్వ్రాఁతకుఁ జూలుచుండు

వసుమతి బొట్టవ్రేల వ్రాయుచుఁ బ్రేమచేఁ
గోయిలరవళికిఁ గుందుచుండు
నిర్వ్యాజుఁ గందుచు నెనరుతో నెంతియు
శుకముపల్కులకును సోలుచుండు

తే. గీ. బరగ నలుదిక్కులును జూచి భ్రమయుచుండుఁ
నెపుడు పతిఁ జూతు నే నని యెంచుచుండుఁ
దనరఁ దనలోనె కాంతుని దలఁచుచుండు
మనసు ప్రియుమీఁదనే నిల్పి మరగియుండు

సీ. తనర నేఁ జేసిన తపములు ఫలియింపఁ
జెలఁగి నాథునిసేవఁ జేయవలదె
కడు మించు నామది కాంక్షలు చేకూరఁ
జెలువుని గౌఁగిటఁ జేర్పవలదె
తమి మీఱ నా మేనితాపంబు చల్లారఁ
బ్రాణవల్లభునిమో వానవలదె
ముదముతోడుత నాదు ముచ్చట తీరంగ
వనశయ్యఁ బ్రియుని బైకొనఁగవలదె

తే. గీ. యనుచుఁ జింతించు మాటికి నొర యనుచుఁ
దలఁకుఁ దలయూఁచుఁ; దనలోనఁ దత్తరించుఁ
జిమ్ము రేఁగిన వలపులఁ జిక్కి మిగుల
విరహపరితాపభరమునఁ దరుణి యపుడు

మ. మకరాంకాకృతినాథుఁ డొక్కరుఁడు ప్రే
మం జేరఁగా వచ్చి మ
చ్చిక మీఱన్ మరుకేళిఁ గూడి కలలోఁ
జెన్నొంద లాలించుచో
సకటా! యేటికి మేలుకొంటి నిఁక నే
నా రాజకందర్పుతో
నేకాంతా కూటమిఁ గూడు టెన్నఁడొ మదిన్
రంజిల్లు టిం కెన్నఁడో!

సీ. ఏ నోము నోచెనో యెలమితో రమణుండు
చేపట్టి లాలించు చివురుబోఁణి
ఏ పూజ సేసెనో యేచినతమి నాథుఁ
బైకొని క్రీడించు భాసురాంగి
ఏ మే లొనర్చెనో యేప్రొద్దుఁ బ్రాణేశు
కౌఁగిట మెలఁగెడు కంబుకంఠి
ఏ పుణ్య మొనరించెనో పేర్మి వల్లభుఁ
బొలయలుకఁ గదలించు పువ్వుబోఁణి

తే॥గీ ఎంత భాగ్యంబు చేసెనో యెప్పుడు విభుని
మనసు రా సేవ నొనరించు మచ్చెకంటి
యెట్టి వేలుపుఁ గొల్చెనో యేకరీతి
వరుఁడు చన విచ్చి మన్నించు వన్నెలాఁడి

వ. అని మఱియును

సీ. కాంతుండు కన్నులఁ గట్టినయట్టులైన
"ఓసి" రారా యని చేరఁ బిలుచుఁ
ప్రేమతో రమణుండు పిల్చిన యట్టులైన
నెనరుతో నేమిరా యనుచుఁ బలుకుఁ
ప్రేమతో నాథుండు పెద వాని నట్టులైన
నొకవింత సీత్కృతు లొనరఁ జేయు
చెలువుఁడు గళరవంబులు చేసినట్టులైన
వీనుల విందుగా వినుచుఁ జొక్కు

తే.గీ. మోడి గైకొన్న యట్టులైన కోడెకాఁడు
చాల వలచితి సొలసితి కేళినేలు
వేడుకలు మీఱ నన్నుంచు వేఁడు కొనును
కాంత మరుమాయచేత విభ్రాంత యగుచు

సీ. పెంచినచిల్కను ప్రియముతో రమ్మని
పద్యముల్ చెప్పదు పద్మగంధి
రాయంచగములను రమణఁ జేరఁగఁ బిల్చి
నడుపులు నేర్పదు నళిననేత్ర
నెమ్మిగుంపుల నెల్ల నెమ్మితో రమ్మని
యాడింపఁగా నెంచ దలరుఁబోణి
శారిక రమ్మని చన విచ్చి మిక్కిలి
మాటలాడింపదు మందయాన

తే॥గీ. ప్రియము మీఱంగ బొమ్మలపెండ్లి చేసి
కొమరు గుల్కంగ గుజ్జెనకూళ్ళు వండి
పడఁతులకుఁ బెట్టనొల్లదు పంకజాక్షి
విరహభారంబుచేతను ప్రీలి మిగుల

క. నెలకొను విరహముచేతను
గలఁగుచు నీ గతిని జాల కళవళపడు నా
పొలఁతుకఁ గని యొక నెచ్చెలి
పలికె న్నెచ్చెలులఁ జూచి భావ మెలర్పన్

సీ. చెలులార! కంటిరా? చెలువ యున్న తెఱంగు
పలువగలై తోఁచె భావమునను
ఫలమున కెంతయుఁ గొదవ వచ్చె నటంచుఁ
గుందుచు నున్నదో! కుందరదన
కలలోనఁ గలసిన కాంతుని దలఁచుచు
విరహాన నున్నదో! వెలఁది యిపుడు
బుద్ధిచాతురిచేతఁ బొలఁతుక లందఱు
నిశ్చయింపుఁడు వేగ నేర్పుమీఱ

తే॥గీ. అసురనాథుండు వినెనేని నాగ్రహించు
నిందుల కుపాయ మే మింక నింతులార!
యనిన వారలలో నొక్క యలసుబోఁడి
నెమ్మి నిట్లని పల్కెను నిశ్చయించి

ఉ. ముచ్చట మీఱ నా కలను
 మోహముతోడుతఁ గూడి నా కడఁ దే
యచ్చెరు వొంద నా యెదుట
 నందము గుల్కఁగ నున్నయట్లుగా
నిచ్చట దోఁచెఁ గన్నులకు
 నే మని తెల్పుదు నిట్టి మోహముల్
వచ్చె నివింటిజోదు పెను
 బాటికి నేగతిఁ నింకఁ దాళుదున్

వ. అని మఱియు నిట్లనియె

సీ. అల్ల కుంభాండునియాత్మజ యైనట్టి
 చిత్రరేఖ యిపుడు చెలువుమీఱఁ
త్రిజగంబులను గల్గు తేజోనిధుల నెల్ల
 సప్త దినంబుల సరసరీతి
వ్రాసి తెచ్చెద నని వన్నె మీఱఁగఁ బల్కి
 పటముఁ దే నరిగెను బంత మలరఁ
దుంటవిల్తుఁడు వాఁడితూపుల నేయంగ
 గడియ యొక్క యుగంబు గాఁగఁ దోఁచె

తే॥గీ. ప్రాణసఖులార! నాదైన భావ మిపుడు
మీకు దాఁచక తెల్పితి; మించె వలపు
చేర నెప్పుడు వచ్చునో చిత్రరేఖ
తలఁపు లెప్పటి కీడేఱ్చు దైవ మింక

వ. అని పల్కిన యుషాకన్యకు మాన్య లగు నెచ్చెలు లిట్లనిరి

క. కలఁకకు నెమ్మదిలోపల
పొలంతి! యిందున్నఁ బ్రొద్దు పోవునె మనకున్
చాలు పగు శృంగారవనిన్
బలరాముని గొల్త మనిరి వాంఛిత మమరన్

—/ ఆ శ్వా సాం త ప ద్య ము లు /—

క. శశిరాజహార చింతా
మణి కామగవి సురద్రుమ శ్రీఖండ*
ఫణిరాజాధిప శరదభ్ర
ప్రకటిత యశస్సాంద్ర విజయరాఘవచంద్రా!

ఉ. శౌరిపదాబ్జసేవనవి
చక్షణ శ్రీరమణీయవీక్షణా!
వైరిజనాధికస్మయని
వారణ! సంభృత మత్తవారణా!
సారసలోచనా! ప్రసవ
సాయకసజ్జన! భాగ్యదాయకా
సారయశోవిభూషితది
శాముఖ! వైష్ణవరక్షణోన్ముఖా

క. వారాశిపరీతక్ష్మా
ధారభుజాదండ! విమతదళనోద్దండా!
శ్రీరామాయణ సంతత
పారాయణ సరసహృదయ! పండితసదయా!

* ప్రతిపాఠము — శ్రీఖండ, ఇది వ్రాఁతపాఠము

# గ్రంథ సమీక్ష

దాసబోధ: వెల 8-0-0; 666 పుటలు. డెమ్మీసైజు. కాలికో బైండు.

ఈ గ్రంథము మహారాష్ట్రభాషనుండి తెలుఁగులోనికి శ్రీకొండ కంచి చక్రధరరావుగారు అనువదించిరి. శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజునకు గురువు లగు శ్రీసమర్థరామదాసస్వామి రచించిరి. ఈ గ్రంథమున నిరువది దశకములు గలవు. ఒక్కొక్క దశకమునఁ బది విభాగములు గలవు.

ఇందలి దశకములయందలి వస్తుస్థితి యిట్లున్నది :—
1. దేవాదిస్తుతులు 2. విషయనిరూపణము 3. స్వగుణపరీక్ష మొ. 4. నవవిధభక్తి 5. గురు, శిష్య సిద్ధసాధకాది లక్షణములు. 6. ఆత్మ మాయ. 7. మాయాస్వరూపము, పరమాత్మప్రాప్తి 8. అధ్యాత్మ జ్ఞానసరణి సూక్ష్మ స్థూల భూతములు, మోక్షలక్షణము, అనుభవములు 9. బ్రహ్మనిరూపణము, శంకలు, సమాధానములు. 10. అంతరాత్మ యొక్క యేకత్వము, బీజలక్షణము, పంచప్రళయము మొ. 11. రాజనీతితత్త్వము, సాధులక్షణము మొ॥ 12. వివేకము, వైరాగ్యము, 13. ఆత్మానాత్మ వివేకము, సారాసారనిరూపణము మొ.

ముఖ్యముగా నీ గ్రంథమున గృహస్థాశ్రమమున నున్నవారికిఁ దరించు మార్గము సూచింపఁబడెను. ఇది తనకాలమున దేశముయొక్క నైతికధార్మిక రాజకీయదశలను మనమునం దుంచుకొని సమర్థ రామదాసస్వామి యీగ్రంథమును రచించె నని చెప్పుచున్నారు. ఉపనిషత్తులు భాగవతము మొదలగు గ్రంథములలోని సిద్ధాంతముల నితఁడు ప్రమాణములుగ గ్రహించెను. ఇది భగవద్గీతవలె పలుమార్లు పఠించి మననము చేయఁదగినగ్రంథము. లౌకికపరమార్థములయందు సాధారణ ప్రజ్ఞాధురీణుఁడైన సమర్థునియనుభవము లిందుఁ జక్కఁగాఁ బ్రతిపాదింపఁబడెను. ఇట్టి యమూల్యగ్రంథ మెచ్చటనో పడిపోనీయక యాంధ్రలోకమునకు మఱల నందిచ్చిన వ్యాసాశ్రమకృషి మిగుల ప్రశంసనీయమైనది.

2. ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము—అనువాదకులు 'మహోపాధ్యాయ' దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు. వెల రెండు రూపాయలు ప్రాప్తిస్థానము—'సాహిత్యస్థాపక' దుర్భా సుబ్రహ్మణ్యశర్మ, నెల్లూరు.

ఈ కృతి మహాకవి కాళిదాస కృతి కనువాదము. ఇది శృంగారస ప్రబంధమగుటచే హృద్యౌచితితో దీనిని శ్రీ శర్మగారు వారి సుదతీరత్నము శ్రాలుఁగన్నులకు సెంతోరక్తి సంకితముచేసి యున్నారు. దీనికిఁ బూర్వము శ్రీ శంకరభగవత్పాదుల వివేక చూడామణిని బద్యకావ్యముగ దమ మాతృదేవత కంకితముచేసి యున్నారు. ఇట్లంకితము చేయుటలో శ్రీ శర్మగారికిఁ గల యౌచితీనిర్వాహణ సామర్థ్యము వ్యక్తమగుచున్నది.

కాళిదాసమహాకవికవిత యెల్లెడలను ధ్వని ప్రధానమైనది. ఆతని కావ్యములందలి వాక్యములందే గాక పదములందును గూడ నవ్యక్తమధుర ధ్వని యెసలారుచుండును. అట్టి యాతనికవిత ననువదింపఁబూనుట యెట్టివారికిని దుర్ఘటమే. ఇఁక ననువాదకులు సాధ్యమైనంతవఱకు మూలమునందలి పదములు తమ యనువాదములోఁ గూడునట్లు చూచుచు భావానువాదము చేయఁగడఁగినఁ గొంతవఱకుఁ గాళిదాసుని కవితామాధుర్యము పాఠకులకుఁ జవిచూపింపఁ గల్గినవా రగుదురు. శ్రీ శర్మగారియనువాదసరణి యిట్టిది.

వీరి యనువాదములో భావావిష్కరణమున స్వాతంత్ర్యము వహింపక, కాళిదాసునివాక్యములకు సన్నిహితముగాఁ దమ యనువాదము తెలుఁగులో నడచుటకు యత్నించి కృతకృత్యులైరి. కావున నీ కృతి మూలమున కన్యూనాతిరిక్తమయిన యనువాద మనవచ్చును. ఈ యనువాదమున శ్రీ శర్మగారికిఁ గల సంస్కృతాంధ్ర భాషాపరిజ్ఞానము స్ఫుటముగ వ్యక్తమగుచున్నది. పద్యములు గద్యములు సంస్కృత పదబహుళములై సరళ శైలిలో భావాభివ్యక్తికిఁ దగిన తీరున సమకూర్పఁబడినవి. విశేష సంస్కృతజ్ఞానము లేనివారికిఁ గృతి కాళిదాస కవితారసాస్వాదనమునకు సహకరించును.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి ఇ. డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు. (జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారధిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

శ్రీ పసుమర్తి సీతారామారావుగారు, బి. ఏ.,

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

# విషయ సూచిక

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## కాకినాడ

## నలువదినాల్గవ వార్షిక మహాసభ.

శ్రీ ........................................................ గారికి

అయ్యా!

44వ వార్షిక మహాసభలు 1956 మార్చి 16, 17 తేదులలో రాజమహేంద్రవరమున జరుగఁ గలవు. సభలు రెండు దినములు జరుగును. 16 వ తేది ఉదయము పరిషద్వ్యవహారసభ జరుగును. అందు స్వాగతసంఘాధ్యక్షుల యుపన్యాసము, సభాప్రారంభకుల యుపన్యాసము, సభాధ్యక్షుల యుపన్యాసము, సభాప్రశంస, కవుల వివిధ పద్యములు చదువఁబడును. సాయంకాలము సారస్వతమహాసభ జరుగును. దీనికిఁ గవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా రధ్యక్షతను వహించెదరు. మఱునాఁ డుదయము భాషా—వ్యాకరణ మహాసభ శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులవారి యధ్యక్షతను జరుగును. ఆ దినము సాయంకాలము చరిత్ర - సంస్కృతి మహాసభ జరుగును.

కావున, ఆంధ్రభాషయందును, ప్రత్యేకముగాఁ బరిషత్తునందును, అభిమానముగల యాంధ్రభాషాకోవిదులు, రాఁబోవు సభలలో సాహిత్యవిషయమునఁగాని, భాషా-వ్యాకరణ విషయమునఁ గాని, ఆంధ్రచరిత్ర--సంస్కృతి విషయమునఁగాని, వ్యాసములను వ్రాసి సభలలోఁ బాల్గొనఁ బ్రార్థించుచున్నాము. ఈ సభలకై పంపఁబడిన వ్యాసములన్నియు సభానంతరము పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడును. వ్యాసములు వ్రాసి పంపుటకుఁ దగిన యవకాశము లేకుండుటచే రచయితలు తమ వ్యాసముల పేర్లు మార్చి 5వ తేదీలోపుగాఁ దెలియఁజేసినచోఁ గార్యక్రమమున వాని నుదహరింపఁగలము. మిగిలిన వివిధ సభాధ్యక్షుల పేర్లు నిర్ణీతము కాఁగానే కార్యక్రమముతోపాటు తెలుపఁబడును. తా మెల్లరు విచ్చేసి సభలను జయప్రదమొనరింపఁ బ్రార్థన.

రామారావుపేట,
కాకినాడ.
28--2--1956

ఇట్లు విధేయులు,
చతుర్వేదుల సత్యనారాయణ,
ప్రతివాదిభయంకర పార్థసారథి,

శ్రీ

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౪ { మన్మథ సంవత్సరము / మార్గశిర-పుష్యమాసములు } సంచిక ౫

# స్మృతులు

## 1

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు 21—1—56 తేదీ రాత్రి (మన్మథనామ సం॥ మార్గశిర శుద్ధ అష్టమి) పదిగంటల వఱకు మిత్రులతోఁ గవితాగోష్ఠి చేసి యా రాత్రియే యాకస్మికముగ దివంగతులైనా రని విని నిలువున నీరయిపోతిమి. ఇంతకు నలువది నాల్గు సంవత్సరములుకూడ నిండలేదు. వీరి యకాలమరణ మాంధ్రులకు గుండెపైఁ జలిపిడుగని వేఱే చెప్పనక్కఱలేదు.

శ్రీరామకృష్ణశాస్త్రిగారికి వైద్యము కులవిద్య. కవిత్వము వెన్నతోఁ బెట్టినది. ఈ రెంటను వీరు సిద్ధహస్తులు. శరీరమునకు, ఆత్మకుఁగూడ నానందము గూర్చు రససిద్ధులు.

శ్రీరామకృష్ణశాస్త్రిగారు కవులు; పండితులు; ప్రతిభా వ్యుత్పత్తులు రెండును సరిపాళ్లుగఁ బుణికి పుచ్చుకొన్న ధన్యజీవులు. తన్మయత—రసార్ద్రత వీరి సహజగుణములు. అందుండి 'త్వమేవాహం త్వమేవాహ' మని కవితావాగ్దేవి యవతరించినది.

శ్రీరామ కృష్ణశాస్త్రిగారి యష్టావధాన, శతావధాన,రంగములు రసతరంగములు. ఆశుధార కమ్మచ్చున లాగినట్లు తీపువడి ముక్కతిమ్మనార్యుని 'నభోవాయునిహతిని మొరయు మహతి'ని దలఁపించెడిది.

వీరి చెలిమికలిమిచే మా పరిషత్సభాసమావేశము లోక నిందాదశమును జాఱఁగొన్నవి. వీరి యకాలమరణముచే మా పరిషత్తు దరిద్రాణమయ్యెనని వగచుచున్నాము.

వీరికి వచన మెంత సరసమో కంఠ మంత మధురము. వారి కావ్యసారస్యముతోపాటు వారికంఠమాధుర్యముకూడ నేఁటికిని మా శ్రుతులయందుఁ బ్రతిధ్వనించుచున్నది.

శ్రీ రామకృష్ణశాస్త్రిగారు ఋషి. అరుణాశ్రమము వీరి కవితా తపోవనము. ఇది కేవలము వీరు తమయుపాసనాస్థితికిఁ బెట్టికొన్న పేరు. 'నడకుదురు' గ్రామము. (తోట్రుపాటు లేని నడతీరుకలది). ఆశ్రమశబ్దమున కిదికూడ సాకూతముగ జతపడినది. 'పవిత్రసారస్వతోపాసన' దీని ముఖ్యలక్ష్యము. తమ శ్రావణకావ్యనివేదనమున వీరు 'కవి విశ్వసారథి' యని యుగ్గడించియున్నారు. అరుణాశ్రమములోని యరుణశబ్దమున కిది యర్థద్యోతక మగుచున్నది. అరుణుఁడు విశ్వసారథి; కవికూడ నంతే. అరుణుఁడు తేజోరాశిని వెంటఁబెట్టికొని దిగంతము లుద్దీపితముచేయును. కవికూడ నంతే. అరుణుని యనూరుత్వము, ఏకచక్రరథత్వము కవి స్థితిగతులను స్ఫురింపఁజేయుచున్నవి. శ్రీ రామకృష్ణశాస్త్రిగారి కవితోపాసన యిట్టి స్థాయితోఁ బ్రారంభమైనది.

వెలువడిన వీరి కృతులు రెండు. అవి కుంతి, శ్రావణము. కుంతి తొలినాఁటిగ శ్రీ రామకృష్ణశాస్త్రిగారి కళాప్రాభవమును పాఠకులకుఁ బరిచితముఁ జేసినది. ఇది చిన్నదైనను జాల యపూర్వరచన. ఎందరెందఱో మహాకవులయు పండితులయు ప్రశంస లందికొన్నది. శ్రావణముకూడ నంతే. ఇది శ్రీరామకృష్ణశాస్త్రిగారు సజీవులై యున్న తమ వృద్ధమాతాపితల కంకితముచేసినారు. పురాణదంపతులఁబోలు వారి ఛాయాచిత్రముకూడ భక్తితోఁ గావ్యముఖమున నీయఁబడినది. ఈ యంకితవిషయము నిట్లు వ్రాసియున్నారు:—

మ. అపుడారసి పితృపాదపంకజ సపర్యాలక్షితం బైన సుం
దరచారిత్రము గావ్యరూపమున సంధానించి విద్వత్సమా
దరణీయమ్ముఁ బవిత్రమై తనరు తత్కావ్యప్రసూనోత్తమం
బిపుడారన్ బితృపాదపంకజసపర్యార్థంబె యోజించెదన్.

పితృభక్తి చేగాక మాతృభక్తిని గూడ శ్రవణుని దలఁపించుచున్న శ్రీ రామకృష్ణశాస్త్రిగారు తమ కావ్యాశ్రితమైన వృద్ధదంపతుల పుత్రశోకమును బునఃపాకంబునకుఁ దెచ్చి మాతాపితల హృదయములలో గరుణారసమును బుటములు పెట్టుచున్నారు—

చ. కొడుకా! యంచు మహోచ్చకంఠముల నాక్రోశించి యాపీనుపైఁ
బడి దోఁగాడుచు నెత్తిమోదుకొని యాపాదంబు నామస్తముల్
పడకుంజేతుల సంస్పృశించుచు మహాబాష్పప్రపూరంబు మైఁ
దడుపన్ బోరున నేడ్చి రెంతయును బుత్రప్రేమ నాదంపతుల్.

శా. ఈ రత్నంబు లభించునంతటి మహాదృష్టంబు.................
..................................నీవంటి వి
స్తారప్రజ్ఞుఁడు నెట్లుదక్కును? తటిత్ప్రాయమ్ముగా జీవితా
కాశారూపం బయి వెల్గె నీవెలుఁగు నిష్క్రాంతంబు నయ్యెన్ ద్రుటిన్

ఈ శోకము కావ్యమున రసము కావచ్చు. జీవితమున దుర్భరము.

నీలకంఠవిజయము, మృచ్ఛకటికము, అద్భుతదర్పణము, నాస్వామి, తుపాను, మొదలగు కృతు లెన్నియో శ్రీ శాస్త్రిగారు రచించినారు. ఇవి యముద్రితములు. 'నాస్వామి'లోని కొన్ని పద్యములు మా పరిషత్పత్రికలోఁ బడినవి.

ఈ మధ్య శ్రీ శాస్త్రిగారు 'శ్రీ వేంకటాచల మాహాత్మ్యము' (తిరుపతి ప్రచురణము) అను సంస్కృతగ్రంథము నాంధ్రీకరింపఁబూనినారు. ఇందలి కొన్నిఘట్టములు వారు మాకు వినిపించినారు. ఇందు

వాగర్థరూపు లగు పురాణ దంపతులయందు వారి కళాస్వరూపమైక్య మొందినదని చెప్పుట యత్యుక్తి కానేరదు ఆంధ్రుల దురదృష్టము— అది పూర్తి కాకపూర్వమే వారు చిత్కళాసాయుజ్యము నొందినారు.

2

శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు 9-2-56 తేదీ రాత్రి పరమ పదించినారు. వీరిమరణమున కాంధ్రసాహిత్యపరిషత్తు చాల విచారము నందినది. శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో పండితులు. భాషాభిమానులు. గ్రంధోద్ధారకులు. కవిపోషకులు. అగణితము లగు ప్రాచీనార్వాచీన సంస్కృతాంధ్రగ్రంథముల ముద్రించి యుభయ భాషలకు నపారమైన సేవచేసినారు.

శ్రీ శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున వీరి సంస్కృతాంధ్రగ్రంథసేవాకృషిని ప్రశంసించి శ్రీ రామలింగారెడ్డి ప్రభృతులు వీరికి 'భాషోద్ధారక' అని బిరుదిచ్చియున్నారు. సమ్మాన సంపుటమను పేరితో నొక గొప్ప సంపుటముకూడ వెలువడినది. క్రిందటి స్నాతకోత్సవములో, ఆంధ్రకళావిశ్వపరిషత్తువారు "కళాప్రపూర్ణ" అని బిరుదు నొసంగి సత్కరించినారు. ఈ బిరుదములకు శ్రీ శాస్త్రిగా రెంతయు దగియున్నారు.

నిరంతర భాషాసేవతో దమ జీవితమును సార్థకపఱచుకొన్న శ్రీ శాస్త్రిగా రాంధ్రులకు జిరస్మరణీయులు. పరమాత్ముడు వారి యాత్మకు శాంతిని ప్రసాదించుగాత.

# ఆవేదనము

వద్దిపర్తి చలపతిరావు

క. ఏడుఁబాసిపోయినావని
సుడి సుడిగొని చెవినిల్లఁకి నూల్కొను కలఁతన్
గడిసిలఁబడె గుండియ, త
ల్లడపడెఁ గాల్ సేయి, చతికిలంబడిపోతిన్.

సీ॥ ఒడికంబై యొప్పునైన యెత్తుగడతో
నొయ్యారముల్ గుల్కు పో
కడతో, వ గుణకీర్తివృత్తులకు సం
కాపాఁకముల్ లేని మేల్
నుడికారంబులపొందు పిసలకు విం
దుల్ సేయ నీ కైతకున్
గుడి కట్టించితివోయి పాఠకమనః
కూటంబులన్ ధీనిధీ,

ఉ॥ వ్యాసుని భారతంబున నొ
కంతలుగా నణఁగారియున్న దౌ
ర్వ్యాసన మంత్రమోహాహతు
రాలి దశాంతర చిత్తవృత్తి ని
శ్వాసము లేర్చి యొక్క రస
వంతపుఁ బాత్రగఁ దీర్చినావు, సే
బా సనిపింపఁగాఁ దెలుఁగు
బాసను మూసను బోసినావులే.

ఉ॥ మోసులువాఱ నీ తెలుఁగు
భూమి లోఁగిన్ గవితారసాల శా
ఖా సముపస్థితిన్ మధుర
గానము సేసితి వింత, పాము కా

…చుప్పు పూ ఋపలు
కే కొనసాంపని నోరెనెం, జిన్
మాతాపిత యా సినల్ బెజాఁ
బో వీకఁ; జావుకుఁ జావు లేద టే.

శా॥ నీ మాతాపితలందు నీకుఁ గల యా
నిర్ణిద్రమా భక్తి మో
జై మాటుంగొని తీవు 'శ్రావణము' శా
స్యంబందు నొలెమ్మొ నాఁ
డా మాత్రు్మోగిన వృద్ధదంపతుల హా
హాకారముల్ నేఁడు క
ట్టా! మాతాపితలందుమన్ దిరుగఁ దోఁ
డన్ బూనికల్ వేద్కు టే.

చ॥ బ్రతుకు పెడాకులం దిసుక
లం బడి పాఱఁగవై చికొన్న నా
హిత వగుః లేఖినిన్ దిరిగి
యిచ్చును గొమ్మదిగో! యటంచు భా
రతి; యిది యేమి! లోచన త
రంగిత కజ్జల బాష్పముల్ మషీ
గతులుగ రాల్చు, నీవు పెడ
గాఁ జని మోమటు పెట్టినంతటన్.

---

# శ్రీనాథుని కృతులలో ఋతువులు

చిలుకూరి పాపయ్యశాస్త్రి

కావ్యములలోఁ గవులు ప్రసంగవశమునఁ దత్తదృతువర్ణనములు వెలయించుచుందురు. ఆ తత్తత్కాలపరిణతినిబట్టి భిన్నభిన్నముగఁ గడచూపు ప్రకృతివైభవ మందు వివరింపఁబడుచుండును. ఋతువర్ణనము ప్రకృతిఁ బోలుత సంస్కృతకవులు తమ కావ్యములలో ప్రకృతి వర్ణనము చేసియున్నారు. కాని దృశ్యసాక్షాత్కారమునకై వార లుపమోత్ప్రేక్షా ద్యలంకార మహితముగ నొనర్చి తత్తద్వికాసము నెంతయుఁ జమత్కారముగ నిరూపించియున్నారు. తెలుఁగుకవులును సమప్రబంధములలోఁ జాలవఱకు నాపరిపాటినే పాటించియున్నారు.

ఒక్కొక ఋతువులోఁ గొన్నివృక్షములు లతలు పుష్పించును. వేర్వేఱుజాతుల విహంగమరుతములు వినవచ్చును. నదీనదములలో వింతవింత హొయలు గానవచ్చును. వివిధ భోగసామగ్రులు మహో మోదము నొదవించును. ఒక్కొకప్పుడు ప్రకృతి శాంతము ఆస్వాద్యము నగును. వేఱొకపుడు భయానకముగ నుండును. ఒకప్పుడు దృష్టిప్రియము వేఱొకప్పుడు శ్రుతిమధురము నగుచుండును. ఒక్కొకసమయము మానసమున కుల్లాసము వేఱొకసమయమున వికారము నొదవించును. కాలికమయిన ఋతువికాసము సుఖాపాదకము. అకాలికమైన ఋతు పరిణామము దుఃఖాధాయకము.

శ్రీనాథుఁడు తనప్రబంధములలోఁ గాలికములు నాకాలికములు నగు ఋతువికాసములను వర్ణించియున్నాఁడు. తత్తదృతువులలో నాంధ్రావనిలోఁ బొడచూపు ప్రకృతివైభవము నెంతయు హృద్యముగఁ జిత్రించియున్నాఁడు. ఆయాసమయములలోఁ దెలుగునాఁటఁ

కావ్యములలోఁ బ్రతిబింబింపఁజేసినాఁడు. తన్మూలమున శ్రీనాథునినాఁటి పరిపాటు లెట్టివియో మనకుఁ దెలియవచ్చును.

శ్రీనాథుఁడు తనకావ్యములలో భావానుసరణమునందును శబ్ద సంయోజనమునందును సంస్కృతకవుల మార్గమును విశేషముగ ననుస రించినను, అక్కడ వచ్చినపు డాంధ్రత్వమును వ్యక్తీకరించుట మాన లేదు. ప్రకృతిని వర్ణించుపట్టులలో తెలుఁగుజాతీయతయే యాతని కవితలో మనకు గోచరించును. ఏయే ఋతువులలో నేయే తరులతా గుల్మాదులు వికసించునో, ఏయే సస్యముల కెట్టిపరిణతి యేర్పడునో, ఆనాఁటి మానవు లేయేభోగసామగ్రుల నెటు లాస్వాద్యము లొనర్చిరో మున్నగు విషయములన్నియు నాతని కవితాదర్పణమునఁ బ్రతిబింబించి నవి. వానిలోఁ దెలుఁగుతనము ప్రతిఫలించు ఋతువర్ణన మెట్లు నిర్వ హింపఁబడెనో, అట్టి పట్టులలోఁ గానవచ్చు విశేషము లీనాఁ డీనాఁట నేవి నిలిచియున్నవో కొంత పరికింతము.

## హరవిలాసము - వర్షర్తువు

శ్రీనాథుఁడు హరవిలాసమును వర్షర్తువును వర్ణించుటలోఁ దన ప్రతిభను వెల్లడించినాఁడు ఇది యాకాలికవర్షారంభము. చిఱుతొండని భక్తిని బరీక్షించుటకై శివుని యనుమతి నింద్రప్రేరితములై పుష్కలా వర్తకాది మేఘములు లిగువదియొక్క రోజులు కుంభద్రోణముగ వర్షింపఁ గాంచి కేతెంచినవి. అప్పటి వాని యాటోపమును వర్ణించుటతో నారంభమై విశ్వంభరామండలం బేకార్ణవం బగునంతటి వర్షోద్ధతి చిత్రింపఁబడినది. తత్క్రమ మిట్టులున్నది.

గీ॥ పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె
నిండునెలఁ జుట్టెఁ బరివేషమండలంబు
గగనమార్గంబునందు నాగడప లెగసె
నంబుధరమాలికలు దక్షిణంబు నడచె.

క॥ ఉఱుము మెఱుము మూలగాడ్పులు
నఱచి పిడుఁగొచ్చె మదనసంహారుదెసఁ గ్రొ
మ్మెఱుఁగుద్భవించెఁ గప్పలు
గఱుఁజఱు గఱువఱుగ యనుచు గట్టున నఱచెన్.

సీ॥ తూర్పుఁగ లాడఁజొచ్చె; దిక్కు ధూళి భ్రమింపఁగఁజొచ్చెఁ; బిచ్చుకల్
నీరాని యుబ్బె; గబ్బిలముఁగు పగటికి రాత్రికిఁ గ్రొత్తెఁ గొమ్ముపై
నాన యవశ్య మింక ఁహంవాసరముల్ జడివట్టు నంచొగిన్
వానికి వాని కాడిరి వచోరణఁ బౌరులు కంచిలోపలన్.

హర. ౨. ౧౫, ౧౬, ౧౭.

ఇంద్రచాపము ప్రాక్పశ్చిమదిశలలోఁ బొడసూపుచుండును. దిశాభేదమునుబట్టి ఫలభేద మొదవుచుండును. ఈ యింద్రధనుస్సును క్షేమమండలిలోనివారు మొండికొఱవి, లేక మొండికొడవలి యని వాకొందురు. ఈయింద్రచాపము పశ్చిమమునఁ బొడచూపిన నది విశేషవర్షారంభసూచకము. తూర్పునఁ బొడచూపిన వర్షాభావసూచకము. దీనినిగూర్చి పాలికులలోఁ బ్రసిద్ధమయిన యొక నానుడి గలదు. 'తూర్పున మొండికొఱవి వేస్తే పశువులను తుంగబీడులో కట్ట వచ్చు. పడమట మొండికొఱవి వేస్తే పశువులను బండతాళ్ళమీఁద కట్టవలె' నని. తూర్పున నింద్రచాపము పొడిచిన జలప్రాయమయిన తుంగబీటిలోఁ బశువులను గట్టినను వానికి వర్షమువలనిబాధ యుండ దనియు, పశ్చిమమున నింద్రచాపము పొడిచిన పశువుల నెత్తయినచోట బండతాళ్ళమీఁదఁ గట్టవలె ననియు కృషీవలుల నిశ్చయము. నిశ్చయముమాత్రమే కాదు. అనుభవముకూడ నట్టిదియే. కాంచిలో నిరువదియొక్కరోజులు కుంభద్రోణముగఁ గురియఁదలఁచిన వర్షవిశేషమున కిది యొక విశేషసూచకము.

ఇట్లులనే చంద్రునకుఁ బరివేషము చుట్టుట (చంద్రబింబము చుట్టును గుడికట్టుట)యును వర్షారంభసూచకమే. చంద్రునకు పరివేష మేర్పడినపుడు తెలుఁగునాఁటివారు "దూరముగ గుడికట్టినపుడు దగ్గఱ వానలు, దగ్గఱగా గుడికట్టినపుడు దూరపు వానలు" అని వాకొందురు.

ఆకసమున ఆగడపలు లేచుటయు విశేషవర్షారంభసూచకమే. "ఆకాశము ఆగడపలు వేసినది. వర్షము తప్పక వచ్చు"నని భీమునదరి వారు ఈనాఁటికి ననుకొను పరిపాటి గలదు. ఆగడపలు లేచుట యనఁగా ఆకసమునందు మేఘఖండములు దొంతులుదొంతులుగ నేర్పడుట. ఆకసమునం దాగడపలు లేచినపుడు వర్షము విశేషముగఁ గురియుటయుఁ బ్రసిద్ధమే.

ఆనాఁడు కంచిలో ఉఱుము ముఱిమి మూలగాడ్పులు విసరెనఁట. మఱియు నీశాన్యదిశయందు క్రొమ్మెఱుఁ గుద్భవించెనఁట. కప్పలు జలాశయతీరమునం దుండి 'గఱవఱ గఱగఱ' యనుచు నఱచిన వఁట. ఇవి యన్నియు గాలివాన వచ్చు ననుటకు సూచకములు.

శ్లో. "విద్యు దుత్తర పూర్వాయా మమోఘా మారుతోఽథవా" ఉత్తరదిక్కునకుఁ దూర్పుదిక్కునకు నడుమ నుండి—అనఁగా ఈశాన్యమునుండి మెఱుపుగాని వాయువుగాని బయలుదేఱిన వర్షము తప్పక వచ్చుననుట. గ్రీష్మవర్షర్తువులలోఁ బశ్చిమము నుండియు, శరదృతువునఁ దూర్పునుండియు, హేమంత శిశిరములలో నుత్తరము నుండియు, వసంతమున దక్షిణమునుండియు వాయువులు వీచుచుండును. అట్లు గాక ఈశాన్యమునుండి గాలి వీచుట జలోత్పాతసూచకము. కడచిన వత్సరములలో 1945 అక్టోబరు (ఆశ్వయుజ మాసము) న ఈశాన్యమునుండి గాలి విసరి, భీమమండలి నంటి యున్న సముద్రము పొంగి, ఉప్పెన వచ్చినది. అట్లు మూలగాలి విసరుట యారంభమైనంతనే ఇక్కడికి (కాకినాడకు) ఆఱుక్రోసుల దూరములో నుండిన తాళ్ళరేవు అను గ్రామమున నివసించు నొకజాలరి

ముగుసలి "మూలగాలి విసురుతోంది. ఎక్కడనో ముంచివేస్తుంది" అని హెచ్చరించినాఁడు. సముద్రమున నావలపైఁ బయనించుజాలరు లిట్టిసూచనలు చేయుచుండుట పరిపాటియే. ఆజాలరి యట్లు హెచ్చరించిననాఁటిరాత్రియే గాలితో వర్షారంభముకూడ నేర్పడి, క్రమముగ రెండును హెచ్చి, సముద్రపుముప్పొంగి తుల్యభాగానదీముఖమున నేల మీఁదికి సరుసు వచ్చి, సముద్రతీరమునందలి భీమమండలీప్రాంతము జలమయ మయినది. కావున మూలగాలి విసురుట జలోత్పాతసూచక మనుట తెలుఁగునాఁట ప్రసిద్ధమయిన విషయమే. ఇటులనే ఈశాన్యమున మెఱపు మెఱసినఁ గూడ విశేషముగ వర్షము కురియుటయుఁ బ్రసిద్ధమైనవిషయమే. కప్పలు గట్టుమీఁదున నుండి 'గఱవఱగ' యనుచుఁ గూయుటకూడ వర్షాసూచక మగుటయేగాక, ఈధ్వన్యనుకరణమున శ్రీనాథునిరచనలో గప్పకూఁతలు ప్రతిధ్వనించినవికూడ.

తూనీఁగ లాకసమున నాడఁదోడఁగుట, సుడిగాలిచే ధూళి యాకసమునఁ దిరుగఁజొచ్చుటయు సామాన్యముగ వర్షాసూచకములు. పిచ్చుక లుబ్బుట, గబ్బులుఁగు (చాకలిపిట్ట) మాటిమాటికి కొమ్మమీఁదినుండి కూయుటయు విశేషవర్షారంభసూచకములు. గాలిమబ్బు పట్టునపుడు సాధారణముగా సుడిగాలి రేగుచుండును. కావున సుడి గాలి రేగుట గాలితోఁగూడిన వర్షమువచ్చుటకుఁ బూర్వరంగము. గబ్బులుఁగు-అనఁగా గంపపులుఁగు-అని కొందఱు నైఘంటికు లనినారు. కాని దీనిని భీమమండలివారు 'చాకలిపిట్ట' యని యందురు. ఇది వర్షము రాకపోకలను దెలుపు శకునపక్షి. ఇది చాతకజాతికి సంబంధించినది. ఇది యేవైపునుండికూసిన యావైపునఁ బంటలు పండునని యిచటి కర్షకుల నమ్మిక. ఈ పిట్ట తెల్లవాఱుజామునఁ గూసిన వర్షము కురియుననియు, పగటివేళఁగూసిన విశేషముగ నెండ కాయు ననియు నీ మండలిలోని యభిజ్ఞులయాశయము, అనుభవమును. ఏది యెట్లయినను దీనికూఁతమా

త్రము వర్షారంభసూచకము. ఇట్టిసూచన లన్నియుఁ జూచి కంచిలోని జను లీఁకఁ జాలదినములు జడివాన కురియు నని యానోట నానోట నాడుకొనఁజొచ్చిరి.

ఆనాఁడు కంచిలోని జ్యోతిష్కులు కూడ గ్రహగతిఁ బరికించి, పై విషయమునే స్థిరీకరించిరఁట.

చ॥ గ్రహసిద్ధాంతకళావిదుల్ సలిలనక్షత్రంబు నీహారరు
క్సహవాసంబున నభ్రవీథిఁ బరివేషస్థాయియై యుండుటన్
బహువర్షంబిటఁ గల్గునంచుఁ దమలో భాషింపఁగాఁ గంచిలో
గృహమేధుల్ భయమంది రింధనతృణక్లేశంబు చింతించుచున్.

గ్రహసిద్ధాంతకళ నెఱిఁగిన జ్యోతిష్కులు, సలిలనక్షత్రము (పూర్వాషాఢ యని యందురు) చంద్రునితోఁగూడి పరివేషమునఁ (గుడిలో) బడియుండుటచే నీఁకఁ జాల వర్షముఁ కురియునని తమలోఁ దాము వాకొనిరి. ఆ పలుకులు వినిన కాంచీవాసులగు గృహస్థులు కట్టెలను కసవునకు శ్రమపడవలసివచ్చు నని భయపడఁ దొడఁగిరి. జడివాన నట్టిసూచన లేర్పడిన నేకాలముననైన ముందుగ శ్రమజీవులు క్లేశము నొందుదురు. ఆవెనుకఁ బాడిపంటలు గల గృహస్థులు వెతఁజెందుదురు. వర్షములు లేకుండినఁగాని, మిక్కిలిగ వర్షము గురిసినఁగాని కృషీవలులకే ముఖ్యముగ లాభనష్టము లధికము. కావున నట్టివారలకు వర్షములను గూర్చినచర్చ యావశ్యకము. ఆలుబిడ్డలతోఁ గూడిన గృహస్థులకుఁ బాడిపంట లత్యావశ్యకములు. పాడిపంటలకు పశుసమృద్ధి నాంతరీయకము. వర్షము లధికముగఁ గురియు వేళలో నెండుకట్టెలు లభింపకున్న వంటలు కొనసాగవు. అందుచే మునురుపట్టు నవిన సంపన్న గృహస్థులకు మొదటిది యింధనసంపాదనక్లేశము. వర్షము లధికమయినఁ బశువుల కిటునటు దిరుగుట కవకాశములేనపుడు పాడిపంటలు గల గృహస్థునకు గ్రాసచింత. ఇది యానాఁడేకాదు. ఈనాఁడును

పాడిపంటలు గల కృషీవలగృహస్థు లీజడివానలకు జడియవలసియే యుండును.

చిఱుతొండనిభక్తి పరీక్షించుటకై కంచిలో నానాఁడు కురిసినది కుంభవృష్టి. చెలరేగినది గాలివాన. అందుఁ బాల్గొన్నవి పుష్కలావర్తకాది మేఘములు. అవి సంకెలలు వీడి వచ్చి, సముద్రములోని నీరు పానముచేసి కారుకొనినవి. ఆమేఘములు తటిదాఘాతము లను కొరడాదెబ్బలు తిని నొచ్చి చెలరేగినతీరున గర్జింప మొదలుపెట్టినవి. ఇంద్రధనురాడంబర మాకసమునఁ దోరణకట్టి నట్లయినది. బకములుద్రేకించి పార్శ్వముల నడుచుట రక్షకభటులు బారులు దీర్చినట్లుండెను. మేఘములు కారుకొనినపుడు మెఱయుట ఉఱుముట కొంగలు బారులుతీరుట యనునివి సహజములే యయినను వాని కొక రూపకల్పనము చేయుట వినోదజనకమై వానివాని యతిశయము నెఱిఁగించినది. ఇట్టి యలంకారభూషితముగ విషయనివేదనము చేయుటలో శ్రీనాథుని ప్రతిభ విలక్షణమై కానవచ్చును.

ఆకసమునుండి తొలఁగుచినుకలనుండి యొకవిధమయిన తావి పుట్టినది. ఆపరిమళము భూమిమీఁదఁ బడినచినుకులనలనఁ బొడమిన కమ్మనిసుగంధముతోఁ గూడి, యాఘ్రాణించువారి ఘ్రాణేంద్రియములకే కాక చిత్తంబుల కాహ్లాదంబు నాపాదించినది. వర్షారంభమునందు గ్రీష్మతప్తమైన నేలమీఁదఁ జినుకులు పడినఁ గమ్మనితావి పొడము ననుట యందఱ కనుభవవేద్యమే. కాని యానాఁటిపరిమళము నాసాద్వారమునఁ జిత్తమున హత్తుకొనునంతటిది రేగిన దనుట విశేషము.

పర్వతశిఖరములందు శిలాతలముమీఁద వడగండు లొకటిపై నొకటి పడఁగాఁ గ్రేంకారము లుప్పతిల్లినవి. అట్లు వడగండ్లు పడుట విద్యున్నటీనాట్యారంభమునఁ బూలదోసిలి వెదఁజల్లుతీరును బోలినది. ఈపోల్చుట యెంతయుహృద్యోదాత్తమై శ్రీనాథునినాఁడు నాట్యకత్తెలు

నాట్యారంభమున పుష్పాంజలిని జిమ్ము పరిపాటి యుండె ననుటను జ్ఞాపింపఁజేయుచున్నది. కంచిలో నానాఁడు కాఱుకొనిన మబ్బు ఖండ పరశుకంఠమునఁ జేరు కాలకూటవిషమషీరసమును బోలియుండినది. అట్టి కాఱుమబ్బులవలన వెలువడిన వర్షధారలమూలమున నేళ్లు పూళ్లు నేకమై భూవలయమంతయు నేకార్ణవ మైనదఁట. వర్షము కుండలపోఁతగను కుంచముపోఁతగను కురిసెనఁట. వర్షమత్యధికముగఁ గురియు నప్పుడు తెలుఁగువారు నేఁటికి నిట్లు వాకొనుట గలదు.

వర్షముతీవ్రత యింతటితోఁ బోలేదు. పిడుగులుకూడఁ బడఁ జొచ్చినవి.

చ॥ తటిదభిఘాతవేగమున ధారలు జోరని కుర్యుచుండఁగాఁ
బిటిలు పిటిల్లనం బ్రిదిలి వ్రేలిపడం దొడఁగెం జతుర్దిశా
తటముల మండుచుం బిడుగుతండము కాంచిపురీజనంబు హృ
త్పుటములు జల్లన న్మఘవపుత్రుని పేళ్ళు పదిం జపింపఁగన్॥

ఈపద్యము నడకలో జోరుగ వర్షము కురియునప్పుడు, పిడుగులు పడునప్పుడు వెడలు ధ్వని ప్రతిధ్వనించుచున్నది. దీనిలో నకాల వర్షారంభ లక్షణములు సూచితములైనవి. సాధారణముగా పిడుగులు పడునపుడు జోరుగ వర్షము కురియుచుండవలయును. వానిపాటునకు ముందు పెద్దగ మేఘగర్జితము, అట్టి యుఱుమునకు ముందు తీవ్రమైన మెఱుపులుండుటయు సహజము. మెఱుపులేనిదే పెద్దగ నుఱుముటగాని, ఉరుము లేనిదే పిడుగు పడుటగాని యుండవు. అట్లు పెద్దగ చప్పుడగు నప్పుడు, పిడుగుపాటునకు భీతిల్లువారు సంప్రదాయము నెఱిఁగియుండినచో నింద్రసుతుండైన యర్జునుని పదిపేళ్లను జపింతురు. పిడుగు పడునపుడు తెలుగునాఁటివారు జపించు నామము లివి :—

శ్లో॥ అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః
బీభత్సో విజయః కృష్ణః సవ్యసాచీ ధనఞ్జయః॥

జ్రతించినాఁడు. "పాము వ్రేలఁగట్టినభంగి, నింగి యవిసి కాఱినచందం బున, సముద్రము వెల్లి విరిసినలీలగా, బలంబు తెఱచినవడువున" వర్షము కురియఁగా ఇంద్రగోపములయాటోపము వానపాముల విహారము, కప్పల యఱువుభేరీధ్వనులు, తాఁబేళ్ల యుద్రేకము, విరానముల యుల్లాసము చెలరేగి మెట్టపల్లములు సమానములై తోఁచవచ్చినవి.

ఇంద్రగోపములను ఆరుద్రపురుగు లని యందురు. ఇవి వర్షా సమయమునందు గుంపులు గుంపులుగాఁ దలచూపి యంతలో సంతరించుచుండును. వర్షాసమయమును వర్ణించుపట్టులందు సామాన్య ముగా నింద్రచాపమును ఇంద్రగోపమును రంగమునకుఁ దీసికొనిరాని కవి యుండఁడు. శ్రీనాథునకు వెనుకటివాఁడును శైవకవివతంసుఁడు నైన నన్నెచోడుఁడు షడృతువులను వర్ణించుచు, వానిలో వర్షావర్ణనమును గొంత యధికముగను మధురముగను గొనసాగించినాఁడు. ఒక్క పద్య ములో నీయింద్రగోపేంద్రచాపముల సొరును చిత్రించిన తీరు కనుఁ గొందము.

ఆ॥ సురపగోపచాపశోభితంబై యుండె
నవపయోదవేళ దివియు భువియు
దెసలు దీటుకొనఁగఁ దృణఘననివహంబు
ఛన్నమయ్యె మఱియు మన్నుమిన్ను.

—కు. సం. ౬. ౧౦౨

వర్షారంభసమయమున భూమి ఇంద్రగోపములతోను, ఆకాశము ఇంద్రచాపములతోను శోభిల్లుచుండెను. ఆసమయమున భూమియందు తృణసమూహము ఆకాశమున మేఘసమూహము ఆవరించియుండెను, ఇట్లు తృణఘనవిజృంభణమును జంటగఁ దెలిపియు వేఱువేఱుగ మధుర వర్ణ్యవస్తుసామ్యమును చిత్రించి పెట్టినాఁడు. కనుఁగొనుఁడు :—

క॥ వలిగాడ్పుల ముసుసులమెయి
చలిగొని ధాత్రీపురంధ్రి పదిఁ బచ్చనికం
బలిఁ బొదివికొన్నవిధమున
బొలుపుగఁ బచ్చరువు గప్పె భూతల మెల్లన్.

చల్లనిగాడ్పులోఁ జలిచే ముసుగులమూలమున భూమియను సతి చలిచేయుటచే పచ్చనికంబళి యను నాకుపచ్చరి కంబళి గప్పుకొనిన ట్లుండెను. వర్షారంభమైనంతనే పచ్చగడ్డి నేలనంతయు నలముకొనును. భూమిపై పచ్చని కంబళి కప్పినట్లు తెరపిలేకయుండును; దాని కవిరాజశిఖామణి యుత్ప్రేక్షగ నూహించినాఁడు. ఇటులనే మేఘాడంబరమునుగూడ రమ్యముగఁ జిత్రించినాఁడు.

గీ. ధర నిదాఘవాతాహతి నెరియకుండ
దివి దమాలమంటపము గావించె ననఁగ
నొప్పె నీలాభ్రపటల మచ్చుప్పరమున
రాటలన నెల్లదెస వానకాళ్లు లమరె॥

ఆకసమం దంతటను నల్లనయిన మేఘపటలము కాఱుకొనినది. అది గ్రీష్మవాయువు తాఁకుటచే భూమి నీటలువాఱకుండ దైవము తమాలమంటపము గావించినట్లు లుండెను. ఆమేఘములనుండి దిగిన వానకాళ్లులు ఆపందిలి నిలుచుటకు వేసిన రాటలవలె నొప్పినవి. మేఘములనుండి క్రిందికిఁ బొడవైన స్తంభములవలె నల్లని మబ్బుతునకలు వ్రేలాడుచుండును. వానిని వానకాళ్లు లని యందురు. అవి యేర్పడి నపుడు వర్షము కురియును.

వర్ష మత్యధికమైనప్పుడు మిక్కుటమైన జలములో జలజంతువుల విహారములు గానవచ్చుచునే యుండును. కాని యెంతటివర్షము కురిసినను మొసళ్లు క్రీడించుట నదీనదములలోఁ గాక నగరములలో సంభవించుట యతిశయోక్తి కావలయును. కాంచిలో బయలుదేఱినది

...ట్టు వెల్లువలో కాని, యుక్తముగాదు. అందును వసంతక్రీడనంబును వర్ణించినాఁడు. వసంతాగమసూచకముగా పుట్టగొడుగులు లేచుట, తుమ్మిపుష్పధూళి దిక్కుల నలముట, ఇంద్రగోపములు చెలరేఁగుట, మొదలగు విషయము లన్నియు నెంతయు స్వాభావికముగ జిత్రింపఁబడినవి. శ్రీనాథుఁడు గావుననే యీ వర్ణనము నింత సహజాంగస్వభావ భరితముఁ జేసినాఁడు.

భీమేశ్వరపురాణము — వసంతఋతువు

వసంతోదయ మైనంతనే ప్రకృతిలో నూతనవికాస మేర్పడును. వసంతునిఁ జూచినను తరులతాగుల్మాదులు పల్లవపుష్పభరితములై, విహంగమకలకలారావముఖరితములై ప్రాణిమాత్రమునకు హృదయోల్లాసము నొదవించును. అట్టి యామనిసొగసు పరికించినంతనే సహృదయుల హృదయములు నూతనభావభరితము లగును. రసికకవివరుల యెడందలలో ఋతువికాసముతోపాటు కల్పనలు నవలెత్తును. శ్రీనాథుఁడు రసికకవిశేఖరులలో నగ్రేసరుఁడు. అతఁడీ వసంతవిలాసము నెట్లు కొనసాగించెనో పరికింతము.

భీమనాథుఁడు దక్షారామమునఁ బ్రతిష్ఠితుఁడై యుండ, దేవత లందఱు నాతనిఁ గొలువవచ్చిరి. అక్రమమున దక్షిణకాశీనాథునిఁ గొలుచుటకై ఋతుచక్రవర్తి యగు వసంతుఁడు కుసుమవిసరము కానుకఁ గొంచు వచ్చెను. అతనిరాకతో సచటి సురపొన్నలు సంపెంగలు పూచినవి. అది యెంతయుఁ జిత్రముగఁ గానవచ్చినది.

సీ॥ కమిచె సురపొన్న వనలక్ష్మికబరిమీఁద
సంతరించిన ముత్యాలజల్లి వోలెఁ
బూచె సంపెఁగ లారామభూమియందుఁ
గుసుమనారాచు చిచ్చుఱకోల వోలె॥

భీమ. ౫. ౬౩

హృదయమునందలి పరిణయావేశము ప్రియావిరహ దుస్సహము. అట్టి దుస్సహావిప్రలంభమున కీపుష్పవికాస ముద్బోధకము. నాగకేసర వృక్షశాఖలకుఁ బొడవయిన కాడలవంటి చిన్నయుపశాఖలు బయలుదేఱి నవి పూలగుత్తు లేర్పడియుండును. అట్టిపూవు లాకృతిలోఁ దోఁకచుక్కలను బోలియుండుటచేఁ గవి యట్లు పోల్చినాఁడు. ఆపూవులపై మూఁగిన తుమ్మెదలు మీఁదికెగయుట ధూమమును జేయుట కీడయి యుండును. నాగకేసరపుఁ బూవునకుఁ గేసరము లధికముగ నుండును. దానియాకృతి పడగపైకెత్తి చుట్టఁ గొనియున్న సర్పమును బోలి యుండును. కావున నాపూవులకు నాగకేసరము లనునామ మేర్పడి యుండును.

వసంతసమయమున నాసవమానువారికి వివిధాసవములు సమృద్ధముగ లభించును. దక్షారామమునందలి యచ్చరలు పుష్పాసవములానుచు భీమనాథుని హిందోళమునఁ బాడి కొనియాడి రఁట.

శా॥ సంపూర్ణాగ్ర చంద్రమండలశిఖిజ్వాలాతటిద్వల్లరీ
కందర్పోత్సుకశాసనాచ్యుతతనూగంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమవాటికుంద సుమనోమైరేయముల్ ద్రావుచున్॥

కైలాసవాసి మహేశ్వరుఁడు భీమనాథుఁడై దక్షారామమునఁ బ్రతిష్ఠితుఁడైనపుడు, దేవేంద్రుఁ డాప్రభువునకు భీమమండలిని ధారాదత్తముచేయుచు, నాతనిసేవకై "వారవధూత్రిశతీద్వయంబు" నర్పించి యున్నాఁడు, వారినే శ్రీనాథుఁడు గంధర్వవంశోద్భవలయిన యచ్చరలఁ జేసినాఁడు. బాణుఁడు కాదంబరిలో మహాశ్వేతచేఁ జంద్రాపీడునకుఁ దన జన్మవృత్తాంతమును దెలియఁజేయునపుడు గంధర్వకులములు పదునాలుగుగా లెక్కింపఁజేసినాఁడు వానిలోఁ గొన్నిటి నీపద్యమున శ్రీనాథుఁడు జతఁగూర్చినాఁడు. క్షీరసముద్రమునుండియు, చంద్ర

మండలమునుండియు, అగ్నిజ్వాలలనుండియు, మొఖపూఁదీఁగలనుండియు, మన్మథుని చెఱకువిల్లునుండియు, విష్ణుని శరీరమునుండియు, జన్మించిన గంధర్వవంశజ లిందుఁ జేర్కొనఁబడినారు. పని వచ్చినపుడు బాణుని రచననుండి విషయములు గైకొనుటలో శ్రీనాథున కాదర మధికము. ఇపుడు వసంతహిందోళము పాడువారు అచ్చరలు; గావున, వారికి సుమనోమైరేయములు ద్రావి పాడుకొనుట కనువుపడునటులు, దక్షారామమునకైతే మింద్రునిచే స్వర్గమునందు సమకూడు మందారకుసుమ వనవాటి నాఁటించి, శ్రీనాథుఁడు వారిచేఁ బాటలు పాడించినాఁడు. భీమ మండలిలో సినాఁటికిని దేవళములందు వసంతోత్సవములు జరుగుట, తత్తదధిష్ఠాన దేవతల మ్రోల వేశ్యాంగనలు పాటలు పాడుటయుఁ బరిపాటిగనే యున్నవి. మైరేయము లానెడియక్కఱ కూడ నక్కడక్కడఁ గానవచ్చును.

అప్పుడు విహంగమరుతములు కూడ వింతలు గొల్పినవి.

మ॥ అళికోలాహలసంభ్రమంబును శుకవ్యాజృంభముల్ శారికా
కులసల్లాపములున్ విహారవిపినక్షోణీవిభాగంబునన్
గలపుంస్కోకిల కంఠకోమలకుహూకారప్రపంచంబుతోఁ
దలఁపించెన్ రతికాంతమూలరథినీధాటీసమారంభముల్॥

వసంత ముదయించినంత నే యారామములన్నిటిలోఁ బల్లవపుష్ప వికాసములతోపాటు విహంగమకలరవములు కూడఁ జెలరేఁగును. వానిలోఁ గొన్నిటికలస్వనములు మదనపారవశ్యము గలిగించునవి. అట్టి కలకలారావములు దక్షారామ పురోపవనవీథులలోఁ జెలరేఁగినవి. అవి—తుమ్మెదల కోలాహలములు, చిలుకల పలుకులు, గోరవంకల సల్లాపములు. ఇవన్నియు కలపుంస్కోకిలకంఠకోమలకుహూకారముతోఁ జతగూడినంతనే రతికాంతుని మూలసైన్యము దాడివెడలెనా! యను యనిపించెనఁట. అళిశుక, శారికల కలకలము విరహిసమూహములకుఁ [illegible]

వినవచ్చును. కాని కలహంసాక్రాంతకంఠకోకిలల కుహూకారము విని వచ్చుట వసంతోదయమున మండినదే అదియే వలరాజదాడికి మొదటి గుఱుతు. దానిని విని విసుతము బ వశీకృతమగుట మన్మథుని ప్రధాన సైన్యము దండువెడలుటగా జక్రిచేయుట యెంతయుఁ జమత్కృతిజనక మైనవిషయము.

ప్రకృతిసౌందర్యచిత్రణమున శ్రీనాథుని దృష్టి కడు నిశితమైనది. అతఁడు కడుసూక్ష్మములైన విషయముల నెన్నిటినో మనకన్నుల యెదుటఁ బెట్టును. ఉడుతలు చెట్లకొమ్మలమీఁద చెరలాడుచుండుట సహజమైనవిషయము. కాని దక్షారామ పరిసరారామములలో దానిమ్మ చెట్లు పగిలినపండ్లను గైసేసి యుండఁ, దన్మధ్యమున నుడుతలు గూండ్లు కట్టుకొని క్రీడించుచున్నవఁట. తరులతాగుల్మాదుల మొలతేరిన చిగుళ్లు తామ్రచూడచూడాతామ్రములై (కోడిజూలువలె నెఱ్ఱనై) మదనసామ్రాజ్యసంపదను మాటిమాటికిఁ దెలుపుచున్నవి. కిసలయ రాగమునకు తామ్రచూడచూడారాగము నుపమానముగాఁ గల్పించుట యెంతయు సహజమునగను సూక్ష్మదృష్టి సమన్వితమునగను సముకూడి నది. వసంతమునఁ దరువు లన్నియు సాధారణముగాఁ బుష్పించును, పూలచెట్లు క్రొత్తపూలలోని మధుపానము చేయుటచే నేర్పడిన హర్షముచేఁ బుష్పించి నూతనలావణ్యముతో నెసఁగారినవఁట. నూతన కుసుమాసవపానమున హర్షమూలకమగు పుష్పవతీత్వము, తస్మూలమున నూతనలావణ్యలాభము నెంతయు ధ్వనితము.

పరంటిపోటలలోఁ గొత్తగ నరంటియాకులు లేచినవి. అవి వనదేవత కమర్చిన తాలవృంతములపగిది నెసలారినవి. ఆరామపరిసరములలోని పనసపండ్లను పెజాలు గాటిన ఫలరసము కాల్వలుగట్టి వన విభాగమును బురదచేయుచున్నది. ఇది యతిశయోక్తి కాదు, మేలి,

ఆయామనివేళ వసంతోత్సవములోఁ బాల్గొనిన దేవతలు గంధర్వులు, భీమనాథుని యంతఃపురమునందలి యుద్యానములో సహకారతరువులఁ బూజచేసిరి. అచట లలితమైన శృంగారరచనలు గావించిరఁట కర్పూరముతోను కస్తూరితోను కోటను నిర్మించిరి. కుంకుమపుష్పద్రవముతో శిఖరముఁ దీర్చిరి. ఈనిర్మాణమునకు అగురును బెందడిగా నుపయోగించినారు. పన్నీటిప్రవాహముతోఁ గందకము నేర్పఱిచిరి. పవడపుఁ జిగుళ్లతో ద్వారము లేర్పఱిచి, పద్మదళములతో బోరుతలుపు లెత్తినారు. రత్నఖండములతో రంగవల్లిఁ దీర్చి, పట్టువస్త్రములతో జెండాల నెగురవేసినారు. ఇట్టి శృంగారరచన, ఆమనివేళ బహుళశోభాభరితమైన సహకారమునకుఁ బూజ శ్రీనాథునినాఁడు పరిపాటిగ నుండనోపు. కాని యిట్టి చేత యీనాఁ డంతగఁ గానరాదు.

మఱియు నానాఁ డీవసంతోత్సవములలో వనితలు కూడఁ బాల్గొని, నాయకునిపై జెఱుకువిండ్లను మోపెట్టి పుష్పబాణముల నేయుటయు నుత్సవమున కొకయంగ మైనట్టులు గన్పట్టును.

చ. అనువగుఁ గౌనుతీఁగ లసియాడఁ బయోధరముల్ వడంకఁగాఁ
గనకమరాళకీరకలకంఠమయూరరథాధిరూఢలై
వనితలు భీమనాయకుని వారక యేసిరి కమ్మఁదేనియల్
చినుకు పసిండిలేఁజెఱుకుసింగిణివిండ్లను బుష్పబాణముల్.

వనితలు కొందఱు బంగారుహంసలు చిలుకలు కోయిలలు నెమిళ్లు రథములుగాఁ జేసికొని, వాని నధిరోహించి, లేక ఆపతంగముల యాకృతులు గల రథముల నెక్కి, బంగారు లేఁతచెఱుకుఁగఱ్ఱలవిండ్లనుండి పూబాణములను భీమనాయకునిమీఁద వేసిరఁట. [illegible]గోవాణము చేసినప్పుడు వానికద లికచే నానసతిలయంపమయిన కౌ[illegible]ఁగ లసియాడినవి. పయోధరములు వణఁకాడినవి. అట్టియవయవసౌష్ఠవము గల వనిత లాచెఱుకువిండ్ల నెక్కుపెట్టి పుష్పబాణములు విసిరినా రనుట, మన్మథుఁడు చెఱుకువిలుకాఁడు

పూవుటమ్ములు గలవాఁడుగావున వసంతోత్సవాంగముగా నీక్రియా కలాపము నడచినది. ఇట్టులే మఱియొక చంచలాక్షి, బంగారురథమునకు మీఁదిభాగమున శిఖరముపైఁ గీలించిన కాంచనపత్త్రపద్మము దుద్దు పనుమ నిలుచఁబడి, చిత్రగతిని నర్తనముసేయుచు, దేవశిఖామణి యగు భీమనాథుని బుష్పబాణములతో సగౌరిగ నేసినట్టు లీ క్రింది పద్యమునఁ జిత్రించినాఁడు. ఇది యప్పటినాట్యభంగిమతీరును దెలుపును.

ఉ. చంచలనేత్రి హేమరథసౌధశిరోగ్రహకూటకోటిపైఁ
గాంచనపత్త్రపద్మమునఁ గర్ణికమధ్యమునందు నిల్చి వి
ర్వంచన నేసెఁ గంకేళి జకిన నర్తనచిత్రవిలాసలీల న
ర్తించుచుఁ బుష్పబాణముల దేవశిఖామణి భీమనాథునిన్.

అంతట భీమనాథుఁడు వసంతకేళివిహారములు జరుపుట కాజ్ఞ వాటించి, దేవతాశ్రేష్ఠులకు నుత్సవానుకూలమగు గంధకర్పూరకస్తూరికాదివస్తువుల నొసఁగ నియమించెను. అప్పు డప్పురియందలియంగనాజనంబులు జిలుగుచెంగావిరంగు చీరల దాల్చి, కుంకుమపరిమళమును మై నలఁదికొని, వలిముత్యములు జోడించినభూషల నలంకరించుకొని, అందమైన కొప్పులలో మొగలిరేకులు చెక్కికొని దేవతాచకోరాక్షులు భీమనాథుని సేవింప వచ్చిరఁట. దక్షారామమునందలి చకోరేక్షణలు వలరాజు గెలిచిన పెద్దకాలపువేల్పగు భీమనాథుని గూడ వలపింప నేర్చిన వారలు. భీమనాథుఁడు రాజశేఖరుఁడై యాజ్ఞ వాటించినంతనే యావనిత లొక్కుమ్మడిగ నాతనిఁ గొల్వవచ్చి రనుటలో వారల విహారప్రియత్వము వ్యక్తమగుచున్నది.

వ. అప్పు డప్పురంబున నంగనాజనంబులు—

మ. జిలుగుంజెంగావన్నె చేలలును గాశ్మీరాంగరాగంబులున్
వలిముత్యంబులభూషణంబులును భాస్వత్కేతకీపత్త్రికా
విలసద్వేణులుఁ జొక్కమై మెఱయఁగా వేల్పుంజకోరేక్షణల్
లలి భీమేశ్వరు రాజశేఖరునిఁ గొల్వ న్వచ్చి రొక్కుమ్మడిన్.

భీమ. ౪-౧౦౪.

రాజశేఖరుఁడైన భీమనాథుని యాజ్ఞను బాటించి యీయుత్సవమునఁ బాల్గొనుటకు బయలుదేఱినవారు ఆపురమునందలి, అనఁగా దక్షారామమునందలి యంగనాజనంబులు. వారలావెంటనే వేల్పుంజకోరేక్షణలైనారు. కారణమేమన శ్రీనాథునిదృష్టిలో దక్షారామమునందలి విలాసినులందఱును చంద్రునితోఁ గల్పవృక్షాదులతోఁ మున్నిటినుండి వెలువడిన విబుధగంధర్వజాతులవారే గాని మనుష్యమాత్రులు గారు. అట్లయినను శ్రీనాథుఁడా వేల్పుంజకోరేక్షణలచేనైనను తెలుఁగు చెంగావి చీరలు ధరింపఁజేసి, కాశ్మీరపరిమళము నలఁదించి, ముత్యాలభూషణము లలంకరింపఁజేసి, జడలలో మొగలిఱేకులు చొప్పింపఁజేసినాఁడు. జానపదస్త్రీలోకలభ్యములగు నలంకారము లమరింపఁ జేసినాఁడే. ఏది యెట్లయినను శ్రీనాథునికాలమునాఁటి విలాసినుల వస్త్రాంగరాగాలంకారములతీరు మాత్రము ఈపద్యమందు వ్యక్తమయినది. మఱియు నానాఁడు రాజులు వసంతోత్సవమున కాజ్ఞాపించుట, పురజను లాతని యాజ్ఞ పాటించి, వస్త్రాభరణాదులు గైసేసి విలాసినీప్రధానముగ నందుఁ బాల్గొనుట యిట సూచితము.

పిమ్మట నావసంతోత్సవమునఁ బాల్గొనుటకు విఘ్ననాథుఁడు పాతాళభైరవుఁడు వీరభద్రుఁడు బ్రహ్మాదిదేవతలు, ఇంద్రాద్యష్టదిక్పాలకులు వారివారిసతులతోఁగూడ వచ్చిరి. నికుంభకుంభోదరాదీశ్వరపరివారములు, సురగరుడోరగకిన్నరాదిదేవతాగణములు, సముచితంబుగఁ గైసేసి వచ్చిరి. పరమేశ్వరుఁడు కనుసంజ్ఞచేసినంతనే విలాసినులు సుగంధద్రవ్యములగు కస్తూరి కర్పూరము మంచిగందము మున్నగు వానిని దేవతలపై విసరఁజొచ్చిరి. క్రమముగ నేతులతో నూనెలతో పసుపుకుంకుమము చెందిరము కుసుమరజము మున్నగువానిని మేదించి, వనితలు పురుషులపైఁ జల్లఁదొడఁగిరి. ఆచల్లులాటలో వావివరుసలు మాత్రము పాటింపఁజొచ్చిరి. పురుషులలో విఘ్నేశ్వరుఁడు తుండ

ముత్తో గాత్రమిూజలము పూరించి వదలుచు పతలోలముగ దొరకున సట్టులు విహారము సేయఁదొడఁగెన. ఈవిధముగ వివిధవిహారములచే వసంతోత్సవారంభము త్రిభువనదృక్ప్రియతమం బయ్యె నని శ్రీనాథుఁ డెంతయు వింతగ వసంతోత్సవము దక్షారామమున నెఱపినాఁడు. ఈయుత్సవమునందలి పరిపాటు లెన్నియో యిప్పటికిని దక్షారామ పరిసరమునందు జరుగు దేవతోత్సవములలోఁ గానవచ్చుచు నే యుండును.

భీమేశ్వరపురాణములోఁ గొనసాగిన యీవసంతోత్సవముఁ బాల్గొనినవారు దేవతలు దేవతాపురంధ్రులే యయినను, అం దుపయోగించిన సుగంధద్రవ్యములు మున్నగువవి మాత్రము శ్రీనాథుని కాలమున అనఁగా 15 వ శతాబ్దిని కుమారగిరిరెడ్డి (వసంతరాయబిరుదాంకితుఁడు) నెఱపు వసంతోత్సవములో నుపయుక్తము లైనవియే. వానినే హరవిలాసకృతిభర్తయయిన అవచి తిప్పయ్యసెట్టి, నౌ లపై ద్వీపాంతములనుండి గొని తెచ్చియిచ్చుచుండెడివాఁడు. రాజమహేంద్రవరము రాజధానిఁగాఁ బాలించు వీరభద్రారెడ్డియు మార్కండేయ స్వామికి వసంతోత్సవము నెఱపు నాఁడీసుగంధద్రవ్యము లుపయోగించి నట్లు క్రిందిపద్యము తార్కాణించుచున్నది.

మ. కలపుంస్కోకిలకంఠకోమల కుహూకార స్ఫురత్పంచమ
స్థలదధ్వన్యములైన కాలముల మార్కండేయనాథేశ్వరున్
లలితక్రీడల వీరభూపతి వసంతం బార్చునవ్వేటి వీ
థుల కర్పూరహిమాంబుసంకుమద కస్తూరీపటీరంబులన్.

కా. ఖ. ౧-౫౯

వాని నీయుత్సవమునం దతిమాత్రముగ నుపయోగించినారఁట. అవి కృష్ణాగురు కుంకుమపువ్వు కర్పూరము మున్నగునవి. ఉత్సవావసానమున కావసువు లెట్టి వింతలు గొలిపినవో శ్రీనాథునినోటనే విందము.

మ. అగురుం గుంకుమధూళియుం దమిసంధ్యారాగసంస్పర్శముం
గగనాభోగము సంధ్యకాలము వలెం గాన్పింప, నాభంగికిం
దగియెం జుక్కలు వోలెఁ బాండవగణాధ్యక్షుండు తుండంబున
న్నగయుం జల్లిన సప్తసింధుజలవేణీబిందుసందోహముల్.

భీమ. ౫-౧౧౯

కృష్ణాగురువు చీకటివలె, కుంకుమద్రవము సంధ్యారాగమువలె ఆకాశప్రదేశము సంధ్యాకాలమువలెఁ గాన్పింపఁగా, దానికిఁ బాండవగణపతి తుండంబుతో నెత్తి మీఁది కెగయఁజిమ్మిన సప్తగోదావరీ జలబిందుసందోహము చుక్కలవలె నెసలారినవి. ఇది యొక మధుర కల్పన. ఆయుత్సవమునఁ గుంకుమము అగురు మున్నగునవి యతి మాత్రముగ నుపయోగింపఁబడె ననుట కిది యొకనిదర్శనము.

ఈతీరున శ్రీనాథుఁడు ఋతుచక్రవర్తి యయిన వసంతము నభివర్ణించుచు, ప్రకృతిలోఁ గానవచ్చు వివిధవికాసములను, వాతప్రసారమును, విహంగముల కలరవములను, దేవతోత్సవపరిపాటిని, అందుఁ బాల్గొనెడి విలాసినుల విలాసములను, భీమమండలిలోని జనుల యుత్సాహావేశములను వివరించుచుఁ గావ్యమును మధురము నొనర్చినాఁడు.

కాశీఖండము—శరదృతువు.

అగస్త్యుడు లోపాముద్రతోఁ గూడి, దేవతాప్రార్థమునఁ గాశినుండి పయనమై వచ్చి, వింధ్యాటోపము నణఁగించి, గోదావరినొరసి కొనుచు నాంధ్రదేశమునఁ దిరుగాడుచుండ శరదృతు వవతరించెనఁట. ఈఋతువునకు సంబద్ధముగఁ జేసిన శ్రీనాథుని ప్రాకృతికచిత్రణ మంతయు భీమమండలికి సంబంధించినదే. కావుననే "కుంభసంభవుండు గోదావరి నొరసికొనుచు నాంధ్రదేశమున నరుగునప్పుడు" అని యుపక్రమించి శరదృతువును బ్రవేశపెట్టినాఁడు. ఇచట మూలమగు సంస్కృత కాశీఖండములో:—

శ్లో. గోదావరీతటంష్టోరమ్యం విచరన్నపి వై మునిః
స తత్యాజ చ తం తాపం కాశీవిరహజం ముహుః.

అని గోదావరీతటమున నగస్త్యమహాముని సంచరించినట్టు లొక్క శ్లోకము మాత్రమే యుండఁగా, దాని నుపశ్రుతిగఁగొని యామహర్షిని ఇరువది మూఁడు గద్యపద్యములనడకలో భీమమండలియంతయుఁ దిరిగించినాఁడు. ఆప్రకరణమునంవతికించుచు నిట్టులనినాఁడు.

గీ. కుంభజుఁడుదక్షిణాభిముఖుఁడగుటయు
నదను వీక్షించి వచ్చెనో యనఁగ వచ్చె
శంబరారిప్రతాపాగ్ని సామిధేని
నవశరద్వేళ శ్రీభీమనాథుఁ గొలువ.

కాశీ. ౩-౨౦

కుంభసంభవమహాముని దక్షిణదిగభిముఖుఁడయిన యదను చూచుకొని వచ్చెనో యనునట్టులు, మన్మథప్రతాపాగ్నికి సామిధేనీమంత్రిము (జ్వాలావృద్ధికరమయినమంత్రిము) వలె, నూతనశరత్కాలము భీమనాథుని గొలుచుటకై వచ్చెను. శరత్కాల మారంభమగునంతనే దక్షిణమున నగస్త్యోదయ మగుచుండును. దీనిని దెలుఁగునాఁటివారు 'చుక్కపొడుపు' అని వ్యవహరింతురు. ఇది దక్షిణదిశయందే పొడ చూపును. ఈవిషయ మీపద్యమున వ్యక్తము యినది. మఱియు శర ద్వేళను సూర్యచంద్రాతపములతోపాటు మన్మథుని ప్రతాపముగూడ పెరుగును. ఆవిషయము కూడ నిందుసూచితము.

శరత్కాలారంభమునకు మేఘములు కంభవృష్టి వెలయించి దిక్కులందలి జిగురుతోఁగూడిన రజమును (ధూళిని) గడిగి మలయజము (మంచిగంధము) వలెఁ దెల్లదనమును గలిగియుండును. అట్టివేళ దిక్కు లన్నిటను సూర్యుని వేఁడిమి చూపట్టును. వర్షాసమయమున సూర్య

మండలము మేఘావృత మగుటచే సూర్యునివేఁడిమి గాని యెండగాని కానరాదు. శరదారంభ మయినంతనే మేఘావరణము పోయి ప్రభా కరునివేఁడిమి గానవచ్చును. ఈవిషయము నీక్రిందిపద్యమున శ్లేషమూ లకారోపముతోఁ జక్కఁగఁ జిత్రించినాఁడు.

సీ॥ జిగురుకొన్నరజస్స్నాన్ర్తిఁ జెరగు మాసి
జలదకుంభోదకంబుల జలకమాడి
మలయజాచ్ఛపయోధరమండలలగు
దిగ్వధువులందు శుచిఁ బ్రవర్తించె నినుఁడు.

దిక్కులనెడి స్త్రీలు, జిగురుగిట్టిన ధూళిస్ఫూర్తిచే చెరఁగుమాసి, మేఘములనుండి పడిన కుంభోదకములతో స్నానముచేసి, మంచి గంధమువలె స్వచ్ఛమైన మేఘమండల మనెడి మంచిగంధపు పూతఁ బూసిన పాలిండ్లు గలవై యుండ వానియెడ సూర్యుఁడు శుచితోఁ బ్రవర్తించెనఁట. ఈపద్యమునందు చెరఁగుమాసిన వధువులు జలకుంభ ములతో స్నానముచేసి, స్తనముల మంచిగందపుఁబూఁత కైసేసి కొనినపుడు ధవుఁడు శుచితో సంగమించుట ధ్వనితమగుచున్నది, ఇందు రజోదర్శనమునఁ జెరఁగుమాసిన నాఁటి యువతులు కుంభోదక ములతో స్నానముచేసి, మలయజచర్చచేసికొనినఁ బరిశుద్ధులగుదు రను నాఁటిపరిపాటియు సూచిత మగుచున్నది.

శరదృతువునందు శ్రీమహావిష్ణువు భుజగశయనమునుండి మేల్కాం చును. కావుననే శరదృతువునందలి కార్తికశుద్ధైకాదశిని ఉత్థానైకాదశి యని యందురు. ఆనాఁడు లక్ష్మీనారాయణులకుఁ బూజగావింతురు. విష్ణువు శేషతల్పమునుండి మేల్కాంచుట శరదృతువునందుఁ గాన నాదృశ్యము నీప్రసంగమునం దిట్లు చిత్రించినాఁడు.

# ప్రకృతి వర్ణనలు - ఆంధ్ర వాఙ్మయము

రచయిత : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము, యమ్. ఎ.

(విహంగావలోకము)

౧

మానవకల్పితము కానిదంతయుఁ బ్రకృతి. ఇది సత్యము శివము, సుందరము నైనది. నవనవోన్మేషణ మైనది. నిత్యోత్సవసత్య మైనది; 'లలితావలోకన స్నేహజ లీలావ్యతికలిత' మైనది. ఆనందోపలబ్ధి నాసించు ప్రతిమానవునకుఁ బాథేయమైనది. తా ననుభవించు నానందము నక్షరరమ్యముగ లోకమునకుఁ బంచిపెట్టు కవులకీ ప్రకృతి నిత్యోపాసనాదైవ మైనది. అంతియేకాక ప్రకృతిదేవి తన నిజస్వరూపమును, భావప్రఫుల్లమును, కమనీయము నగు కవీశ్వరవాగ్విలసనములఁ దెలిసికొని లోలోన మురిసి మురిసి పోవును. అందువలననే "ప్రకృతి పరిణేతల్ కవుల్" అను నార్యోక్తి.

అది బహుయుగయుగాంతములనాఁటి మాట. విమల బ్రహ్మధీనత రమించు ఋషిపుంగవు లుద్గీథముగ ఋక్సామములఁ జెప్పుచు నానంద తనూతారుణ్యరోచనముతోఁ బ్రత్యక్షమైన యుషాదేవి కిట్లంజలించిరి.

"లోకమునకు లోచనమ్ము
లోలచిత్రలోచితమ్ము
నాలోకింపు ముషస్సును
తమోభుగ్నకుటీప్రాంగ
ణముల కవాటములఁ దెఱచె;
తిరోధానమైన జగము
తెర దొలఁగించిన దదిగో !!
విశ్వమ్ములు మేలుకొల్పి

వికసించిన దుషాదేవి !!!"
అనారతము రోదసినే
అవలోకించుచు నుదయమ్మయి
సర్వము వ్యాపించె
యతివ యీామె యుషఃకస్య !!
ఉదయమై మంజుల
వరోజ్వలాంబరము ధరించి
ఉన్నతురా లీమె వెడలు
చున్నదదో కనుంగొనుము !!!
బంగరుపూఁతలతో నా
యంగన యందజిహ్వాదయము
పొంగించుచు వారిలోన
రంగరించు జీవరసము"

—(విద్వాన్ విశ్వం)

"ఇట్లే వీ రీ చిన్మయమైన యరుణతేజమును శైశవనైర్మల్య మధురహాసముగను, మాతృదేవీ ప్రేమార్ద్రవీక్షణముగను, ముగ్ధ కన్యాభిజాత్యముగను, నుషస్సూక్తుల నాలపించిరి. ఏమి యీ యార్య ఋషుల ప్రకృత్యుపాసనా తత్పరత! మహోన్నత భావుకతాశబలత! ఇట్టి వర్ణనములు ఋగ్వేదమున నతి వ్యాప్తములు. కవినామము నిజమున కీ ఋషిపుంగవులయందు సార్థకత భజించుకొనుటచేతనే 'నానృషిః కురుతే కావ్యమ్' అను నార్యోక్తి యీ దేశమునఁ గలిగినది.

౨

వైదిక ధర్మమును జన సామాన్యమున కందుబాటు గావించుటకు వెలసినవి యితిహాసములు. ఇందుఁ గథాకథనమే ప్రధానము. అయినను వాల్మీకి కోకిలాలాపములలోఁ బ్రకృతి వర్ణనలు పదపదమునఁ

ప్రతిధ్వనించినవి. అందలి నాయికా నాయకులకుఁ బదునాలుగేండ్లరణ్య నివాసమగుటచే నాయా ఘట్టములఁ బ్రకృతికిని, కథకును నవినాభావసంబంధ మేర్పడినది. "తం దృష్ట్వా మృత్యు సంకాశం, తీక్ష్ణ దంష్ట్రం మహాభుజమ్, ప్రాద్రవన్ గిరిసంకాశం భయార్తా వన దేవతా:" అని సీతాపహరణసందర్భమునఁ గవి, ప్రకృతి దేవతలు కూడ రావణుని చర్యను జూడలేక పరువెత్తిపోయినవని యుదాత్తముగ వర్ణించినాఁడు. తా నపహరింపఁబడుచున్న వార్తను రామున కందఁజేయుఁడని సీతాదేవి మాల్యవంతపర్వతమునకును, గోదావరీ నదీమతల్లికిని, వన దేవతలకును మ్రొక్కుకొన్నది. రావణాపహృత యగు సీతయెడలఁ బ్రకృతి చూపిన సానుభూతి పరికింపుఁడు.

"నళిన్యో ధ్వస్త కమలా స్త్రస్తమీనజలేచరాః
సఖీమివ గతోచ్ఛ్వాస మన్వశోచంత మైథిలీమ్ !!"

క్రూరాక్రూర మృగములుఁగూడ నాస్వాధీమతల్లిని విడలేక యామె నీడ ననుసరించి పరుగు లెత్తినట్లు చేసిన యీవర్ణన మమూల్యము; అతి లోకసుందరము !!

"సమంతాదభిసంపత్య సింహవ్యాఘ్రమృగద్విజాః,
అన్వధావం స్తదా రోషా త్సీతాం ఛాయానుగామినః!!".

సీతావియోగశోకోపహతుఁ డగు శ్రీరాముఁడు తన యర్ధాంగిని గూర్చిన వార్తను తెల్పుఁ డని చెట్టుచెట్టును బుట్టబుట్టను ప్రార్థేయపడెను. ఈ తీరునఁ బ్రకృతివర్ణనలు రామాయణేతిహాసముతోఁ దాదాత్మ్యమును బొంది కవివర్ణనావైశారద్యమును బ్రస్ఫుట మొనర్చినవి. భరతుఁడు శ్రీరాము నయోధ్యకు మరలించుకొని పోఁదలంపుతో రానున్న సమయమున శ్రీరాముఁడు చిత్రకూటపర్వత పరిసరశోభారామణీయకమును సీతకు వర్ణించుపట్ల వాల్మీకి చూపిన వర్ణనావైదగ్ధ్యము నవనవోన్మేష మైనది. రామాయణమునందువలె మహాభారతమునఁ బ్రకృతి

వర్ణనల కీతివృత్తముతోడి విలీనత గాంచము. అందులకు హేతు వా మహేతిహాసకర్తలలోను నితివృత్తములోను గలదు. వాల్మీకి వ్యాసుని కన్న లోకోత్తరమైన కవితాహృదయసంపత్తి గలవాడు. వ్యాసుఁడు మాపు గొన్న విజ్ఞానసర్వస్వము. తత్కాల చరిత్రమును లిఖించి ధర్మసమన్వయము గావించుటయే యాతని ముఖ్యకర్తవ్యము. అయినను 'సౌగంధిక పుష్పాపహరణా'ది సందర్భములఁ బ్రకృతిశోభ ప్రత్యక్షసుందరమే !!

3

కవికులగురు వగు కాళిదా సాదికవి యగు వాల్మీకిని సేవించి ప్రకృతివర్ణనానైపుణ్యమున నతనివలె సిద్ధహస్తుఁ డైనాఁడు. కుమార సంభవకావ్యమున హిమాలయవర్ణన మనితరసాధ్య మైనది. స్థాణ్వాశ్రమ ప్రాంతమున నకాలవసంతాగమనవర్ణనము చరాచరచేతనములకు రతిక్రీడాభిప్రేరణను గల్పించు సమర్థ మాట మహాకవికిఁ దప్ప, సాధారణకవులకు సంప్రాప్తింపని శిల్పము. శకుంతలరూపకమునఁ బ్రకృతివర్ణనలు కథతోఁ బ్రకృష్ట సంబంధము కలవి. పాశ్చాత్యకవిపండితులను గూడ నానందపరవశముఁ జేసిన దీ మహాగుణమే. శకుంతల ప్రకృతిచే రక్షింపఁబడి, ప్రకృతిలోఁ బెరిగిన ముద్దు బిడ్డ. తన జీవితానందమును బ్రకృతిలో ముడివెట్టుకొన్న ముగ్ధ. తన లతాదులకు నీర మిడక, తన శాబకముల కాహార మందీయక యామె యెన్నఁడును దనపొట్ట నింపుకొనలేదు. ఏమి స్వార్థరాహిత్యము !

శకుంతల యత్తవారింటి కేఁగుసమయమున వనమంతయుఁ గానుక లర్పించి సంతుష్టి నొందుచున్న విధానము చూడుఁడు:—

"క్షౌమం కేనచి దిన్దుపాండుతరుణం మాంగల్య మావిష్కృతం
నిష్ఠ్యూతశ్చరణోపభోగసులభో లాక్షారసః కేనచిత్,
అన్యేభ్యో వనదేవతాకరతలై రాపర్వభాగోత్థితై
ర్దత్తాన్యాభరణాని తత్కిసలయోద్భేదప్రతిద్వన్ద్విభిః"

ఇంగుదీతైలముచే గాయము మాను పట్టించుకొన్న హరిణ శాబకము శకుంతలను వీడిపోఁజాలకున్నది. శకుంతలావియోగభారమున

"ఉద్గళితదర్భకబళా మృగాః
పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రాః
ముంచన్త్యశ్రూణీవ లతాః"

మృగములు తినుచున్న దర్భలను విడలి వేయుచున్నవి. మయూరములు నర్తించుట మానినవి. పండుటాకులు రాల్చు లతలు కన్నీటిబిందువులు రాల్చుచున్నట్లున్నవి. కణ్వుని కంఠము స్తంభించినది. తపోవనము చింతాభారముచే నాక్రందన మొనర్చుచున్నది.

ప్రకృతి నిట్లు దృశ్య మొనర్చుట కాళిదాసునకే చెల్లినది. ఒక్క ఉత్తరరామచరిత్రమందు దీనిప్రతిబింబములు కానవగునేమోకాని మఱి యేయితర సాహిత్యమునందును గరుణరస మిట్లు ప్రకృతినుండి ప్రవహింపలేదనుట యత్యుక్తి కాదు. అసలు కాళిదాసు బాల్యమునుండియుఁ బ్రకృతి పరిశీలన వతత్పరుఁడు. అందువలననే తొలుత ప్రకృతి వర్ణనలే కావ్యవస్తువు గావించి "ఋతుసంహారము"గావించినాఁడు. అనంతరము ప్రకృతికిని మానవప్రకృతికిని నవినాభావమును గూర్చి భూలోక స్వర్గలోకముల రససేతువును నిర్మించినాఁడు. ప్రకృతిని వస్తువునకును నభేదాధ్యవసాయము కల్పించుటయందే కవిప్రతిభ భాసిలును. కావ్య వస్తువుతోఁ దాదాత్మ్యము నందని ప్రకృతివర్ణనలు పేటికాంతర్గతములగు రత్నహారములను బోలినవి మాత్రమే. ముద్రారాక్షసరూపకమున రాక్షసుఁడు జీర్ణోద్యానమునఁబ్రవేశించి చేసిన వర్ణనము కథాతాదాత్మ్యమందిన యుత్తమవర్ణనము. ఇట్టివి సంస్కృత వాఙ్మయమున ననేకములు:—

౪

ఋషితుల్యుఁ డగు నన్నయ ప్రకృతివర్ణనాతత్పరతను రెండవ వాల్మీకి. ప్రణవనాదమువలె గంభీరమును, అక్షరరమ్యాను నగు నతని ప్రకృతివర్ణనము లత్యంతమధురములు. ఆతని "శారదరాత్రులు"ఆంధ్రీకి వాహ్యాళిసమయములు. ఈతనివర్ణనలు కథాగమనమున కవిరోధములు, కొన్నిప్రసన్నకథాకథనమునఁ బరితః కుద్దీపనమును గల్గించి, భావ్యర్థసూచనముల నిచ్చునవి. ఉదాహరణము:-వేఁటకువచ్చి, కణ్వమహర్షి యాశ్రమ ప్రాంత మని తెలిసికొని యామహానీయుని దర్శించు కుతూహలముతో వచ్చుచున్న దుష్యంతునికి లతాలలన లిచ్చిన స్వాగతము—

"అతిరుచిరాగతుం డయిన యాతనికిఁ హృదయ ప్రమోదమా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ
ర్జితకుసుమాక్షతావళులు సేసలువెట్టినయట్టిరెరి సం
పతదళినీ నినాదమృదుభాషల దీవన లొప్పనిచ్చుచున్!! "

లతాలలనలు కుసుమాక్షతలు చల్లినవి. తుమ్మెద లాశీర్వచనములు పల్కినవి. తన్మూలమున దుష్యంతున కచిరకాలమున రానున్న శకుంతలా పరిణయ మాంగళ్యము చక్కఁగ సూచింపఁబడుచున్నది.

శత శృంగపర్వతమునఁ బత్నీ సమేతుఁడై పాండురా జున్న సమయమున 'నఖిల జీవలోకానంద జననంబును'ను 'సర్వభూత సమ్మోహనం' బయిన వసంతాగమనము మూలమున లేనిదానిని గల్పించి పాండురాజునకు మన్మథోద్దీపనమును గల్గించుటలో నన్నయ ప్రకృతివర్ణనమునఁ దనకున్న యుపజ్ఞను బ్రదర్శించి యాంధ్ర మహాభారతమునకుఁ గావ్యధర్మముల నాపాదించినాఁడు.

సోమయాజి ప్రకృతి వర్ణనము లత్యంత నిశితములు. విరాటపర్వమున నతఁడు గావించిన సూర్యోదయ సూర్యాస్తమయాది ప్రకృతి ర్ణనలు తరువాతి కాలమునఁ బెంపొందిన విపుల ప్రబంధ వర్ణనా

విధానములకుఁ బ్రాతిపదికములై నవి. సూర్యోదయము నీ కవి భావిం
చిన విధాన మెంత పవిత్రమో పరికింపుఁడు.

సీ॥ నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన
భవ్య తపంబున ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహర బ్రహ్మ మహానుభావంబు లొ
క్కటి గాఁగఁ గరఁగిన గుటికయనంగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకంద మనఁగ
నఖిల జగముల కన్నైర యగుచు జనస
మాజకరపుట హృదయ సరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె॥

ఇట్లే సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు కాముకచిత్త
ప్రవృత్తి కనుగుణముగ భావనాచమత్కృతి కాలవాలములై ప్రబంధరీతి
కొఱవడి దిద్దు చున్నవి.

క॥ ఇనుఁడు దనకడకు నేతెం
చినరాగముఁ బొందు టది యుచిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జనసంభావనముల గారవ మందెన్॥

సీ॥ నలువ చెందొవలరేకులకు నన్నువెట్టఁ
గోరి కావించిన గుళిక యనఁగ
"నఖిల ద్విజశ్రేష్ఠ మగు చకోర చయంబు
తపము సముల్లసత్ఫల మనంగఁ

బూర్వపయోరాశిపొంతఁ గెంజాయచె
న్నొందవిన పవడంపుఁ బొద యనంగఁ
జిగురుజొంపము నను జిగి యొప్పు నుదయాద్రిఁ
బొలుపారు నవకల్పభూజ మనఁగ.
నరుణరుచి తనమండల మతిశయిల్లఁ
బొడిచి దివిఁ బ్రాకి దీధితు లడరఁజేసి
యంతకంతకు నెక్కుచు సంతమసముఁ
గాలుకొననీక చందుృఁడు గ్రాలె నధిప".

అల్పాక్షరముల నిట్టి యనల్పభావోపేతముగ నుత్ప్రేక్షించుట తిక్కన యట్టి కవి బ్రహ్మకే తగును.

కీచకునికాముకప్రవృత్తి కనుగుణము లగు వనశకుంతముల విహారవర్ణన మాతని నుద్రేకింపఁ జేయునదియై రసపోషణమున కెట్లుపక రించుచున్నదో తిలకింపుము.

"ఇంపైన ప్రియ శాన నిచ్చి నిల్చిన మధు
వాదట నాను మత్తాలివిభునిఁ
జెట్టుప ల్పచరించి చుట్టుఁగ్రమ్మఁజె మనో
రమ నియ్యకొలుపు మరాళవిభుని
ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నిచ్చు
మెయినఁ జొక్కెడు శుకమిథునములను
గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయిమెయిఁ
దాకంగఁ జను పికదంపతులను"

ప్రకృతినుండి చక్కని యుపమానములఁ గైకొనుటలోఁ దిక్కన కాళిదాసుఁ డంతటివాఁడు.

నన్నిచోడునికుమారసంభవమునఁ గల యనేక ప్రకృతివర్ణనలు సంస్కృతాధారములు. అటనట స్వోపజ్ఞజనకములును గలవు. కాళి

దాహుని పార్వతి "సంచారిణీ పల్లవినీ లత". ఈతని పార్వతి "పుష్పిత జంగమలతల నడిమి కల్పలత", కవికులగురు వగు కాళిదాసుని సైతము మురిపింపఁ గల ప్రకృతి వర్ణనా నైశారద్య మతని కపరియత్నలబ్ధ మని యన్నందుల కీ క్రిందిపద్యము పరిపల నిదర్శనము.

సీ॥ మొన లావులించి వాసన నల్ల జసిగొని
తేఁటిగము లెంగిలింపకుండ
నెడ సూటిగొని వేచి సుడియు తెమ్మెరలచేఁ
బాడము పుప్పొడి వాలిపోవకుండ
తరణి కూటమున మేవొరలి పద్మినిమేన
మొలతెంచు మధుమద మొలుకకుండ
మేల్కొని గోమిని మెలఁగి, మైముఱిసిన
బోదిగొన్నయకరువుల్ సెదరకుండ
తే॥ వెలిసి ఒక్కవలాంటొంటి గలయఁదారు
కలకలంబున రేకులు గదలకుండ
మున్నకొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిడితామరల వరదు"

ఇట్టి వా యా పట్టుల ననేకములు. గజక్రీడలు, వేటాముటలు వర్ణించుటలో నీతఁడు సిద్ధహస్తుఁడు.

శివకవులలో నుత్తముఁ డగు పాల్కురికి సోమనాథుఁడు, సునిశితమైన ప్రకృతి పరిశీలనము కలవాఁడు. సంస్కృతవాఙ్మయపు వాసన నంటనీయక, కోడికూఁత నెట్లీ కవి వర్ణించెనో పరికింపుఁడు.

"తొలికోడి కనువిచ్చి నిలచి మై వంచి
జలజల ఱెక్కల నడలించి నీల్గి
గ్రక్కునఁ గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకలు చక్కొల్పి, కడుపు
లెక్కించి మెడసాచి నిక్కి మిన్నూచి
'క్కొక్కొరోకుర్' అని కూసె"

ప్రబంధకవుల కుకక్కారములు ప్రకృతి పద్యములు కాక వారి మస్తిష్కజన్యము తోట దీనిలోని సహజ సౌందర్య మందుఁ గొఱఁతపడును.

పాల్కురికి సోమన్న చూపిన సహజ మగు తెనుఁగు శక్తికా మార్గమునఁ గోనబుద్ధారెడ్డి తన రామాయణ మధురగానము గావించి నాఁడు. చంద్రవర్ణనమం దెట్టి నిరాడంబరసహజభావోపేతమో!!

"పాలు పొంగు కలువలపోరాసి విందు
కలసిన జక్కవకవఁ బాపు మందు
పాలవెల్లిని దచ్చి పడసిన వెన్న
శృంగారమోదలపువ్వు చుక్కలనవ్వు
నెఱి చకోరములకు నెలనెలపంట
యుఱవేఁడి విరహుల నుడికించు మంట
హరిహర బ్రహ్మల యానందదృష్టి
సరసిజరిపుఁ డైన చంద్రుండు పొడిచె."

ఈ మార్గ మిట్లుండ, నాంధ్ర వాఙ్మయాంబరమున "స్ఫురదరుణాంశు రాగరుచి" వలె నెఱ్ఱాప్రగడ యవతరించెను. కథాకథనమునకు రంగభూమిగ విపుల మగు ప్రకృతి వర్ణనములఁ గావించి యాతఁడు ప్రబంధ పరమేశ్వరత్వము నందినవాఁడు. భారతారణ్యశేషమునే కాక నృసింహపురాణాదులయందును నీతఁడు తన ప్రకృతివర్ణనావైశారద్యమును బ్రకటించి, వానికి కావ్యత్వ మాపాదింపఁజేసినాఁడు. రసోచంచిత మగు నీ వర్ణనము నిజముగఁ గవితామలయమారుతము వీచిన స్వాంతరంగమునకు హాయి గొల్పుచున్నది.

చ॥ "ఇవె చనుదెంచెఁ జైత్రుఁ డని మల్లవనంబులకుం బ్రమోదముల్
పొదలఁగ మేలివార్తగొని బోరన వచ్చిన దాడికాఁ డనన్
మృదువన దేతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవగ దక్షిణానిల మనూనమనోహరశీలనంబునన్".

కోశములోని పదము లన్నియు నొక్కచోఁ జేర్చి కూర్చినట్లు వృక్షజాతుల నన్నిఁటిని సమీకరించి పద్యము లల్లెను. వానిని మున్నతనుగు ప్రకృతి వర్ణనము లనఁజాలము.

ఉ॥ అందుఁ దమాల, మాల, వకు ళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా
కందుక చందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లి కా
కుంద మధూక మంజులనికుంజములం దనరారి వెండియున్.

ఇట్టి వాంధ్ర వాఙ్మయమున నితరకవులయందును లెక్కకు మిక్కిలిగాఁ బొడఁగట్టును. "ఇట్టివిగూడ ప్రకృతివర్ణనలే యైనచో వస్తుగుణదీపిక నుత్తమ మగు ప్రకృతివర్ణనాగ్రంథముగ నెన్నవలయును" నను రామలింగారెడ్డిగారి హాస్యోక్తి మఱువరానిది.

పెద్దన, తిక్కనాదులమాట య టుంచి ప్రబంధకవులప్రకృతి విధాన మంతయు నొక్క యచ్చునఁ బోసినయట్లుండు నని స్థూలముగ నూహింపవచ్చును. ప్రబంధకవితాపితామహుఁ డగు నల్లసాని పెద్దన హిమాలయ పర్వతములఁ గొంత తన మనోవీథిని జిత్రించుకొని వర్ణింప నారంభించెను. అవి పెనుగొండ పరిసరముల వర్ణనలని పెద్దలయభిప్రాయము. "తుహిన భూధర శృంగ శ్యామల కోమల కానన హేమాఢ్యదరీ ఝరీనిరీక్షాపేక్ష"తోఁ బ్రవరుఁ డరిగెను. అచ్చో "ఉల్లలదలకాజలకణ, పల్లవితకదంబముకుళపరిమళలహరీహల్లోహలమదబంభర, మల్లధ్వను లెసఁగ మరుదంకురములు" విసరెను.

..................................

..................................

దృగ్విదాహచ్ఛిదావినిద్రాణమదవ
దంజనాలానమూలశయ్యావిధాన
తోరణాధోరణాకల్పితోరుశోణ
మృత్తికారాశియో యన" సంధ్య మెఱసెను.

సూర్యబింబము సాయంకాలము రక్తవర్ణమ దాల్చెననుటకుఁ బ్రవరుఁడు వరూధినీవాంఛితముఁ దీర్పక వంతలఁ బడఁదోసి పోవుటచేఁ గల్గు నాగ్రహమే కారణముగా వర్ణించిన యీ పద్య మౌచిత్యముచే విరాజితము. నిక్కమునకుఁ బ్రకృతివర్ణన లిట్లు కావ్యపాత్రలతోఁ బ్రకృష్టబంధములు గల్గి యలరారవలయును.

"తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్"

సాయంతన సమయముల రాయలతో మృగయావినోదముల సందర్శించు పట్లఁ బరికించిన ప్రకృతి నెట్లు వర్ణించుచున్నాఁడో గమనింప నగు నీ పద్యమున.

శా॥ "శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బక్షు; లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె; మృగతృష్ణావార్ధు లింకెన్; జపా
శోణం బయ్యెఁ బతంగబింబము; దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె; సరోజషండములు నిద్రాణంబు లయ్యెన్ గడున్"

చంద్రునిలోఁ గనంబడు నీలిమను గవులు పెక్కురీతుల వర్ణించిరి. పెద్దన గావించిన యీ క్రింది కల్పన మపురూపము. ఇట్టి వర్ణనలు కొన్ని పెద్దన్న పెద్దతికమును నిలఁబెట్టుచున్నవి. అందులకు ముఖ్యహేతు వా వర్ణన లితివృత్తముతోఁ బెనవేసికొని యౌచిత్యముతో నట్టివడుచుండుటయే

చ॥ "మరున కొసంగఁ గాలము తమశ్ఛట కాటుకగా నహోదయ
స్ఫురదరుణప్రభాపథికశోణితసిక్తసితోడుభుక్తముల్
హరిహయదిఙ్నభస్స్థలమునన్ బలి చల్లి వటాంకముల్ వసూ
త్కరజటితంబునన్ వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.

ముక్కుతిమ్మనార్యుని ముద్దుకవితాలత, ప్రకృతి సౌందర్యసౌరభవిభాసి తము. శ్రీకృష్ణుఁడు సత్యభామకు మేరువును వర్ణించి చెప్పుటలోఁ బాత్రో చితమైన వర్ణనాప్రాగల్భ్యము సుప్రకటితము.

సీ॥ జీర్ణపర్ణద్రుమ సంకీర్ణహిమమణి విభా
మాయాకిసలవంచ్యమానసికము
శశికాంతరుచి మృషాసలిల సంక్షాళన
శ్లథవిషాణోద్విగ్నసైరిభంబు
గోమేధిక ప్రభాంకూర మిథ్యామధు
ద్రవలిలిక్షామిళద్భల్లుకంబు
నీలగండప్రస్తరాళీకగజభేద
శీర్యన్నఖక్షుబ్ధ సింహకులము"
తే॥ "గారుడాశ్మచ్ఛవిచ్ఛటాకపటయవస
పూలికాచర్వణవ్యగ్ర బాలమృగవి
లంఘ్యమానాబ్జరాగశిలావితాన
కూటదావాగ్ని యదె మరుత్కుధర ము॥.

ఇంతటి రమణీయ భయంకరమైన మేరువునందు సంచరించు చెంచెతల నెంతటి తేటమాటలతో వర్ణించెనో!

"వంచనఁబొంచి చేరవకు వచ్చిన చంద్రుని జింకసేసి హ
ర్షించియుఁ దత్సుధారసనిషేచనచే నని చావకున్కిఁ బ్రే
క్షించియు నేటుదప్పె నని చే విలు సమ్ములుఁ బాఱవైచి ల
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరిసానుభూములన్."

"సాయంకాల వర్ణనలు", "చంద్రికా విహారములు", "సూర్యాస్తమయాది వర్ణనములు" మనోజ్ఞమధురములై ముక్కుతిమ్మనార్యుని ముద్దుకైతకు ముచ్చటైన యుదాహరణములే కాని యీ వర్ణన లితి

"కలఁచున్ నీలమయంపుఁ దల్లి యొఱదాకం జేటనీ రొప్పు ర
థ్యాలకూపంబుల మీఱఁ జూచి, వలభీవ్యాసంగితుంగద్రుశా
ఖలలో నుండి గుభాలునన్ లకుముకుల్ క్రందై పడన్, లేచుమూ
ర్ఛిలి గేహేందిర దాగివిడీపరిచితిన్ జెందాడు చందంబునన్."

కవికి నుండదగు సూత్ప్రేక్షా శక్తి, పారము ముట్టిన ఓ సాహితీ సమ రాంగణ సార్వభౌమునిలో.

మాఱుమూలలఁ గల ప్రకృతి స్వభావములఁ జిత్రించుటలో నీతని కీర్తైన కవి వాఙ్మయమున లేఁ డనవచ్చును. (1) మేడిపండు లోనికి వర్షపు నీరెక్కినపు డందుండి దోమల పంక్తులు వెడలుట. (2) మాలదాసరి కథలోని వటవృక్షవర్ణన—అందున మఱ్ఱియాకు లను బురుగులు కొట్టివేయఁగా నేర్పడిన గీఱల వర్ణన, (3) కుల్యాంతర ములలో నిద్రించు జాతువుల వర్ణన, ఇంకను నిట్టి వనేకములు "రవి గానవిచోఁ గవి గాంచునేకదా" యను సూక్తిలోని సత్యమును నిలువఁ బెట్టుచున్నవి. కాని వీనికిఁ గథతో నేమాత్రము సంబంధము లేకపోవు టచేఁ బ్రథమశ్రేణికిఁ జెందిన వర్ణనలుగాఁ బరిగణించుటకు వీలుపడదు.

ప్రబంధ కవులలోఁ బింగళి సూరన ప్రకృతి వర్ణనలయందును దన సార్థక్యమును జూపెట్టినాఁడు. ప్రతి వర్ణనము సతఁడు చక్కని ధ్వని మయముగను, కథా ప్రకృష్టసంబంధిగను కూర్చి తన విశిష్టతను ప్రదర్శించెను.

"విలసితవీచికాయత రవిప్రతిబింబమిషంబునన్ మహా
జలనిధి లక్ష్యపార్శ్వచయచక్రిపయిం జెయిచాచి యొప్పు సం
ధ్యలఁ బురలక్ష్మిధర్మవిధు లన్నియు నొజ్జలపుచ్ఛకాయగా
వలయు విడండతందు రసవత్పరిఖామిష బాహుబంధమున్"

అను నీ సముద్రవర్ణనము భావికథ కంతకును సూచ్యార్థసూచికగా నొప్పుచున్నది.

మః॥ స్తంభోదు సుముఖాస త్రికిఁ జూపుచుఁ జేయు సముద్ర వర్ణనము, అందు తిమింగల శిరోరంధ్ర ప్రసంగము తరువాతి కథ యగు నలఘువ్రతుని చరిత్రయం దతని భార్యలు తిమింగలముచే గ్రసింపఁబడి లీరిగి దాని శిరోరంధ్రమునుండి చిమ్మఁబడిన నీటిలోఁ బడి గగనమున కేగియుట ప్రాతిపదికము. అంతియే కాక ప్రకృతకథలో విరాగ దంపతులను సరాగులుగ మార్చుట కుద్దీపనము. ఇట్టి వర్ణనములే నిజముగకు సార్థకములు. కవికిఁ గావ్యమునకుఁ జరితార్థదాయకములు.

"ఒక విషయమునుబట్టి చూచిన సరస్వతీ చతుర్ముఖ విలాసము వంటి ఘట్ట మాంధ్రమున నెక్కడను లేదు. ఏ విషయ మనఁ బ్రకృతిని పాత్రముల జీవితముతోఁ గలసినట్లు వర్ణించుట" యను రామలింగారెడ్డిగారి వాక్యము సత్యసమ్మతము.

తరువాత నాంధ్ర వాఙ్మయమునకు క్షీణయుగము. గతానుగతికము లైన రచనలు తామరతంపరలుగ వెలసినవి. వానిలో నెచ్చోటనైన" నెడారులలో "బయూసెస్సెన్సులవలె నొకటి రెండు ప్రకృతివర్ణనలు స్వోపజ్ఞకములు పొడఁగట్ట నగును గాని కష్టమునకుఁ దగిన ప్రతిఫలము గిట్ట దని నాశంక.

ఆధునికాంధ్ర వాఙ్మయ మాంగ్లవాఙ్మయము ననుకరించి యభివృద్ధి జెందినది. ఆధునికకవు లాంగ్లమున Wordsworth, Shelly, Keats మున్నగు కవులవలెఁ బ్రకృత్యుపాసనా తత్పరులై హాయిగ, స్వేచ్ఛగ ప్రకృతిలోని స్పందనమునకుఁ దన హృదయమును స్పందించి కవన మల్లిరి. అనుకరణముతోఁ దొలుత ప్రారంభమైన కాలాంతరమున నవ్యకవులలోఁ బ్రకృతివర్ణనము స్వకీయప్రతిభావిలసితముగ విరాజిల్లినది. "ఋతువున కొక రుచిరాలంకృతిఁ నవదరించి యభినయించెడి సృష్టిస్థితిలయయోగిని"గా శ్రీ రాయప్రోలు సుబ్బారావు కవిగారు ప్రకృతిని బుజీతముగా దర్శించిన ధన్యత సంపాదించుకొనిరి.

"సతతనూతన మృదువిలాస ప్రభూత
తావకమనోజ్ఞలాస్య సందర్శనమున
నాదుభావాలు మధురగానమ్ము సలిపె
ప్రకృతి యానందతన్మయత్వమున మునిఁగి"

అని తన యానందమును వెల్లడించుచున్నాఁ డొక నవ్యకవి. "ఆకులో ఆకునై పూవులోఁ బూవునై, కొమ్మలో కొమ్మనై నును లేత రెమ్మనై, యీయడవి దాఁగిపోనా? చిరుగాలి కెరటమై, సెలయేటి పాటలో తేటనైపోనా!" అని యేమి చేయుటకును దోఁచక స్తబ్ధుఁడైనాఁ డొక భావకవి. అతఁడే మఱియొకసమయమునఁ దన భావకవిత్వోపక్షముల విహంగత్వము వహించి "దిగిరాను, దిగిరాను దివినుండి భువికి" యని సంతోషమునఁ గేకలువెట్టుచున్నాఁడు. మఱియొక మభినవ కుశీలవుఁడు "మామిడికొమ్మమీఁద కల మంత్రపరాయణుఁడైన కోకిల స్వామి"కి మ్రొక్కుచున్నాఁడు. అతఁడు "కానఁబడక, అనుమానప్రమాణమున నందియునందని పరమతత్త్వమవలనుంచి పంచభూతదృశ్యంబైన ప్రకృతి యొకటి" తనకు లక్ష్యమని విశదమొనర్చుచున్నాఁడు. తన కత్యంత ప్రియులగు బాంధవులను, తల్లిని, ప్రేయసిని, సోదరిని ప్రకృతియందే దర్శించుచుఁ దృప్తిఁ జెందుచున్నాఁడఁట.

ఇట్టి యాధునికాంధ్రకవుల ప్రకృతి తాదాత్మ్యముపై విశ్వకవి రవీంద్రుని ప్రభావముగూడ నెంతో ప్రసరించినది.

విశ్వనాథవారి "కిన్నెరసాని పాటలు", "ఋతుసంహారము" సునిశితపరిశీలనఫల మగు ప్రకృతివర్ణనలతోఁ గూడినవి. పింగళి, కాటూరి వారల "తొలకరి" ఆచార్య సుబ్బారావుగారి "తెనుఁగుతోట" తెనుఁగు ప్రకృతికి దర్పణములు.

అచ్చముగాఁ బ్రకృతి దృశ్యములను వర్ణించుటలోనే కానియక నవ్యకవులజాతికి జీవగఱ్ఱ యగు రైతును, గ్రామీణ దృశ్యములను బ్రకృతికి

ముద్దు బిడ్డలుగ జీవించు పశ్లుపక్షులను, తన కవిత్వమున కితివృత్తము గావించినాడు. ఆంగ్లమున Wordsworth "Solitary reaper" మున్నగు ఖండకావ్యములు వీరి కిందు మార్గదర్శకములైనవి.

శ్రీ ఏటుకూరి వెంకటనరసయ్య "క్షేత్రలక్ష్మి", దువ్వూరివారి "కృషీవలుఁడు" రైతుయొక్క స్వార్థరహితజీవన విధానప్రాశస్త్యమును ప్రదర్శించుచున్నవి.

"రారమ్మో యి! కవీశ్వరా! హృదయమర్మక్షేత్రముం దున్ని సం
స్కారాసన్న ఫలమ్ము నందుటకు స్వర్గస్థానమం దుండెరా
వారే రైతులు విశ్వజీవనకళాపారంగతుల్ నీ కవి
త్వారంభమ్మున కిద్ది స్వర్ణయుగ మన్నా, నాఁటికిన్ నేఁటికిన్"

అని వీరుల ప్రబోధము.

దువ్వూరి రామిరెడ్డిగారి 'వనకుమారి' మధురిమంబుల ప్రకృతికావ్యము. శ్రీ నండూరి సుబ్బారావు, కవికొండల వెంకటరావు, అడవి బాపిరాజు మున్నగు నవ్యకవులు సహజసౌందర్యవిలసిత మగు జానపదులజీవితము వర్ణించి నూత్నమార్గముల వెల్వరించిరి.

నండూరివారి 'యెంకికి' "తోట పూల మనసులు తెలుసు"
బాపిరాజుగారు పడవవారితోఁ బడవవాఁడై

"రావోయి సిన్నవాడా! మావాడరావోయి సిన్నవాడా!

అని నాటి పడవవానిని బిలిచి

"ఉబికే వాగుల్లోకి-ఉయ్యాల లూగుతు పోయి
నందరాన వుట్టేటి - సెందురూని సేసు కొంద" మని వారికి

సైదోడగుచున్నాఁడు.

ఇట్టిది నిసర్గ మగుకైత. దీనికిఁ బాండిత్యము, కోశములు, అప్పకవీయము పనిలేదు. కవితకు జీవనమగు భావనాశక్తి యవసరము. పాల్కురికి

భోమన్న చెప్పిన తుమ్మెద పదములు, పర్వత పదములు మున్నగు మన జానపద సాహిత్యము ప్రకృతి శోభారామణీయకము. ఇది కృత్రిమగు మార్గ కవిత్వపు హడావుడికిఁ దెరమఱుఁగైనది. దానిని పునరుద్ధరించి జాతీయ జీవన విధాన గ్రహణమునకుఁ దోడ్పడవలయును. జానపద కవిత్వ ప్రాశస్త్యమును Johnson పండితుఁ డిట్లు ప్రశంసించెను.

"There is scarcely any species of poetry that have allowed more readers or excited more writers than the pastoral. pastoral is a way out of "cares and peturbations into Elysian regions, where we are to-meet with nothing but joy end contentment".

జానపద కవిత్వ మల్లుటకు నిరుపహతి స్థలము లుండరాదు. కవి వారిలో నొక్కఁడుగ జీవించి వారి యనుభవములను గ్రహింపవలయును. W. Irring ఆంగ్ల వాఙ్మయములోని జానపద కవిత్వ విశిష్టత నిట్లుగ్గడించెను;

"The pestoral writers of other countries apper as if they had paid an occassional visit and became aquinted with her general charms, but British poets have lived and revelled with her".

అట్టి యున్నతస్థితిని దెలుఁగుఁగవులు గూడ నందుకొనవలయును. అపారభావనా విలసితులును, అతీంద్రియానుభవులై నకవులు ప్రకృతితోఁ దాదాత్మ్యము పొందినపుడే వారి రచనలకు సార్థక్యము సాఫల్యము. మన కానందైక్యము. మార్గకవితాభిమానముతోనే పరితృప్తులుగాక, నిసర్గకోమల మగు దేశికవితాభిమాన ప్రవృత్తులై, జాతి మనః ప్రవృత్తుల నున్మీలనముఁ జేసి, వాఙ్మయ విశిష్టతను ద్యోతమానము చేయ వలసిన బాధ్యత మనకవిపుంగవుల పై నున్నది. ప్రకృతిలో జీవించి, ప్రకృతి సౌందర్యమునకుఁ బులకితులై, పఠితలను బులకింపఁ జేయఁగల వాఙ్మయ మింకను నెంతయో సృజించి రససిద్ధు లగుట జాతికి గర్వకారణము !!.

మణిస్తంభోదు సుముఖాసత్తికిఁ జూపుచుఁ జేయు సముద్ర వర్ణనము, అందు తిమింగల శిరోరంధ్ర ప్రసంగము తరువాతి కథ యగు నలకూవరుని చరిత్రయం దతని భార్యలు తిమింగలముచే గ్రసింపఁబడి తిరిగి దాని శిరోరంధ్రమునుండి చిమ్మఁబడిన నీటిలోఁ బడి గగనమున కెగియుట ప్రాతిపదికము. అంతియేకాక ప్రకృతకథలో విరాగ దంపతులను సరాగులుగ మార్చుట కుద్దీపనము. ఇట్టి వర్ణనములే నిజమునకు సార్థకములు. కవికిఁ గావ్యమునకుఁ జరితార్థదాయకములు.

"ఒక విషయమునుబట్టి చూచిన సరస్వతీ చతుర్ముఖ విలాసము వంటి ఘట్ట మాంధ్రమున నెక్కడను లేదు. ఏ విషయ మనఁ బ్రకృతిని పాత్రముల జీవితముతోఁ గలిసినట్లు వర్ణించుట" యను రామలింగా రెడ్డిగారి వాక్యము సత్యసమ్మతము.

తరువాత నాంధ్ర వాఙ్మయమునకు క్షీణయుగము. గతాను గతికము లైన రచనలు తామరతంపరలుగ వెలసినవి. వానిలో నెచ్చోటనైన" నెడారులలో "బయాసెస్సెస్సులవలె నొకటి రెండు ప్రకృతివర్ణనలు స్వోపజ్ఞకములు పొడఁగట్టనగును గాని కష్టమునకుఁ దగిన ప్రతిఫలము గిట్టదని నాశంక.

ఆధునికాంధ్ర వాఙ్మయ మాంగ్లవాఙ్మయము ననుకరించి యభివృద్ధి జెందినది. ఆధునికకవు లాంగ్లమున Wordsworth, Shelly, Keats మున్నగు కవులవలెఁ బ్రకృత్యుపాసనా తత్పరులై హాయిగ, స్వేచ్ఛగ ప్రకృతిలోని స్పందనమునకుఁ దన హృదయమును స్పందించి కవన మల్లిరి. అనుకరణముతోఁ దొలుత ప్రారంభమైన కాలాంతరమున నవ్యకవులలోఁ బ్రకృతివర్ణనము స్వకీయప్రతిభావిలసితముగ విరాజిల్లినది. "ఋతువున కొక రుచిరాలంకృతిఁ సవదరించి యభినయించెడి సృష్టిస్థితిలయయోగిని"గా శ్రీ రాయప్రోలు సుబ్బారావు కవిగారు ప్రకృతిని బుణీతముగా దర్శించిన ధన్యత సంపాదించుకొనిరి.

"సతతనూతన మృదువిలాస ప్రభూత
భావకమనోజ్ఞలాస్య సందర్శనమున
నాదుభావాలు మధురగానమ్ము సలిపె
ప్రకృతి యానందతన్మయత్వమున మునిఁగి"

అని తన యానందమును వెల్లడించుచున్నాఁ డొక నవ్యకవి. 'ఆకులో ఆకునై పూవులోఁ బూవునై, కొమ్మలో కొమ్మనై నును లేత రెమ్మనై, యీయడవి దాఁగిపోనా? చిరుగాలి కెరటమై, సెలయేటి పాటలో తేటనై పోనా!" అని యేమి చేయుటకును దోఁచక సంధిగ్ధుఁడైనాఁ డొక భావకవి. అతఁడే మఱియొకసమయమునఁ దన భావకవిత్వపక్షముల విహంగత్వము వహించి "దిగిరాను, దిగిరాను దివినుండి భువికి" యని సంతోషమునఁ గేకలువెట్టుచున్నాఁడు. మఱియొక మభినవ కుశీలవుఁడు "మామిడికొమ్మమీఁద కల మంత్రపరాయణుఁడైన కోకిల స్వామి"కి మ్రొక్కుచున్నాఁడు. అతఁడు "కానఁబడక, అనుమానప్రమాణమున నందియునందని పరమతత్త్వమువలనుంచి పంచభూతదృశ్యంబైన ప్రకృతి యొకటి" తనకు లక్ష్యమని విశదమొనర్చుచున్నాఁడు. తన కత్యంత ప్రియులగు బాంధవులను, తల్లిని, ప్రేయసిని, సోదరిని ప్రకృతియందే దర్శించుచుఁ దృప్తిఁ జెందుచున్నాఁడఁట.

ఇట్టి యాధునికాంధ్రకవుల ప్రకృతి తాదాత్మ్యముపై విశ్వకవి రవీంద్రుని ప్రభావముగూడ నెంతో ప్రసరించినది.

విశ్వనాథవారి "కిన్నెరసాని పాటలు", "ఋతుసంహారము" సునిశితపరిశీలనఫల మగు ప్రకృతివర్ణనలతోఁ గూడినవి. పింగళి, కాటూరి వారల "తొలకరి" ఆచార్య సుబ్బారావుగారి "తెనుఁగుతోట" తెనుఁగు ప్రకృతికి దర్పణములు.

అచ్చముగాఁ బ్రకృతి దృశ్యములను వర్ణించుటలోనే తనియక నవ్య కవులజాతికి జీవగఱ్ఱ యగు రైతును, గ్రామీణ దృశ్యములను బ్రకృతికి

ముద్దు బిడ్డలుగ జీవించు పల్లెపడుచులను, తన కవిత్వమున కితివృత్తము గావించినారు. ఆంగ్లమున Wordsworth "Solitary reaper"మున్నగు ఖండకావ్యములు వీరి కిందు మార్గదర్శకములైనవి.

శ్రీ ఏటుకూరి వెంకటనరసయ్య "క్షేత్రలక్ష్మి", దువ్వూరివారి "కృషీవలుఁడు" రైతుయొక్క స్వార్థరహితజీవన విధానప్రాశస్త్యమును ప్రదర్శించుచున్నవి.

"రారమ్మోయి! కవీశ్వరా!హృదయమర్మక్షేత్రముం దున్ని సం

స్కారాసన్న ఫలమ్ము నందుటకు స్వర్గస్థానమం దుండెరా

వారే రైతులు విశ్వజీవనకళాపారంగతుల్ సీ కవి

త్వారంభమ్మున కిద్ది స్వర్ణయుగ మన్నా, నాఁటికిన్ నేఁటికిన్"

అని వీరుల ప్రబోధము.

దువ్వూరి రామిరెడ్డిగారి 'వనకుమారి' మధురిమంబుల ప్రకృతికావ్యము.

శ్రీ నండూరి సుబ్బారావు, కవికొండల వెంకటరావు, అడవి బాపిరాజు మున్నగు నవ్యకవులు సహజసౌందర్యవిలసిత మగు జానపదులజీవితము వర్ణించి నూత్నమార్గముల వెల్వరించిరి.

నండూరివారి 'యెంకికి' "తోట పూల మనసులు తెలుసు"

బాపిరాజుగారు పడవవారితోఁ బడవవాఁడై

"రావోయి సిన్నవాడా! మావాడరావోయి సిన్నవాడా!

అని నాటి పడవవానిని బిలిచి

"ఉబికే వాగుల్లోకి-ఉయ్యాల లూగుతు పోయి

నందరాన పుట్టేటి - సెందురూని సేరు కొండ"మని వారికి

సైదోడగుచున్నాఁడు.

ఇట్టిది నిసర్గ మగుకైత. దీనికిఁ బాండిత్యము,కోశములు,అప్పకవీయము పనిలేదు. కవితకు జీవనమగు భావనాశక్తి యవసరము. పాల్కురికి

సోమన్న చెప్పిన తుమ్మెద పదములు, పర్వత పదములు మున్నగు మన జానపద సాహిత్యము ప్రకృతి శోభారామణీయకము. ఇది కృత్రిమ మగు మార్గ కవిత్వపు హడావుడికిఁ దెరమఱుఁగైనది. దానిని పునరుద్ధరించి జాతీయ జీవన విధాన గ్రహణమునకుఁ దోడ్పడవలయును. జానపద కవిత్వ ప్రాశస్త్యమును Johnson పండితుఁ డిట్లు ప్రశంసించెను.

"There is scarcely any species of poetry that have allowed more readers or excited more writers than the pastoral. pastoral is a way out of "cares and peturbations into Elysian regions, where we are to meet with nothing but joy and contentment".

జానపద కవిత్వ మల్లుటకు సరుపహాతి స్థలము లుండరాదు. కవి వారిలో నొక్కఁడుగ జీవించి వారి యనుభవములను గ్రహింపవలయును. W. Irring ఆంగ్ల వాఙ్మయములోని జానపద కవిత్వ విశిష్టత నిట్లుగ్గడించెను;

"The pestoral writers of other countries apper as if they had paid an occassional visit and became aquinted with her general charms, but British poets have lived and revelled with her".

అట్టి యున్నతస్థితిని దెనుఁగుఁగవులు గూడ నందుకొనవలయును. అపారభావనా విలసితులును, అతీంద్రియానుభవులై నేఁకవులు ప్రకృతితోఁ దాదాత్మ్యము పొందినపుడే వారి రచనలకు సార్థక్యము సార్థక్యము. మన కానందైక్యము. మార్గకవితాభిమానముతోనే పరితృప్తులుగాక, నిసర్గకోమల మగు దేశికవితాభిమాన ప్రవృత్తులై, జాతి మనః ప్రవృత్తుల నున్మీలనముఁ జేసి, వాఙ్మయ విశిష్టతను ద్యోతమానము చేయు వలసిన బాధ్యత మనకవిపుంగవులపై నున్నది. ప్రకృతిలో జీవించి, ప్రకృతి సౌందర్యమునకుఁ బులకితులై, పఠితలను బులకింపఁ జేయఁగల వాఙ్మయ మింకను నెంతయో సృజించి రససిద్ధు లగుట జాతికి గర్వకారణము !!.

---

# శ్రీమద్రామాయణము-మానవత్వ ప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

పించుటకును గారణ మా విలక్షణతమసాతీరసన్నివేశమే. తుదకు శింశుపావృక్షమునుండి సీత నుపలక్షించుచుండిన యాంజనేయులయందు వాల్మీకి ప్రవేశించి "ఇమా మసితకేశాంతాం శతపత్రనిభేక్షణాం; సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః" అని సీతదుఃఖమునందుఁ గ్రౌంచీదుఃఖప్రతిబింబమును స్ఫురింపఁజేయుచుఁ గాయకసరు తినునట్టి యాటవికుఁడ నైన నా హృదయముగూడ నీ సీతదుఃఖముచే వ్యథ నొందుచున్న"దని తన యనుభవము నా ఋషి యుగ్గడించి యున్నాఁడు! పైఁగఁ "గావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" అని శ్రీమద్రామాయణము పేరుగాని యయ్యది సీతచారిత్రమే యని చెప్పునంత యుత్కృష్టస్థానము నలంకరించెను సీతామతల్లి వాల్మీకిహృదయమునందు. ఇఁకఁ దార, మండోదరి, మున్నగు స్త్రీల విలాపములు కేవలహృదయవిదారకములు. అదియంతయుఁ గ్రౌంచీదుఃఖసంజనితకరుణారసతరంగములే యందురా? కాదు; వాల్మీకి స్వీయ చరిత్రకూడఁ గొంత సీతారాముల నాలంబనముగ గ్రహించి యానాఁడు వాల్మీకి హృదయమును గలంచిన యనుభవముల నందుంచె నని నా మనవి. వాల్మీకిభార్య యగు బోయతకూడ నొక మొఱకు స్త్రీ యని మనము గ్రహింపరాదు. తారాపాత్రమును బాగుగఁ దిలకింపుఁడు! వాలికొఱ కామె యెంత దుఃఖించెను? అది నటనమా? కాదు. వాల్మీకి యొనరించెడి దుష్కృత్యములందలి పాపమును దాను బంచుకొనన నని యాతనిభార్య నిరాకరించినంతమాత్రమున నా యిల్లాలి నాతఁడు విడుచుట పాడియా? సీత లక్ష్మణు నే తీరున నెన్ని దుర్భాష లాడియుండలేదు? రాముఁ డామెను గాదని వదలెనా? తార తన భర్తృశోకసూచ

మృతి నొందవల సని చెప్పెను. కాని తుదకు సుగ్రీవుని యాజ్ఞ చేపట్టక తప్పలేదు. ఆ తీరున వాల్మీకిభార్య యగు నా బోయత గూడ చేసియుండవచ్చును. ఆ కాలమునం దా యాటవికస్త్రీల కది ధర్మము కావచ్చును. అంతమాత్రమున కాతఁడు తన స్త్రీని విడిపోవుట తగియుండలే దని నాఁటిక్రౌంచీరోదనముచే నాతని హృదయము కరఁగిపోయెను! అందుచే నాతనిమానస మా దినమున నొక యగ్నిపర్వతమువలె నుడుకసాగె నను విషయ మిదివఱకె చెప్పియుంటిని. ఈ రీతిగ శ్రీమద్రామాయణమునందు విషమఘట్టము లనేకములు మానవుల నెటుల జీకాకుపఱచుచుండునో చర్చించి శ్రీరామచంద్రుఁ డే తీరున మానవమాత్రునివలె సంచరించి వాని నన్నిటిని దన నిశితధర్మపరిపాలనముచే నట్టి విషమవిషయములను జయింపఁగలిగెనో నిరూపించెను. ఆ యా విషయములు చర్చించుతఱిఁ బాఠకమహాశయులకు విన్నవించుకొందును. ఏది యెట్లున్నను వాల్మీకి మతమునందు స్త్రీస్వరూపము కేవల మొక త్యాగమూర్తి యనియు, నామె పరమపవిత్ర మగు వస్తు వనియు, నామె నెల్లప్పుడు నెట్టి విషమపరిస్థితులయందును గౌరవింపవలయునే కాని యామె నొక తుచ్ఛ మగు భోగ్యవస్తువుగ గ్రహించుట పురుషునియందలి యక్షమనీయ మగు లోప మనియు నా మహాశయునినిశ్చయ మని యాతని కృతి చాటుచున్నది. ఈ రహస్యమును గ్రహించిన మహాత్ముఁడీ కలియుగంబున, త్యాగయ్య యొక్కఁడే యని చెప్పిన సాహసోక్తి కాదు. స్త్రీవలననే పురుషున కుత్తేజము కలుగునుగాని కేవలపురుషుని వలన నీ జగమునందుఁ బౌరుషము, గౌరవము, విజ్ఞానము, వీర్యసాహసాది మహాపురుషలక్షణములు కలుగనేఱ వని వాల్మీకి మతము. అందులకుఁ దార్కాణముగ గమనింపుఁడు; పదునాలుగు వేల దుష్టరాక్షసుల నర్ధాధికముహూర్తంబునం బోరిఁగొన్న జగదేకవీరుఁ డగు రాముఁడు రావణసంహారమునకై యే డహోరాత్రంబులు యుద్ధము సలుపవల

మృతి నొందెద నని చెప్పెను. కాని తుదకు సుగ్రీవుని యామె చేపట్టక తప్పలేదు. ఆ తీరున వాల్మీకిభార్య యగు నా బోయతగూడ చేసియుం డవచ్చును. ఆ కాలమునం దా యాటవికస్త్రీల కది ధర్మము కావచ్చును. అంతమాత్రమున కాతఁడు తన స్త్రీని వీడిపోవుట తగియుండలే దని నాఁటిక్రౌంచీరోదనముచే నాతని హృదయము కరఁగిపోయెను! అందుచే నాతనిమానస మా దినమున నొక యగ్నిపర్వతమువలె నుడుకసాగె నను విషయ మిూ వఱకె చెప్పియుంటిని. ఈ రీతిగ శ్రీమద్రామాయణము నందు విషమఘట్టము లనేకములు మానవుల నెటుల జీకాకుపఱచుచుం డునో చర్చించి శ్రీరామచంద్రుఁ డే తీరున మానవమాత్రునివలె సంచ రించి వాని నన్నిటిని దన నిశితధర్మపరిపాలనముచే నట్టి విషమవిషయ ములను జయింపఁగలిగెనో నిరూపించెను. ఆ యా విషయములు చర్చిం చుతఱి బాఠకమహాశయులకు విన్నవించుకొందును. ఏది యెట్లున్నను వాల్మీకి మతమునందు స్త్రీస్వరూపము కేవల మొక త్యాగమూర్తి యనియు, నామె పరమపవిత్ర మగు వస్తు వనియు, నామె నెల్లప్పుడు నెట్టి విషమపరిస్థితులయందును గౌరవింపవలయునే కాని యామె నొక తుచ్ఛ మగు భోగ్యవస్తువుగ గ్రహించుట పురుషునియందలి యక్షమ నీయ మగు లోప మనియు నా మహాశయునినిశ్చయ మని యాతని కృతి చాటుచున్నది. ఈ రహస్యమును గ్రహించిన మహాత్ముఁ డీ కలియుగంబున, త్యాగయ్య యొక్కఁడే యని చెప్పిన సాహసోక్తి కాదు. స్త్రీవలననే పురుషున కుత్తేజము కలుగునుగాని కేవలపురుషుని వలన నీ జగమునందుఁ బౌరుషము, గౌరవము, విజ్ఞానము, వీర్యసాహ సాది మహాపురుషలక్షణములు కలుగనేఱ వని వాల్మీకి మతము. అం దులకుఁ దార్కాణముగ గమనింపుఁడు; పదునాలుగు వేల దుష్టరాక్షసుల నర్ధాధికముహూర్తంబునం బోరిఁగొన్న జగదేకవీరుఁ డగు రాముఁడు రావణాసురునకుమున్నొ నాఁడు మహోగ్రాగ్రంబుగ యుద్ధము సలుపవల

సివచ్చెను! కారణ మేమి? జనస్థానయుద్ధమునందుఁ దన కెదురుగ యుండెను. ఆ వీరమహిషి తనభర్తను జూచుచు నాతనివీరవిహారమునఁ దన నిశితకటాక్షపంక్తిని దోఁడు సల్పుచుండెను! సీత తన్ను నరణ్యావమునకుఁ గొంపోవ శ్రీరాముఁడు నిరాకరించినప్పు డే మనెను? "వనస్య శూరస్య చర్యా తే మను రోచతే" అని వనవాసమునం రామచంద్రుఁ డే రీతి ప్రవర్తింపఁగలడో నా మహావీరకాంత చూఁ దలంచెను! కావున స్త్రీ యను వ్యక్తి పురుషునకు మహత్తరశ నిచ్చెడి 'కళత్రము'. 'కళత్ర' మనఁగా నేమి? పురుషస్య కళా త్రాయత, ఇతి, కళత్రమ్' అని దానికి వ్యుత్పత్త్యర్థము కాదా? దాని "దేశేదేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః; తం తు దేశం పశ్యామి యత్ర భ్రాతా సహోదరః" యను శ్లోకమునందుఁ బూర్తి వాల్మీకి విశదీకరించియున్నాఁడు. ఈ శ్లోకమున కర్థమును నిర్ణయి చుటలో మనవారు స్త్రీలన శ్రీరాముఁడు చాల చులకనగఁ జూచినటుఁ నన్వయించి భార్య లెల్లెడల నున్నారుకాని లక్ష్మణునియట్టి సోదరు డెచ్చటను గాన రాఁ డని యర్థము చెప్పుచుందురు. అయ్యది వాల్మీ సమ్మత మైన భావముగఁ గన్పట్టను. శ్రీరాముఁ డా తీరున "దేశే దేశే కళత్రాణి"యని చెప్పుటలోఁ దన భార్య యొక్కతెయే తనయఁ దపూర్వానురాగము చూపునట్టి వనిత కా దనియు, నట్టి మహా వీర మాతలు పెక్కండ్రు "కళత్ర"ము లనేకప్రదేశముల నరుంధతి, సావిత్రి, దమయంతి, అనసూయ, మున్నగువార లెందఱో కల రనియు నేక గర్భజనితు లగు సోదరులే యొకరినొకరు చంపుకొనుట తటస్థించుచుండ భిన్నోదరుఁ డగు లక్ష్మణునియట్టి సర్వపరిత్యాగి మృగ్య మనియు నా కవియభిప్రాయ మని నా మనవి. అందు నొకవంక స్త్రీ గౌరవము చెడకుండ సౌభ్రాతృత్వ మన నెట్టు లుండవలయునో చెప్పుట వాల్మీకి మతము. పురుషునికళలను స్త్రీ యెటుల రక్షించునో మనకు రామా

యణమునందు జనస్థానయుద్ధానంతర మీ తీరున వాల్మీకి వర్ణించెను.

> "శ్లో. తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహమ్
> బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"
> "పునః పరిష్వజ్య శశిప్రభాననా
> బభూవ హృష్టా జనకాత్మజా తదా".

ఈ రీతిగా "శశిప్రభానన" యగు సీత శ్రీరాముని కౌఁగిలించుటచేతనే ఖర, దూషణ, త్రిశిరః ప్రముఖరాక్షసుల శస్త్రాదిఘాతములచేఁ గలిగిన గాయఘాతము లన్నియుఁ బ్రమటిలో మాయ మయ్యె నని గోవిందరాజాదులు వ్యాఖ్యానించిరి. అచ్చట "శశిప్రభానన" యను విశేషణము నాఁ కవి సీత కిచ్చుటలో రహస్య మేమి? చంద్రుఁ డేతీరున తన యమృత వృష్టిచే సమస్తలోకతాపములను బోఁగొట్టునో యా రీతిగ శ్రీరాముని యుద్ధశ్రమ మంతయు నా చంద్రముఖి యపనయించెను! ఇంతకన్న నసదృశసాదృశ్యము మనకుఁ గళత్రవిషయమున నేమి కావలెను? ఎన్ని యున్నను "భార్యామూల మిదం గృహ" మ్మనిక దా పెద్దలు వచింతురు. కావున నాఁటి క్రౌంచమిథున వృత్తాంత మా తీరున మహత్తర రసస్రవంతిగ మాఱి యనన్యసామాన్యబుద్ధి వాగ్వైభవముచే నయ్యాది యా రామసాగరగామిని యయ్యె నని చెప్పకతప్పదు. కరుణారసము శృంగారరసవిచ్ఛిత్తిచేఁ గలిగిన శోకముగాని దానికి వేఱొండు స్వతంత్ర స్థానము గానరాదు. రసము లన్నిటియందును స్వతంత్రముగ నిలువఁ జాలిన దొక్కవీరము. శృంగారమునకుఁగూడ దాని యాలంబన మవసరము. ఈ వీరశృంగార రసములే యీ సృష్టి కాధారము లని వాల్మీకి నిశ్చయము. తుదకు హరిశ్చంద్రోపాఖ్యానాది కరుణారస ప్రపూరితము లగు నితివృత్తములుగూడ వీరశృంగారరసములయొక్క విచ్ఛిత్తిచేఁ గలిగిన శోకమోహములుగాని వేఱొండుగావు. నలోపాఖ్యానమున నేమి!

కావున శ్రీమద్రామాయణావిర్భావమునకుఁ బ్రధానకారణములు వీర శృంగారరసానుభూతులు. కరుణారస మానాటి యనుభవముచేఁ గలిగిన తాత్కాలికోద్రేకము. మానవజీవిత మంతయు "మరణాంతం తు జీవితమ్" అను వాక్యమునం దిమిడియున్న దని శ్రీరామచంద్రుఁ డనినంత మాత్రమున మన మాతీరున నిర్ణయింపఁజనదు. అయ్యది కేవల లౌకిక రసానుభూతికే చెల్లునుగాని, యది పరమార్థమునకుఁ జెల్ల దని వాల్మీకి యభిప్రాయము. ఆ యావిషయములు మున్ముందు మనము తెలిసికొందుముగాక ! వీరుఁ డగు మానవుఁడే యమృతత్వ మొందఁగలఁ డనియు, స్త్రీ, పురుషున కట్టి వీరరసానుభూతిని దన శృంగారరసప్రవాహముచే నెల్లవేళలయందును జాగ్రత్తగఁ గాపాడుచు నీ ప్రపంచమంతయుఁ గేవల తుచ్ఛము లగు పదార్థములలో నిండియున్నను వాని నన్నిటిని దన ప్రేమమహిమచే నుత్తేజింపఁ జేసి యీ విషమ విషయములలో నిండిన మానవజీవయాత్ర నొకవిలక్షణామృతపథముగ మార్చు ననియు మనకు శ్రీమద్రామాయణము బోధించుటయేకాక స్త్రీ, పురుషు నేరీతిగ నమరత్వ మొందఁజేయునో కూడ వాల్మీకి యత్యంత మనోహరముగఁ జిత్రించి మన హృదయమునందు శాశ్వతముగఁ గావ్యానందరసమును నెలకొల్పి యున్నాఁడు. అట్టిమహత్తరకావ్యమునకు శోక మెన్నటికిని బీజము కానేరదు అని నాయభిప్రాయము. ఏతీరున నామహాకవి శ్రీరామపాత్రమును లోకమున కందించెనో మన మికఁ విమర్శించుకొందుముగాక. కామముచే కామజయమును వాల్మీకి సాధించెను. "Diomand cut Diomand" "వజ్రం వజ్రేణ భిద్యతే" కావుననే శ్రీమద్రామాయణము మనకు నిత్యపారాయణగ్రంథ మగుచున్నది. కామము, కామమును జయింపఁగలదా? యని మనము సందేహింపఁబనిలేదు. దాని కీ క్రింది వ్యాసశ్లోకమును బ్రమాణముగ నిచ్చుచున్నాను.

శ్లో. "విక్రీడితం వ్రజవధూభి రిదం చ విష్ణోః
శ్రద్ధాన్వితో ను శృణుయా దనువర్ణయే ద్యః
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య "కామం"
హృద్రోగ మా శ్వపహినో త్యచి రేణ ధీరః".

అని గోపికాక్రీడాంతమందు ఫలశ్రుతి రచించినాఁడు వ్యాసభట్టారకుఁడు. ఇందు "శ్రద్ధాన్వితః" అను పదప్రయోగమును మనము గమనింప వలెను. ఆ శ్రద్ధ యెట్టిదో మనము నిశ్చయించుకొనినచో మన కయ్యది యే యమృతత్వమును జేకూర్చును! ఆ యానన్ని వేశములు నాకు సాధ్యమైనది విపులముగఁ బాఠకలోకమున కందింప యత్నింతును. నా రచనయం దే దేని యసంగతవిషయము లున్నచో నాకు విద్వాం సులు తెలిపి నన్నుఁగూడ సంస్కరింపఁ బ్రార్థన.

## శ్రీరాముఁడు మనుష్యుఁడా?

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్" అని శ్రీరామచంద్రుని మానవమాత్రునిగనే సంతరించుటలో వాల్మీకి యుద్దేశ మేమి?

## శ్రీ రా ముఁ డు.

ఇంతవఱకు "మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః" అను రామాయణ ప్రాదుర్భావబీజమగు శ్లోకమునుగూర్చి యథాశక్తిగ విమర్శించి యి క్కావ్యము వాల్మీకిమహర్షి యొక్క హృద్గతకామో ద్రేకసంచలనశక్తిచే నుద్భవించిన విలక్షణకామధేనువువంటి దివ్యఫల ప్రదాత యగు నితిహాస మని మనవి చేసియున్నాను. దీనివలన మానవు లకుఁ గలుగునట్టి యలౌకిక ఫలములంగూర్చి బాలకాండ ప్రథమసర్గము నం దీ రీతిని వ్రాయఁబడినది.

శ్లో. పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్
వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్
జనశ్చ శూద్రోఽపి మహత్త్వ మీయాత్ (1-1-100)

కావున శ్రీమద్రామాయణము మనజనకుఁ గల్పవృక్షకామధేనువులకన్న మహత్తరఫల ప్రదాత యగుట నిస్సందేహము.

ఇఁక శ్రీరామచంద్రుఁడు మానవుఁ డనుటకుఁ గల కారణముల నిట దిఙ్మాత్రముగఁ బొందుపరచుచున్నాను. వీనివలన శ్రీరాముని దైవముగ నారాధింపఁగూడ దని కాని వల దనిగాని,యక్కఱలే దనిగాని నాయాశయ మెంతమాత్రమును గాదని తొలుదొల్తనే నేను మనవిచేసి యున్నాను. దైవమనఁగా నెవ్వరు? అతఁడు మనుష్యరూపమున నీ లోకమునందు సంచరించె నని నం దప్పేమి? మానవుఁడుగా సంచరించి, తన మతమును లోకమునందుఁ బ్రచార మొనరించిన ఏసుక్రీస్తు, మహమ్మదు, బుద్ధభగవానుఁడు మొదలగువారు తన్మతస్థులచే దైవములుగ నారాధింపఁబడి వారికై ప్రార్థనామందిరములు వారు నిర్మించినచో నయ్యది న్యాయమా? హిందువులు శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారమూర్తులను బూజించినచో నట్టివారు కాఫరులా? మతాభినివేశముతో లోకమును బీడించుటగూడ నొకమహత్తరకార్యముగ నెంచుచున్నారు నేఁటికిని కొందఱు దుర్మార్గులు! ఆర్షమతము, "పితృదేవోభవ," "మాతృదేవోభవ" "ఆచార్యదేవోభవ" "అతిథిదేవోభవ" తల్లిని, తండ్రిని, యాచార్యుని యతిథినిగూడ దైవముగ భావించి పూజింపవలె నని శాసించుచున్నది.శ్రీరాముఁడే యీ తీరునఁ దనతండ్రి వాక్యము చెల్లింపక తప్ప దని సీతామతల్లితో ననెను.

శ్లో. "అస్వాధీనం కథం దైవం ప్రకారై రభిరాధ్యతే
స్వాధీనం సమతిక్రమ్య మాతరం, పితరం, గురుమ్".
(2-30-33).

ఆ రీతిని శ్రీరామచంద్రుఁడు తల్లిని దండ్రిని, గురుని, నెటుల దైవములుగ భావించి పూజించెనో వాల్మీకి సూచించియున్నారు. ఆహా! ఇట్టి శ్రీమద్రామాయణాది గ్రంథములు నేఁటి విద్యార్థులు పఠించుచున్నారా? విద్యాశాఖాధికారులు బాలబాలికల కీ దివ్యకావ్యములను బఠింప నియమించుచో నేఁటి దేశమునందలి యవినీతి, యశాంతి, యవజ్ఞ యుడుఁగంటి పౌరుషజ్ఞానకీర్తులు మనయువకుల మానసములందు నెలకొనవా? కోట్లకొలఁది రక్షకభటులను నియమించినంతమాత్రమున దేశమునందు శాంతి నెలకొనునా? మన దేశనాయకు లీ ముఖ్యవిషయ గమనింపక కేవల పాశ్చాత్యనాగరితా వ్యామోహచిత్తులై యూఁటుక జీవనప్రయాణము "Standing of living" వృద్ధిచేయవలె నని యే వేవియో పథకములను దయారుచేసికొనుచు నొకజాతియొక్క నైతిక ధర్మముపై నార్థికవ్యవస్థితి యాధారపడి యున్న దనెడి మూలసూత్రమును గ్రహింపక మెలంగుటవలన నేమిలాభము?

దైవమానవశక్తులకును, మనుష్య రాక్షసశక్తులకును నెంతయో తరతమభావ ముండనక్కఱ లేదని నే నీవఱకే వక్కాణించియుంటిని.

"విముంచతి యదా కామాన్ మానవో మనసి స్థితాన్ ।
తర్హ్యేవపుండరీకాక్ష! భగవత్త్వాయ కల్పతే॥"

అని మహాభక్తాగ్రేసరుఁ డగు ప్రహ్లాదుఁడు నిర్వచించెను. కామ మను విలక్షణమగు నీశ్వరశక్తిని దుర్వినియోగ మొనరించి నీచము లగు భోగములకై దానిని దుష్ట మొనరించుటచేతనే మానవుఁడు రాక్షసుఁడగుచున్నాఁడు! దానినే తనమనోజయముచే నరికట్టి యీ ప్రకృతియందలి సర్వశక్తులను స్వాధీన మొనరించుకొని లోకోపకార మొనరించుటయే దైవశక్తి యని మనకు శ్రీమద్రామాయణము బోధించుచున్నది. చూడుఁడు! నీచ మగు కామసుఖము నపేక్షించి సీతను మ్రింగఁబోయిన శూర్పణఖను లక్ష్మణుఁడు ముక్కుచెవులం గోసి యంపెను. శ్రీకృష్ణభగ

# వ్యక్తివివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.,

శర్వపదమును వ్యాసపదమును బర్యాయములే యగును. సమానార్థకములగు పదములను రెంటిని బ్రయోగించుటవలనఁ బునరుక్తిదోషమే కల్గును: అందుచే నా పదములప్రయోగమే యనుపపన్నమైనపుడు, వానికిఁ సమాసము కూడునా, కూడదా యను వాదమున కవకాశమే లేదు. కావునఁ 'బారాశర్య, వ్యాసాదిపదములకు సమాసము లేకుండుటలో వానికిఁ గల సమానార్థకత్వమే హేతు వని తెలియవలెను. ఇందు కుదాహరణము.

"శశాంకశేఖర, శ్శంభుః, పద్మజన్మా, పితామహః," ఇవి యన్నియుఁ బర్యాయపదములే, కాని విశేష్యమున కతిశయాధాయకములగుటచే సమాసమునం దంతర్భావితములు గాలేదు. ఇటులే 'తక్షక సర్పః' ఇది సామాన్య మగు సర్పము గాదు. తక్షక మను సర్పమనుటతోడనే సర్పమునం దసాధారణత్వము భాసించుచుండుటచేఁ దక్షకత్వము విధేయము. అందుచే నిట సమాసాభావ ముచితమే.

"లోహిత స్తక్షక ఇతి సమాసోఽత్రాపి నేష్యతే
లౌహిత్యస్య విధా వుక్తన్యాయా త్తస్యాప్రవృత్తితః
స్వరూపమాత్ర స్యోక్తౌ తు లౌహిత్యావ్యభిచారతః
ఉష్ణోఽగ్ని రితివత్ పక్షో న చా స్త్యస్య దతిక్రమే".

"లోహిత స్తక్షకః" "ఎఱ్ఱని "తక్షకుఁడు"—ఇటువంటి వాక్యముల కర్థముఁ జెప్పునపుడు రెండు పక్షము లున్న వని మనము గుర్తించుకొనవలయును. అం దొకటి స్వరూపమాత్రప్రతిపాదనపరము — "ఉష్ణః అగ్నిః" అనునపుడు 'అగ్ని యుష్ణముగ' నున్నదని దానిస్వరూపము, స్వభావముమాత్రమే ప్రతీతము లగును. ఉష్ణత్వము విధేయమను ప్రతీతి యిచట వివక్షితము గాదు. 'లోహిత స్తక్షకః' అనునపుడు

రెండవ రీతి కసంబసుసు. తక్షకశబ్దమునుండియే సర్పత్వజాతిప్రతీత మగుచున్నట్లు, ఆ జాతి సర్పములకు సహజముగ నుండు నెఱుపురంగుగూడఁ బ్రతీత మగుచునే యుండును. అయినను బ్రత్యేకముగ లోహితశబ్దమును బ్రయోగించుటచే, లౌహిత్యమును విధేయముగఁ గవి, యుద్దేశించినాఁడని తెలియవలెను. అందుచే నిట్టితావులందు "లోహితతక్షకః" యని సమాసముఁ జేయఁగూడదు. సమాసముఁ జేసినచో లోహితత్వమునకు విధేయత్వము భాసింపదు. కావున విధ్యనువాదభావ మున్నప్పుడు సమాసముఁ జేయఁగూడ దని తెలియవలెను. ఈ రెండు రీతులే తప్ప మఱియొక రీతి లేనేలేదు.

ఇంతవఱకుఁ గర్మధారయసమాసస్థలమున సమాస మెచటఁ గూడునో యెచటఁ గూడదో చర్చించితిమి. ఇఁక బహువ్రీహిసమాస విషయమున విచారింతము.

<u>బహువ్రీహిసమాసము చేయకుండుటవలన సర్ధచమత్కారము దెల్గుట కుదాహరణము.</u>

"యేన స్థలీకృతో విన్ధ్యో యేనాచాన్తః పయోనిధిః
వాతాపి స్తాపితో యేన స మునిః శ్రేయసేఽస్తు వః

అర్థము:— యేన=ఏయగస్త్యునిచేత, విన్ధ్యః=విన్ధ్యపర్వతము, స్థలీకృతః= సామాన్యస్థలముగాఁ జేయబడినదో, (పెరుఁగకుండఁ జేయఁబడినదో) యేన=ఎవనిచేత, పయోనిధిః సముద్రము, ఆచాన్తః= ఆచమనముగఁ ద్రాగఁబడినదో, యేన=ఎవనిచేత, వాతాపిః= వాతాపి యను రాక్షసుఁడు, తాపితః= బాధింపఁబడినాఁడో (చంపఁబడినాఁడో) సః మునిః = ఆముని, వః, శ్రేయసే, అస్తు= మీ శ్రేయస్సున కగుఁగాక.

వింధ్యపర్వతము ప్రతిదినమును బెరిఁగెడిది. సూర్యు నావరించి, జగత్తున కంతకును జీకటిని గలుగఁజేసినది. అట్టి వింధ్యపర్వతమును

నగస్త్యుఁ డణఁచివేసినాఁడు. —సముద్రము గాంభీర్యము, నసారమును: అయినను నగస్త్యుఁ డట్టి సముద్రము నాచమించినాఁడు. —వాతాపి యను రాక్షసుఁడు, తనమాయచే నందఱను జంపివేసెడివాఁడు. అట్టి మాయావి యగు వాతాపినిగూడ నగస్త్యుఁడే సంహరించినాఁడు.

ఇచట విన్ధ్యపర్వతము నుద్దేశించి స్థలీకృతత్వము, సముద్రము నుద్దేశించి, యాచాన్తత్వము, వాతాపి నుద్దేశించి తాపనమును విహితము లగుచున్నవి. వింధ్యపర్వతాదుల కిట్టి దుస్థితి కలిగిన దను విషయము స్పష్టముగ భాసించుట కవియభిమతము. వింధ్యాదుల కిట్టి దుస్థితిని గూర్చిన యగస్త్యుఁ డఘటనఘటనాసమర్థుఁ డనియు దుష్కరకారి యనియుఁ బ్రతీతి కలుగును. ఇందువలన నగస్త్యుని ప్రభావాతిశయము వ్యంగ్య మగును.—స్థలీకృతత్వాదులు సమాసములో నంతర్భావము నొందక వ్యస్తములుగ నుండుటచేతనే యీ వ్యంగ్యవైభవము సాధిత మైనది. —కావున నిచట బహువ్రీహిసమాసముఁ జేయకుండుటయే యుచితము.

ప్రత్యుదాహరణము :—

"(1) యః స్థలీకృతవిన్ధ్యాద్రిః (2) ఆచాన్తాపారవారిధిః
(3) యశ్చ తాపితవాతాపిః సమునిః శ్రేయసేఽస్తు వః".

స్థలీకృతవిన్ధ్యాద్రిః —మొదలగు మూఁడు పదములును బహువ్రీహిసమాసములే — పైశ్లోకమున నున్న యర్థమే గీనికి నున్నది. కాని స్థలీకృతత్వాదులు ప్రధానముగ విధేయములై భాసించుట లేదు. కవి వివక్షిత మైన చమత్కారము సిద్ధింపదు. కావున నిచట బహువ్రీహిసమాస మౌచిత్యభంజక మే యైనది.

కొందఱీ యుదాహరణప్రత్యుదాహరణములలో నర్థమునొక్కయుత్కర్షాపకర్షలు భాసించుటయే లేదని యనుచున్నారు. వారిని మే మిట్లు ప్రశ్నింతుము. అన్ని సమాసములవిషయమునఁగూడ విగ్రా

క్లిష్టో యద్గోత్కర్షాపకర్షలు భాసించుటలేదా? లేక కేవల బహువ్రీహి సమాసవిషయమునమాత్రమే యిట్టి భావముతెలిసెదా? సమాసాసమా సములవిషయమునఁగూడ సమాసాసమాసకృత మగు నర్థభేదము మాకుఁ గన్పించుట లేదని యందురేని, సాక్షు లగు సహృదయుల నడుగుఁ డనిమాత్రమే చెప్పఁగలము. మాకుమాత్రము సమాసము చేసినపుడు కలుగుప్రతీతికిని, చేయనపుడు కలుగుచున్న ప్రతీతికిని జాల భేదము కన్పడుచునేయున్నది.

బహువ్రీహిసమాసవిషయమునమాత్రమే మాయందు సమాసాస మాసకృతము లగు భేదములు భాసించుట లేదందురేని మేము చెప్పు సమాధాన మిది. అసమాససమాసములవలన నర్థమునం దుత్కర్షాపకర్షములు ప్రతీతము లగుచుండఁగా, ఉత్కర్షాపకర్షములకు, అసమాససమాసరూపహేతువు కనుపడుచుండఁగా, నర్థభేద మేమియును లేదని చెప్పుట యుచితము గాదు. అసమాససమాసము లను హేతువుల కర్థభేదప్రతీతిని గలుగఁజేయు సామర్థ్య మున్నపుడుగూడ నకారణముగ నర్థభేదప్రతీతి లేదందురేని, క్షిత్యాదిరూప మగు సామగ్రి యవికలముగ నున్నపుడుగూడ సంకురాదికార్యోత్పత్తి కలుగ దని యంగీకరింపవలసివచ్చును. అట్లంగీకరించుట న్యాయ్యము గాదు. అందుచేతఁ గర్మధారయసమాసమునందును, బహువ్రీహి సమాసమునందునుగూడ సమాసాసమాసకృత మగు నర్థభేదము నంగీకరింపవలయును. సమాసాభావభావము లను హేతువులు రెండు చోట్లను నున్నవిగదా! కా దందురా, రెండు స్థలములలోఁగూడ నర్థప్రతీతిభేదము లే దనుఁడు. హేతువు రెండుచోట్ల నున్నను,నొకచోటమాత్రమే యర్థభేద మున్న దనియు, రెండవచోటలే దనియుఁ జెప్పుట యర్ధజరతీయమే యగును.

ఈక్రింద నీయఁబడిన యుదాహరణములందైనను, సమాసాసమాసకృత మగు ప్రతీతివైచిత్రిని, మీరు స్పష్టముగఁ జూతురుగాక. ఎచ్చట విధ్యనువాదభావమును జెప్పఁదలఁచియో, కవి పదార్థోపనిబం

ధనము జేసినాఁడో, యచ్చటఁగూడ, విశక్తి తాత్పర్యార్థ ప్రాధాన్య ప్రాధాన్య ములనఁ దగు సమాసాభావభావములు గన్పడుచునేయున్నవి.

ఉదాహరణము :—

"సూర్యాచన్ద్రమసౌ యస్య మాతామహపితామహౌ

స్వయం వృతః పతి ర్ద్వాభ్యా మూర్వశ్యాచ భువాచ యః".

అర్థము :—

యస్య=ఏపురూరవునకు, సూర్యాచంద్రమసౌ=సూర్యచంద్రులు, మాతామహపితామహౌ = మాతామహుఁడును, పితామహుఁడునో, యః=ఏపురూరవుఁడు, ఊర్వశ్యాచ=ఊర్వశిచేతను, భువాచ = భూమి చేతనుగూడ, స్వయంవృతః = స్వయముగ వరింపఁబడిన, పతిః = భర్తయో!

సూర్యచంద్రు లిద్దఱును ప్రపంచమున కలంకారభూతులు. చరాచర మగు జగమున కంతకును ప్రాణము. భగవంతు లగునట్టి సూర్యచంద్రు లిచట ననువాద్యములు. వారి నుద్దేశించి, పురూరవమాతామహత్వ పితామహత్వములు విధింపఁబడుచున్నవి. ఇట్లగుటచేఁ బురూరవుఁడు లోకోత్తర మగు వంశమున జన్మించినాఁ డని తెలియుచున్నది. అందుచే నతని మహిమాతిశయము వ్యంగ్య మగుచున్నది. విశేషణవిశేష్యభావ మున్నపుడు, సమాసమున లేకుండ, వ్యస్తముగ నున్న విశేషణము, విశేష్యమునకు గుణాతిశయమును గలుగఁజేయు నని చెప్పితిమి. అటులే విధ్యనువాద భావస్థలమునఁగూడ విధేయము, వ్యస్తముగ నున్నపుడే యనువాద్యమున కుత్కర్షాతిశయము గోచరించును. ఇచట ననువాద్యము లగు సూర్యచంద్రులను దెలుపు "సూర్యాచంద్రమసౌ" అనుపదములో, విధేయము లగు మాతామహత్వ పితామహత్వములను దెల్పు 'మాతామహపితామహౌ' అను పదమును గలిపి బహువ్రీహి సమాసముచేయకుండుటవలననే యిప్పుడు మన మనుకొనిన యర్థాతిశయము స్ఫురించుచున్నది. సూర్యచంద్రులకు స్వరూపములో మాత్రమే యిచట భేద మున్నది. —కాని తమకు విధేయము లగు మాతామహ పితా

మహత్త్వముల మూలమున, అనఁగాఁ బరంపరాసంబంధముచే వాక్యార్థమునకు (పురూరవునకు) మహిమాతిశయమును సంక్రమింపఁ జేయుట యనుఫలితములో, భేద మే మాత్రమును లేదు. ఇట్టి విశేషప్రతీతి నాశించియే యిచట సమాసము చేయఁబడలేదు.

ఇం కొక విశేషమునుగూడ నిచట మనము గుర్తింపవచ్చును. 'సూర్యాచంద్రమసౌ' అని ద్వంద్వసమాసము, వాక్యార్థమున కుత్కర్షను గలుగఁజేయుటలో సూర్యచంద్రులకుఁ గల స్పర్ధను వ్యక్తము సేయును. 'ఊర్వశ్యాచ భువాచ' అని ఊర్వశీపదమును, భూపదమును గలిపి సమాసము చేయకుండుటలోఁగూడ సౌచిత్య మున్నది. 'ఊర్వశి' పురూరవుని వరించుట వాస్తవ మగు నర్థము. —భూమి పురూరవుని వరించుట యను భావము వాస్తవముగాదు. గౌణమే—కవి ప్రౌఢోక్తి కల్పితమే. పురూరవసంవరణములో నూర్వశీ భూములకుఁ గల ముఖ్యాముఖ్యత్వభేదమును జూపుటకయియే, యిచట నాపదములను గాళిదాసమహాకవి, వ్యస్తములుగఁ బ్రయోగించినా డని తెలియుచున్నది.

మఱియొక యుదాహరణము:—

"జనకో జనకో యస్యా యా తాతస్యోచితా వధూః
ఆర్యస్య గృహిణీ యా చ స్తుతి స్తస్యా స్త్రపాస్పదమ్".

అర్థము :—

యస్యాః=ఎవతెకు, జనకః రాజర్షి యగు జనకమహారాజు జనకః=తండ్రియో, యా=ఏసీత, తాతస్య=నాతండ్రియగు దశరథునకు, ఉచితా=తగిన, వధూః=కోడలో, యా=ఏసీత, ఆర్యస్య—ఆర్యుఁడగు రామునకు, గృహిణీ=భార్యయో, తస్యాః స్తుతిః=ఆసీతయొక్క స్తుతి, త్రపాస్పదమ్=సిగ్గుచేటు; అట్టి మహనీయురాలిని స్తుతించుట శక్యముకాని పని యని భావము.

ఇచటఁగూడ జనకమహారాజా మెతండ్రి యని చెప్పుటవలన సీతయొక్క యాభిజాత్యాతిశయము తెలియుచున్నది. 'యా జనకజనకా'

యని బహువ్రీహి సమాసమునే చేసినచో నీ యర్థవిశేషము భాసించె డిదికాదు.—ఇట్టి యుదాహరణములపరిశీలనము వలన బహువ్రీహి సమాసమునందుఁగూడ సమాసాసమాస కృత మగు నర్థభేద మున్న దనియే నిశ్చయ మగుచున్నది.

ద్విగుసమాసము :—

"ఉపపన్నం నను శివం సప్తస్వంగేషు యస్య మే
దైవీనాం మానుషీణాంచ ప్రతిహర్తా త్వ మాపదాం".

అర్థము:—(హేగురో=గురువగునో వసిష్ఠా!—దిలీపుని వాక్యములు) సప్తసు, అంగేషు ః స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్ర దుర్గ బలము లను నేడు రాజ్యాంగములందును, శివం=కుశలము, ఉపపన్నం నను=యుక్తమే; యస్య=ఏ, మే=నాయొక్క దైవీనాం=దైవికములగు నట్టియు, మానుషీణాంచ=మనుష్యకృతములగునట్టియు, ఆపదాం=ఆప దలకు, త్వం=నీవు, ప్రతిహర్తా=నివారకుఁడవో".

మీ యనుగ్రహబలమున నారాజ్యమునకు సంబంధించిన యం గము లేదును బాగుగనే యున్నవని దిలీపుఁడు తన గురు వగు వసిష్ఠునితోఁ బల్కినాఁడు. ఇచట "అంగము ల నుద్దేశించి "సప్తసంఖ్య" విధేయ మగుచున్నది. సప్తసంఖ్యగల యంగములం దనుటచే, నిరవశేషముగ సమస్తాంగములం దనుటచే, నిరవశేషముగ సమస్తాంగములును బాగు గనే యున్న వని భావము వ్యక్తముకావలయును.'సప్తసు'అను విధేయ మగు సంఖ్యావాచకపదమును విడిగాఁ బ్రయోగించుటచేతనే సంపూర్ణ మైన కుశల మున్నది, యను భావము భాసించును. 'సప్తాంగేషు' యని సమాస మున్నపు డీ విశేషము భాసింపదు. అనఁగా సంఖ్యాగత మగు ప్రాధాన్యము భాసించెడిదిగాదు. దైవమానుషము లగు రెండువిధముల యాపదలలో నేదియును, ఏరాజ్యాంగమునందును నెంతమాత్రముఁ గూడ లేదనుటచే రాజునకుఁ గల "శివోపపత్తి" (క్షేమాతిశయము)

పరిపుష్టమై భాసింపవలెననుసభిప్రాయముతోనే యిచట వ్యస్తప్రయోగ మాశ్రయింపఁబడి యుచితముగ నున్నది.

ఇంకొకయుదాహరణము :—

"నిగ్రహాత్ స్వసురాప్తానాం, వధాచ్చ ధనదానుజః
రామేణ నిహితం మేనే పదం దశసు మూర్ధసు".

అర్థము:—ఖరాదిరాక్షససంహారమైనపిదప రావణునకుఁ గలిగిన భావము; స్వసుః=సోదరియొక్క, నిగ్రహాత్=కర్ణాదిచ్ఛేదనమువలనను, ఆప్తానాం=ఆప్తులయొక్క, వధాత్ చ=వధవలనను, ధనదానుజః=కుబేరునిసోదరుఁడగు రావణుఁడు, రామేణ = రామునిచేత, దశసు, మూర్ధసు=తలలు పదింటియందును, పదం=పాదమును, నిహితం=ఉంచఁబడినట్లుగా, మేనే=తలఁచెను.

రావణునియొకతలయందు రామపాద మున్నను రావణునకుఁ బరాభవ మే యగును. తలలు పదింటియందును, రామపాద మున్నట్లే రావణుఁడు భావించుటచే నాతనిపరాభవమునకు మేరయే లేదను భావమిచట వర్ణ్యము.—స్వసుః=అని యేకవచన ప్రయోగముచే, తనకున్న యొక్క సోదరికిఁ బరాభవము జరిగినది అని తెలియుచున్నది. 'ఆప్తానాం' అను బహువచనము,ఆప్తులందఱును జనిపోయినా రను భావమును దెలియఁజేయును. 'దశసు' 'పదింటియందును' అనుటచేఁ బరాభవము యొక్క సాకల్యము గోచర మగును. "దశమూర్ధసు" అని సమాస మున్నచో, 'దశ' (పది) సంఖ్యకుఁ బ్రాధాన్యము భాసించెడిదిగాదు. అపుడీ పరాభవాతిశయముగూడ వ్యంగ్య మయ్యెడిదికాదు. ఇట్లు ద్విగుసమాసమునందుఁగూడ సమాసాసమాసకృతి మగు నర్థభేద మున్నదని తెలియుచున్నది.

నఞ్ సమాసమున కుదాహరణములు :—

"నవజలధర స్సన్నద్ధోయం నదృప్త నిశాభరః" మొదలగు

పద్యములు ప్రసజ్యప్రతిషేధ విచారమునం దింతకుఁ బూర్వమే ప్రదర్శితము లైనవి.

ప్రత్యుదాహరణము :—

"వాచ్యవైచిత్ర్యరచనాచారు వాచస్పతేరపి
దుర్వచం వచనం తేన బహు, తత్రాప్యయమనుక్తవాన్".

అర్థము:—(ఎందువలననే విషయమున) వాచస్పతేరపి=బృహస్పతికిఁగూడ, వాచ్యవైచిత్ర్య రచనాచారు, వచనం, = వాచ్యార్థము యొక్క వైచిత్ర్యము ప్రధానముగ నుండు రచనముచే మనోహరముగ నుండునట్లు చెప్పుట, దుర్వచం=శక్యముకాదో, తేన=ఆకారణముచేత, తత్ర=ఆవిషయములో (అయమ్) అపి=ఇతఁడుగూడ, బహు=ఎక్కువగా, అనుక్తవాన్=మాట్లాడలేదు.

ఇచ్చట 'అనుక్తవాన్' అని చెప్పుటకు బదులు 'నోక్తవాన్' అని యున్నచో బాగుండెడిది. నిషేధమునకుఁ బ్రాధాన్యము భాసించెడిది.

తత్పురుషసమాసకర్తృపదోదాహరణము :—

తత్పురుషసమాసమునందుఁ గర్తృవాచకపదము వ్యస్తముగ నున్నందువలన నౌచిత్యము కలుగు నను విషయ మీ క్రింది పద్యమునందు గమనింపవచ్చును.

"దేశః సోఽయ మరాతిశోణితజలైః యస్మిన్ హ్రదాః పూరితాః
క్షత్రాదేవ తథావిధః పరిభవ స్తాతస్య కేశగ్రహః
తాన్యేవాహితశస్త్రఘస్మరగురూ ణ్యస్త్రాణి భాస్వన్తి మే
య ద్రామేణ కృతం తదేవ కురుతే ద్రోణాత్మజః క్రోధనః".

అర్థము—అశ్వత్థామవచనములు :—

యస్మిన్=ఏదేశమునందు, అరాతిశోణితజలైః= శత్రువులరక్తమనెడు జలముచే, (పరశురామునిచేత) హ్రదాః=సరస్సులు, పూరితాః= నింపఁబడినవో, సః దేశః,అయం=ఆదేశ మిదియే;తథావిధః=అటువంటి

కార్తవీర్యార్జునునికుమారులు జమదగ్ని నేవిధముగాఁ జుట్టుపట్టి లాగి పరాభవించినారో యటువంటి) కేశగ్రహాః=జుట్టుపట్టిలాగుట యనెడు, పరిభవః=అవమానము, తాతస్య=నాతండ్రియగు ద్రోణునకు, క్షత్రాదేవ=క్షత్రియుఁ డగు దుష్టద్యుమ్నునినుండియే (జరిగినది); అహితశస్త్రఘస్మరగురూణి = శత్రువులయొక్క శస్త్రములను నాశనముచేయుట యందు గొప్పశక్తి గలిగినట్టియు, భాస్వన్తి=ప్రకాశించునట్టియు; మే, అస్త్రాణి=నాయొక్క అస్త్రములు, తాన్యేవ = ఆపరశురామునకున్న బ్రహ్మాస్త్రాదులే;క్రోధనః=కోపముగల ద్రోణాత్మజః=ద్రోణునిపుత్రుఁడు, (నేను) రామేణ=పరశురామునిచే, యత్ కృతం=ఏమిచేయఁబడినదో, తదేవ=అపనియే, (క్షత్రియనాశనమునే) కురుతే=చేయుచున్నాఁడు.

ఇచట 'రామేణ' అను తృతీయావిభక్తిపదమునందు, రాముని కర్తృత్వము భాసించుచున్నది. "రామేణకృతం" అనుపదములకు, రామ కర్తృక మగు కృతి యని యర్థమువచ్చును. కావున రామకర్తృత్వ మనునది కృతిలోనికి విశేషణరూపమున నన్వయించును అది యిట్లన్వయించినపుడే, పరశురామునియందలి దారుణతాతిశయరూప మగు నుత్కర్షమును దెలియఁజేయును. ఈ యుత్కర్షాతిశయమును, రౌద్రరస పరిపోషకముగ నుండును.పరశురాముఁడు నిరతిశయశౌర్యశాలి యనియు; మహాభయంకర మగు నిర్దయత యతనిలో రూపొందిన దనియు,సర్వజగత్ప్రసిద్ధమైనవిషయమే. ఇన్నిభావములకు సూచకముగ నుండు 'రామేణ యను పదమునందలి విశేషణత్వము ప్రధానమైన దనుట నిస్సందేహము. ఆ ప్రాధాన్యము భాసించుటకయియే 'రామకృతం' అని సమాసమును జేయక, "రామేణకృతం" అని వ్యస్తప్రయోగ మాశ్రితమైనది.

ఇపుడు కర్తృవాచకమై, వాచకమై, విశేషణరూపము నన్వయించు నొకపదముమాత్రమే యున్న యుదాహరణమును బరిశీలించినాము. కర్తృవాచకపదములు కాని, మిగిలిన కారకవాచకపదములు

గాని యనేకములు, సమానముగ విశేషణభావమును దెల్పునవిగ నుండుచో, నపు డా ప్రయోగము ద్వంద్వసమాసమునకు సంబంధించి నదిగ నుండును. ద్వంద్వసమాసవిచారము సేయునపు డా విశేషణములకుఁ గల ప్రాధాన్యాప్రాధాన్య విచారణము చేయఁబడును. అందుచే ననేకవిశేషణము లున్న యుదాహరణము నిచ్చట నీయలేదు. విధ్యనువాదభావము గల ప్రయోగములకును, పదములకుఁ గల ప్రాధాన్యాప్రాధాన్యములలో భేద మేమియును లేదు. అందుచే నిచట విధ్యనువాద భావము గల యుదాహరణమును గూడ నీయలేదు.

ప్రత్యుదాహరణము:—

"య స్యావమత్యే గురుద త్త మిదం కుఠారం,
డింభో ౾పి రామఇతి నామ పదస్య హర్తా"

ఇందులో "గురుద త్త మిదం కుఠారం" అనునది యుదాహరణము. ఎవనికి గురువుచే నీగొడ్డలి యీయఁబడినదో యని యర్థము—పరశురామునిసేవచే సంతోషించిన యీశ్వరుఁడే—సామాన్య మనుష్యుఁడు కాఁడు—గొడ్డలిని బరశురాముని కిచ్చినాఁ డనుటచేఁ, బరశువు యొక్క మహత్త్వమును, పరశురామునియొక్క యీశ్వరానుగ్రహపాత్రత్వ, మహామహిమత్వములును నిచ్చట వ్యక్తము లగుచున్నవి. గురు (ఈశ్వరుఁడు) పదమే యీయర్థోత్కర్షకు మూలము. కాని యిచట నట్టి గురుపదము, 'గురుద త్తం' అను సమాసములో నంతర్భావము నొంది తన ప్రాధాన్యమును గోల్పోయినది. "గురుణాద త్తం" అని యున్నచో బాగుండెడిది.

కర్మకారకమున కుదాహరణము:—

కృతకకుపితైః బాష్పాంభోభిః సదైన్య విలోకితైః
వన మసి గతా యస్య ప్రీత్యా ధృతాపి తథాంబయా
నవజలధరశ్యామాః పశ్యన్ దిశో భవతీం వినా
కఠినహృదయో జీవత్యేవ ప్రియే స తవ ప్రియః"

అర్థము :—ప్రియే=ప్రియురాల వగు నో సీతా! అంబయా=తల్లియగు, కౌసల్యచేత, తథా=ఆవిధముగ, ధృతాపి=అడ్డుపెట్టఁబడినను, యస్య=ఏనాయొక్క (నాసంబంధమైన) ప్రీత్యా=ప్రేమచేత, కృతకకుపితైః=కృత్రిమకోపములచేతను, బాష్పాంభోభిః=కన్నీళ్ళచేతను, సదైన్యవిలోకితైః=దీనము లగు చూపులచేతను, (నన్ను వశముచేసికొని) వనమ్=వనమునుగుఱించి, గతా=వెళ్ళినదానవు, అసి=అయితివో, సః=ఆ, తవ, ప్రియః=నీకు ప్రియుఁడగునట్టియు, కఠినహృదయః=కఠినహృదయుఁ డగునట్టియు రాముఁడు, భవతీంవినా = నీవులేకుండగనే, నవజలధరశ్యామాః = శ్రొత్తమేఘములచే నల్లనైన, దిశః = దిక్కులను, పశ్యన్=చూచుచు, జీవత్యేవ = జీవించియేయున్నాఁడు.

ఇచ్చట సీతా కర్తృకమైన గమనక్రియకు "వనం" అనునది కర్మ. వనకర్మక మైన గమన మనుటచే, వనము విశేషణమైనది.— ఈ విశేషణము, (వనకర్మకగమనకర్త్రియగు) సీత కుత్కర్షను గలిగించును. వనవాసదుఃఖ మతి కష్టము—అట్టి వనవాసదుఃఖమున కంగీకరించుటచే సీతకు శ్రీరామునియం దతిశయ మగు ప్రేమ యున్న దనియు నితర స్త్రీలు చేయలేని దుష్కరకార్యము నామె యొనర్చిన దనియుఁ దెలియు చున్నది. ఈ భావము లన్నియును సీత కనితరస్త్రీసాధారణ మగు మహత్త్వము నాపాదించును. ఈ మహత్త్వభావనము, రామునియందలి రతి కుద్దీపనవిభావ మగుచున్నది. ఇట్లు వన మను కర్మవాచకపదము రసపోషణమునఁ బ్రధానమై యొప్పుచున్నది. అట్టి 'వన' పదమును 'గతా' యను పదముతోఁ గలిపి "వనగతా"యని సమాసముఁ జేయ కుండుటయే యుచితము. సమాసముఁ జేసినచో మన మిప్పు డనుకొనిన చమత్కారాతిశయ ముదయించెడిదికాదు.

మఱియొక యుదాహరణము—"గుర్వర్థ మర్థీ, శ్రుతపారదృశ్వా రఘోస్సకాశాత్ అనవాప్య కామమ్"

## గద్య

ఇది శ్రీ రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సార
సా(ర)స్వత ధురీణయు, విచిత్ర పత్రికాశత లిఖిత వాచికార్థావగాహన
ప్రవీణయు, తత్ప్రతిపత్రికాశత స్వహస్తలేఖన ప్రశస్త కీర్తియు,
శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు,
అతులితాష్ట భాషా కవితా సర్వంకష మనీషా శారదయును,
రాజనీతి విద్యా విశారదయును, విజయరాఘవ మహీపాల
విరచిత కనకాభిషేకయు, విద్వజ్జనకవిస్తవనీయ వివే
కయు, మన్నారుదాస విలాసనామ మహాప్రబంధ
నిబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ
భాగవత భారత కథాసంగ్రహణ విచక్షణయు,
పసపులేటి వేంకటాద్రి బహుజన్మ తపఃఫలం
బును, మంగమాంబాగర్భ శుక్తి ముక్తా
ఫలంబును, రంగద్గుణ కదంబయు నగు
రంగాజమ్మ వచన రచనా చమత్కృతిం
జెన్నుమీఱు "ఉషా పరిణయం"
బను మహా ప్రబంధము నందు
ప్రథమాశ్వాసము
స మా ప్త ము.

# ఉషాపరిణయము

## —◆ ద్వితీయాశ్వాసము ◆—

క॥ శ్రీ జయ నిత్య నివాసా!
భూజనపాలన వదాన్యభూజ! మహోద
గ్రాజి ధనంజయ! దశది
గ్రాజిత గుణహారి! విజయరాఘవశౌరీ!

వ॥ అవధరింపుము.

క॥ అని పలుకు చెలులపలుకులు
విని కన్నియ సమ్మతింప వేడ్కలు మదిలోఁ
దనరఁగఁ దమదమ యుడిగము
లను వొందఁగఁ జేయఁబూని రా చెలు లంతన్.

సీ॥ పణఁతి యొక్కతె చేరి బంగారుపావలు
పదములఁ గీలించె బాగుమీఱ
చెలియ యొక్కతె చేరి శృంగార మమరంగఁ
గై దండ యొసఁగెను ఘనతమెఱయ
సకియ యొక్కతె చేరి సరిగంచుపనిచీర
నెఱిచక్కఁగా దిద్దె నీటు గుల్క
కొమ్మ యొక్కతె చేరి కొనగోళ్ల చేతను
గురులు నున్నఁగ దువ్వె కొమరుమించ

తే॥ అతివ యొక్కతె పనిహార్వుహారిగ పట్టె
పొలఁతి యొక్కతె యడపంబు పొసఁగఁబట్టె
సుదతి యొక్కతె కపురంపు సురటి విసరె
రమణి యొక్కతె వింజామరంబుఁ బూనె.

వ॥ మఱియును-

సీ॥ దండె తంబుర స్వరమండలంబు రబాబు
వేటుగజ్జెలు ముఖవీణె ఢక్క-
చెంగు కామాచి యుపాంగంబు కిన్నెర
వీణియ తాళంబు పిల్లఁగ్రోవి
చిటితాళము రమయు శేషనాదంబు రా
వణహస్తమును జంద్రవలయములును
మురజంబు నావజంబును మొదలుగఁ గల్గు
కమనీయ వాద్యముల్ గరిమఁ దాల్చి

తే॥ రంగురక్తులు గులుకంగ రాజముఖులు
ముంగలను జేరి త్రిభువనమోహనముగఁ
జెలఁగి సంగీతమేళంబు సేసి కొలువ
వేడుకలు మీఱ నెంతయు విభవ మలర

సీ॥ పదపద్మములఛాయ బాఱిన యెడలను
బఱచిన చెంగావి బాగు మీఱ
నెమ్మేనికాంతులు నిండిన దిశలను
బంగారుమనుపూఁతరంగు కులుకఁ
గలికిలేఁజూపులు గలిగిన బయటను
గలువతోరణములచెలువు మెఱయ
నెఱికొప్పుబలుకప్పు నిగ్గు దోఁచిన చోట్ల
నీలముల్ వెదజల్లు నీటు దనర.

తే॥ బాణనందన మైనట్టి పద్మగంధి
మందయానలు గొలువంగ నందముగను
మనసు నాథునిపై నిల్పి మచ్చి కలగ
వన్నె మీఱిన యుద్యానవనముఁ జేరె.

వ. అప్పుడు-

క॥ రామా! ర మ్మని చెలు లా
రామంబును జూడఁ దలఁచి రమణీయవచ
శ్శ్రీ మెఱయఁ బలికి రీ గతిఁ
గోమలికిని బ్రొద్దు పుచ్చు కోరికతోడన్.

సీ॥ పరిమళంబుల నింపు పసిఁడిక్రొవడి నించె
సంపెఁగల్ చూచితె సరసిజాక్షి !
పంచబాణునికీర్తి పగిది శోభించెను
బొండుమల్లెలు చూడు పువ్వుఁబోఁడి
వనలక్ష్మిమౌక్తిక వనహార మన మీఱె
పొన్న మొగ్గలు చూడు పుష్పగంధి!
ఒప్పారె ధరసేసకొప్పుచందంబున
సేవంతులను జూడు చిగురుఁబోఁడి !

తే॥ మాధవునికొల్వుకూటాలమాడ్కిఁ దనరెఁ
గన్నె! చూడుము పుప్పొడితిన్నె లిచట
ననుచుఁ జెలి నెచ్చరించుచు హర్షమునను
వనవిహారంబునకుఁ బూని వనజముఖులు

రగడ

జలజాక్షి! చూచితె! సరవిఁ గనకము లిందు
తొలఁగె నళులెల్లను దూరముగ నిటులిందు

చెలియ(రో!)పలుమాఱు చేయకుము [1] వాదులను
వెలయేల! కైకొనుము వేగ విరవాదులను
కొమ్మ! యీ విరిబంతి కొసఁగ నా చెలితరమె
తుమ్మెదలు ఝంకృతులఁ దొలఁగ నడిగో! [2] తఱిమె
సుదతిరో! వింతాయెఁ జూడు మిట నీడలను
మదనునిహజారములమూడ్కిఁ దగె [3] నీడలను
పొలఁతిరో! మకరందముల మీఁకె నిదె పొగడ
చెలరేఁగి పలుమాఱు చెల్లదే యిఁకఁ బొగడ
హరిణాక్షి! పరికింపు మచటి కింశుకములను
మెఱుఁగారు విరుల నామెతలుసేసె శుకములను
పారిజాతము చూచి పరువెత్తె మున్న యది
మూరునెలగో లిచట మలసి పిక మున్నయది
కంతునకు నర్పింప, గమనజితవేదండ!
వింతగాఁ గూర్చెదను వేగ మీవే దండ
అలరుగుత్తిది దానిదఁట యిమ్ము నీ కేల?
కెలన నున్నది విరుల్ గిల్లు మిదె నీ కేల
నగువారిఁ జూడు మెన్నఁడుఁ గాన మీ వింత
చిగురాకునకు రాఁపు సేతువా నీ వింత
కోరి నేఁ దెచ్చితిని గోరంటవాసనను
ఔర నే నెటు లిత్తు నడిగి దీ వాసనను

---

(1) వాదములు-అని ప్రతిపాఠము. రగడలోని యంత్యప్రాసనియమమును బట్టి యిది వ్రాఁతపొరబా టని తోఁచెడిని.
(2) 'తఱిమె' క్రియకు వ్యావహారికము.
(3) 'ఈయొడలను' అని యర్థము.
(1) అడిగెదు + ఈవు + అసన్ + వను. అని విసంధి.

అదిర ! దవ్వుగఁ బోయి యరికట్టె నిది రాఁగ
నెదురుగా విరిసరుల కింతి! యెంతటి ఱాఁగ

మల్లె మొగ్గలు మీఱె మరునిసెలగోల లన
నెల్లెడలఁ దనచాయ లెనయ నిదిగో లలన

బింబోష్ఠి ! యేనె తగఁ బెంచితి [1] రసాల మును
డంబైనయట్టి నీడల యీ రసాలమును

ఎంత దూరము చనియె నెంచు కే యీ లేమ
కంతుపూజకు నన్నఁ గనకములె యీ[2] లేమ ?

వేడుకలు నించె నిట వెలఁది! నారంగములు
నాడగా గుంపులై యలరె సారంగములు

అవుర ! బంగరుచాయ నలరె జంబీరములు
యువతి ! నీ కుచము లెనయునె ? పట్టిబీరములు

కురువిందగుత్తి గైకొను మేల జగడంబు ?
పరికింపు దీనికిని ప్రతి యగునె పగడంబు ?

చాలు నిఁక నన లనుచు సరసోక్తులను బెనుచు
బాళి మీఱఁగఁ జాల బాణనందన ప్రోల.

క. వనకేళి సలిపి యీ గతి
నెనసిన తమ మేనిబడలి కెంతయుఁ దీఱఁ
దనరెడు తామరకొలనికి
వనజేక్షణఁ దోడుకొనుచు వచ్చిరి వేడ్కన్.

సీ॥ తావులు వెదజల్లు తామరవిరి యను
ముద్దులుఁగులుకు నెమోమ్ముఁ దనర
డాలు గల్గినయట్టి వాలుగమీ లను
కడు సోగలై మించు కన్ను లమర

(1) అనురాగరూపనీరములతో—అని యర్థము
(2) ఈయ లేమ ?—అని యర్థము

మక్కువ గనుపట్టు జక్కువ లనియెడు
కొమరు మీఱిన గబ్బిగుబ్బ లలర
ఒమ్మిగాఁ జెలువొందు తుమ్మెదగుం పను
కప్పు మీఱిన గొప్ప కొప్పు మీఱ
తే॥ గీ॥ హంసగమనంబు లను గతు లతిశయిల్లఁ
దరఁగ లనియెడు బాహులు తనరఁ జాచి
సరసి యనియెడు చెలికత్తె సంభ్రమమున
బాణతనయ నెదుర్కొనె భావమలర.

క. ఒక రొకరిచేయి గ్రుచ్చుక
పకపక నవ్వుచును మిగులఁ బంతము మీఱన్
వికచాబ్జనయన లయ్యెడ
నకలంకం బైన సరసి నాడుచు వేడ్కన్.

సీ॥ ఈఁత యిక్కడ నుఱ వింతిరో ! ర మ్మని
చేరంగఁ బిల్చెను జెలియ యొకతె
చిమ్మనఁగ్రోవులఁ జిమ్మెద వేగ మ్మ
యొడ్డించుకొ మ్మనె నువిద యొకతె
నేర్పున నీఁదెద నెలఁత ! యిచ్చోటను
దను జూడు మని పల్కెఁ దరుణి యొకతె
కలువపువ్వులు గోసి కలికి ! నీ కిచ్చెద
నెన్నంటి ర మ్మనె నెలఁది యొకతె
తే॥ మాటిమాటికిఁ జాలుగుఁబీఁట లెక్కి
సారసాక్షులు కొందఱు జాతి సారె
నొండొరులమీఁద జలములు నిండుకొనఁగఁ
జల్లు లాడిరి సరసిలో సరసముగను

సీ॥ ఒప్పైన కుచములకు నోడిపోయినయట్లు
తుమ్మెదగుంపులు తొలఁగఁ బాఱె
స్తనయుగ్మములకును సరి రా మనెడులీలఁ
జక్రవాకంబులు సరగ నెగసె
గమనంబులకుఁ గుంది కడ నుండుకై వడి
నంచలు పార్శ్వాల నణఁగియుండె
కనుదోయితో సాటి గాంచలే మనురీతి
జలములలోఁ దాఁగె సారెమీలు

తే॥ కోమలు మీఱు కరేణువుల్ గొలను జొచ్చి
మించి వేడుకతో విహరించునట్లు
బాణనందనఁ గూడి య ప్పద్మముఖులు
సరసిలోపల జలకేళి సల్పునపుడు

క॥ ఇవ్విధమున విహరించిన
జవ్వను లందఱునుగూడి సంతస మమరన్
పువ్వులబోణిని దోడుక
నవ్వుచు గట్టెక్కివచ్చి నైపుణి మీఱన్

ఉ॥ బొమ్మలపట్టుకోకలను
బొంకము మీఱఁగఁ గప్పి, మేలిపూ
సొమ్ములు మేనఁ దాల్చి కడు
సొంపమరన్ జడ లల్లి వింతగా
నెమ్మని గీటునామములు
నీటుగ దిద్దుచుఁ, దీవమేనులన్
గమ్మజవాదివాసనలు
ఘుమ్మని మీఱ సలంది వేడుకన్

క॥ బటు వగు మామిడిక్రిందను
గుటిలాలక మదిని మించు కోర్కులు వెలయన్
స్ఫుటముగ మదనుని భావము
పటమున లిఖియించి తెచ్చి ప్రమదము మీఱన్

క॥ పుష్పాడిని దిన్నె దీర్చుచు
నొప్పుగ మృగనాభి యలఁది యొదవిన వేడ్కన్
కప్పురపుముగ్గు లిడుచును
దెప్పలుగాఁ దమ్మివిరులు దెచ్చుచు మఱియున్.

సీ. ప్రతిలేని రతనాల పండ్లెంబులోపల
గంధంబు కుంకుమ కస్తురియును
పసిఁడియక్షతలును బండ్లు టెంకాయలు
పన్నీరుచెంబులు బాగుమీఱ
కపురంపుబాగాలు కలువపూబంతులు
మొగలిరేకులు మంచిమొల్లవిరులు
కురువేరు దవనంబు గొజ్జఁగ సరులును
బొండుమల్లెసరాలు పొన్నపువులు
తే॥ గీ॥ మొదలుగాఁ గల వస్తువుల్ ముదము మీఱ
తెచ్చి ముందఱ సవరించి తేజ మమర
పచ్చవిల్తుని నచ్చటఁ బరగ నిల్పి
బాణనందనఁ దోడ్తెచ్చి బాగుమీఱ

సీ॥ ధ్యానంబు నారాయణాత్మసంభవునకు
నావాహనంబు రత్యాప్తునకును
సింహాసనంబు రాచిల్కతేజీరాతు
కర్ఘ్యంబు వారిచరాంకునకును

పువ్వులదుప్పటి పూవింటిజోదుకు
గంధంబు మలయూతుగ ప్రభునకు
నలరుదండలు కుసుమాకరసఖునకు
ధూపంబు భూరిప్రతాపునకును
తే॥ దీప మఖిలానురాగప్రదీపునకును
సరస నైవేద్య మిది యిక్షుచాపధరున
కనుచు వివిధోపచారము లాచరించి
య య్యుషాకన్య మ్రొక్కించి యందముగను.
సీ॥ అఖిలజగన్మయుం డైనట్టి హరియును
శ్రీసతి నెద నుంచెఁ జెలువముగను
సకలంబు సృజియింపఁ జాలినబ్రహ్మయు
వాణిని నెలకొల్పె వదనసీమ
సతిరౌద్రుఁడై యుండునట్టి ముక్కంటియు
సామేన నుంచెను సతిని ప్రేమ
నల పరాశరమౌనియంతటివాఁడును
మత్స్యగంధిని గూడె మమతచేత
తే॥ నితరు లన నెంత? నీ దాడి కెంచి చూడ
నీకు నెన యెవ్వరయ్య? త్రిలోకములను
బాల యెటువలెఁ దాళు నీ బాణములకుఁ
గన్నెఁ గావుము మదన! నీ కరుణచేత
వ. అని సన్నుతించి య క్కన్నియచేత మ్రొక్కించిన.
క॥ కుతుకము మీఱఁగ నా మది
చతురతగలఁగలిసినట్టి సరసగుణాఢ్యున్
బతి సేయు మనుచుఁ గోమలి
రతిరాజును వేఁడుకొనియె రంజిలుభక్తిన్

వ. అంత

క॥ అరు దగు తన సతినామము
తిరముగ ధరియించునట్టి తెఱవకు నింకన్
పరితాపం బిడరా దని
ఖరకరుఁ డస్తాద్రిఁ జేరెఁ గనికర మొప్పన్.

మ॥ కమలంబుల్ ముకుళించె భృంగములెఱుఁగుం
కారంబు తోరంబుగాఁ
గుముదశ్రేణులయందు మించె; ఖగముల్
గూఁడుల్ వడిన్ జేరె; సం
తమసంబుల్ దిశలందుఁ జేరెఁ; గడు వం
తన్ గుందెఁ జక్రావలుల్
కమనీయద్యుతిఁ జెందెఁ దారకలు నా
కాశంబునం దీరుగన్

సీ॥ చీకటు లనియెడు సింధురశ్రేణులఁ
జెండాడ వచ్చిన సింహ మనఁగ
నమరులు మథియింప నల క్షీరవారిధి
వెలువడి కనుపట్టు వెన్న యనఁగ
ధూర్వది కన్నునట్టి తొయ్యలి ధరియించు
మురువైన ముంగెరము త్తె మనఁగ
వాలిదీవిలో నున్న వెన్నునిసన్నిధిఁ
బట్టిన పలుపగల్వా త్తి యనఁగ

తే॥ గీ॥ వెలయఁగఁ జకోరకముల కెల్ల విందుచేసి
కువలయామోద మొనరించి కొమరుమీఱ
కూడియుండెడి విటులకుఁ గోర్కె హెచ్చ
చంద్రుఁ డుదయించె సత్కాంతిసాంద్రుఁ డగుచు.

# ద్వితీయాశ్వాసము

వ. అట్టి సమయంబున

క॥ పల్లిసూఁ డై మొలె నరవిరి
చల్లడమున్ జివ్వురుదట్టి సవరించి తగన్
మల్లెవిరి బొమిడికం బిడి
మొల్లజిరా దొడిగి మిగుల మోదముతోడన్.

సీ॥ చెలరేఁగి యెలదేఁటి యెలగోలు మూఁకలు
దులదుల మునుమున్ను దుముకు లిడఁగ
దండిమై రాయంచ దండిబారా వెంట
మెండుగా నెల్లెడ నిండి నడన
నిరువంకలను జేరి గోరింకమన్నీలు
బలుబింకములతోడఁ బ్రబలి కొలువ
గుంపు గూడుక గండుకోయిలమాష్టీలు
వెన్నాని కైమదోద్వృత్తి రాఁగ

తే॥ గీ॥ చిఱుపతెమ్మెరదళవాయి సరసఁ జేరఁగ
తేజ మమరంగ రాచిల్క తేజి నెక్కి
తమ్మిదోడుమ్మి కలువ కేడెమ్ముఁ బూని
తలిరువిలుకాఁడు బోటిపై దాడివెడలె.

ఉ॥ పాయని భీతిఁ బాంథులకు
భగ్గున గుండెలు బెగ్గటిల్లఁగాఁ
గోయిల లంటి వెంటఁ జని
కో యని యార్వఁగ, జంట తుంటవిల్
రాయలు తమ్మికైదువ ఝు
రా యని దూయుచు దొమ్మి కొమ్మపై
ధే యని కల్కి రాచిలుక
తేజిని నూకె దువాళి మొప్పఁగన్

క॥ ఆయెడ వలరాయఁడు బలు
రాయిడి కెందమ్మిజిగికరాచూపులచే
నాయమ్ములు గాయమ్ములు
చేయన్ మదిరాక్షి బెగడెఁ జిత్తములోనన్.

క॥ కలఁ గలసిన యల చెలువుని
చెలువము దమి నెంచ నెంచఁ జిత్తములోనన్
వెలి విసరె సత్త్వసంభవ
లలితవికారంబు లపుడు లజ్జావతికిన్.

చ॥ సరసిజపత్త్రనేత్రి కల
చందము డెందములోనఁ బూని ప
ల్మరు మరుచూలి యేలిన క్ర
మంబు గణించ మరుండు సించఁగా
గఱులకు గాఁడి వాఁడి సరి
కట్టిన కల్వలకోరిచాలు మే
మురువున రూపుమై పులక
ముల్ బొరసెన్ మొరసెన్ ద్విరేఫముల్.

చ॥ సలలిత మైన చందనము
చాయను మాయఁగఁ జేసి కప్రపుం
బలుకులతళ్కు-పూఁత నగు
బా టొనరింపుచు గబ్బిగుబ్బలన్
నెలకొను సిబ్బెపున్మెఱుఁగు
నీటును మాటు సనంగపాండిమల్
బలవడె నింతిమేనఁ గుసు
మాయుధకీర్తి సమానమూర్తియై.

సీ॥ మించుమొగ్గలను రాణించు తీవియ నీస
డించు చెల్వంబు వరించ నెంచి
డంబుమొత్తెపూఁజక్కడంబుడాల్మరుని బె
త్తంబు నేల్మెఱుఁగుమొత్తంబుఁ దాల్చి
యొనపగిమంచుచే నెసఁగు తొల్కరివిప్పు
పసిఁడిగేదఁగిఱేకుమిసిమిఁ దెగడి
చిలుపనీటను బొందు నిలుపఁబోలు మెఱుంగు
మలపఁజాలు తెఱంగు తెలుపుమీఱి

తే॥ గీ॥ మెఱయు చిఱుచెమటూనిన మేనఁ జాన
యుల్లసిలువల్లభుని యెద నుండునట్లు
డాలువాలుగదొరపూలకోలలేటు
నాటి సాత్త్వికభావంబు తేటపఱుప.

తే॥ గీ॥ వనజముఖి యౌర ! యబల యయ్యును జగత్ప్ర
సిద్ధు ననిరుద్ధుఁ దనలో నిరుద్ధుఁ జేయ
బద్ధవైరంబు మరున కా భ్రమరకచకు
దానిచే నయ్యె; సుతునకై పూనుకొనరె !

చ॥ కనుతెఱఁ గొప్పియున్ గనదు,
గాంచు గణించఁగఁ బారవశ్యమున్
వినుతికి నెక్కు నామధుర
వృత్తి వహించియు మాటలాడ దా
మునుకొని యట్టివారలకు
మోహ మొనర్చును గాఁక కిమ్ముగన్
గనుఁగొన భేదమా ! కలువ
కంటికి మారుని తుంటవింటికిన్.

క॥ కలకల నవ్వుచు నుండుఁ
బలుమాఱును దిశలు చూచు భ్రమయుచునుండుఁ
నిలిచిన చోటను నిలువదు
కలకంఠికి విర (హా) మెంత ఘనమో యకటా !

వ. యివ్విధంబున

క॥ మరుకాఁకల భ్రమ నొందుచుఁ
బరువడి నుసునుసుర మనుచు భామిని మదిలో
వరునిం దలఁపుచు నుండఁగ
వెఱఁ గందుచు నెక్కసకియ వెలఁదుల కనియెఁ.

సీ॥ అతివ ! దాఁగిలిమ్రుచ్చు లాటలాడుద మన్న
సమ్మతించ దొకింత చంద్రవదన
చెండు గోరింతము చెలియ రమ్మనిఁ పిల్వ
గనువిచ్చి చూడదు కలువకంటి
గుజగుజ రేకులఁ గొమ్మ ! యాడుదమన్న
మోమెత్తి చూడదు ముద్దుగుమ్మ
పగడసాల మనము పడఁతి యాడుద మన్నఁ
బలుకదు మనతోను బద్మనయన

తే॥ గీ॥ అతివ ! చదరంగ మాడుద మనుచుఁ బిల్వ
నించుకంతయు నంగీకరించదయ్యో
యనుచుఁ దమలోన వగచుచు నతివఁ జేరి
మరునితాపంబు చల్లార్చు మనసుతోడ.

సీ. బాణనందనకప్డు పణఁతు లందఱుఁ గూడి
శైత్యోపచారముల్ సలుపగోరి

చిగురాకుపాన్పుపైఁ జెలియ నొయ్యన నుంచి
పూలదుప్పటి మేనఁ బొసఁగఁ గప్పి
కపురంపువాసనల్ ఘుమ్మన వాసించు
చెలువగందము పూసి చెలువు మెఱయ
పన్నీటఁదడిసిన పావడచేతను
మొగమునం దడియొత్తి మోద మమర.

తే॥ కలువపూవులబంతులు కన్నుదోయి
మాటిమాటికి నొత్తుచు మమత మీఱ
పూలసురటుల విసరుచుఁ బొంకముగను
మరునితాపంబు చల్లార్చ మగువ కపుడు.

సీ. చెలువుమీఱినయట్టి చిగురాకు పానుపు
చిగురువిల్తునివాఁడి చిలుకు లయ్యెఁ
బొసఁగంగఁ గప్పిన పువ్వులదుప్పటి
పంచబాణుని బాణపంక్తు లయ్యెఁ
గన్నుల హత్తించు కలువపువ్వులబంతి
వలరాజుమొల నున్న వంకియయ్యెఁ
దనువున నించిన తామరతూఁడులు
కుసుమసాయకునిలకోరు లయ్యె

తే॥ జెలులు గావించు సుపచారములె తలంప
మనసిజుని సాధనంబులై మనసులోనఁ
దోఁచుచుండంగ విరహంబు ద్రోయలేక
యేమిఁ సేయుదు నె ట్లోర్తు నే నటంచు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి బి ఇ డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోరా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

శ్రీ ఏచూరి సీతారామారావుగారు, బి. ఏ.,

రిపబ్లిక్ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక



దేశభాష లందు తెలుగు లెస్స


సంపుటము ౪౪

సంచిక ౬

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.
శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౪ { మన్మథ సంవత్సరము / మాఘ-ఫాల్గుణమాసములు } సంచిక ౬


## పునఃకటాక్షము

వద్దిపర్తి చలపతిరావు

1

ఉ. దేవిరో! వీణపై ముసుఁగు
దీయుము; మెట్టులు గీలుకొల్పి యా
రావులు తీవులన్ మిస మి
టారము సేయుము; మూఁగగొన్న ప్రాఁ
దీవియలన్ జగాజిగిని
దీర్పుము; తేకులు వేయి విచ్చి నా
పూవుబెడంద దీయములు
పొంగులువాఱఁగ మీటుమీ శ్రుతుల్.

2

ఉ. శాపము దీఱి నీదగు ప్ర
సాదము పైకొని నేఁడు కావ్య మా
లాపము సేయఁగాఁ దెలుఁగు
లం దలకొంటిని; నేనె నీవుగా
రూ పొడఁగూర్చి, నా పలుకు
లువ్వులు అవ్వలు గాక బాసలోఁ
దీపులు చేఁపగా నను మ
తింపుము; తేనియ్చుకొనన్ సుధాక్షుధల్.

3

చ. రగిలిచి తెన్నఁడో మధుర
రాగము నీ పదరక్తిమన్; దరా
దిగ నది యొక్కటే బ్రతుకు
తీపిగ నే దిగఁద్రావికొంటిని; ఈ
సెగసోగ లైన నెవ్వగలఁ
చిచ్చుజలందున నేఁ డదొక్కటే
దిగఁబడిపోయె, నింత తడి
తీయని గుండియలోని పచ్చిగా

4

ఉ. ఆ పసిపచ్చియే యిప్పుడో
కంతలు మోసులువెట్టి, పూఁతలున్
బూపలుఁ గమ్మ కమ్మవల
పుల్ బులిపించెడి తేనెకై పుతీ
తీపులకై తగా బ్రతుకుఁ
ద్రేన్చుకొనన్; వడగాడ్పు దెబ్బలం
దూసిరిగొన్నటుల్ దివుటి
లూరును నీ పదదోహదంబులన్.

5

మ॥ ప్రకృతిన్ బన్నిన వన్నియల్ నెలిసిపో
వన్ గాసె నీ దివ్యవ
ర్ణకళల్ పున్నమపండువెన్నెలలు—దా
నన్ మంగళస్నాత మ
ట్లొక శుద్ధం బగు సత్పదార్థమునఁ గా
యువ్వం గొన్న నా చూడ్కి ము
కుకు సూక్షై తెకతేర నిన్ను నరఁ గ
న్గోసాఁగె నీ నాఁటికిన్

# శ్రీమద్రామాయణము - మానవత్వప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

వానునికిఁ దన కామసుఖమునకై దివ్యచందన మర్పించి పూజించిన కుబ్జను భగవానుఁ డామెవక్రతను బోఁగొట్టి సర్వసౌఖ్యము లబ్బఁజేయుటయే కాక సర్వయాదవవినాశమునం దా త్రివక్రకుమారుఁ డగు యుపశ్లోకుని రక్షించి లోకమునకు మేలొనంగుటకై వానిని నియమించెను. ఇంతకన్న నా కామశక్తియందలి దైవశాక్షిన పరిణామములకు వేఱు నిదర్శన మేమి కావలెను? కావున నీ తీరున మానవునియొక్కయు, మనుష్యలోకముయొక్కయు, సముద్ధరణముకొఱకై మానవులై యీలోకమునందుఁ జిరకాలము నివసించిన శ్రీరామ శ్రీకృష్ణాదుల చరిత్రములందుఁ గేవలదైవమునుగూర్చియే ప్రతిపాదింపఁబడినచో నయ్యవి యెటుల మానవాదర్శకము లై సంగతార్థములు కాఁగలవు? ఈశ్వరుఁడే సృష్టియంతయుఁ బలురకములుగ భావించి భావించి తుదకు మానవుని సృజించి యావిష్కరించి కృతార్థుఁ డయ్యె నని వ్యాసభట్టారకుఁ డీ తీరున నిరూపించియుండెను.

శ్లో. "సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మశక్త్యా
వృక్షాన్, సరీసృప, పశూన్, ఖగ, దంశ, మత్స్యాన్
తైస్తై రతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోక ధిషణం ముద మాప దేవః".

(శ్రీమద్భాగవతము).

"బ్రహ్మావలోక ధిషణం పురుషం విధాయ" యనుటలోఁ గల స్వారస్య మేమి? ఈశ్వరతాదాత్మ్యము నొందఁగలవాఁడీ సృష్టియందు మానవుఁ డొక్కఁడే! అట్టి యవాఙ్మానసగోచర మగు నద్వయానందపదవి దేవతలకుఁగూడ నగమ్యము! వారు "క్షీణే పుణ్యే మర్త్య

లోకం విశంతి" పుణ్యభోగానంతర మీ మర్త్యలోకమునందుఁ బుట్టి వేద బోధిత కర్మల నీశ్వరార్పణముగ నాచరించి,జ్ఞానవైరాగ్యసిద్ధిని గాంచి మోక్షము నందవలెను గాని వేఱొండుమార్గము లేదని మనకుఁ బ్రమాణగ్రంథ మగు గీత చెప్పుచున్నది. అట్టి నిరతిశయపదవి సాధించుట యెటులనో మానవునకుఁ జూపుటకే శ్రీరామచంద్రుఁడు చిన్ననాఁట నుండి మహర్షులసాంగత్యమునందుఁ బరిపక్వహృదయుఁడై కామక్రోధ లోభ మోహమదమాత్సర్యములను దన యింద్రియ నిగ్రహశక్తిచే గెలిచి వేద ధర్మానుష్ఠానమును బదునాలుగువత్సరము లరణ్యములందు ఋష్యాశ్రమములందును బరిపూర్ణముగఁ దెలిసికొని యాచరించినధీరుఁడు. కావుననే యాతఁడు భగవంతుఁ డయ్యెను. రావణసంహారానంతర మాతఁ డొకవంక "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం" అని యెలుఁగెత్తి చెప్పుచున్నను "కాదు ! కాదు ! నీవు సాక్షాద్భగవంతుఁడ" వని బ్రహ్మరుద్రేంద్రాదులు నిర్ణయించి ప్రబోధించిరి ! "తత్త్వమసి" త్యాదివాక్యములచే మన కుపనిషత్తులు, భగవద్గీతలు, బ్రహ్మసూత్రములు మున్నగు గ్రంథరాజములు నిరంతర మెన్ని విధముల నీవు బ్రహ్మముగాని వేఱొండుగా వని బోధించుచున్నను మన కట్టి యఖండ వైరాగ్యజ్ఞానాదులు కలుగుచున్నవా ? లేదు !, ఎందుచేత ? మన హృదయమునం దావరించిన యజ్ఞానము, కామ, క్రోధాదులు, మన కట్టి స్వస్వరూపజ్ఞానమును గలుగనిచ్చుటలేదు. అయోధ్యాకాండారణ్యకాండ కిష్కింధాకాండలయందు శ్రీరాముఁడుగూడఁ బూర్తిగ నిర్జితకాముఁడు గాకుండె నని యే మనకు వాల్మీకి చెప్పుచుండెను. భవభూతి యనినటుల "అశిథిలపరిరంభ వ్యాపృతైకైకదోష్ణోః" యని యాతఁడు సీతమ్మకౌఁగిళులందుఁ జొక్కుచుండి నంతకాల మాయుదారమూర్తి కామము నెటుల జయించె నని చెప్పఁగలము? పైఁగా నామె వియోగమువలన నాతఁడు దుర్భరసంతాపముఁ జెందుచు మిత్రుఁ

డగు సుగ్రీవునియాలస్యమున కాతనిఁ జంపుదు నని కబురువెట్టెను. అట్టి కామముచే శ్రీరాముఁడు సీతావియోగదుఃఖము భరింపఁజాలక చచ్చు ననియేకదా మూర్ఖుఁ డగు రావణుఁ డామెను హరించెను! కాని రావణసంహారానంతర మా రామచంద్రుని గమనికను గమనింపుఁడు. నిజముగ శ్రీరామునియుద్రేకమును గుర్తించినచో రావణసంహారానంతర మాతఁడు ముందుగ సీతవద్దకుఁ బోవుటగాని సీతను దనవద్దకుఁ దెమ్మనుటగాని జరిగించియుండవలెనుగదా! అటుల నాతఁ డొనరించెనా? ముందుగ విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేక మొనరింపఁజేసి యాతని యనుమతిని గైకొని యాంజనేయుని బంపి సీతకుఁ దన విజయవార్త నెఱింగింపఁజేసి యామె యొకవంకఁ దన తాపసిరూపముతో శ్రీరాముని దర్శింపవలె నని యున్నదన్నను సరకుఁగొనక నామెకు విభీషణ స్త్రీలచే శృంగార మొనరింపఁజేసి యుద్ధభూమికి రావించి తుదకుఁ గర్ణకఠోరోక్తులచే నామెను బూర్తిగ నొప్పించెనేగాని యామెను స్పృశింప నైన లేదునరికదా, యొక్క యనునయవాక్యమునైన శ్రీరాముఁడు పలుగలేదు! తుద కగ్నిముఖమునఁ బవిత్రయైన యామెనుగూడ "కానిండు బ్రహ్మరుద్రేంద్రాదు లగు పెద్దలు మీరు చెప్పుచున్నారు గావున నేను బరిగ్రహింతు" నని చెప్పి యామెను దిరుగఁ బరిగ్రహించెనే కాని యా త్రిలోక సుందరియుఁ బరమపతివ్రతయు నగు భార్యకొఱ కంత యావేదన చెందిన శ్రీరాముఁ డారీతి నామెను నిరాకరించుట గాంచినచో నాతఁడు నిర్జితకాముఁ డని వేఱుగ దుందుభులు మ్రోయింపవలెనా? లేక నేఁటి మహాత్ములవలెఁ బత్రికలలోఁ బ్రకటింపవలెనా? కావున శ్రీరాముని జితకామత యనన్యసామాన్యము! అద్వితీయము! శుక, భీష్మాంజనేయాదులు శ్రీరామ శ్రీకృష్ణులకు మ్రొక్కి రనుట కాశ్చర్యమేమి? "వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసితయేవ ధీరాః" అని నాఁడు కాళిదాసు. అందుచేతనే యారాజచంద్రుని దైవముగ దేవతలు

గుర్తించిరి. మానవులు నేటికిని బూజించుచున్నారు. అద్దానిని గాంచియే, రాముని ప్రవర్తన మంతయు నొక నాటకముగాఁ గొందఱు గ్రంథకర్తలు వర్ణించిరి.

అధ్యాత్మరామాయణాదిగ్రంథములందు శ్రీరామునిచర్య లన్నియుఁ గేవల మాభాసమాత్రములుగా నిర్ణయించి యాతనిపాత్రము నొక మనుష్యవేషమును ధరించిన శ్రీమహావిష్ణువుగా నందు సంతరించిరి. అతఁడు మనుష్యజన్మ లీలామాత్రముగ నెత్తె ననియుఁ బ్రతిక్లిష్ట సమస్యయందు నా యుదారుఁడు "నేను విష్ణువు, నీవు లక్ష్మివి మన మిద్దఱ మీ నాటక మాడుటకై యీ వేషములను ధరించితి"మని సీతా రాము లనుకొనుచుండిన ట్లందు లిఖింపఁబడెను! నిజమునకే సృష్టియంతయుఁగూడ నొక మహానాటకమే యని యొక పాశ్చాత్యోద్గ్రంథకర్త యగు షేక్స్పియరు మహాకవి యాతీరునఁ దన "As you like it" అను నాటకమునందుఁ జేర్కొనెను.

"All the world is a stage,
And all men and women merely players;
They have their exits and entrances;
And one man in his time plays many parts etc"

ఆ తీరున నీ ప్రపంచములోని మానవు లందఱుఁ దాము కేవల పాత్రాధారుల మని గుర్తెఱుంగుచున్నారా? అట్లెన్నినచో నీప్రపంచములోని తగులాటము లన్నియుఁ ద్రుటిలోఁ జల్లాఱునా? సృష్టి యాఁగి పోవదా? చూడుఁడు! మన ప్రధానమంత్రిపుంగవు లే తీరున మన దేశమునం దంతకంతకుఁ దమోగుణ మావరించుచున్నదో దెలుపుచున్నారు. The more intelligent the people were, the more they lacked the capacity to pull together after taking their decisions in a democratic way and to carry out those decisions". (Speech in the Amrutsar Congress on 7-2-1956.)

బుద్ధికౌశలతవలన విజ్ఞాన మబ్బు ననుట యసంగతము. శాస్త్రాధ్యయనముచేత వైరాగ్య మబ్బు ననుట శశవిషాణప్రాయము. సీతారాములు, లక్ష్మీవిష్ణువు లైనచో రావణ కుంభకర్ణాదులు మాత్రము జయ విజయులు కారా? వారికిమాత్ర మీ మాయావనిక నేల వర్తింపఁజేయవలెను? కొన్ని రామాయణములందు రావణుఁడు సీతను బూజించుటకే గొంపోయె నని రచింపఁబడినది! కాని వాల్మీకి మహర్షి మాత్ర మట్టి యవకతవకలం బడక శ్రీమద్రామాయణమునందు రాముని, సీతను నిజ మగు మానవులుగనే యత్యంత మనోహరముగఁ జిత్రించి మానవలోకముకు 'రామాదివ ద్వర్తితవ్యం న తు రావణాదివత్' అనుటకొక మహత్తరాదర్శప్రాయ మగు దంపతులను జూపియున్నాఁడు. ఒకవేళ నాటకమునందువలె శ్రీరాముఁడు నటించియుండినచో స్మశాన వాటికయం దేడ్చినది లలితకుమారి కాని, నిజమగు చంద్రమతి కాదనియు, నా కాటికాపరి హరిశ్చంద్రుఁడు గాఁడు వెంకట రావనియు మనము హరిశ్చంద్రనాటకమునందు గుర్తింపఁగడంగుదుమేని యట్టి యాభాసరసము ననుభవించుటవలన మన కే విధముగ నిజ మగు రసనిష్పత్తి కలుగఁగలదు? ఇఁక నా నాటకమును మనము చూచు టేల? ప్రవర్తకులు ప్రదర్శించు టెందులకు? వాల్మీకి తన రామాయణమే ప్రమాణ మనియు, నదియే శ్రీరాముఁడు విని సమానందించి యథార్థముగ నున్న దని "సర్టిఫికెట్టు" నిచ్చె ననియు వ్రాసుకొనుటయే కాక మహాకవి యగు బ్రహ్మగారుకూడ దాని నామోదించిన ట్లీ రీతిని వాకొనియున్నారు.

శ్లో॥ "తత స్తుతా రామవచః ప్రబోధితా, వగాయతాం మార్గవిధాన
సంపదా।
సచాపి రామః పరిషద్గత శ్శనై ర్బుభూషయాసక్తమనా
బభూవహ" (1-4-31).

శ్లో॥ "న తే వాగనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి।
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమాం"(1-2-35)

అదియును గాక శ్రీరామునిగూర్చిన వాల్మీకిప్రశ్నమునం దాతఁడు

నారదుని నడుగుటలోఁ గూడ "అస్మిన్ లోకే" అనియు; "సాంప్రతమ్" అనియు, "చారిత్రేణ చ కో యుక్తః" అనియుఁ దనకు మంచి గుణములు గల మనుష్యునిగూర్చి చెప్పు మనెనేకాని లోకాతీత మగు నొక సుప్రసిద్ధనటకునిగూర్చిగాని, యెవ్వరో దైవగోళమునుండి వచ్చిన వానింగూర్చి యుపదేశింపు మని గాని యడుగలేదు. అట్టి నటకునిచరిత్ర మును మానవుఁ డెటుల తన నడవడికి నొరవడిగాఁ బెట్టుకొనఁగలఁడు? ఎవ్వియో గొన్ని యనఁగా, నొకటి, రెండు, మూఁడు విషయములకన్న మిగిలిన వన్నియు మానవుఁడు పూనుకొనినచో ననుష్ఠింపఁజాలని వేవియు రామచరిత్రమునందుఁ గాన్పింపవే! పితృ మాతృభక్తి, దేశభక్తి, గురు దేవతాదులం దాదరము, సత్యము, అహింస, అస్తేయము, బ్రహ్మచర్యము మున్నగు సద్గుణము లలవఱుచుకొనుటకు శ్రీరాముఁ డాదర్శముగ గ్రహింప వీలు కలుగనిచో నిఁక నా రామాయణము మానవుల కెట్లు లుపకరించును? అటులైనచో శ్రీరాముఁడు విష్ణ్వవతార మని బాలకాండలో వాల్మీకి చెప్పెనే యందురేని, యది సత్యమే. శ్రీరాముని జన్మగూర్చియేకాదు, పిపీలికాది బ్రహ్మపర్యంతము నీ సృష్టియం దుండెడి ప్రతి జీవకోటికిని, మన మొక గృహముకాని, వంతెనగాని నిర్మించుట కే రీతిని సూక్ష్మరూపముగ నొక చిన్న కాగితముపై నొక పటమును గీచికొని యా ప్రకారము దానిని నిర్మింతుమో యా రీతిగనె దైవగోళములందు ముందుగఁ బ్రతివ్యక్తి జన్మయు నిబద్ధమై యుండి యెద్దియో నొక కార్య నిర్వహణమునకై యీశ్వరునిచే నియమింపఁబడి యుండుననుట సర్వశాస్త్ర ప్రసిద్ధము. "Each human being Occupies a certain place in his group". అనఁగాఁ దన సంఘము నందుఁ బ్రతి మానవుఁ డెద్దియేని కార్య నిర్వహణమునకై నిర్దేశింపఁబడి యున్నాఁడని Carrel పండితుఁడు వ్రాయుచున్నాఁడు. అట్టితఱి శ్రీరామచంద్రుని యట్టి, వీరాధివీరుఁడును, లోకోత్తర వ్యక్తినిగూర్చిన

సర్జనమునందు సూక్ష్మ గోళములందు బ్రహ్మాదిదేవతలును, స్థూల గోళమునందలి వసిష్ఠాదిమహర్షులును మహత్తరము లగు సాంకేతిక నిర్ణయములం గావించి రని వాల్మీకి మహర్షి కనుఁగొని యా యద్భుత రహస్యమును లోకమునకు వెల్లడించినం దప్పేమి ! అట్టి యనన్య సామాన్య దృష్టి వాల్మీక్యాది మహర్షులకే తెలియును. విశ్వామిత్రుం డా విషయము నే "అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమం। వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః" అని నిరాఘాటముగ గుండెపైఁ జఱచుకొనుచు శంఖారావ మొనరించియున్నాఁడు ! అదియే నేఁడు మన ప్రధానమంత్రిపుంగవులు మాటిమాటికిని నిరసించెడి జ్యోతిశ్శాస్త్ర వైభవము. జ్యోతి యనఁగా వెలుఁగని యర్థము కదా! సమస్త చేతనాచేతన పదార్థములం దీశ్వర శక్తిస్వరూప మగు చైతన్యము కలదు. దానినే యాధునిక ప్రకృతిశాస్త్రవేత్తలు "ఎలక్ట్రాన్" అని నిర్వచించుచున్నారు. ఒక అణువులోని "ఎలక్ట్రాన్" యొక్క పరిధి యనఁగా "Diameter" ఆ యణువుయొక్క పరిధిలో 1/40,000 వంతు మాత్రమే యుండు నని నిర్ణయించుచున్నారు! మన మహర్షులు "నీవార శూకవత్తన్వీ పీతా భాస్వ త్యణూపమా, తస్యాఃశిఖాయా మధ్యే పర మాత్మా వ్యవస్థితః" ఇత్యాదిగా నున్న దని యాజీవచైతన్యము నే నాఁడో వేదములందు నిశ్చయించిరి! కాని మన వేదములందుఁ జెప్పిన యంశములు మన యాధునిక విద్వాంసులకుఁ బ్రమాణము లగునా ! ఏమి చెప్పు దుము ? ఈ సృష్టియందలి ప్రతియణువునందును చిత్ప్రకాశాత్మిక శక్తి స్వరూపమున్న దని Eivstin అను పాశ్చాత్య ప్రకృతిశాస్త్రవేత్త తాను క్రొత్తగా కనిపెట్టితి నని "Theory of Relitivity" అనఁగా పదార్థమునకును శక్తికిని యవినాభావ సంబంధ మనియు, నొక పదా ర్థాణువును శక్తిగా మార్చవచ్చు ననియు నొక శక్తియొక్క చెణుకును పదార్థముగ మార్చవచ్చు ననియు "Matter and energy are not different things at all; they are merely manifestations

of the same thing'' అనియు, Energy = Mass × (Velocity of light)$^2$ అని Albert Eviestin చెప్పినంతటనే యయ్యది మనకు వేద వాక్కైయినది! వ్యాసాచార్యు లీ తీరుగ నేనాఁటనో తన వేదవిమర్శన జ్ఞానముచే నార్జించిన యద్భుతసామర్థ్యము నూఁతగఁ గొని యీసృష్టి యంతయు నీశ్వర చైతన్యముచే వ్యాపింపఁబడియున్న దని యుద్ఘోషించెను :—

శ్లో. "త్వం వాయు రగ్ని రవని ర్వియదంబు మాత్రాః
ప్రాణేంద్రియాణి హృదయం చిదనుగ్రహశ్చ
సర్వం త్వమేవ సగుణో విగుణశ్చ భూమన్ !
నాఽన్య త్త్వద స్త్యపి మనోవచసా నిరుక్తం.(శ్రీమద్భాగవతము)

అని వక్కాణించినచో నయ్యది యూహాగానమఁట! Elexis Carrel అను పాశ్చాత్య పండితుఁడు "How do the geues contained in the nucleas of a fertilized ovum determine the characteristics of the individual deriving from the ovum? అనఁగా నొక రేతోబిందువునందుఁ గల పరమాణుస్వరూపకణము లందుండిన జీవశక్తి నుండి, యందువలనఁ బుట్టిన మానవుని యసంఖ్యాత గుణగణము లే తీరున నిర్ణయింపఁగల మని దిగ్భ్రమ చెందుచున్నాఁడు! కాని మన మహర్షు లగు వసిష్ఠాదులు దశరథుఁ డశ్వమేధమును బుత్రోత్పత్తికై యొనరించె నని చెప్పినంతనే :—

శ్లో. "పుత్రాశ్చ భవిష్యంతి చత్వారోఽమితవిక్రమాః
వంశప్రతిష్ఠానకరాః సర్వలోకేషు విశ్రుతాః" (1-11-10).

అని యిఁక నెప్పుడో పుట్టఁబోవునట్టి దశరథ సుతుల, గుణగణములం గూర్చి నిర్ణయించి యా ప్రభువు నశ్వమేధ మొనరించుటకుఁ బురికొలిపిరి! పరీక్షితుఁడు జన్మించిన తఱి నాతని జన్మపత్రమును బరిశీలించి కార్తాంతికులా బిడ్డ మహోదారుఁడగు ప్రభువై ధర్మయుతముగ రాజ్య మొనరించి

తుదకు విప్రశాపవశంబునఁ బాముచేఁ గఱువఁబడి చచ్చునని ధర్మనందనుని సభయందు నుడివి రచి కవివ్యాసుఁ డీ రీతిని లిఖించెను.

శ్లో. "తక్షకా దాత్మనో మృత్యుం ద్విజపుత్రోపసర్జితాత్".
ప్రపత్స్యత ఉపశ్రుత్య ముక్తసంగఃపదం హరేః॥ "
(శ్రీమద్భాగవతము)

కావున జీవులజ్యోతిరి విమర్శించు శాస్త్రమబద్ధము కాదు. ప్రతిశాస్త్రము నభ్యసించుటకు నీతినియమములు గలవు. ఏదేనియొక చిన్న లౌకిక కార్యమును సాధింపవలె నన్న మానవుఁడు ద్రవ్యమును బుద్ధినిగూడ నుపయోగించి యెందరిసహాయమునో యపేక్షించును. అట్టితఱి ననంత మగు మనుష్యశక్తినిగూర్చి విమర్శించుట కెట్టి పరికరము లుండవలెను? ఎంత తపశ్శక్తిని మానవుఁ డార్జించి వినియోగింపవలెను? అన్నివిధములఁ గష్టించిననుగూడ నొక్కొక్కతఱి శాస్త్రమును ఫలింపదు. అదియెట్టిదైన సంఘటనము. "Indeed. syntheses, as well as discoveries demand exceptional mental power and physical endurance"! లోకమునం దుత్పన్న మయ్యెడి పదార్థముల ననుసంధాన మొనరించి నూతనసృష్టి యొనరించుట కపార మగు మానసికకాయిక సహనశక్తి యావశ్యక మని యొక పాశ్చాత్య పండితుఁడు హెచ్చరించుచున్నాఁడు. పుత్రకామేష్టి యొనరించినచో దశరథునకుఁ బుత్రులు కలిగినటుల పాండుమహీపాలుఁ డెట్లుంగఁడా? అతఁ డేల చేయఁజాలకుండెను? అతని కాలమునందుఁగూడ వేదమునంతయుఁ బరామర్శించిన వ్యాసాదిమహర్షులు చేయించువా రుండిరే! కాఁబట్టి యనేక సూక్ష్మతర విషయములను మానవులు గ్రహించి పూర్వాపరసందర్భములు నిర్ణయించుకొనక శాస్త్రము లబద్ధ మనియు, మహర్షు లెద్దియో యూహాగాన మొనరించిరిగాని వారు కేవలద్రష్టలుకారని యనుకొనుట మన యజ్ఞానమును వెల్లడించుకొనుటయే యగును. అట్టి యుపకృతపక వాద మొనరించు

నట్టి యపండితులకు వరాన ముత్తమము. నే నీవలకు వసిష్ఠవ్యాసాదు లేతీసిన సగరభార్య గర్భసంజనిత మగు మాంసపిండమును గాంధారీగర్భ సంభూత మాంసపిండంబును భేదించి వానినుండి శిశువుల నా మహర్షు లుత్పాదించిరో వ్రాసియుంటిని. వేననిమృతకళేబరమునుండి పృథు చక్రవర్తి నుత్పత్తిచేసిన యార్షశక్తి నే మనవలెను? మనవారు నమ్ము దురా? అవి యన్నియుఁ బుక్కిటిపురాణము లందురు. అదియే యొక పాశ్చాత్య విద్వాంసుఁడు సెప్పినచో వేదవాక్యముగఁ బరిగణించి మన శాస్త్రవేత్త లా విద్యకొఱ కితరదేశములకుఁ బోయి యెన్నియో పాటులు పడుదురుకదా! మన వారి కీరీతిగఁ బాశ్చాత్యదేశములపైని యప్రతిహత విశ్వాసము జనించుటకును మన యార్షవిజ్ఞానమునందలి విశ్వాసము జనించుటకును గారణ మేమి? మనము ప్రతినిమిషమునను దినెడి పదార్థములు పాశ్చాత్యదేశమునుండి దిగుమతియైనవి కావా? మన శిశువులపోషణకై కావలసిన పాలుగూడ నితరఖండములనుండి తెచ్చుకొనవలసిన దుర్గతి మనకు సంప్రాప్తమైనది! "అన్నమయం హి సోమ్యమనః" అని వేద ముద్ఘోషించుచున్నది. కావున మన మన స్సంతయు మనము తినెడి యాహారపదార్థములపై నాధారపడి "తేజో మయీవా"క్కనుటచే మన జీవము నాశ్రయించియుండు శబ్దజాల మంతయుఁ బాశ్చాత్యవాఙ్మయావృతమై కేవల పరదాస్యమునకుఁ బూర్వముకన్న వేనుడంగులు నేఁడు దేశము సుఖముగ నున్నది! అట్టి తఱి నార్షవిజ్ఞాన మెవ్వరికిఁ గావలెను? అందుచేతనే కలియుగంబున నైదువేల వత్సరములు వచ్చునటికి సర్వవేదములు సమస్తశాస్త్రములు గూడ స్వర్గగతము లగునని నారదమహర్షి భవిష్యత్పురాణమునందుఁ జెప్పెను. జ్యోతిశ్శాస్త్రముమాత్రము వేదాంతముకాదా? అయ్యది నేటి మన విద్వాంసుల కెట్లు కరతలామలక మగును? అయ్యది యోగా భ్యాసాదులచేఁ దమ దివ్యతేజము నాగ్రిసింపఁజేసికొనిన సిద్ధులకును యోగులకునుమాత్రమే గోచరించును.

శ్లో. "ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితం
విమూఢా నాఽనుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః"
యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితం ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః'
(శ్రీమద్భగవద్గీత)

అని శ్రీకృష్ణభగవానుఁడు కురుక్షేత్రభూమిని శంఖారావ మొనరించి యున్నాఁడు. ఒకానొక యచేతన పదార్థ మగు లోహాణువునందలి చైతన్య స్వరూపమగు "Electron" ను గుర్తించుటకై కోట్లకొలఁది ద్రవ్యమును వెచ్చించి వేలకొలఁది శాస్త్ర నిపుణులు తమ నిశిత యత్నములచే బ్రహ్మాండము లగు యంత్రాగారములను నిర్మించుచు లోకమును దగులఁబెట్టుటకు విశ్వప్రయత్న మొనరించుచున్నారు. కాని వా రొక గడ్డిపోచనుగూడ సృజించుటకు వలయు పరికరములను సృజింప గలుగుచున్నారా? మన మహర్షులకు దేశములను నాశన మొనరించుట కొక పుడిసెడు నీళ్లు చాలియుండెను. దండకుని రాజ్యమునందుఁ బంద్రెం డహోరాత్రములు దుమ్ము వర్షించుటకై చేరెడు నీళ్ళ నభిమంత్రించి శుక్రుఁడు శపించెను! పంద్రెండు రోజులలో దండకుని రాజ్యమంతయు మట్టితోఁ గప్పఁబడి దండకారణ్యముగఁ బరిణమించెను! షట్చక్ర నిరూపణ మను గ్రంథమునందుఁ బూర్ణానంద మునీంద్రుం డీ తీరున యోగియొక్క క్రోధముచేఁ గలుగు లోకసంచలనమును నిరూపించి యున్నాఁడు:—

శ్లో॥ "ఇహ స్థానే చిత్తం నిరవధి నిధాయాత్తపవనో ।
యది క్రుద్ధో యోగీ చలయతి సమస్తం త్రిభువనం ।
నచ బ్రహ్మా విష్ణుః నచ హరిహరో నైవ ఖమణిః ।
తదీయం సామర్థ్యం శమయితు మలంనాపి గణపః॥"

కావున నా తీరున శుక్రాదులవలె దేశములను విధ్వంస మొనరించుట

కును, విశ్వామిత్రాదులవలెఁ బ్రకృతిని జయించి సృష్టికిఁ బ్రతిసృష్టి చేయుటకును, శుకాదులవలె నిరతిశయబ్రహ్మసాక్షాత్కారము నొందుటకునుగూడ నార్షవిజ్ఞాన శక్తి యీ లోకమునం దక్కాలంబున మహోజ్జ్వలముగ మానవవికాసమునకుఁ దోడుపడెను. వారు కేవల యంత్రపరికరముల సాధించియుండలేదు. ఒకొక్క మహర్షి యొకొక్క మహా యంత్రముగఁ దన శరీరమును దయారుచేసికొనెను. మన మొక పాఠమును జదువుకొనవలె ననిన, దీపము సహాయము, లేక సూర్యుని సహాయము కావలెను. కంఠగతముగ గురువునోటనుండి వెలువడిన శబ్దమును సాధించుటకుఁ బొత్తములు, ముద్రణయంత్రములు, దీపములు గావలెనా? మనవా రెంతవఱకు స్వయంసృష్టిపై నాధారపడి యుండిరో గమనింపుఁడు. నాల్గు వేదములు, చతుష్షష్టికళలు, పురాణములు, ఇతిహాసములు, వివిధ శాస్త్రములు కంఠగతము గావించుకొనిన మహామేధావులు కారా భారతీయులు? ఒకవేళ మహత్తర యంత్రములను నిర్మించినచో దుర్మార్గుఁ డగు రావణుని చేతి పుష్పకవిమానమువలె దుచ్ఛము లగు భోగపరు లగు ద్రవ్యాధికులచేత నవి చిక్కించుకొని దుర్ణయముపాలు గావించి లోకమునకు హాని నొనరింపరా? నేటి ద్రవ్యాధికులచేతిలోని మారణయంత్రము లెంత లోకమును భీభత్సమొనరించుచున్నవో గమనింపుఁడు! వాలి, రావణ, ఇంద్రజిత్ ప్రముఖులగు రాక్షసులు వేదవిజ్ఞాన రహస్యములం గొన్నిటిని గ్రహించి వాని వలన ననేక మారణయంత్రములను సాధించి లోక విద్వేషమునకుఁ గారకు లైనందుననే యా నాఁటి మహర్షులందఱు నేకమై దశరథ మహారాజుచేఁ బుత్రకామేష్టి సేయించి యీ సృష్టి కంతకును బ్రభు వగు శ్రీమహావిష్ణుని భూలోకమునందు మానవజన్మ మెత్తునట్టుల నొనరింపఁ గలిగిరి. అట్టి మహత్తర వీరాగ్రేసరునకుఁగూడ, నాఁడు మనుష్యుఁ డగుటచేఁ దమరు సాధించిన దివ్యాస్త్రముల నుపదేశించి, యా

శ్రీరామచంద్రునిచే లోకప్రమాదమొనరించెడి రావణ, కుంభకర్ణాది ప్రతీపరాక్షస శక్తులను (Lock, stock, barrel) అనఁగా పుత్రమిత్ర కళత్రాదులతో నిర్మూలింపఁజేసి లోకకళ్యాణము నొనరించిరి. నేఁటి మన విద్యాధికులును, విద్యార్థులునుగూడ నా కీతినొక పరమాణువునందలి సూక్ష్మతర జ్యోతిస్స్వరూపమును దర్శించి దానినుండి యమృతఫల మును దీసి లోకమున కందింప సాధింపఁగలరా! మన మహర్షు లొసంగిన శాస్త్రముల నభ్యసించుటకు మనకు ముందుగా వాని యందు విశ్వాస ముండవలదా? పైఁగ మన పూర్వు లూహాగాన మొన రించి రని పరిహసించుటకుఁ గడంగుచున్నారే కాని యొక్క విద్వాంసుఁ డైన వారి మార్గము ననుసరింప యత్నించుచున్నాఁడా? భారతము నందుఁ జేర్కొనఁబడిన ధౌమ్యోపమన్యువులవలె నొక్క గురు శిష్య యుగ్మమును మనము మచ్చునకైనఁ గాంచఁగలుగుచున్నామా? కల్ల! నెపోలియన్ చక్రవర్తి తన విద్యార్థి దశయందు పాధ్యాయునికిఁగూడ దుర్భేద్యమైన యొక రణతంత్రసమస్యను (Military problem) పలు వది యెనిమిది గంటలకాలము దానిపైఁ దన బుద్ధిని కేంద్రీకరింపఁజేసి భేదించె నని "Abbot" పండితుఁడు తన "Life of Nepolean" గ్రంథ మునందు లిఖించియున్నాఁడు. నేఁ డట్టి కేంద్రీకరణ శక్తిని భగవంతుఁ డే మాత్రమొ పాశ్చాత్యఖండవాసుల కొసంగి యున్నాఁడు. దానికిఁ గారణము? మన యవిశ్వాసము. పెద్దలను హేళనము గావించుట. భావదాస్యము, నైతికస్ఖాలిత్యము, వీని నన్నిటికిమించిన యింద్రియ లోలత! "It is well known that sexual excesses inpede the intellectual activity" అని యొక మహావైద్యశాస్త్ర పండితుఁడు వాపోవుచున్నాఁడు! "While the nervous, the week, and the unbalanced become more abnormal when their sexual appitits are repressed, the strong are rendered still stronger by practising such a asceticism". అనఁగా నరముల పటుత్వము తక్కు-

నైనట్టియు మనోదౌర్బల్యము కలిగినట్టియు, నిగ్రహశక్తి చాలనట్టియు మనుష్యులు నిగ్రహమును బాటించినచో వారి కింద్రియ సంయమము, మఱింత నుద్రేకకారణ మగును. కాని పూర్తియగు నిగ్రహము గలమానవుల కయ్యది యధిక మగు నింద్రియబల మొసంగునని యీ పండితుఁడు పేర్కొనెను. అందుచేతనే చాలకాలము వఱకు నింద్రియముల నరికట్టి తపము లాచరించిన భోగపరులగు రావణకుంభకర్ణాదులు వరములఁ బడసినయనంతర మా శక్తు లన్నియుఁ గేవల మింద్రియభోగములకై మఱింతగ దుర్వినియోగ మొనరించుటకు సమకట్టిరి. రావణ సంహారానంతరము, మండోదరి, యీ తీరునఁ దన భర్తకళేబరముపైఁ బడి విలపించెను.

శ్లో॥ "ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా।
స్మరద్భిరివ తద్వైర మింద్రియైరేవ నిర్జితః॥ (6-114-18).

ఇఁక నేఁటి యింద్రియలోలురగతి యేమి? అందుచే మనము నానాఁటఁ బరాధీనజీవనమునకుఁ బూర్తిగఁ దావొసంగుచున్నారము. తుద కొక చిన్నకఱ్ఱవంటిన గట్టవలె నన్న నమెరికానుండి నిప్పులును నింగ్లాండు నుండి మేకులును దిగుమతి చేసికొని జీవించుచున్నారము: త్రిరాత్రోపవాస దీక్షచే శ్రీరాముఁడు శతయోజన దీర్ఘంబును దశయోజన విస్తారంబు నగు సముద్రసేతువు నిర్మింపఁగలిగెను! పండితరాయ లనినటుల "త్వం చ భో నీలకంఠః" యని మనముగూడ భారతవర్షీయార్య సంతతి వార మనుకొనుటకు సిగ్గగుచుండలేదా? రామాయణకాలమునందలి శిల్ప చాతుర్య మెట్టిదియో యెఱుంగుట కొక గ్రంథము వ్రాయవలసి యున్నది. ఒక్క శ్లోకములో వాల్మీకి మహాకవిచే వర్ణింపఁబడిన పుష్పక విమానమునుగూర్చి పాఠక మహాశయులకు విన్నవించి యింతటితో నీ ప్రస్తావనము గట్టిపెట్టుచున్నాను:—

శ్లో॥ తపస్సమాధానపరాక్రమార్జితం మనస్సమాధాన విచారచారిణం।
అనేకసంస్థానవిశేషనిర్మితం తతస్తతస్తుల్య విశేషదర్శనం॥

ఇ దంతయు నూహాగానమేట! కాదిందు. ఊహ లేనిచో భగవంతుడు గూడ నే కార్యమును సాధింపజాలఁ డని మన విద్యాధికులు నేఁటికైనను గ్రహింతురుగాత! సర్వశాస్త్రములకు, నిఖిలకళలకు నూహయు, తృష్ణయు ప్రధానములు గావా ! "The world within the Atom" అను పత్రికయందు "Charles H. Weaver" అను నొక పాశ్చాత్య పండిత పుంగవుం డీ తీరున నాయాప్రకృతి శాస్త్రవేత్త లే తీరున నణుస్వరూపము నూహించి, యత్నించి, దర్శించిరో వ్రాయుచున్నాఁడు చూడుఁడు:—

"So, there went Dalton's hard indivisible, different kinds of Atoms. Atoms were different, to be sure ; but they all *seemed* to be composed of still smaller particles, and you couldn't tell one of these particles from another. *Here was one of man's boldest ideas*—the building-blocks from which everything in the universe is made are tiny particles! And atleast some of them are particles of Eletricity!" దీనినే శంకరభగవత్పాదులు తమ "సౌందర్యలహరి"యను "పరాశక్తి స్తోత్రములో" The universe has sprung from the Atom" అను సత్యము నీ తీరున "తనీయాంసం పాంసుం తవచరణపంకేరుహభవం। విరించి స్సంచిన్వ న్విరచయతి లోకా నవికల"మ్మని నిర్ణయించిరి! అయ్యది యూహాగానమో సత్యమో కనుఁగొనుట కా Dalton పండితునివలె మన వా రెవ్వరైన నిటీవల యత్నించిరా! మన కూహలు లేవు! కర్మశ్రద్ధ పూర్తిగ నడుగంటి కేవల తమోగుణాత్మక మగు నలసత్వ మాశ్రయించినది! మన మిఁక భారతవర్షము నుద్ధరింతుమా? ఇంతటితో జ్యోతిశ్శాస్త్ర ప్రశంస నాఁపుదము. ఒక్కమాట, జ్యోతిశ్శాస్త్రి మన, మన నవనాగరికు లనుకొనెడి "సోడే" శాస్త్రము మాత్రము కా దని మనవిచేయుచున్నాను.

శ్రీరామచంద్రుఁడు విష్ణ్వవతార మైన నాతఁ డీలోకమునఁ గేవల మనుష్యునివలెనే వ్యవహరించె నని వాల్మీకి తాను జూచి, యా

ప్రభుని కాతిథ్య మొసంగి, యాతని భార్య యగు సీతామతల్లిని దన యాశ్రమమునందుఁ గొంతకాల మాదరించి, రచించినట్టి యారామ చరిత్రను మనము కా దనుటకు వీలులేదు. రాముఁ డొక యైంద్రజాలికుని వలె వర్తింపలే దనుట నిర్వివాదము. ఆతఁడు కేవలరావణవధార్థమే యవతరింపలేదు. అట్లవతరించియుండినచో నా రావణవధానంతర మా తఁడు దన వేషమును మార్చుకొని మత్స్య, కూర్మాద్యవతారములవలెఁ దన దేహము నుపసంహరించుకొని యుండును. అటులకాక శ్రీరామ, శ్రీకృష్ణావతారములు భగవంతుఁ డత్యంత శ్రమ కోర్చి సృజించిన మాన వోద్ధరణమునకై నిర్దేశింపఁబడినవి. లోకోద్ధరణమునకు ముందుగ దుర్మార్గుల నణంచుట ముఖ్యముకదా! అందుకొఱకై రావణాదులను సంహరించి యనంతరము చిరకాల మీ లోకమును బాలించెను శ్రీరాముఁడు. ఏలయన, మానవసృష్టి యొనరించుటకునై యీశ్వరుఁడు చాల కాల మాలోచించియుండెను. తొలుత నీ ప్రపంచ మంతయు జలార్ణ వముగ నుండిన కాలమున నందు జలచరసృష్టి యొనరించి, వానియందుఁ దాను గూడ నొక మత్స్యమై యా జలచరసృష్టి యందలి కష్టసుఖములను దెలిసికొని క్రమక్రమముగ నందలి యహంకార మమకారము లనెడి మధుకైటభుల నణంచి, జ్ఞానమును వృద్ధిపఱచెను. అదియే మత్స్యావ తారము కదా! అటుపిమ్మట జలస్థలసంచార మొనరించెడి కూర్మమై యనంతరము స్థలచర మగు వరాహమై, నరమృగరూప మొంది కాల క్రమమునఁ బ్రతిదేహమునం దుండెడి వివిధతను భావవికారములను దానుగూడ ననుభవించి తుదకు "బ్రహ్మావలోకధిషణం పురుషం విధాయ ముద మాప దేవః," అని పదునొకం డింద్రియములు గల మానవుని సృజించి యీశ్వరుఁడు కృతార్థుఁ డయ్యెను. అట్టి నిరంతర ప్రయాసముచే నుత్పాదించిన తన యుత్కృష్ట సృష్టి నశింపకుండఁ బదు నొకండు వేలవత్సరము లా పదునొకం డింద్రియసంకలితుఁ డగు మానవ

సంరక్షణార్థ మా విష్ణుః డవతరించి లోకమునందు మానవత్వప్రతిష్ఠను నెలకొల్పెను. "వధాయ దేవ శత్రూణాం నృణాం లోకే మనః కురు" అని ప్రార్థించిన దేవతలకు శ్రీమహావిష్ణు వీ తీరున సమాధాన మొసంగుటకుఁ గారణ మేమి ?

శ్లో॥ "భయం త్యజత భద్రం వో హితార్థం యుధి రావణం ।
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతిబాంధవం॥
హత్వా క్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహం ।
దశవర్ష సహస్రాణి దశవర్షశతాని చ ।
వసామి మానుషే లోకే పాలయన్ పృథివీ మిమామ్॥"
(1-15-27,28)

ఇంతేయేకాక విభీషణుని బరిగ్రహింపవలసిన దని సుగ్రీవుఁ డనినతఱి శ్రీరాముఁడు "అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర" యని చెప్పి రావణాదులను వధించుటకే తా నవతరింపలే దని నొక్కి వక్కాణించెను. శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారములచే భగవంతుఁడుగూడ మానవుఁడై కష్టసుఖములను దానుగూడ ననుభవించి మానవసృష్టి యందలి యుత్కృష్టత నెలకొలిపి భగవంతుఁడుగూడఁ గృతకృత్యుఁడ నైతి నని యానందించెను. మానవుఁడు తన ధర్మమును నిర్వర్తించి నచో నీ సృష్టి యంతయు నెట్టి విషమగతిని జెందక చిరకాలము సుఖముగ సాగి యనంతరము తనకుఁ జేరుకొను నని భగవదాశయము. అటులైనను, నందుఁగూడ రాక్షసులు పుట్టి దుర్మార్గములను గావించు చుండిరి. అందులకై వారికి మృత్యువును బ్రసాదించెను. మృత్యు వనునది లేకున్నచో దుర్మార్గులకు భయ మెటుల కలుగును ? జ్ఞానులకును, యోగులకును, ధర్మమార్గానువర్తులకును మృత్యుభయ ముండదు. పాపాత్ములై దారుణకృత్యము లొనరించువారే మృత్యువునుండి నిరంతరము భయభ్రాంతు లగుచుందురు. అట్టివా రెటుల ప్రవర్తించిరో

# శ్రీనాథుని కృతులలో ఋతువులు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

(అనువృత్తము)

సీ॥ అభినవోన్మేష జిహ్మంబైన తొలుచూపు
కౌస్తుభాలోక రేఖలకు నలఁగ
సాంగభంగంబైన యావులింతకు వేల్పు
లంగుళిస్ఫోటంబు లాచరింప
సౌఖశాయనికులైన సంవర్త భృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప
ధృతచేతనంబులై దివ్యాయుధము లైదు
జయ జయ ధ్వనులతో సంస్తుతింప
కలువ ఱేకులువోని పెంజిలువ ఱేని
యరల కుబుసంబు పొరలు మై నంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండె నుదధిశయను
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు.

శ్రీమహావిష్ణు వాశరద్వేళ నప్పుడే మేల్కాని యుండుటచే రూక్ష మయిన తొలిచూపు కౌస్తుభమాణిక్య కాంతులతో నలుక వహించినది. ఒడలి విరువుతోఁ గూడిన యావులింతకు దేవతలు చిటికలు వేయుచుండిరి. సంవర్తుఁడు భృగువు మొదలయిన మహర్షులు హస్త పద్మములు జోడించి సుఖశయనమును పృచ్ఛించుచుండిరి. శంఖ చక్రాది దివ్యాయుధము లాకారములు దాల్చి జయ జయ ధ్వానములతో స్తుతించుచుండెను. ఇట్టితఱి నా హరి యాదిశేషుని శరీరమునందలి యరలు గల కుబుసపుఁబొరలు శరీరము నంటియుండ క్షీరసాగర మధ్యమున మేల్కాని కూర్చుండెను. క్షీరసాగరమునుండి మేల్కాంచు నప్పటి శ్రీహరి దివ్యత్వమహత్త్వము లీ పద్యమునఁ గవి చిత్రించి తనకుఁ శ్రీహరి యెడఁ గల భక్తిభావమును వెల్లడించియున్నాఁడు.

ఈ సీసమునందలి నాల్గుపాదములలో నిరూపించిన విషయములు సంస్కృత కావ్యములనుండి యవతరించినవియే. ఒకటి, రెండు పాద

ములలోని విషయము విశాఖదత్తుని ముద్రారాక్షసము నందలి శ్లోక మున కనువాదరూపము.

శ్లో॥ ప్రత్యగ్రోన్మేషజిహ్మా క్షణ మనభిముఖీ రత్నదీపప్రభాణా
మాత్మవ్యాపారగుర్వీ జనితజలలవా జృంభితైః స్సాంగభంగైః
ముద్రా. 3- 31.

దీనిలో మొదటిపాదమునకు సీసములోని మొదటిపాదము సమగ్రాను వాదము. రెండవపాదము ననువదించుటలోఁ గొంతమార్పు కావింపఁ బడినది. ఆవులింతకు వేల్పు లంగుళిస్ఫోటంబు లాచరించుట మూల ములో లేనిది. ఇటులనే మూఁడు నాలుగు పాదములలోని విషయ ములు కాళిదాస విరచిత రఘువంశములోని యీ క్రింది శ్లోకముల కనువాదరూపములు.

శ్లో॥ హేతిభి శ్చేతనావద్భి రుదీరిత జయస్వనమ్ రఘు. 10-12.
శ్లో॥ భృగ్వాదీ ననుగృహ్ణాంతం సౌఖశాయనికా నృషీన్
రఘు 10-14.

నాల్గవపాదములో మునులు హస్తాంభోజములు మొగుడ్చుటలోఁ గొంత మార్పు గావించినాఁడు. శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణము నందు, ఇంద్రాదిదేవతలు నిద్ర మేల్కనిన శ్రీహరిని దర్శించినపుడు కూడ నిట్టి సీసపద్యమునే సంతరించియున్నాఁడు. అచట ముద్రారాక్షస నాటకములోని భావములు వదలి రఘువంశములోని మఱికొన్ని శ్లోక ముల భావముల నిముడ్చినాఁడు.

సీ॥ దివ్యాయుధము లైదు ధృతచేతనంబులై
శత్రు సంహారంబు ప్రస్తుతింపఁ
బులుఁగుఱేఁడు కరాబ్జములు రెండు మొగిడించి
భ్రూలతాదేశంబు పోలుపు సరయ
సౌఖశాయనికులైన సనకాది యోగీంద్రు
లనురాగవీక్షణ మభిలషింప

నూరురంభా స్తంభయుగళంబుపై నుంచి
లక్ష్మి శ్రీపాదపల్లవము లొత్తఁ
బన్నగాధీశ భోగతల్పంబుమీఁదఁ
దత్ఫణారత్నదీప్తి సైంతళుకు చూపఁ
బాలమున్నీటిలో నిద్ర మేలుకొన్న
హరికిఁ బొడచూప నేతెంచె హరిహయుండు.

భీమ ౪-౪౯.

మొదటిపాదము మూఁడవపాదము పైనఁ బేర్కొనిన దశమ సర్గలోని ౧౨-౧౪ శ్లోకముల కనువాద రూపములు. రెండవపాదమునకు మూలము "ఉపస్థితం ప్రాంజలినా వినీతేన గరుత్మతా" అను ౧౩ వ శ్లోకార్థము. నాల్గవపాదమునకు—

శ్రియః పద్మనిషణ్ణాయాః క్షౌమాంతరితమేఖలే
అంకే నిక్షిప్తచరణ మాస్తీర్ణకరపల్లవే.

అను శ్లోకము మూలము. కాని భావములోఁ గొంత మార్పు గావింపఁ బడినది. గీతమునందలి యొకటి రెండు పాదముల కీ క్రింది శ్లోకము మూలము.

శ్లో॥ భోగిభోగాసనాసీనం దదృశు స్తం దివౌకసః
తత్ఫణామండలోదర్చిర్మణిద్యోతిత విగ్రహమ్.

రఘు ౧౦-౬.

ఏమయినను సంస్కృత వాఙ్మయము నందలి మధురోదాత్త భావముల తరమెఱిఁగి యెంచుకొని, ప్రకరణశుద్ధిగఁ దెలుఁగులోని కవతరింపఁ జేయుటలో శ్రీనాథునకుఁ గల నేర్పు వేఱొకనికిఁ గానరానిది. పై కాశీఖండమునందలి సీసముమీఁది యెత్తుగీతిలో తెలుఁగు నుడికారపు తీరును నెంతయుఁ దీయఁగా నదికినది. చిలువతేని కలువతేకులవంటి కుబుసపుఁబొరలు హరి శరీరము నంటుకొనె నని తెలుపుటలో నొక స్వాభావిక దృశ్య చమత్కృతి సమకూడినది,

ఈ సీసము తరువాతి వచనములో నాంధ్రదేశీయ శరదృతు సౌభాగ్యము నంతయు రమ్యముగఁ జిత్రించినాఁడు. శరత్తునందలి ప్రకృతి సౌందర్యము తరులతావికాసము నదీనద సౌభాగ్యము సస్య సంపత్సమృద్ధియు నిం దభివర్ణితములు. ఆకాశమునఁ దెల్లని మేఘ ఖండములు—దిక్కు లనుబూరుగుచెట్లు పండఁగా వానినుండి చెదరిన తూలరాశిని బోలియు, ఆకాశ మను పాము విడిచిన కూస మన్న భ్రాంతిని గలిగించునవియై, ఐరావతి శరీరమువలె తెల్లనై యిటునటు దిరుగుచు, ఇంద్రధనుస్సుతోఁగూడి గగనము నలంకరించెనఁట! శరత్కాల మేఘ ఖండముల ధావళ్య మిందు వివిధరీతులఁ జిత్రింపఁబడినది.

గగన మను రంగస్థలమునఁ గ్రొమ్మెఱుఁ గను మెఱుఁగుఁబోఁడి నాట్యము సేయ నారంభించినది. ఆ నాట్యమునకుఁ గాఢమ మేఘములు తెర లయినవి. వలుదవడగండ్లు పుష్పాంజలులై యమరినవి. ఉఱుముల చప్పుళ్లు మద్దెలమ్రోఁత లయినవి. మదించిన వనమయూర మనుపడఁతి మధురమైన తన 'కేక' యను గీతి నాలాపించి, తుదిని పింఛమువిప్పి యాడినది. మేఘములు కుంభద్రోణములుగ వర్షించి వెలిసినవెనుక, అప్పటప్పట నట్టిపడు నుదకబిందువులవలెను, రాత్రియను శుక్తినుండి వెలువడిన మౌక్తికములవలెను నొప్పారు నక్షత్రము లాకసమున ముచ్చట గొలుపుచుండెను. దక్షారామము నందలి యప్సరసల వదనారవింద సౌందర్య ప్రవాహ బిందువయిన చంద్రుఁడు మన్మథుని దిగ్విజయపతాకను బోలిన పండువెన్నెలను విచ్చలవిడిగఁ గాయఁదొడఁగెను. ఇవి యన్నియుఁ బ్రకృతిరంగమునఁ గానవచ్చిన శరద్విభ్రమములు.

ఇఁక కలువలు వికసించినవి. లాంగలి (కలిగొట్ల పూల చెట్టు) చెంగలించె. తెల్లు ఉల్లసిల్లె. కానర కాచె. దోస దోరగిలఁబాఱె. ఈ పుష్పఫలసంపద శరత్కాలమునందే ప్రభూతియుగఁ గానవచ్చునది. ఉదకము పండు దిగినది. వర్షావసమయమున వండుతో నిండిన జల మిా

సమయమునఁ గలఁక దేఱును. కరి మదముక్కఱియుట, నందిపోతు పోతరించి ఖణిల్లున ఱంకెవేయుట తాత్కాలికముగాఁ బశువులలోఁ గలుగు నుల్లాసము. బురదలో నడుగులు వడుట, ఇసుక దిబ్బలు బయటఁబడుట నీడ చలియగుట యనునివి రవితేజస్సూచకములు. వరిగ పెరుగుట, గసగస మొలక మెసఁగుట, పెసర ఉసురుకొనుట దవనిక పొదలుట, తెక్కఁదాసంగు దోండముక్కఁవడుట—యనునివి సస్య సంపదలోఁ గానవచ్చిన నవ వికాసములు. వరిగింజలకొన లెఱ్ఱఁబడి నచో, చేను దోండముక్కు పడినదని హాలికులిచట వాకొందురు. భీమ మండలిలో శరత్కాలమున ముందుగఁ బంటకు వచ్చెడి సస్యము రసంగి బసంగులు. వీనినేకాఁబోలు శ్రీనాథుఁడు ప్రాసంగులుగా వ్రాసినాఁడు.

జల విహారముల కనువుపడు నల్పసరస్సులు, మదకల కలహంస లయు, చక్రవాకములయు మధురాలాపములతో నిండినవియై, కాంతా కుచద్వయసవాఃపూరవంతంబు లయ్యెనఁట. అనఁగా విహరించు కాంతాజనంబులకు ఱొమ్ములబంటినీరు కలవియై విహారయోగ్యములైన వనుట. ఈ గద్యమునందలి 'తూలరాశి ద్వయసంబులు' 'కాంతాకుచ ద్వయసవాఃపూరవంతంబులు' అను నీ పదములు రెండును శ్రీనాథుని సంస్కృత వ్యాకరణాభిజ్ఞతకుఁ దార్కాణములు. కాశీఖండమును రచించునాఁటికి శ్రీనాథుని వయసును కవితయుఁగూడ పరిణతములైనవి. అయినను పట్టయిన ఘట్టములలోఁ గవిత కాంతాకుచద్వయ సంప ర్కము లేనిదే సాగలేదు. తద్విషయవర్ణనము వచ్చునరికి రచన మఱింత ప్రౌఢమై కొనసాగును. ఇరువదియైదు గద్య పంక్తులు గల యీ శరదృతు వర్ణనఘట్ట మంతయు ననుప్రాసభరితమైన తెలుఁగు సంస్కృత ముల మడికారపు సొంపులతో జాలువాఱి తుదిని "మదకల కలహంస సారసకలాలాప కోలాహల వ్యాజృంభితకకుబంతంబులైన విహారవేళం

తంబులు కాంతాకుచద్వయసవాఃపూరవంతంబు లయ్యె” నను తీయని రచనతో మధురాతిమధురమైనది.

అయ్యవసరంబున:—

గీ॥ కార్తికికవేళ భీమశంకరుని నగర
వింధ్య సంస్తంభయిత దూఱె విమలబుద్ధిఁ
దొయ్యలియుఁ దాను జిచ్చులతోరణంబు
కలుష సంహతిసంహార కారణంబు.

కాశీ. 3-౨౮.

ఇది శరద్వేళల దేవళములలో జరుగు నుత్సవము. దీనిని జ్వాలాతోరణము అని యందురు. ఇట్టిది దక్షారామమున విలక్షణముగా జరుగును. కార్తిక శుద్ధ పూర్ణిమనాఁటిరాత్రి, బలమైన గడ్డివెంటి చుట్టి రెండు స్తంభలములకుఁ గట్టి నడుమ గడ్డి వ్రేలఁగట్టి, వాని నంటింతురు. జ్వాలలతో నిండియున్నపుడు శివకేశవుల యుత్సవ విగ్రహములను బల్లకిమీఁదఁ గొనితెచ్చి, యీవలినుండి యావలికిఁ దూఱునట్లు చేయుదురు. దేవునివెంట జ్వాలాతోరణమున దూఱినవారికిఁ గలుషము లన్నియు బాయునని తద్జ్ఞుల నమ్మిక. ఇట్టి జ్వాలాతోరణమును శ్రీనాథుఁడు, వింధ్యసంస్తంభయిత యగు నగస్త్యుని లోపాముద్రతోఁ గూడఁ బ్రవేశింపఁజేసినాఁడు భీమేశ్వరస్వామి యంతఃపురాంగణమున. ఇది కలుష సంహతిసంహార కారణ మనుట భీమఖండములో నైతే మిట్లు వ్రాసినాఁడు.

గీ॥ కార్తికికవేళ భీమశంకరుని నగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చులరతోరణంబు
అతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోర యమ పట్టణ ద్వారతోరణంబు

భీమ. 3-౨౪.

## శివరాత్రిమాహాత్మ్యము — హేమంతశిశిరములు

శివరాత్రి శిశిరర్తువులో వచ్చెడిపుణ్యదివసము. కావున నీకావ్యమున శిశిరర్తువునే ప్రధానముగ వర్ణింపవలసియుండినను, తత్పూర్వమున హేమంత విలాసమును మధురముగ నిందుఁ జిత్రించినాఁడు. ఇచట ప్రకృతి వర్ణనము సహజసుందరమై యెసలారినది.

శివరాత్రి ప్రబంధమునకుఁ గథానాయకుఁడు సుకుమారుఁడు. అతఁ డెనుబదియేండ్ల వార్ధకమునఁగూడఁ గలు ద్రావుచు, మాంసమాహారించుచు వావివరుసలు విడనాడి, తనకు జన్మించిన చండాల కన్యలతో రమించుచుండెను. అట్టియెడ మదనబలశ్రీమంత మగు హేమంతము భువన మంతయు నలముకొని వచ్చెనఁట.

క॥ హేమంతము శరదాగమ
సామంతము తుహినకరవిసంజ్ఞితశబరీ
సీమంతము మదనబల
శ్రీమంతము డాసె భువన సీమాంతమై.

శివరా. ౪. ౧౨.

అట్టి హేమంతసమాగమమున—

మ॥ బలుసు ల్పండెను దొండముక్కువడియెం బ్రాసంగుఁజే ల్పోఁకమో
కల పూఁబాళలతావిఁ గ్రోలి పొరలెం గౌబేరదిగ్వాయువుల్
ఫలిసీవల్లిమతల్లివల్లరులపైఁ బైపై నళివ్రాతముల్
పొలసె న్మంచులు రాలె రాత్రికరిణీపూత్కారవార్బిందువుల్.

బలుసుతుప్పలు పండినవి. పచ్చనిపండ్లతో నిండిన బలుసులు చూడ ముచ్చటగొలుపుచుండును. ప్రాసంగుచేలు దొండముక్కువడినచో సువర్ణచ్ఛాయతో నెసలారును. ఈ దృశ్యములు సహజరమ్యములు. ఉత్తర దిక్కునుండి వీచుకొండగాలులు పోఁకపొత్తులలోని కమ్మతావిని గ్రోలి చెరలాడెను. ప్రేంకణపుఁదీవల పూలగుత్తులపైఁ దుమ్మెదగుంపులు మూఁగినవి. రాత్రియనెడు నాడుఏనఁగు పూత్కారముసేయు జలబిందు

వులవలె నేలపై వ్రాలినవి. రాత్రి వేళ వ్రాలిసమంచుబిందువులపైఁ దరణి కిరణములు పడినచో వింతహరాయయలు పొడచూపును. ఈతీరుగ నీపద్యమునఁ బ్రకృతిపరిణతి మధురముగ నిరూపింపఁబడినది. హేమంతసస్యసంపదయు నిట్టులే చిత్రింపఁబడినది.

చ॥ కలమవనాళికాకణిశకంటక కోటులచేతఁ జూడ్కి కిం
పలవఱిచె ద్ధరిత్రి తుహినాగమ వేళఁ దటాకసారణీ
సలిలము వాఱి పండినయజాంగలసీమము లెన్ని యన్నిటం
దలముగుశీతుపేర్మి గరు దాల్చినభావము ప్రస్ఫుటంబుగన్.

చెఱువులనుండి జాలువాఱిన కాలువల యాధారమున వరి పండెడి చేలలో ధాన్యపువెన్నులమీఁదఁ జటిచిన నూగుచే భూమి, హేమంత వేళ మిక్కుటమగు చలిచే రోమాంచము దాల్చెనో యనునట్లు చూడ ముచ్చటగొల్పినది. పండిన ధాన్యపువెన్నులకు నూగుపట్టుట సహజము. దానినే శ్రీనాథుఁడు చలిచే ధరిత్రీవనితశరీరము గరు పొడిచినట్టు లుండె నని చిత్రించుట చిత్రము.

ఇటులనే మఱికొన్ని సహజవిషయములను మధురదృశ్యములుగఁ గన్పఱచినాఁడు. ఇవి యన్నియుఁ జలిని బురస్కరించుకొని చేసిన కల్పనలు.

క॥ కలవింకకలకలాకుల
వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందుఁ దుహినవేళలఁ
జలి గులగుల కూయునట్టిచందం బొందెన్.

పట్టణముసందలి సౌధవాటికలను ఇంటికప్పులను నంటుకొని యున్న యూరుఁబిచ్చుకలు హేమంతపుఁజలి తట్టుకొనలేక కూఁతలు కూయుచుండెను. ఆకూఁతలు చలియే యట్లు గులగుల కూయుచున్నట్లుండెనని చిత్రించినాఁడు. ఇటులనే—

క॥ పెనుచలి గడగడ వణఁకుచు
వనదేవత దంతవీణ వాయించెనొకో
యన మోకప్రేంకణంబుల
వనగుత్తులమొఱసె నలిగణము పిపిసములన్.

అడవులలోఁ బ్రేంకణఘుఁదీఁగ లావేళఁ బూచినవి. పూచిన పూలగుత్తులపైఁ దుమ్మెదలు మూఁగి రొదచేయుచున్నవి. ఆ రొదలు వనదేవతయే చలిచే గడగడ వణఁకుచు, దంతము లొండొంటితోఁ దాకించుచు దంతవీణ వాయించుచుండెనా? యను నట్లుండెనఁట. హేమంతమునఁ జలి మిక్కుటమైనపుడు గడగడ వణఁకుట దంతములు తాఁకించుటయు సహజములు. దాని నిచట తుమ్మెద రొదలమూలముగ వనదేవతకుఁ గలిగించుటలో శ్రీనాథుని కల్పనా చమత్కృతి వెల్లివిరిసినది.

ఇట్టిచలి వేళలోఁ గొందఱు ధన్యులు సుఖముగ నిద్రింపఁగల్గెదరనుటనుగూడ నందముగనే వివరించినాఁడు.

శా॥ బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబున న్హత్తి మో
దంబార న్మృదుకేళిశయ్యల శుభాంతర్గర్భగేహంబులన్
దాంబూలీదళభోగపూరితముఖు ల్ధన్యాత్మకు ల్శీతకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధుల్.

సంస్కృతకవి యొకఁడు చలిబాధ తీరుట కొకయుపాయము నిట్లు వాకొనినాఁడు.

శ్లో॥ కార్పాసకృతకూర్పాసశతైరపి న శామ్యతి
శీతం శాతోదరీపీనవక్షోజాలింగనం వినా.

ప్రత్తితోఁ దయారయిన బొంతలు గాని, ఉన్నితోఁ దయారయిన కంబళ్లుగాని వంద కప్పుకొనినను, చలియనునది కృశోదరీపీనవక్షోజములను గౌఁగిలించుకొనినఁ గాని తగ్గ దనినాఁడు. అట్టిభాగ్య మున్నవారికే హేమంతరాత్రులలో సుఖనిద్ర లభించు నని శ్రీనాథుఁడు, మఱి

కొంత సామగ్రి కావలయు నని హెచ్చరించినాఁడు. సుఖకరమైన లోపలియింటిగదిలో మెత్తనయినప్రక్క, ఉరఃపీఠంబుల హత్తించుట కనువైన బింబోష్ఠుల కుచకుంభములు, ముఖాలంకారయోగ్యమయిన తాంబూలీదళము లాస్వాదించుటకు సమువుపడినపుడు సంభోగలీల లభించిన ధన్యులు హేమంతరాత్రులం దెంతేని నిద్రపోఁ గలిగెదరఁట.

మఱియు హేమంతవేళ చలి హెచ్చుగ నుండుట తెలుఁగు పరిపాటిలో నీతీరునఁ దెలిపినాఁడు.

గీ॥ చలి ప్రవేశించు నాగులచవితినాఁడు
మెఱయు వేసవి రథసప్తమీదినమున
నచ్చశీతు ప్రవేశించుఁ బెచ్చుపెరిగి
మార్గశిరపౌషమాసాల నడుమ.

కార్తికశుద్ధ చతుర్థి సంస్కృతపరిపాటిని నాగచతుర్థి. తెలుఁగు పరిపాటిని నాగులచవితి. శ్రీనాథునినాఁటఁ గూడ నిది నాగులచవితియే. ఈనాఁడీనాఁటివారు నాగులకుఁ బ్రీతిగఁ బుట్టలోఁ బాలుపోయుట, చలిమిడి, చిమ్మిలి, పండ్లు నాగస్వామికి నైవేద్యము చెల్లించుట, శక్తిగలవా రుపవసించుట మున్నగు పుణ్యకృత్యము లొనర్చుచుందురు. ఆంధ్రులలో నన్నిజాతులయూడువారు పాటించెడి పుణ్యదివస మిది. ఆనాఁటికి నాఁడును నేఁడును గూడ చలి ప్రవేశించును. మాఘశుద్ధ సప్తమి రథసప్తమి. ఆనాఁటికిఁ జలి మరలును. వేసవికూడఁ గొంత పొడచూపును. ఇదియునుఁ దెలుఁగువారి కొక పర్వదినమే. ఈ రెండు పర్వములకు నడుమనే మార్గశిర పౌషమాసములు. ఈ మధ్యకాలమున నచ్చమైన చలి పెచ్చుపెరిగియుండును. ఈ మాసముల నడుమనే సూర్యుఁడు కోదండరాశిఁ (ధనుస్సులోఁ) బ్రవేశించును. సూర్యుఁడు మకరరాశిలోఁ బ్రవేశించుసమయమును మకరసంక్రాంతి యందురు. ఈప్రవేశమునకు వెనుకటిదినములు నెల ధనుర్మాసదినములు. ఈమాస

మునవ్రతపూజోత్సవాదులు విష్ణునకు విశేషప్రీతికరములు. సూర్యుఁ డిట్టికోదండరాశికిఁ జేరునప్పుడు,మదపుటేనుఁగున కున్నంతబలము గలిగిన మానిసియైనను చలికిఁ దట్టుకొనలేక శరీరమును కోదండమువలె వంచక తప్పదనుటను భావస్ఫుటముగఁ జిత్రించినాఁడు.

గీ॥ ఇనుఁడు కోదండరాశిమీఁ దెక్కువేళ
నిక్షుకోదండవల్లి యెక్కుడు మరుండు
సమదవేదండ సమమహాసత్త్వుఁడయ్యు
జనుఁడు కోదండమునుబోలెఁ దనువు వంచు.

మకరసంక్రాంతి సాధారణముగఁ బౌషమాసమధ్యమునం దుండును. ఆవేళకుఁ దెలుఁగునాఁటి పల్లెలలోఁ గానవచ్చు చలివినోదములను కడు హృద్యముగ నెదుటఁ బెట్టినాఁడు.

గీ॥ ఇండ్లమొగలను నీరెండ నీడికలను
ననఁగుఁ దమ్ముఁడు నన్నయు నాటలాడు;
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము
గాచుచోటికి మకరసంక్రాంతివేళ.

ఇండ్లముందర నీరెండలు రేగినఁ, జిన్నపిల్లలైన యన్నదమ్ములు ఈడ్చుట కుపయోగించు కంపతోడుగు మున్నగువానిని దీసికొని యాటలాడు కొందరు. మంటయాఱి వేఁడి నెగజిమ్ము కుమ్ముగలచోటికిఁ జేరుటకై యత్తకోడండ్రు కుమ్ములాడుచుందురు. ఈరెండలో నన్నదమ్ములాట లాడుట, కుమ్ము దగ్గఱ నత్తకోడండ్రు కుమ్ములాడుట యను నీసహజ గ్రామ్యదృశ్యములను మన యెదుటఁ బెట్టిన శ్రీనాథుని నిశితశిల్పకళా దృష్టి కొనియాడనేరని సహృదయుఁ డుండఁబోఁ డని నాయూహ. గ్రహాగణేశుఁ డగుసూర్యుఁడు కోదండరాశి వదలి మకరరాశిలోఁ బ్రవేశించునప్పటికి మాఘవేళ వచ్చును. మాఘమాసవాసరములు భారతీయులకుఁ బుణ్యదివసములు. ఆ దివసములలోఁ గలుషములు

పాపఁ గోరువారు పుణ్యతీర్థములఁ గ్రుంకులు వెట్టుదురు. అట్టి మాఘవేళ శ్రీనాథుఁడు మహాస్థలను, కాశిలో చక్రపుష్కరిణియందును, పీఠికాపురమున కుక్కుటేశ్వరకుండమునందును (దీనిని పాదగయ యందురు) దక్షారామమున సప్తగోదావరమునందును, రాజమహేంద్రనగరమున మార్కండేయస్వామిసన్నిధిని గౌతమీనదియందును, తీర్థమాడఁజేసినాఁడు. ఆ సమయంబునః—

మ॥ పతిపోయెం దుహినంబు; పండె వరి; యిప్పల్పూసె శైలంబులన్
గటిగట్టె న్వలరాజు తేటిమొఱకం గాండప్రకాండంబులం
జటపించెం గ్రహరాజు మాతరకునిం జక్రాదిదిక్కూటంబునం
దటిఁ గౌబేరదిగంతికక్షపథయాత్రాజైత్రతుత్తుంభముల్.

శివరా. ౪-౩౯.

మాఘమాసవేళలో మంచుమాయుట, వరి పండుట, కొండలమీఁది యిప్పచెట్లు పూయుట, యనునివి సహజవిషయములు. మన్మథుఁడు తన బాణ సమూహమునందు తుమ్మెద ఱెక్కలతో గటికట్టినాఁడు. సూర్యుఁడు త్తరదక్కుజైత్రయాత్రకు మాతరకుఁడను పార్శ్వచరునిచే భేరి వాయింపఁజేసినాఁడు. రాత్రివేళలందు నిండువెన్నెలలో నులివేఁడి పొడచూపినదఁట. ఇది పరికించినఁగాని గోచరము గానిది. వరిచేలు కాపుకాచు గోపికలు, దంచి చెరిగి శుభ్రముచేసిన ప్రాసంగుఁబ్రాలు కర్ణాటదేశతాటంకినీదంతకాంతులఁ బోలియుండెనఁట. శ్రీనాథునినాఁడు పరిభాష్యము పరిబియ్యము పరియన్నము లభించుట యరుదు; కావునఁ జనరచన లన్నిటియందును పరిభాష్యమునుగూర్చిన వర్ణన మధికము. మంచు తొలఁగిపోవుటచే స్వచ్ఛమైన బహుళపక్షరాత్రులందు, కలువలు వికసించిన కొలఁకులలో నక్షత్రములు ప్రతిఫలించి, హంసల చంచువులచే ఖండితములై పైకిఁదేలిన మృణాలఖండము లనిపించుచుండెను. ఈ కల్పనలో శిశిరకాలమునాఁటి నక్షత్రదీప్తి నీటిస్వచ్ఛతయుఁ బ్రతిబింబించినవి.

మాఘమాసవాసరములలో వచ్చెడి పుణ్యదివసము మాఘ కృష్ణ చతుర్దశి మహాశివరాత్రి. ఇది యాచండాలాదిమనుష్యులకు భుక్తి ముక్తులు ప్రసాదింపఁజాలినది. మహేశ్వర భక్తులకు మహోత్సవ సమయము, ఆ శివరాత్రివ్రత మెట్లు నెఱపవలయునో ప్రథమాశ్వాస మునఁ బరమేశ్వరుఁడు వసుమతీబ్రహ్మలకుఁ దెలిపినట్టు లోకగద్యమున వర్ణించి, యట్టి యుత్సవము పాశ్వస్థ పురమునందలి పౌరులు, శివగంగానదీతీరమునందలి నాగేశ్వరాలయమున జరిపినట్లు వర్ణించి నాఁడు. ఈ వర్ణనమున శ్రీనాథునినాఁడు జరిపెడి శివరాత్రివ్రతపరిపాటి, ఆనాఁటి సాంఘికాచారములు వ్యక్తము లగుచున్నవి. ఆక్రమ మిట్లున్నది.

సీ॥ శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి
దగ నొనర్చిరి మూఁడుతర్పణములు
ధరియించి రంబుర ధౌతవస్త్రంబుల
నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం
దొవరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి
యభ్యాగతుల కన్నదానాలు నడిపి
రవనినురు లెల్ల నాగేశ్వరాలయమున
కేఁగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు...

శివరా. 4-34.

ఈ పద్యమునందు పదునేనవశతాబ్దినాఁటి బ్రాహ్మణగృహస్థుల నిత్య నైమిత్తికాచారపరణి వ్యక్తమగుచున్నది. శివరాత్రినాఁడు నాగేశ్వ రాలయమునకు రానెంచిన భూసురులు శివగంగానదిలో నఘమర్షణ మంత్రములు పఠించుచు స్నానమాచరించి, స్నానాంగముగ దేవర్షి పితృతర్పణములు చేసిరి. స్నానాంతరము ధౌతవస్త్రములుగట్టి, బ్రహ్మ

యజ్ఞ మాచరించి, అర్ఘ్యప్రదానముతరువాత సూర్యోపాస్తి నెఱపిరి. ఆవెనుక గృహములలోఁ జేయు నిత్యదేవతార్చన కావించి, యతిథిపూజలు నడిపిరి. ఆవెనుక నాగేశ్వరాలయమునకు వచ్చి పరమేశ్వరునకుఁ బ్రణమిల్లిరి. గృహస్థులయిన భూసురులకు పంచమహాయజ్ఞములు నిత్యములు. శివరాత్రి వ్రతాచరణము నైమిత్తికము. నిత్యములను ముందుగఁ దీర్చియే నైమిత్తికముల నాచరింపవలయును. కావుననే వణిక్పృథపౌరులు నిత్యక్రియలను దీర్చి, తరువాత శివరాత్రివ్రతాచరణమునకు నాగేశ్వరాలయమున కేతెంచిరి. శ్రీనాథునినాఁట నిత్యనైమిత్తికక్రియ లాచరించెడి భూసురులపరిపాటి యిందు సువ్యక్త మయినది.

ఇఁక నానాఁటిమహోత్సవమునఁ బాల్గొనినపౌరులు నాగేశ్వరాలయమునఁ జేసిన సంస్కారములు, వ్రతసరణి యీ క్రిందివిధముగఁ గొనసాగినవి.

గీ॥ ఆదరంబున సమ్మార్జనానులేప
ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల
బ్రాహ్మణులు నర్హులైనట్టి పౌరజనులు.

సీ॥ కాంస్యతోరణ మాలికలు సంఘటించిరి
ప్రాసాదగోపురాభ్యంతరముల
గంభాతరుస్తంభసంభారములు సము
త్పాటించి రోఁగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు
సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్ప వృషభపుంగవకేతనంబులు
నిలువంగఁ బెట్టిరి వలభులందుఁ
గమలనీలోత్పలంబులు గర్ణికార
మాలతీకుందములు హేమమరువకములు

మల్లి కాకింశుకము లపామార్గవకుళ
పాటలంబులు గూర్చి రపారములుగ.

ఈ పద్యమునం దానాఁడు దేవళములకుఁ జేయుమార్జనాది సంస్కార ములు. తోరణరంభాస్తంభాద్యలంకరణములు, ఈశ్వరపూజోపయోగి పుష్పపత్త్రాదిక మిందు వివరింపఁబడినవి.

ఇఁక నీమహోత్సవము నలవోకగాఁజూచిన సుకుమారునకుఁ బాలకులకుఁగూడ వింతగొలుపునది, భావించిన సద్భావము నొదవించు నదియు నాగేశ్వరలింగమును మెండుకొనియున్న పుండరీకములపూజ. తచ్చిత్త్రణ మీతీరుగ నున్నది.

"మదోన్మత్తుఁడైన సుకుమారుఁడు...గర్భగోళంబునకుఁ గట్టె దుర నిలిచి,...అలవోకయుంబోలె, నిర్మలస్ఫటికమండలాధ్యాసీనుం డును, నమృతమయజ్యోతిర్లింగమూర్తియు, ముక్తాఫలధవళకాంతియుఁ ద్రిభువనవందితచరణుండును నగు నాగేశ్వరుని దర్శించి, యమ్మహా దేవు మౌళికపాలమాలికామండనఖండేందుశకలంబులకు గగన గంగా ప్రవాహడిండీరఖండంబులకు ఉష్ణీషఫణిఫణాఫలకంబులకుఁ జెలికారంబు సేయఁజాలి, పాంచజన్యసహోదరంబులన నంగజాట్టహాసచ్ఛేదంబు లన మెండుకొనియున్న పుండరీకంబులపూజం గనుంగొనియె."

పుండరీకంబుల నెన్నిరీతులఁ బోల్పనగునో యిందు సందర్భింపఁ బడినది. ఉపమానవిషయములు చాలవఱకీశ్వరసంబంధులగుటచే భక్తిభావోద్బోధకములు.

శివరాత్రినాఁటిరాత్రి జాగరణఫలము సిద్ధించుటకై నిద్ర లేకుండుటకుఁ బాటించుపవిత్రకర్మములు వినోదవిషయములుకూడ నానాఁటి మనుజులు పాటించెడి పరిపాటుల కొక నిదర్శనము.

"ఆ శివరాత్రిపుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువా రును, నితిహాసంబులు చదువువారును, బంచాక్షరీపంచబ్రహ్మాది మంత్రం

బులు జపించు వారును నీలకంఠస్తోత్రంబులు పఠించువారును, బ్రాహ్మణా యాయంబు లను సంధించువారును బ్రిత్యాహారంబులు నడుపువారును బ్రిదక్షిణంబులు సేయువారును, భస్మోద్ధూళనం బొనర్చువారును, (ఇంతవఱకుఁ జెప్పఁబడిన వన్నియుఁ బరమేశ్వరానుసంధానరూపము లయిన కృత్యములు) దురోదరంబుల వినోదించువారును, నష్టావధానం బులఁ గ్రీడించువారును, వీణ లాస్ఫాలించువారును గావ్యగోష్ఠి సలుపు వారును, బరిహాసంబు లాదరించువారును, బిందుమతి నభ్యసించు వారును, నాడువారునుం బాడువారును, మేషకుక్కుటశరాటులావుక కపింజలయుద్ధంబులు వీక్షించువారును, గుబ్జవామనబర్బరరజకమూక జనంబుల వికారంబు లవలోకించువారునై జాగరంబు సలుపుచుండిరి"

పుణ్యకార్యాచరణమునఁగాని, వినోదప్రదర్శనముతోఁగాని శివరాత్రినాఁటి జాగరణము విశేషఫలదాయక మని యానాఁటివారి యూహ. ఇట్టులు శ్రీనాథునినాఁటి పరిపాటు లెన్నియోమనకు నాతని కావ్యములందలి ఋతువర్ణనరీతి యెఱుకచేసినది.



# అయుతనియుతోపాఖ్యానము

శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ, ఎమ్. ఏ.

అయుతనియుతోపాఖ్యానమున గృహస్థాశ్రమమహత్త్వము నిరూపింపఁబడెను. మోక్ష మధిగమించుటకు సన్న్యాసమునకంటె సంసారమే నిశ్చితోపాయ మని నిర్ణయింపఁబడెను. ముందుగా "సంసార-సన్న్యాసములఁ" గొంత పరికింతము.

సుఖాభిలాష మానవునకు సహజగుణము. భంగురము, శాశ్వతము, అని సుఖము రెండు విధములు. కొంతకాల మనుభవించిన పిమ్మట నశించునది భంగుర సుఖము. ఎంత యనుభవించినను దఱుగనిది శాశ్వతసుఖము, మోక్షసుఖ మన్నదియే. దీనికంటె నధిక మైన సుఖము మఱియొకటి లేదు. అల్పసుఖము ననుభవించిన మానవుఁ డంతకంటె నధిక మైన సుఖ మనుభవించుటకై ప్రయత్నించును. సాంసారికానందము లన్నియు క్షణికము లగుటచే వానియందుఁ దనివిసనక శాశ్వత మైన మోక్షానందమునకై మానవుఁడు ప్రయత్నించుచుండును. అందువలన మోక్షము పరమపురుషార్థము, ప్రధానగమ్యస్థానము నయ్యెను. తక్కుంగల ధర్మార్థకామములు దాని కుపాయభూతములు. అం దర్థకామములు ధర్మమున కుపాయములు. అర్థకామములను ధర్మపరముగా సాధింపవలెను. అట్లు నిరంతరము ధర్మనిష్ఠుఁడై నిష్కామకర్మ నాచరించుచు మానవుఁడు క్రమముగా సత్త్వశుద్ధిని బడసి జ్ఞానసంపన్నుఁడై మోక్షము సాధింపఁగల్గును. తీవ్రసంవేదన మున్నచో ధర్మార్థకామములతోఁ బని లేక సత్వరముగా మోక్షము పొందవచ్చును. అట్టి సంవేదన మందఱికి దుర్లభము. సంసారి ధర్మార్థకామములద్వారా క్రమముగా సత్త్వశుద్ధిని బడసి జ్ఞానియై మోక్షము నధిగమించును. తీవ్రసంవేదనము గలవాఁడు సంసారమును, అందు విహిత మైన ధర్మమును సన్న్యసించి సత్వరముగా మోక్షము గాంచును.

మోక్షగమ్యస్థానమును జేర్చు సంసారిగతి నేలపై నడకవంటిది. నేలపై నడ్చువాని కెట్టి ప్రమాదభయము లేదో యట్టే సంసారమున

నున్న వానికిని బతనభయము లేదు. ఒక వేళ బతితుండైనను వెంటనే లేచుట కవకాశము గలదు. ఇఁక సన్న్యాసిగతి విమానగతివంటిది. వీనికిఁ బతనభయ మెక్కువ. ఎట్టి ప్రమాదము గల్గినను పతితుఁ డగును. పతితుండైనచో నామరూపము లుండవు. సంసారి పతితుండైనచోఁ బ్రాయశ్చిత్తాదులవలన బునరుద్ధితుఁడు కావచ్చును. సన్న్యాసి కట్టి ప్రాయశ్చిత్తాదులు లేవు. వాని దధోగతియే; క్రమముగా, నిశ్చయ ముగా, సంసారి మోక్షపదవీపథికుఁడై గమ్యస్థానము నందఁగలఁడు. సన్న్యాసి యందినచో సత్వరముగా నందఁగలఁడు, లేనిచో నధఃపతితుఁ డగును. ఈ విధముగా సంసారసన్న్యాసములు రెండును మోక్షమున కుపాయభూతములే. మొదటిది క్రమసాధనము, కాని ప్రమాదరహితము. రెండవది సత్వరసాధన మైనను ప్రమాదభూయిష్ఠము, "Slow and sure is the best way to win the goal" అని చెప్పినట్లు సన్న్యాసము కంటె సంసారమే ప్రధానసాధన మని యీ యుపాఖ్యానమున నిరూ పింపఁబడెను.

(2) ఈ యుపాఖ్యానమునకు సూచికగా "నెవ్వారు గృహస్థ ధర్మవశవర్తులు వారలసామ్ము ముక్తియుక్" అనియుఁ దన్మధ్యమున 'దుస్సాధంబుసుమీ, స్మరజ్వలనజ్వాలికసోఁకసీక నిలుపక్ జ్ఞానామృత స్యందముక్" అనియు వర్ణించి కవి యన్వయవ్యతిరేకములచే గృహస్థా శ్రమము ముక్తిసాధన మని నిరూపించెను. క్రమసాధనమేగాక ప్రతి బంధనివృత్తిద్వారమున గృహస్థాశ్రమము ముక్తిసాధనముగాఁగూడ వర్ణింపఁబడెను. గృహస్థు పుత్త్రులఁ బడసి పున్నామనరకము తలంగు టయేగాక పితౄణవిముక్తిఁగూడఁ గాంచును. అందువలన మోక్ష మార్గ మతనికి సుగమము కాఁగలదు. వాసూలముని యయుతునితో నీ విషయ మిట్లు చెప్పెను—

దర్దురాంగనయందు సంతానసిద్ధి
నీకు నగుఁ గొంతకాలంబు నిర్గమింప

దాన నీవు పితౄణంబు తలఁగి శాప
మోక్షప్రాప్తియును గలుగు నాక్షణంబ.

ఈ విధముగా గృహస్థాశ్రమము మిగుల నుత్కృష్టమైన దని నిరూపింపఁబడెను. అంతియేగాక గృహస్థాశ్రమదూషణము పతనహేతు వనియుఁ దెలుపఁబడెను—

అట్టి గృహమేధిధర్మంబునందు నీవు
కుత్స సేయుట నీ రీతిఁ గొదవ యొడవె
నొప్పునది యొప్ప దని పల్కు నుద్ధతులకుఁ
గసరి పైవచ్చు రాళ్ళపై గాలివైన.

అని యహంకారముచే గృహమేధిధర్మమును నిందించుటయే యయుతుని దోషమని తెలుపఁబడెను. ఆ దోషమునకు దండనముగా నతఁడు శాపగ్రస్తుఁ డయ్యెను. శాప మిచ్చినవాఁడు మహాముని. శాప మిచ్చుటకుముం దతని కయుతునిదోష మెట్టిదో తెలియక శాపమిచ్చినను "మునీనాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి" యన్నట్లు శాపముగూడ నతనిదోషమున కనురూపముగాఁ బరిణమించెను. అయుతుఁడు మధ్య నున్న గృహస్థాశ్రమమును వదలి బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసాశ్రమమునకు లంఘింపఁదలఁచెను. ఇట్లు మండూకప్లుతి యొనర్చుటచే మండూకమవు కమ్మని ముని యిచ్చిన శాపమునకు సామంజస్యము చేకూరెను.

(3) ఈ గృహస్థాశ్రమమహత్త్వ నిరూపణమున బోద్ధృ బోద్ధవ్య బోధనల వైశిష్ట్యముగూడ సునిపుణముగా సూచింపఁబడెను. ఇందు బోద్ధలు మువ్వురు. అగస్త్యుఁడు, ఇంద్రుఁడు, వాధూలముని. ఈ మువ్వురును బోద్ధవ్యుఁ డగు నయుతునకు గృహస్థాశ్రమమును బోధించిరి. ఈ మువ్వురు నొకరికంటె నొకరు మహనీయులు. అగస్త్యుఁడు శివవివాహసమయమున సురాసురాదు లందఱు నొక్కదిక్కునఁ జేర

ధగణితమంపేయు నొద్ధరైపక్షైన గానిఁ గాపాడిన మహనీయుఁడు. సుశ్లోకముల గాపాడువాఁడీ ప్రభువు. వాధూలుఁడు బ్రహ్మనిష్ఠుఁడు. చరాచరమును నైన నిఖిలలోకములను నేనుగడ. ఇతనినిగూర్చి "పరతత్త్వసముద్బోధక బోధకలితుం డనియు నతని యాశ్రమపదము వానప్రస్థభృతులకుఁ జొరరాని దనియుఁ గవి వ్రాసెను. కావున నితఁడు వానప్రస్థకంటె నధికుఁడే.

అగస్త్యమహాముని మొదటిబోధ. అతని శిష్యసహస్రములోఁ బ్రయుతునికుమారులగు నయుతనియుతు లగ్రగణ్యులు. వారు కలియు వల్పియు నెఱుఁగక, శరీరసంస్కారము పాటింపక, పగలని రాత్రి యని పరికింపక, కూర్చున్నచోటినుండి కదలక వేదాధ్యయన మొనర్చిరి. క్రమముగా వారు "హృద్యాన్నోద్యదయజ్ఞానానూన విచార వాగ్వైభవ తేజః క్షాంతిశాంతిప్రధాన సమేతు"లైరి. ఋక్సిద్ధి వారికి దాతయు, గురుఁడు, దైవము, తల్లి, దండ్రియు నై యగస్త్యుఁ డెనుదు చేసి విద్యాతిశయము రాఁజొనిపెను. విద్య పూర్తియైనది. బ్రహ్మచర్యాశ్రమము వదలి యే యాశ్రమమున వారు ప్రవేశించుట యనునది సమస్య. అగస్త్యునకు గృహస్థాశ్రమ, సన్న్యాసాశ్రమముల విశేషము తెలియును. తన శిష్యుల యోగ్యతయుఁ దెలియును. సర్వము నెఱింగియే సంసారమునం దుండి సత్కర్మ మాచరించుట క్రమముగా మోక్ష మధిగమించుటయే వారికి యోగ్యమైన కృత్యమని నిశ్చయించెను. విద్యలో వారిని సంపూర్ణులగావించుటలో నితఁడు తనివిసనలేదు. వారియందలి యపారాతిశయమున వారి నుత్తమగృహస్థులనుగా గూడఁ జేయఁదలంచెను. గృహిణీ యోగ్యతయే గదా యుత్తమగార్హస్థ్యమునకు సోపానపదవి! ఈ భూలోకమున నెచ్చటను వారికిఁ దగిన కన్య లెవ్వరు లేరని తలంచి బ్రహ్మలోకమున కరిగి బ్రహ్మ నర్థించి యాతనికూఁతుల గాయత్రి సావిత్రి యను వారలఁ గొనివచ్చి యయుతనియుతులకుఁ జూపి "కుఱ్ఱలారా! బ్రహ్మను

వేఁడి విూకై యీ కన్యారత్నములఁ గొనివచ్చితిని. జ్యేష్ఠానుపూర్విగాఁ బరిణయ మాడుఁ డని పల్కెను. నియుతుఁడు గురువు మాట శిరమునఁ దాల్చి వివాహమున కియ్యకొనెను. అయుతుఁ డట్లంగీకరింపక "దేవా! ననవిల్తుసాధనమీకాయమునకు వేలుపట్టునా, అవగుణముల కెల్ల నెకైన నిలయ మైన యంగనాజనముకలనఁ గీడె గాని మేలు కలుగునా! తెలిసి తెలిసి తామే యిట్లు పలుకుట తగ"దని పల్కెను.

అగస్త్యున కింకు స్వార్థ మేమియు లేదు. శిష్యవాత్సల్యమె యతని నిందుఁ బ్రవర్తింపఁజేసెను. శిష్యులశక్తి నెంచియు, మేలు గోరియు నతఁ డీ కార్యమునకుఁ గడంగెను. అట్టియెడ నయుతునినిరాకరణ మతనికి దుస్సహ మయ్యెను. జడముడి వీడెను. కన్నుల నిప్పులు రాలెను. నిట్టూర్పు లగ్గలించెను. ఒడలంతయుఁ జెమర్చెను. కఱవఁ దలంచియుఁ బాము తానే యుడిగినట్లు శపింపఁదలంచియు నగస్త్యుఁ డుపశమిల్లి "నా యెదుట నుండక యావలికిఁ బొ"మ్మని గర్జించి యాకన్యల నిరువురను నియుతున కిచ్చి పెండ్లిచేసెను.

ఈ విధముగా నయుతునిగృహస్థాశ్రమమున దింపుటకై ప్రయత్నించి యగస్త్యుఁడు విఫలమనోరథుఁ డయ్యెను.

అయుతుని గృహస్థాశ్రమమున దింపుటకై ప్రయత్నించిన రెండవ బోద్ధ యింద్రుఁడు. అయుతుఁడు గురువుకోపమునకు వెఱఁ గంది హిమవద్గిరిప్రాంతమున కరిగి మోక్షమును బొందుటకై తీవ్రముగాఁ దపము సేయుచుండెను. ఇంద్రున కది నిప్పు త్రొక్కినట్లుండెను. అతనియుగ్రనిష్ఠను మాన్పఁదలంచి వృద్ధమహీసురవేషధారియై ముసలిభార్యతోఁగూడి కొందఱు శిష్యులు సమిత్కుశాదులు మోయుచుండ మఱికొందఱు సవత్స యగు ధేనువును దోలుకొని వచ్చుచుండ నయుతునియాశ్రమపదమునకు విచ్చేసెను. సాయంసంధ్యోపాసనకై నదీతీరమున కరుగుచున్న యయుతుని గలిసికొని కుశల మరసి, యతనియుగ్రతపమునకుఁ గారణ మడిగెను. అయుతుఁ డిట్లనెను.

ఆ. విషనిభంబు లైన విషయాభిలాషంబు
లెల్లఁ జెల్లఁ బెట్టి యేను బ్రహ్మ
చర్యధుర్యవృత్తి సవరించుచున్నాఁడ
నుగ్రతపము మోక్షమును కోర్కి.

ఇట్లయుతుఁడు పట్టుదలతోఁ దప మొనర్చుచుండెను. తపోగ్ని జ్వాలలాకసమునఁ బర్వి లోకభయంకరము లయ్యెను. ఇంద్రునకుఁ దలనొప్పి పుట్టెను. ఎందువలన? స్వార్థపరుఁ డగుటవలననా? లేక యయుతుని యభ్యుదయమున కసూయాగ్రస్తుఁ డగుటవలననా? కాదు. అయుతునకుఁ దీవ్రసంవేదనము లేదనియు, మోక్షమున కనర్హుఁ డనియు, నట్టియెడ నాతని యుగ్రతపము వ్యర్థ మనియు నతని తాత్పర్యము. తపస్సులకు విఘ్న మాచరించుట యింద్రునిస్వభావ మనియు, నతఁ డసూయాపరుఁ డనియుఁ గొంతఱేయభిప్రాయము. అది విమర్శన సహము కాదు. ధర్మరక్షణమే యతఁడు గావించు తపోవిఘ్నములకుఁ గారణము.

ఇట్లుపదేశింపవచ్చి యింద్రుఁ డాతనిచిత్తము నెన్ని విధముల నావర్జింపవలయునో యన్నివిధములఁ బ్రయత్నించెను. మొదట నతని సుముఖుని గావించుకొనుటకై యతనియందుఁ దన కభిమాన మున్నట్లు "నాయనా! నీతండ్రి ప్రియుతుఁడు నా మిత్రుఁడు. అతనిప్రాభవము భవము పెద్దల మెప్పు గాంచినవి. అతని జ్యేష్ఠపుత్రుఁడ వగుటచే నిన్ను జూడ నా కన్నుల కమృతము నానినట్లున్నది" అని పలికెను. ఇట్లు సుముఖుని గావించి మెల్లఁగా నతనిదోషముల నుద్ఘాటింపదొరకొని "కులధర్మమును వదలితివి. గురుపాదులకుఁ గోపము గల్గించితివి. అయినవా రందఱికి దూరమవైతివి. నీ వొక్కఁడ విక్కడ నుట్టి గట్టుకొని వ్రేలాడెదవా?" ఇట్లాతనిదోషములఁ జేర్కొని మోక్ష ప్రవృత్తి తగ దనియు సంసారము సుఖప్రద మనియు బోధింపఁ

జొచ్చెను. "లోకములో నెంతటి జ్ఞానియైనను మన్మథునకుఁ దలయొగ్గ వలసినదే. అతని నతిక్రమించుట యసాధ్యము పరాశరాదు లెంత గొప్పవారు? రాయివంటివారి హృదయములనైతము పూవులుతుఁ డొక్క నిముసములో నీరుగావించినాఁడు ఇఁక నీ వంటి పసిపాపల సంగతి చెప్పవలయునా? సంసారములోఁ బడినవారికి మోక్షము మృగ్య మని తలంచితివి కాఁబోలు! జనకాదులు మన్మథసాధనసామగ్రిమధ్యమున నుండియే మోక్షానందమును బొందలేదా? సన్న్యసించినంతమాత్రమున మోక్షము సులభ మనుకొంటివా? తలలు నున్నగాఁ జేయించుకొనిన సన్న్యాసులు నయితేము గాథాపురాణార్థములఁ దెలుపఁగల్గుదురు గాని ముక్తిని బొందఁగల్గుదురా? సంసారములో నమృతాయమాన లగు నంగనల మన్మథకళాసర్వస్వశృంగారమును వర్ణించి వర్ణించి సారస్వతపట్టభద్రులు నేఁటికిని పారముగానకయున్నారు. అట్టి యంగనల విలాసవిభ్రమాదుల నేమియు నెఱుంగని నీవు సంసారమును నిందించుట చూడ హాస్యాస్పదముగా నున్నది. గృహస్థాశ్రమములోఁ గల్గు సౌఖ్యము మఱెందును లేదుసుమా! ప్రతిదినము పశుశాలలనుండి పా లింటికే తెంచును. బహుధాన్యములు నేలఁ బండి యొఱగుచుండును. ఎడనెడఁ బెండ్లిండ్లు వడుగులు జరుగుచుండును. అడిగిన యాచకులు కృతార్థులై చనుచుందురు. పరిచారికాకోటి పనిపాటులు గావించు చుండును. చుట్టములు చేరవత్తురు. గ్రామ మంతయుఁ దన్నాశ్రయించి యుండును. నిత్యనైమిత్తికములు చక్కఁగా సాగుచుండును. హరిభుక్తము భార్య భక్తితోఁ బెట్టుచుండ భుక్తి గొనుటయే ముక్తి గాని నిదానించుచున్నవాని వలె నరగన్నులు వడ, రాతి వలెఁ గదలక మెదలక యోగనిష్ఠుఁడవై యుండుట ముక్తి కాదు సుమా".

ఇట్లు వృద్ధబ్రాహ్మణవేషధారి యైన యింద్రుఁ డయుతుని మోక్షమార్గమునుండి త్రిప్పి గృహస్థాశ్రమమున ప్రవర్తిల్లఁ జేయవలెనని

ములఁ బ్రయత్నించెను. అయుతుఁ డానాఁడు గురువు శపించునేమో యని భయపడి తొలఁగిపోయెను. ఈనాఁ డాతని కట్టిభయము లేదు. ఇంద్రుఁడు చూపిన ప్రతియుక్తికిఁ దాను బ్రతియుక్తిని జూపి ఖండించి వైచెను. ఒకటికిఁ బది, పదింటికి నూఱుగా, యుక్తులఁ జూపి వాదము చేయు నయుతుని శక్తికిఁ బట్టుదలకు నింద్రుఁడు సంతసించెను; కాని యతనియపమార్గవర్తనమునకు మిగులఁ బరితపించెను. ఇఁక నతనితో వాదము పెట్టుకొనిన లాభము లేదని తలంచి యతని యహంకారమును దూషించుచు నిట్లనెను - "అబ్బాయీ! నే నేదో మంచి మాటలు చెప్పఁదలంచి చెప్పితిని. నీవు వినకున్నఁ బోనిమ్ము; అహంకారమునఁ బెరిగి నీచమార్గమునఁ బోయెడి నదిపలె నిన్నెవ్వ రాపఁగలరు? గురువునే గుఱుతింపని నీకు నే నొక లెక్కయా? అలమి గుడి మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గావా? పులిని జూచి నక్క వాఁత పెట్టుకొన్నట్లు శుకాదుల ననుసరించుటకై ప్రయత్నింపకుము. అందని పంటి కానపడి లాభమేమి? బొందెతోఁ గైలాసముపొందనగునా? నీ కెందులకీ పట్టుదల!" అని పలికి విఫలమనోరథుఁడై యింద్రుఁ డచ్చోటు [illegible]సెను. అక్కడనుండి నెల్లైనేగాని యింద్రుని కతనితపస్సు తలనొప్పిగా నుండెను. తనచెంత నున్న కామధేనువుతో "మాయలు పన్ని యతని [illegible] గెను.

మ[illegible]ని. కామధేనువు తా నీ పని స్వయముగాఁగాక భంగ్యంతరమున నిర్వహింపఁ బ్రయత్నించెను. మహాతపస్వి యగు వాధూలమునిని దన ప్రయత్నమున కుపకరణముగాఁ బరిగ్రహించెను. ఇతరులు కోరినకోర్కెలఁ దీర్చు కామధేనువునకుఁ దన కోర్కెలఁ దీర్చుకొనుట యొక లెక్కకాదుగదా!

వెంటనే కామధేనువు లేవడి యొత్తువసీన ముసలిమ్రావు రూపమును దాల్చి యయుతుని యాశ్రమము ముందు పడియుండెను. అయుతుఁ

డా యావును జూచి "మొన్న వృద్ధబ్రాహ్మణునివెంట వచ్చిన యావే యిది! నిన్న నేఁటనే దీని కెంత దురవస్థ వాటిల్లెను", అని దానిపై జాలి తలఁచి యుపచారములు గావింపఁదొడఁగెను. నిరంతరము దాని కుపచారములు గావించుటచే నతనితపమునకే విఘ్నము వాటిల్లెను. ఊరక యకార్యకరణశీలురకు సుఖము గల్గునా? ఆ యా వాతని యుపచారములచేఁ దేఱుకొని బలిసెను. అచటఁ దాపసులు పెంచెడి నీవారపాకములను గందమూలములను దర్భలను నాశనము చేయఁదొడంగెను. తాపసు లెల్లరుపై కేమియుఁ బలుకనోడి లోలో నయుతుని నిందింపసాగిరి. బీద బలిసి బందెకాఁడైనట్లా యావువలనఁ గలుగు గొడవ భరింపఁజాలక యయుతుఁడు దానిని దాపసాశ్రమమునుండి వెడలఁగొట్టఁదలంచెను. ఆవునకు లంకె వేసి మెడలో లావుపాటిగుదెగట్టి తల్రాడు చేతఁబట్టుకొని చావమోదుచు నావలి కీడ్చుకొనిపోవుచుండెను. ఆ ధేను వాతఁడు పట్టు బహుబాధలచే రేఁగి పరతత్త్వసముద్బోధకలితుఁడగు వాధూలమునీంద్రుఁడుండు వనములోఁ బడెను. ఇంద్రాదులకైనను నాతనివనము చొరరానిది. ఆ ధేను వట్లు విజృంభించి యొడ లంతటను బుట్టలుపెరిగి కానరాకున్న వాధూలమునిని గట్టిగాఁ గాలితో మట్టి పాఱిపోయెను. సమాధినిష్ఠుఁడైన ముని దానితాపుచే సమాధి చెడి కన్నులు తెఱచి చూడఁగాఁ జేతిలో నున్న గోవును విడిచి నిర్విణ్ణుఁడై యున్న యయుతుఁడు గానవచ్చెను. తనతపోవిఘ్నమున కతఁడే కారణ మని తలంచి ఓరీ! దురాత్మ! వినయోజ్ఝిత! మదాంధ! యెవ్వరుఁ జొరరాని నా వనమునఁ జొచ్చుటయేగాక నా సమాధిగౌరవముకూడ వమ్ముచేసితివి. నీ శ్రాయము, రూపము, గర్వము, నుడిపోవునట్లు భేకమవు గమ్మని శపించెను. దీనుఁడై యయుతుఁడు జరిగిన దంతయు విన్నవింపఁగా దివ్యదృష్టిచే నతఁడు చెప్పినదంతయు సత్య మని గ్రహించి వాధూలముని కరుణాస్వాంతుఁడై యి

ఇదియు నహంకారమువలనఁ గల్గిన దుర్బుద్ధియే. "ఏ నింతవాఁడ, నేనయి పూనుకొన్న సరి కాకపోవుదిని. ఉగ్రతపము చేసి మోక్షము సాధించి తీఱెద" నను యహంకారములో నతఁడు హిమవంతమున కరిగెను.

అయుతుఁడు విద్యావంతుఁ డయ్యెనే గాని వివేకవంతుఁడు కాలేదు. యుత్సాహమే గాని యాత్మశక్తి నెఱుంగఁడు. విద్య పూర్తియగుటతో నన్నియుఁ దెలియు నను మిథ్యాజ్ఞానము కల్గెను. అధికారితారతమ్యమువలన నాశ్రమతారతమ్య మేర్పడు నని యతనికి గోచరింపలేదు. ఉత్తమాశ్రమ మైన సన్న్యాసమునకుఁ దా నర్హుఁడ నను జ్ఞానము లేక గురువు తన్ను గోతిలోఁ దింపుచున్నాఁ డని తలంచెను. గురు వెక్కడ శపించునో యని భయపడి యతని సమ్ముఖమునుండి తొలఁగిపోయెనుగాని యతఁడు శాంతముగా మాటాడినచో సమాధానము చెప్పగల్గుదు నన్న యహంభావ మతనికి లేకపోలేదు. అహంకారము గలవారికిఁ బట్టుదల యెక్కువ. హిమవంతమున కరిగి యయుతుఁడు పట్టుదలలోఁ దప మొనర్చుచుండెను. తపోగ్నిజ్వాల లాకసమునఁ గ్రమ్మి లోకభయంకరము లయ్యెను. ఇంద్రునకీ తపమువలనఁ దలనొప్పి గల్గి వృద్ధబ్రాహ్మణవేషమున వచ్చి దాని మాన్పింపఁ బూనెను. ఇంద్రుఁడు స్వయముగా వచ్చి మోక్షప్రయత్నమునుండి యయుతుని మరల్పుటకై పలువిధములఁ బ్రయత్నించెను. కాని యతఁడు తన వాదనైపుణ్యమును నెఱపి యొకటికిఁ బది, పదిటికి నూఱు యుక్తులఁ జూపి యాతనిమాటల నిరాకరించెను. ఇం దయుతుని వాద మహంకారపూరితము. యుక్తికిఁ బ్రతియుక్తి చూపుటయందే యతని సంరంభము. దీని కొక్క నిదర్శనము — ఇంద్రుఁడు గృహస్థాశ్రమ మహత్త్వము నిరూపించుచు "జనకాదులు సంసారమునందుండియు మోక్షమును సంపాదించిరి. తీవ్రసంవేదన మున్న సంసారమునుండియు

మోక్షము పొందవచ్చును. అది లేనిచో సన్న్యాసి యయ్యును మోక్షము పొందలేఁ"డని చెప్పెను. అయుతుఁ డిందలిచివరభాగమునకు సమాధానము చెప్పక ప్రతియుక్తిగా "మోక్షము పొందినవారిలో జనకు నెంతు వేమి? అతనికంటె గొప్పవాఁడు శుకుఁ డున్నాఁడుగదా! అతఁడు బ్రహ్మచర్యమునుండియే మోక్ష మందెను" అని పలికెను. అంతతో నూరకున్న నొంత బాగుండును. మఱియొక యుక్తినిగూడఁ జూప నెంచి యిట్లనెను- "జనకునకు యాజ్ఞవల్క్యాదులు మోక్ష మార్గ ముపదేశించిరి. కావున నతఁడు పరముఖోపనత విజ్ఞాని. శుకుఁ డా జన్మబ్రహ్మవేత్త. అందువలన బరముఖోపనతవిజ్ఞాని కాదు" ఇం దయుతుని వాదదౌర్బల్యము గానవచ్చును. తన్నుఁ శుకునితోఁ బోల్చు కొనుచున్నాఁడు, బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసమును స్వీకరించుట తమ యిరువురికి సమానమే. గాని శుకుఁడు జన్మ బ్రహ్మవేత్త; పర ముఖోపనతవిజ్ఞాని కాదు. తానో యట్టివాఁడు కాఁడుగదా! అట్టియెడ నీ విశేషణముఁ బ్రయోజన మేమి? ఒకటికిఁ బది ప్రతియుక్తులు చూపుటకై యట్లు పల్కెను. అందియేగాని శుకునకు నీతనికి హస్తిమ శకాంతరము గలదు. వీరికిఁ గల యంతర మింద్రునకుఁ దెలియకపోలేదు. అందువలననే "వ్యాససుతాములం దలఁచి వాసికి మంగలికత్తి ద్రింగెదు...చలం బది యేమి ఫల"మని చెప్పెను. ఇతని యహంకార మును దూషించుచు నింద్రుఁడు "ఇది వోలు నిది వోలదని దెల్పఁదెలియునే యనవుఁ బోదువ? నిమ్నాభిముఖంబైన నీటి నెవ్వాఁ డోపు ద్రిప్పి యెప్పగుచోటఁ దిరుగఁజేయ? నలమి గుడి మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గాకుండునే? అగస్త్యముని పనుపుమీఱి యూరకిగుర్వన మిన్ను ముట్టు నింత మేటికి నా మాట యెంతపాటి?" అని పలికెను

ఘటించునే సమయముగాఁ దన శిష్యహస్తము [illegible] వెలువరించెను. అప్పు
చేసిన తప్పుం కితని నిష్కారణముగా శపించితినా యని యాఘోరాంగుని దివ్యదృష్టికి జరిగిన దంతయు [illegible] మా ప్రవేశము కాదనియుఁ దనచేఁ బొరపాటు [illegible] యయి తునికి తప్పని తెలియఁజేసెను. గార్హస్థ్య ముత్తమాశ్రమ మనియు దాని బాటించుట తగ దనియు, ఆశ్రమములఁ గాఁదన్న శాపోపహత స్వుడు భేకజన్మమున నైన గార్హస్థ్య మవలంబింపు మనియు నయుతునకు బోధించెను.

అయుతుడను కథ్వా [illegible] చెప్పిన దంతయు శిరసావహించెను. శిష్యస్వభావ మిచ్చట సూచింపఁబడెను. గురువు యథార్థవాది యని తెలిసియున్నను, గురువు యథార్థమే పలుకుచున్నను దాను దలంచిన దాని కన్యథా పల్కినచో నహంకారముగల శిష్యుఁడు విషయవిమర్శన మొనర్పక గురూపదేశమును దృణీకరించును. గురు వా విషయములోఁ బొరపడె ననిగాని. తన కనర్థము చేయుచున్నాఁడనిగాని తలంచును. పెద్ద లెవ రెంతే చెప్పినను వాని మనస్సున కేమియు నెక్కదు. వాని వినిపింపవలెనన్నచో ముందుగా నతని యహంకారమును భగ్నము కావింపవలెను. తగిన దండనమునఁగాని యహంకార భంగము కలుగదు. దండ మైనను దాను తప్పుచేసితి నని తెలిసినప్పుడే ప్రయోజనకారి యగును. నిష్కారణముగా దండితుడ నైతినని తలంచినచో నతని యహంకార మడుగుటకు బదు లుద్రేకించును. యుక్తసమయమున నొసఁగిన దండనమువలన నతఁడు పశ్చాత్తప్తుఁ డగును. అప్పు డొసర్చిన యుపదేశ మతని తల కెక్కును. అందువలనే యాగిస్త్యుఁడు శపింపఁదలంచియు నతని నిరపరాధిత్వము నూ[illegible] గురువిప్లి యాశ్రమమునుండి వెడలఁబడచెను. [illegible] ఉపదేశము వినలే [illegible] నిరపరాధియగు నతనికి హానిసేయు నొల్లక కామధేనుముఖముననుఁ గాల్ప

సిద్ధి గావింపఁదలఁచి వెడలిపోయెను. కామధేను వతని యకార్యకరణ శీలమును వ్యక్తముగావించి వాధూలశాపమున కగ్గము గావించెను. వాధూలముని మొదట శపించియుఁ బిమ్మట ప్రసన్నుఁడై యతని యహంకారమును గర్హించుచు నిట్లు పలికెను—

"ఇట్టి గృహమేధి ధర్మంబునందు నీవు
గుత్స సేయుట నీరీతిఁ గొదవయొదవె
నొప్పునది యొప్పదని పల్కునుద్ధతులకుఁ
గసరి పైవచ్చు ఱాళ్ళపై గాలియైన"
"తానింతవాఁడ నేనయి
పూనుదునఁట యెద్దికాకపోయెడి నని సుం
తైన ఫల మందఁ దీరదు
మానవులక కాదు విను మమర్త్యులకైనన్"

అయుతుఁ డప్పుడు పశ్చాత్తప్తుఁ డయ్యెను. ఇంద్రుని మాటలు ఖండించినట్లు వాధూలముని మాటలు ఖండించుట కతఁడు పూనుకొనలేదు. తా నిప్పుడు శాపోపహతుఁడు.నిరహంకారి. ఎదుటనున్న వాఁడు సర్వము నెఱింగిన వాధూలముని. అతని మాట కా దనుట యెట్లు?

ఈ విధముగాఁ గామధేను పరీక్ష కాగలేక యయుతుఁడు పతితుఁ డయ్యెను. కావున నయుతుని పాతిత్యము సకారణమగుటచే సానుభూతి విషయము కాదు.

(4) ఇందలి బోద్ధలు ముగ్వురు బోద్ధవ్యుఁ డగు నయుతునకు మూఁడు విధములుగా బోధించిరి. అగస్త్యుఁడు ప్రభుసమ్మితముగా బోధించెను. తా నొసర్చిన యుపదేశ మయుతుఁడు నిరాకరించినప్పు డతని బోధించుటకై యగస్త్యుఁడు మఱియొక మార్గ మన్వేషింపవలసి

నది. మాట విననిబంటుపైఁ బ్రభువు మండిపడిన ట్లయుతునిపై మండి పడి యాశ్రమమునుండి వెడలనడచెను. ఉపదేశ విషయము ప్రభు సమ్మితత్వము ఫలప్రదము కా దని యిందువలన వ్యక్త మగుచున్నది.

ఇంద్రుఁడు మిత్రసమ్మితముగా నుపదేశించెను. అయుతుని యందలి యాదరాతిశయముచే స్వర్గలోకమునుండి తానే విచ్చేసెను. ఉపదేష్ట యాదర్శప్రాయుఁడైనఁగాని యుపదేశ మెక్కుదుగదా! అందువలన నింద్రుఁ డాదర్శకుటుంబి యయ్యెను. అతని వృద్ధమహీసుర వేషము సంసార మెప్పటికి సన్న్యసింపఁదగినది కా దనియు, వృద్ధభార్యాసాహచర్యము వయస్సుతోపాటు దాంపత్య మతిశయించుననియు, గోసేవ శిష్యవాత్సల్యములు సంసారమున నానందకందము లనియు సూచించుచుండెను. మిత్రునివలెఁ దా నెన్నో విధముల నయుతున కుపదేశించెను. ఉబ్బించియు, నూరించియుఁ, దప్పు తెలిపియుఁ, గోపించియుఁ, దుదకు దూషించియు నతనికి బోధింపఁ దొడంగెను. ఎన్నివిధములఁ బ్రయత్నించినను నయుతుఁ డహంయువై యతనిమాటలు గీటునఁ బుచ్చెను. "ఇతఁ డహంకారి. సామవచనములఁ జక్కఁబడఁ" డని తెలిసి 'దండోపాయమున నతని వశంవదుఁ గావింపు' మని కామధేనువునకుఁ దెల్పి వెడలిపోయెను. మిత్రసమ్మితమగు బోధ వినీతులయెడనేగాని యవినీతులయెడ ఫలప్రదముకా దని యిం దభివ్యక్తమగుచున్నది.

కామధేనువు కాంతాసమ్మితముగా నుపదేశించెను. కాంత తన కోర్కె సాక్షాత్తుగాఁ గాక భంగ్యంతరమున వ్యక్తీకరించి నిర్వహించి కొన్నట్లు కామధేనువు వాధూలముని ద్వారమునఁ గార్యోపదేశ మొనరించి యభీష్టసిద్ధిఁ గాంచెను. కామధేను వతని యహంకార మమకారముల బయటఁబెట్టి యసమర్థుఁడు సంసారమును దూషించుచు సన్న్యాసమునకుఁ గడఁగుచున్నాఁడు. వీనికిఁ దగిన శాస్తి యొనర్పుమ

న్నట్లు వల్మీకి నిమగ్నుఁడై తపోనిష్ఠగరిష్ఠాత్ముఁడై యున్న వాధూల మునిని మట్టి లేవఁగొట్టెను. అతఁడు లేచి శపించెను. పిమ్మట వినీతుఁడైన యయుతునకు సంసారమహత్త్వ ముపదేశించి భేకజన్మమున సంసంసార సుఖమును జూఱఁగొను మని యాదేశించెను. అయుతుఁ డతని యాజ్ఞను శిరసావహించెను. అయుతుఁ డట్లగుటంజేసి సన్న్యాసమునకంటె సంసారమె క్షేమమైన మోక్షసాధన మని నిరూపింపఁబడినట్లయ్యెను.

ఈ విధముగా బోద్ధ సర్వోత్కృష్టుఁడుగా నుండవలె ననియుఁ బోద్ధవ్యుఁడు నిరహంకారి కావలె ననియు, బోధనము కాంతాసమ్మితముగా నుండవలె ననియు, బోద్ధృబోద్ధవ్యబోధనములనై శిష్ట్య మిందుఁ జక్కఁగా సూచింపఁబడెను.



# శివలీలా విలాసము

## తృతీయాశ్వాసము

వ. ఇట్లిందిర సముద్రాంతర మందిరయగుచు సర్వంకషంబు నిజ విజృంభణంబు తలచూపకుండె; నత్తరి లోకంబులు బహుదారిద్ర్యశోకంబులఁ గీడ్పడియె. నిర్జరసమూహంబులు రాక్షసవిజయోత్సాహంబులచే నొచ్చి, చేడ్పడియె. యాగంబులుక్రియావియోగంబులఁ జిక్కు మోడ్పడియె. ధర్మంబు పాపకర్మంబుల స్రుక్కి వీడ్వడియె; నత్తెఱఁగు తెఱంగుపడ నిరీక్షించి, నిశ్చయించి పురందరప్రభృతులుపురస్కృతమునివిస్తృతులగుచు నార్తరక్షణ పరాయణుండు గావున నారాయణుండు మమ్ముర‌క్షించు; మాకుఁ దచ్చరణంబులు శరణం బని, తత్పరంబుగా వైకుంఠ పురంబునకుం జని,

సీ. శ్రుతిధురీణాగమ మతిచింత పాటగా
శయ్యాహివిభుఁడు మస్తకము లెత్త
పీతాంబరము నవస్ఫీతాతపంబుగాఁ
జారునాభీరుహజలజ మమర
శ్రీనిత్యలక్ష్మి మూర్ఛిత మధువ్రతముగాఁ
గోమల నవపుష్పదామ మొప్ప
శేఖర మణికాంతిచంద్రిక పాగగా
నుల్లస న్నీల ధమ్మిల్ల మమర
శంఖపద్మ కౌమోదకీశార్ఙ్గ ఖడ్గ
ముఖ్య దివ్యసాధనములు మూర్తలీల
మెలసి తనచుట్టుఁ గొల్వ నింపొందుచున్న
యవిరళ ప్రాభవుని రమాధవునిఁ గనిరి.

చ. కని ప్రణమిల్లి భక్తివశగౌరవ మొప్పఁగఁ బెక్కుభంగుల
న్వినుతు లొనర్చి రట్టియెడ నిర్జరవల్లభుఁ డర్థిఁ గేలు మో
డ్చినిటలపీఠిఁ జేర్చి తగ సృష్టికి లక్ష్మి ఘటించుపొందు త
న్ననుగుణరీతి వేఁడిన జనార్దనుఁ డాదరభావ మూరఁగా.

క. వారును దానును నప్పుడు
మేరునగంబునకు సరిగి మిగిలిన కణఁకన్
నీరజగర్భుని నచటికి
వారక పిలిపించుటయును వచ్చె నతండున్.

వ. ఇట్లు వచ్చిన విరించిఁగోడం దలపోసి, శార్ఙ్గపాణి నిలింపపరంపరలఁ జూచి, మందరమహీధరంబు గవ్వంబుగా దుగ్ధసముద్రంబున నిడి వాసుకిం దత్త్రాడుగా సలవరించి, తన్మథనంబు గావించిన నభిమతసిద్ధులు సమకూరు నని పలికి, యేమును దోడుపడియెదము. మీరు రాక్షస వీరులవలని శాత్రవం బుడిగి మిత్త్రభావంబు నడపి, తత్సహితులగుచు మంథాచల సమారోపణంబునకుఁ దొణంగుం డతిశీఘ్రంబ కణంగుఁ డనుచు వీడ్కొలిపినం బురందర ప్రభృతు లందఱు నా జగత్పతు లిరువురకుం బ్రణామంబు సల్పి చని తదుపదిష్టప్రకారంబున.

ఉ. లీలఁ బులోమజంభక బలిప్రముఖాసురనాథులన్ యథా
ర్హాలఘు నామకర్మముల నాప్తుల మిత్త్రులఁ జేసి వారి న
వ్వేలుపు లెల్లఁ దోడుకొని వేడుక మందరశైలమున్ రమా
లోలతఁ జేరగాఁ జనిరి లోకహితార్థ విధాధురీణులై.

మ. చని వార ల్గని రాగబంధుర వరస్వర్బాలికాలోల లో
చన రాకాసితిమచ్ఛలోచ్ఛలదుదంచ త్స్యందవచ్చంద్రకాం
తనవాంభః ప్రకట ప్రభావపరిపూర్ణ వ్యాయతావాల మో
హన నానావిధ వృక్షజాలము భవిష్యన్మంథకుత్కూలమున్.

ఆ. అప్పుడు దితిజముఖులు నదితిజప్రముఖులుఁ
జిత్తములు తదీయ చిత్రమహిమ
కలరుచుండఁ జూపు లంగ సమాసక్త
హేలఁ జెలఁగుచుండ నిట్టు లనిరి.

మ. వరసింహాసనశోభి సన్మకుట మదవ్యాలేపి శృంగారి బం
ధురఖడ్గప్రవిభాసి హేమకట కోదండ ప్రభాశాలి చా
మరతేజస్స్ఫుటహారి మంగళశిరోమాణిక్య సంసర్గి యీ
ధరణీ భృత్కులచక్రవర్తి యొసఁగుఁగా దా నస్మదీయార్థముల్.

వ. అనుచుఁ జేర నరిగి, యమితస్ఫారబాహాబలసన్నాహంబులుం బర
స్పరాధిక సముత్సాహంబులు నితరేతర సముచిత క్రియాకలాపం
బులు నన్యోన్యచతురాలాపంబులుం జగురొత్తం దత్తరపడక నెర
వేర్పడం బట్టి యగ్గిరి యెట్లునుం బెల్లగింపఁజాలక నిజస్వాంతంబులు
చింతాక్రాంతంబులుగా నుండ నంత.

ఉ. ఆసమయంబునందు దితిజాదితిజశ్రమ మార్ప వచ్చెఁ బ
ద్మాసన జన్మకారణ వరాంబుజనాభుఁడు భక్తలోకర
క్షాసముదగ్రనిర్మల యశఃఫలలాభుఁడు మంగళోజ్జ్వల
ద్వాసుఁడు వాసుదేవుఁ డతిధర్మనివాసుఁడు సంభ్రమంబునన్!

ఉ. భూరిబలాఢ్యు లయ్యు సురపూర్వసురేశ్వరు లొక్కచోటఁ ద
ద్భారవిభుగ్నభగ్నబలపౌరుషులై పడవైచి రుర్విఁ బ్రా
గ్భారవికీర్ణ ఘోరవరపాత సమగ్రగళన్మణిప్రభా
పూరము సత్పురాణవరభూజము మందరశైలరాజమున్.

క. గరుడగమనుఁడు దాశం
కరుఁడును నా ధరణిధరము కందుకలఘుతం
బారయంగ నెత్తి సత్త్వ
స్ఫారణంబున వాహనాసమునఁ దగ నిడియెన్.

వ. తదనంతరంబు వార లందఱు పరస్పరాహ్లాదభాజను లగుచుఁ దోడన
కొల్చి చనుదేర నచ్చోఁ గదలి.

మ. సరసీజాక్షుఁడు దుగ్ధవార్ధి కరిగెం జాగ్రత్స్ఫురత్సాన్ద్రవనీ
ధరయాదస్సముపాత్తసంగణనజాతస్పర్ధికభ్యాగతాం

బరగజాద్రిగుణీభవద్ఘుమఘుమ ధ్వానార్భటిం దుర్గభం
గరయోద్భూతరయచ్ఛటానిఘటితాకాశస్ఫుటాంతర్ధిక్కిన్.

మ. అతిచిత్రావహలీల నిట్లురిగి నేర్పారంగ నాభూమిభృ
త్పతి డించెన్ హరి మించెలర్ప లహరీపర్యస్తముక్తాఫల
ద్యుతి రమ్యస్థలయాదఃచందనతమాలస్ఫూర్తిసంస్ఫూర్జద్గంధ సం
తతి మన్మందగరుత్సమీరణము తద్వారాశితీరంబునన్.

వ. అనంతశయనుం డనంతరంబ యాఖండలపురోగములగు సురాసుర నాథులంజూచి, మీరిమ్మహీధరంబున సాగరంబు దరువుండు; శుభంబులు దొరకు; ననవుడు వార లుత్సాహ దోహలంబున.

ఉ॥ సుందర మందరంబు గమనమంపరయంబున నంబురాశిలో
నం దగ నిల్పి భూమిభరణక్షమసత్త్వవిలాసు వాసుకిం
బొందగ నేత్రభావమునఁ బొంపిరిపోవ నొనర్చి రంత గో
విందుఁడు దాల్చెనప్డు గము పీఘునఁగచ్ఛపమూర్తిశాలియై.

వ. మఱియు నతం డాకొండ యొరగం బడకుండ ననురూపంబుసల్పి, తచ్ఛిఖరంబు సముద్దండ భుజాదండంబుల గ్రుచ్చిపట్టి, కరంబు తిరంబు గావించిన

మ. అట మంథాచలవేష్టితాహిపతి మాద్యత్పుచ్ఛమస్తంబు లొ
క్కట దేవాసురు లర్థిఁ బూని తరువంగాఁ జొచ్చి రబ్ధి న్విశం
కటపర్యాయ సమాపకర్షణభవత్కల్లోల లోలత్పయ
శ్ఛట లంభ్రంకషతం దలిర్పఁగ భుజాజాగ్రద్బలోదగ్రులై.

శా. శుంభత్సారులు వారు ద్రచ్చునపు డస్తోకభ్రమాటోపసం
జృంభప్రౌఢి దలిర్ప నగ్గిరి సమాశ్లేషించె జంభారి దో
స్తంభాతిక్షత మాశుశుక్షణిమహాదంభోళి సంపాతభి
త్సంభోది ప్రసవత్స్వపక్షభవపక్షాలక్ష్య శైలావళిన్.

వ. తదనంతర సమయంబున

మ. కలఁగెన్ దిగ్విజయదంతదిక్షు బధిరీకార ప్రకారక్రియా
కలన న్మంధ మహీధర భ్రమణ వేగత్రుభ్యదభ్యంతరా
కులితస్వాంత కుళీరకూర్మ శఫరీ కుంభీక కుంభీనసా
ద్యలఘుభ్రాంతిజలగ్రహానన సముద్యద్భైరవారావముల్.
మ. సరి నిట్లాదఁబు నొక్కపెట్ట కణఁకన్ సవ్యాపసవ్యంబులన్
దరువంగా వలసూన నాగపతి వక్త్రవ్యాప్తనిశ్వాసని
ర్భరవాతోద్ధితవహ్ని యగ్రిచరదీప్యత్కీలఁ గ్రాలం భయం
కరరీతిం బ్రభవించె నయ్యెడ మహాకాకోలమంభోనిధిన్.
తరలము—
భుగ భుగంచును దిక్కులందును బొంగుధూమచయంబులుం
ధగ ధగన్మెఱి వాని మీఁదికి దాటునగ్నికణంబులుం
ఖగపతిం జని తత్సహాయతఁ గ్రాలు మంటలుగాఁ గడుం
నిగనిగ న్విషమొప్పె సర్వము నిండునీలమరీచులన్.
శా. ఆ హాలాహల మంత నద్దవిడి మంథాద్రీంద్ర సక్తస్ఫుర
ద్బాహుస్తంభుని దత్సమానతను విభ్రాజిష్ణు విష్ణున్ రయో
త్సాహం బొప్పఁగ నాక్రమించె మహితాశ్చర్యంబుగా ముంచి త
ద్దేహం బగ్గల మైన నీలరుచి నొందించె న్మదించెం గడున్.
క. కమలోదరుఁ బొదివియుఁ బోదు
వమి నొక్కట వేఁడ దనుజవల్లభులు ససం
భ్రమగతుల నన్నివంకల
గమనించిరి తద్విషంబు గని యాతురతన్.
వ. ఇట్లు వష్టంభ విజృంభణనిరాఘాటం బగు కాలకూటంబు వజ్రాయు
ధంబునుంబోలెఁ బ్రభంజనంబును, ననలంబునుంబోలె నాశ్రయాశం
బును, నింద్రరత్నంబునుంబోలె నీలంబును, నగుచుఁ గొలంకులు డిం
దను, దిక్కరులు నొగులను, సాగరంబులుమఱుఁగను, గాతుకంబు

లు దరుగను, జండగతినిండం బడసి లోకంబులం బ్రాప్తశోకంబుల
గావించుసమయంబున నక్కడం దలలచీఁకలు మఱచిన సురాసురలును
నిఖిలాభీలభయసంభ్రమంబు లెడలిన తపోధనులుంగూడఁబడ
నరిగి యెడదవ్వుల నిలిచి, విషోద్భవంబునకు వెరఁగుపడుచున్న
యంబుజాసను శరణంబుఁ జొచ్చుటయు, నతండు వారి కిట్లనియె.

చ. అరుదుగఁ బూని యీ విషకృతాపదఁ బాపఁగ నోపు దక్ష తె
వ్వరు గం రాదిదేవుఁడు శివప్రదభావుఁడు బాలచంద్రశే
ఖరుఁ డొకరుండు దక్క నెడఁగావున నిప్పుడ యేఁగి భక్తిమై
శరణము వేఁడఁగావలయు సత్కరుణాకరు నమ్మహేశ్వరున్

మ. అనుచుం గ్రక్కున వారుఁ దాను జని సొంపారంగఁ గైలాసమున్
గనియెన్ ముందఱకందరాస్ఫాటలతాగారాంతరస్థత్వర
స్తన కుంభద్వయ లిప్తచందన హరిద్రాగంధ వద్గంధవా
హానిరస్త శ్రమశంభు సీపనసమాయాతా ధ్వరోల్లాసమున్.

వ. అనంతరం బమ్మహాచలమధ్యభాగంబున నంబరభాగంబు గదిసి, యొప్పుమీఱిన రాచవారి పెద్ద మొగసాలముందట నిల్చి, యం దఱు నొక్కపెట్ట యార్తస్వరంబుల నిట్టు లనిరి.

శా. అబ్రహ్మణ్యము విశ్వనాథ యయిదో యవ్యక్త మొఱ్ఱో నిశీ
శభృద్భాలనేత్ర కావుము కృపన్ సర్వజ్ఞ యాలింపు గం
గాభ్రాజిష్ణుసమూర్ధ దిక్కగుము లోకారాధ్య కైకొమ్ము నా
నాబ్రహ్మోపనిషణ్ణయా యరయుమానందాత్మ మమ్మార్తులన్.

క. అని నానావిధ దీన
ధ్వని ముఖరత మ్రోయుచున్న వారలపలుకుల్
విని పిలువఁబంచె శంకరుఁ
డనితరసులభానుభావుఁ డందఱఁ గరుణన్.

వ. బ్రహ్మాదులు కలితాహ్లాదు లగుచు నగణితమణిసముత్కరదీపంబుల మెఱయు లోపలి కొలువుకూటంబునకుం జని,

సీ. దాపటిమోకాల నేపారఁ బూనిన
పిన్నప్రాయపుఁ బాప పెండియమును
దోడల యొల్లియదండ బెడఁగారఁ గట్టిన
తోండంపుబద్దియ దుప్పటియును
నెంపపేరులలోన నింపార గ్రుచ్చిన
మాటపెద్దజికంబు మానికమును
జడముడిచెంగటఁ జదురారదోపిన
మవ్వంపుఁ గ్రొన్నెల క్రొవ్విరియును
నెమ్మి యొసలారు వలకేలుఁదమ్మియందుఁ
బొసఁగఁగట్టిన ముమ్మోము పోటుముట్టు
గలిగి యొక పెద్దసింగంబు గద్దెఁమీద
గణఁకఁ గొలువున్నయట్టి ముక్కంటిఁ గనిరి.

గీ. అందఱును వారలంత నానందమొప్పు
సరణి నందంద యిలఁ జక్కఁజాగి మ్రొక్కి
హరుఁడు కరుణార్ద్రభంగి లెం డనిన లేచి
యంజలులు ఫాలవీలథుయంద నిలిపి.

వ. తదనంతరంబ —

మ. ప్రకటానంద చిదుజ్జ్వలన్మహిమ మారన్ శాశ్వతాత్మ ప్రకా
శకకూటస్థనిరూఢి భూనియతి సూక్ష్మస్థూలభావంబులన్
సకలంబుం గనుచుండు దీవు వరహాసఖ్యాతివిభ్రాజివై
యకలంకస్థితి నిన్నెఱుంగఁ గలరా? యస్మాదృశుల్ శంకరా!.

ఉ. ఒక్కొకమాఱు నీవు శుభయుక్తపరిసిద్ధిగ నిర్వికల్పతం
జొక్కక యింత లేక యతిచిత్రదయాదరశీల మెంతయున్
లెక్కకు నెక్కఁ గైకొనినలీలలు మాహృదయాంబుజంబులం
దక్కఁ గుపాస్తిచేసి ప్రమదంబు వహింతుము నిచ్చలున్ శివా!

వ. అని పెక్కుతెరంగులఁ బ్రస్తుతించిన విని శివుం డాదరించి మీ రార్తి నొంది వచ్చినకతం బేమి యనవుడు వనజాసనాదు లిట్లనిరి.

ఉ. దుగ్ధసముద్ర మేము ఘనదోర్బల మొప్ప మథించుచో నభో
దగ్ధరణప్రపూర్ణసముదీర్ణయుగాంత కృశానుభానుమ
ద్దుగ్ధరమై విషం బొకటి దుస్సహమై జనియించి సర్వమున్
దగ్ధము సేయఁజొచ్చె సముదగ్రతముగ్రకరాళకీలలన్.

ఉ. ఆవిషవహ్ని కోపక భయంపడి తన్మథనోద్యమంబునం
జేవయుఁ దక్కి యేము తలచీర యెఱుంగక పాఱుచుండఁగా
వావిరిఁ బోక నిల్చిన నవక్రసముద్ధతిఁ దచ్ఛిఖాచయం
బే వడి వానకాఁగవిసి యెంతయు విష్ణునిఁ జేసెఁ గృష్ణునిన్.

ఉ. కానఁ దదీయవర్షమునఁ గాలను బేలను లేక సత్కృపాం
భోనిధివైన నీశరణముం దగఁ బొందఁగ వచ్చినార మ
మ్లాన నిజప్రసాదగరిమంబు గరంబు దలిర్చుచున్న స
న్మానితసాదరేక్షణము మాపయి రూపుగఁ జాఁగ జూపవే!

క. విషధరకృతాంగభూషణ
విషమేక్షణ నీవ కాక విషధిజనితదు
ర్విషమవిషమ హాలాహల
విషభంజన మరయ నన్యవిషయమె చెపుమా!

గీ. వేయు నేఁటికి నేఁటికి విన్నవింప
కాలకాలా మహాభీలకాలకూట
శిఖి జగంబుల నెల్లఁ గ్రశించుచుండ
చిత్రగతి వచ్చి వేగ భంజింపవయ్య!

వ. అనిన విని భువనశంకరుండగు శంకరుం డందఱతోడ వెఱవకుండుం డని; అస్మదేకపరాయణుల నెన్నఁడు నాపదలు వొంద నేరవు. మిమ్ము నీయార్తికిం బాపి రక్షించెద. భక్తపోషణకౌశలంబున వీక్షించెద నమకుం గదలి.

మ. సరయపత్రిక్రియ మెప్ప వాహనపరిష్కారంబుల న్మించుశా
క్వరరాజోత్తము నెక్కి యాశివుఁడు దేవవ్రాతముం దాపసో
త్కరముం దాపససంఘముం గొలిచి రాఁగా వచ్చి యగ్రక్షితిన్
ఖరకాకోలముఁ గాంచె సర్వదహనాఖర్వజ్వాలజ్వాలముల్.

శా. ముల్లోకంబులు సంతసింప నఁట యమ్ముక్కంటి మిన్నంటియు
త్ఫుల్లోదగ్రత మండుచున్న గరళంబుం డాసి సరంభియై
యుల్లోలలీలఁ బూని పట్టె నతిసీలోద్భాసివిస్ఫూర్తిమై
నల్లోనేరెడుపండు వోలె నది యొప్పారంగఁ బాణిస్థలిన్.

గీ. పాండురాంగుండు నిజకరపాత్రికాల
కూటవిషమున నెంతయుఁ గోమరుమీఱె
గండశైలసమాసక్తకాలజలధ
రమునఁ జెలువైన రజతశైలమునుబోలె.

వ. తదనంతరంబు.

ఉ. ఎక్కువకంటి వేలుపు మునీంద్రసురేశ్వర దానవప్రభుల్
పెక్కువతోడ దేవ హర భీహర యోహర యంచు నందఱుం
గ్రక్కునఁ బ్రస్తుతింప నవగాఢవిజృంభణఁ గాలకూటముల్
గ్రక్కున మ్రింగె విశ్వముకుఁగాఁ బ్రమథోత్సవ మావహిల్లఁగాన్.

క. కర ముగ్రం బిది లోనికి
నరిగిన నుదరస్థభువనహాతి యగు ననుచున్
భరితకృపఁ గుత్తుకనయా
హరదేవుఁడు దాల్చె నెరయుహాలాహలముల్.

చ. వెలివిరిదమ్మి మొగ్గకడ వేడ్క వసించిన చంచరీకముల్
సలలితశంబపార్శ్వమునఁ జక్కఁగ నిల్చినయింద్రనీలముల్
వలనుగ గెల్చి మేచకనవప్రభతోడ మహేశకంధరా
స్థలి విలసిల్లె నవ్విషము చాల మనోహరలీల సత్త్రముల్.

శా. భ్రాంతి న్వీడ్కొనియె సమస్తదివిషత్ప్రత్యర్థిగణస్వాంతముల్
శాంతి న్బైకొనియె న్మునీశ్వరమనస్సంజాతసంతాపముల్
గ్లాంతిం బాసె వసుంధరాస్థలిగగనచక్రంబు లుద్యల్లజ్జమై
క్రాంతి న్మించెఁ గపర్ది యాక్రియ మహాకాకోలముం గ్రోలినన్.

వ. అంతఁ బద్మాక్షీపద్మగర్భులు ఫాలికీలితాంజలిసందర్భులగుచు ననిమిషముని దనుజనాయకులతోడ నాగరళకంధరునకుం బాదప్రణామంబు లాచరించి, యిట్లని విన్నవించిరి.

చ. యుగవిగమంబునం బ్రబలు నుగ్రతరజ్వాలనంబుఁబోలె బి
ట్టెగసి కరాళకీలముల నీహారిదంతర మెల్లఁ గప్పుచున్
జగములఁ గాల్చునిప్పటివిషంబు గుటుక్కున మ్రింగినట్టినీ
యగణితలీల నెట్లు గొనియాడఁగ నేర్తురు నీలకంధరా!

ఉ. వాలినయమ్మహాగరళవహ్నికి నోర్వఁగలేక నల్గడం
దూలి నిరంతరార్తిగతిఁ దొట్రిలి యున్నమముం దయారసా
స్ఫాలితవృత్తి వచ్చి యిటు చక్కఁగఁ ద్రావఁగ నీక చెల్లె నిన్
బోలినవేడ్క నెయ్యెడలనుం బొడఁగానము నీలకంధరా!

వ. అని మఱియు నానాప్రకారంబులం దన్నుం బ్రశంసించిన విన్ని యాశివుఁడు వారల నాదరించి, మీర లింక భయంపడవలదు; మథనంబునకు దొరకొనుండు; భవదభిమతంబులు దొరకొను నట్లు గావింతు ననవుడు, నెప్పటియట్ల యందఱుం గణంగి రాసమయంబున.

సీ. నవ్యవిభావిభ్రమవ్యాజితాదభ్ర
శరదభ్రమైన యుచ్చైశ్శ్రవంబు
లాలితకైలాసలీలాసముల్లాస
గుణవాసమగు సభ్రకుంజరంబు
సతతాశ్రితమనోపహార్ణవితరణాద్యశేషవర్ణ
నోదీర్ణమైన చింతోపలంబు

నిశ్చలసౌదామనీ వల్లికాభూమ
రుచిధాముగు నప్సరోగణంబు
ధానసంధాన విభ్రాజమానమైన
పారిజాతప్రముఖతరుపంచకంబు
గామదోహదకళాపరిసీమమైన
సురభియును నుద్భవించె నాశరధియందు

క. ప్రస్తుతరుచిదినమణి యగు
కౌస్తుభమణియును నితాంతకమనీయశ్రీ
నిస్తంద్రుం డగు చంద్రుఁడు
శస్తగతి న్మఱియు నందు సంభవ మొందెన్.

వ. తదనంతరంబ.

సీ. అలఁతితుమ్మెద లేల నిలిచియున్నవి యొకో
లోలత నలచంద్రమోల ననుచు
మరునిసింగిణు లేల సరిఁగూరినని యొకో
కేవలమగు జాలకేళి ననుచు
వజ్రపుష్పంబేల వలనొందినది యొకో
నలువారు నద్దంబు నడుమ ననుచు
కోకయుగంబేల కుదురుకొన్నది యొకో
కడు లేఁతతీఁగయగ్రమున ననుచు
రమణఁ గొనియాడఁ గురులు ఫాలమును బొమలు
నక్షియుగళంబు నాసయుఁ గ్రమముతోడ
నొప్పునిందిరయును జరారోగమరణ
హారిణియునైన సుదతియు నందుఁ బుట్టె.

వ. ఇట్లభిరామంబగు పదార్థస్తోమంబులు జన్మించినం జూచి విశ్వప్రభుం డగు నవ్విభుం డాదరంబున

సీ. తాళమానక్రియామేళనం బేపార
దైవతారావనాదము లెలర్ప
మంద్రమధ్యమతాళ మధురిమం బరుదార
గంధర్వగీతరాగములు చెలఁగ
మంగళోదారవాక్సంగమం బేపార
సిద్ధమునీంద్రు లాశీర్వదింప
వివిధాభినయకళావిసరణం బింపార
నప్సరస్స్త్రీలు నృత్యములు సలుప
నతులనవహారిసౌరభ్య మలరఁ గల్ప
తరులు గల్పప్రసూనాక్షతములు సల్ల
నిందిరాదేవి నవ్వారిజేక్షణునకుఁ
బెండ్లి సేయించెఁ గరము సంప్రీతితోడ.

వ. తదనంతరంబ యతనికి నలంకారార్థంబుగాఁ గౌస్తుభరత్నం బిచ్చి, అమృతం బమరులకు, నాసవం బసురులకునిచ్చి, సుధాకరు రావించి, పూర్వసరణి నిశాధిపుం గావించి యైరావణంబు నుచ్చైశ్శ్రవంబును నాదిగాఁ దక్కినవన్నియు నెప్పటియట్ల నిలింపపతి కలవరించి, యందఱ నిలువం బంచి, మరలి కైలాసంబున కరిగె నిమ్మార్గంబున.

క॥ పరగఁగ విషభక్షణ మను
పరమేశ్వరులీల భక్తిఁ బఠియించినఁ ద
త్పరతను వినినను వారికిఁ
బొరయవు దురితము లభీష్టములు సమకూడున్.

ఆ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవు డవధరించినట్టి లీల
యది దలిర్చుచుండు నవనిఁ జక్రవరిబా
నాహ్వాయంబు తోడ నంద మగుచు.

సముద్రమథనానంతరంబ రమాభారతీశ్వరులు మంథానధారాధరంబు గొనిచని యెప్పటిచోటన తిరంబుగా నిలిపి, సురాసురవీరుల వీడ్కొలిపిన నిజాలయంబులకు మరలి చని రానమయంబునం బులోమ శంబర ప్రభృతులగు దానవపతులు నిజగురుండగు భార్గవుఁ గాంచి నమస్కరించి యిట్లనిరి.

ఉ. తారును నేము నొక్కపరిఁ దర్చిచ్చితి మబ్ధి విశిష్టధర్మసం
చారులు నిర్జరుల్ మథనజాతములైన పదార్థముల్ మఱిన్
నేరుపుతోడ నన్నియును నెట్టన తామె పరిగ్రహించి యిం
పారుచు నేఁగినారు మఱి యానవ మొక్కఁరు నొల్లరాత్మలన్.

క. గలసిన సిరియును గొందురు
చలమతిఁ గనుతోడ నేము సంగరధరణిం
దలపడఁగ నోప మనియెడు
తలఁపు గలుగఁ బోలుఁ దగవు దప్పట యరయన్.

క. అవి పాలిండని వారిం
దవులం బనియేమి యిపుడ దాడిగఁ జని యా
దివిజతతిఁ దోలి యన్నియుఁ
దివుటం గొనివత్తు మేము తేజం బలరన్.

అనిన విని నయమార్గగుణానకుం డసురాధిపులం జూచి యిట్లనియె.

క. తత్తర మొప్పదు పసియెడ
నుత్తములకు ఘనవిచారయుక్తాత్ములకున్
జిత్తమున మెచ్చి లీలా
యత్తముగా లక్ష్మి కడుఁ బ్రియంబునఁ బొందున్

చ. ముదుసలి వారిఁ జేరిన సముజ్జ్వలరూపవిలాసలీలలన్
జదురగు కాంతవోలె ననిశంబును బాయక కోరు పం..
స్పదమును ముప్కరాత్మత విచారము సేయని మూఢు గావున
న్వదలరు పెద్దలెల్ల నయవృత్తని తాంతనిబద్ధభావముల్.

గీ. తవిలి సామభేదదానదండంబుల
సరవితోడఁ జలుపు చతురపురుషు
సిరి భజించుచుండుఁ జెలఁగిసోపానమా
ర్గమున వచ్చినట్టు రమణితోడ.

వ. అట్లు గావున బుద్ధిమంతుని నొక్కని నరసి తొలుత సిలింపులపాలికిఁ బంపుట కార్యంబు. వారలు మాత్సర్యంబున నీకుఁ బెనంగంబడిరేని కడిమిం దలపడి, సంగ్రామంబున గెలిచి, తత్పదార్థ స్తోమంబు నపహరింతముగాక యనుచు గురుండు పలుకు ననునయ వచనంబులకు నలరి యాదానవనాయకు లందఱు నొక్క కింకరుం బిలిచి, తగిన మాటలుగఱపిన వాఁడును నమరావతిపురికిం జని, కొలువులోపల నున్న సురేశ్వరునిం గని యిట్లనియె.

క. దనుజేంద్రులు తమమాఱుగ
నను నీకుం జెప్పుమనిన నయభాషణము
ల్వినిపింతు నేను నీవని
పనుపడఁగా వినఁగఁదగు సుపర్వగణేశా!

చ. శరనిధి మీరు మేము సదృశశ్రమయుక్తిన ద్రచ్చినార మం
దరుదుగఁ బుట్టినట్టి సుమహచ్ఛుభవస్తువులెల్ల మీర ని
ష్ఠురగతిఁ బుచ్చుకొంటి రది చూచినఁ బాడితెరంగె యందు నె
వ్వరు సహకర్మకర్మతుల వంచన సేయఁగ నుత్సహింతురే?

క. ఇంతటటనైను మా కవి
నంతసమునఁ బాలు తెండు చనియెదమటుగా
కెంతయు బంటుతనంబునఁ
బంతంబులు పలుకఁ దలఁచుభావం బైనన్.

శా. ధన్వారంభితశంక్రియాఘుమఘుమధ్వానంబు లాటోప మొం
దన్వర్ణ్యాన్యపదద్రధేభఘనయాధస్ఫీతసన్నాహమా
ర న్వాజిప్రకరోర్మిజృంభ మొదవ న్నతుశ్చమూమత్సరో
దన్వత్పూరము ముంచు నేఁడు రయసంధానంబుగా నాకమున్.

వ. అనిన విని విగతరోషవికారముఖుం డగుచు శతముఖుండు నసురదూత తోడ మునిశాపవశంబునం బడిన మాసొమ్ములు మథనకరణంబున -నుచితభంగిఁ బరిగ్రహించినారము. తమకు వానికిం బనియేమి! తారు మాకుం దొడఁగుట యీశ్వరాజ్ఞ నింతియు; యివ్విధంబు దలంపక రణంబున కంతఃకరణంబునఁ దలంచిరిగాక యే మనుచు వానికిం గట్ట నిచ్చి యనిపినం జనియె నంత నిక్కడ.

ఉ. ఆక్యము దప్పి యిట్టిగతి నాదితిజాధిపుఁ డాడినట్టిదు
ర్వాక్యము లన్నియు న్వినియ వారణ వారలఁ బోరఁ గెల్వఁగా
శక్యముగాదో యౌనో యని సన్మతిఁ జూచి మదించి సంశయా
ధిక్యముతోడ వాసవుఁడు దేవగురుం బిలిపించి యిట్లనెన్.

ఆ. అసురనాథు లబ్ధియం దుదయించిన
వరపదార్థసమితి వచ్చెఁ దమకుఁ
బా లటంచు దూతఁ బంపినా రింక నె
య్యది ప్రవర్తనీయ మనుడు సతేఁడు.

క. కడుదుర్మదు లసురేంద్రులు
విడువరు సామమునఁ జలము వేగమె భేదం
బొడఁబడదు వార లందఱుఁ
గడిఁదిమగ లనేకకార్యకర్తలు సగుటన్.

ఆ. దానకలన మన్న తలఁపంగ సమకూడ
దెట్లనినను వార లితరధనము
లొల్ల రబ్ధిలోన నుదయించినవి దక్క
నవియు మనము నిచ్చు టనుచితంబు.

క. కడపటియుపాయ మొకటియ
కడపటఁ జేయంగ వలయుఁ గర్జం బని లో
నొడుతు మని వారు వచ్చినఁ
బొడువుం డెదిరించి దైవమును దోడుపడున్.

వ. అనివిచారించుకొని రణంబునకు సన్నాహించి రంత రాక్షసనాథులు
సపారచతురంగబల సమేతులగుచుం గదలి నాకంబుమీఁద విడిసిరి.
నిర్జరలోకపాలురును జతుర్విధసేనాపరంపరలతోడ దృఢసమరశీలు
రగుచు నెదురు వేలంబు వెట్టి రట్టియెడ

సీ. మొఱయించునప్పుడు ముంగలివిండ్లల
యొసపరి మొరపంబు లురుములుగను
జళిపించునప్పుడు తళుకును నడివాల
మెలపడి మెఱుపులు మెఱుఁగులుగను
గమియించునప్పుడు క్రందుతావునఁ బడు
బెడిదంపుటడుగులు పిడుగులుగను
తగడించునప్పుడు తగుల మొందక చను
వాలంపకోలలు వానలుగను
నలఘురాక్షససేనగ్రీష్మావసాన
కాలసంభూతజీమూతజాలమనఁగ
పటుతరామరనివ్వ్రితీపప్రతాప
దవహుతాశను నణఁపఁ దత్పరత నరిగె.

ఉ. అంతట వజ్రియాదిగ దిశాధిపులందఱు నొక్కపెట్టదు
ద్ధాంత చతుఃప్రకార బలరాజ సమాజసముద్ధతిన్ భయం
బింతయులేక దుష్టదనుజేశ్వరవర్గముఁదాఁకి రోలిఁ గ
ల్పాంతము నప్పు డంబునిధియావలి నీరధిఁ దాఁకు చాడ్పునన్.

క. చలమున సురదానవబల
ములు లోపలబిరుసుఁ జందములు గల సుభటుల్
తలమీఁటి యెదిరి పోరికిఁ
దలపడిరి కరంబు బాహుదర్ప మెలర్పన్.

# ఉషాపరిణయము

పసపులేటి రంగాజమ్మ.

క॥ కలఁగుచు నుండెడివేళను
గలలోపలఁ గలసినట్టి కాంతుం డెదుటన్
సిలిచినయటువలెఁ దోఁపఁగ
పలుమఱు నెచ్చెలులతోడ భ్రమయుచుఁ బలికెన్.

సీ॥ అంతఃపురంబున కళుకక వచ్చిన
దిట్టను జూడరే తెఱవలార!
తన మాసధన మెల్ల మును గైకొనినయట్టి
చోరుని జూడరే సుదతులార!
పలుమాఱు మోవాని పలుగంటి చేసిన
జూఁటును జూడరే బోఁటులార!
చెక్కిలిఁ గొనగోరఁ జీరలు చేసిన
యీ ధూర్తుఁ జూడరే యింతులార!

తే॥ గీ॥ తొడలపై నుంచి పుక్కిటి విడె మొసఁగి
కళలఁ జొక్కించి మిక్కిలి గారవించి
కంతుకేళిని నను గూడ రంతుకాఁడు
ఎదుట నున్నాఁడు చూడరే ముదితలార!

సీ॥ జూఁటుకాఁ డగు వీఁడు జుణిఁగిపోవకయుండఁ
దోయజాక్షిరో! తల్పు మూయవమ్మ
కన్నగాఁ డగు వీఁడు కదలిపోవకయుండఁ
బడఁతి సందిట గ్రుచ్చి పట్టవమ్మ
వంచకుం డగు వీఁడు వదలిపోవకయుండఁ
జంచలాక్షిరో! యడ్డగించవమ్మ

దిట్టవై తగు వీఁడు తేలిపోవకయుండ
నతివ! పేరేమని యడుగుమమ్మ

తే॥ గీ॥ సారిది నలపోతుటేఁగకుఁ జొరఁగరాని
యిచ్చటికి నేఁటికి వేళ వచ్చితనుచు
మంచిమాటలచే వీనిమనసుతలఁపు
కలువకంటిరో! తేటగాఁ దెలియవమ్మ!

వ॥ అని మఱియు ని ట్లనియె.

సీ॥ కన్నెపాయముదానఁ గదిసి నా మోవిని
బలుగంటి సేతురా! భయము లేక
ఆటపాయముదాన నగడుగాఁ జన్నులఁ
గొనగోరు లుంతురా! కొంకు లేక
ముద్దరాలను నేను ముద్దుచెక్కిలి నొక్కి-
జీరలు సేతురా! చింత లేక
గోలను గాఁగిట గ్రుచ్చి నీ సరిపెన
గుఱుతులు నింతురా సరకులేక

తే॥ గీ॥ ...............................
...............................
...............................
...............................

సీ॥ పుక్కిటివిడె మిచ్చి బుజ్జగించిన నీకు
మో వీయనైతినా! మోహనాంగ!

కడిఁది ప్రేమను నన్ను కౌఁగిలించిన నిన్ను
గుబ్బల నొత్తనా! కోడెకాఁడ
చెక్కిలి నొక్కినఁ జెలరేఁగి సందిట
నెలవంక లుంచనా! నీటుకాఁడ
సమరతులను నన్ను సారెన వలయించ
నుపరతి సేయనా యొఱపుకాఁడ

తే॥ గీ॥ నేర మేమిర నా మీఁదఁ జేరి యింత
తామసించిన నింత తాళంగఁగలనె
కౌఁగి లీయర! నా సామిఁ గరుణ మీఱ
భావజున కొప్పగింతురా! ప్రాణనాథ!

సీ. అల చకోరము వెన్నె లతివ కిచ్చినయట్లు
మోవి యొసంగరా! మోహనాంగ!
చెలువ (తోఁ) గోకిల చెలఁగి పల్కినయట్లు
మాటాడరా! వేగ నీటుకాఁడ
హంస తామరతూఁడు నబల కిచ్చినరీతి
మణుఁపులు గోటి కీర! మన్నె రాయ!
జక్కవపెంటితో జతగూడినటువలె
రతి నేలరా నన్ను రంతుకాఁడ

తే. గీ. ననయు వాసనయును గూడి తనరినట్లు
లొప్పుమీఱిన యీ చల్వచప్పరమున
నలరు చౌసీతివగలచే ననఁగి పెనఁగి
కోర్కె లీడేర్చరా! నేఁడు కోడెకాఁడ!.

సీ. పొలఁతి యెవ్వతె చేరి బుద్ధులు చెప్పెనో
పలుమాఱు నేఁ బిల్వఁ బలుకవేమి
పూఁబోణి యెవ్వతె బోధించెనో నీకుఁ
బ్రేమఁ గౌఁగిటఁ జేర్చి పెనఁగవేమి ?
కోమ యెవ్వతె దయ లేకుండఁ జేసెనో
తీయని కెమ్మోవి యీయవేమి!
చెలువ యెవ్వతె నీదు చిత్తంబుఁ గలఁచెనో
చెక్కిలి ప్రేమతో నొక్కవేమి!
తే. గీ. ఎవ్వతె మరులు ఘుట్టించె నెనఁగ నీకు
నెయ్య మమరంగ నను జేరఁదియ్యవేమి!
భావజాకార నీ దైన భావ మేమి ?
తెలియఁ బల్కర నీ వింకఁ దేటగాను,

సీ. ప్రేమతోఁ జక్కర నెట్టి లాలించిన
చిలుకలె వెగటుగాఁ బలుకసాగె
నా మెలదోఁటలోనను వృద్ధిఁ బొందిన
యళులె ఝుంకృతుల నన్నలుకఁజేసె
నటన గుల్కంగ నే నడపించు నంచలె
ప్రతికూలగతు లయ్యె భావమునకుఁ
బూఁటపూఁటకు నీళ్ళుపోసి పోషించిన
లతికలె మరునమ్ములపొదులయ్యె
తే. గీ. పాములకుఁ బాలు పోసిన పగిది వింటి
నంత పెంచిన కనికర మింత లేక

పంత మలరంగ నేఁ డల పంచబాణుఁ
గూడి యారార ! నామీఁద దాడివచ్చె.

వ. అని యా దనుజరాజపుత్రి వనజాక్షిఁ జూచి యి ట్లనియె.

క. క్షీరాంబుధి జనియింపుచు
శ్రీరమణికి నన్న వగుచుఁ జెలఁగిన నీకన్
క్రూర మగు సెకలు చల్లుట
నా రుద్రునిశిరసుఁ జేరు నా వగనుసుమీ !.

వ. అని పల్కినయనంతరంబ యా బాణపుత్రి పంచబాణు నుద్దేశించి

క. చలికరువలి నెచ్చెలి వై
యెలమిన్ హాటితనయుఁ డనఁగ నిల నెగడిన యో
కలువలచెలిమేనల్లుఁడ !
చెలువల నిటు నేఁచ నీకుఁ జెల్లునె ? మదనా!.

తే॥ గీ॥ బాణునకు నోడి చనిన గీర్వాణు లెల్ల
మకరకేతన! నిను వేఁడ మచ్చరించి
చెలఁగి నామీఁద దాఁడి వచ్చినవిధంబె
తెలిసె తే కున్న నీ కింత ద్వేష మేల?

క॥ అని మదను మదనుబలముల
మనమున నిందించి మగువ మాటికి దూఱన్
విని నెచ్చెలు లందఱు నా
దనుజాధిపపుత్రిఁ జూచి తగ నని రెసమిన్

క॥ అల చిత్రరేఖ మనతోఁ
దెలిపినయటువంటి సప్తదినములు గడచెన్

దెలతెలవాఱఁగ వచ్చెను
గలఁగకు మిదె పటముఁ దెచ్చెఁ గమలదళాక్షీ

వ॥ అని నెచ్చెలులు చెప్పెడి యనూఱడించు సమయంబున

చ॥ పలుమఱు కాఁక నింపుచును
బాణసనూభవ సింత యోచఁగా
బలితనయుండు వేగఁ దన
పై నిఁక నెక్కడ దాడి వచ్చునో
చలమున నంచు వెల్లనగు
చందురుచందము చూచి మాటికిన్
వెలయఁగ నవ్వినట్టు లర
విందములున్ వికసించె నత్తఱిన్

చ॥ ఎనయఁగ నా యెడన్ దిరిగి
యా దనుజుల్ భయపెట్టు లోకముల్
మనుమని బ్రోవఁగా దనుజ
మర్దనుఁ డీడకు వచ్చి నిచ్చలున్
దనుజుల కిమ్మునంగితని
దండన సేయనో యంచు జారెనాఁ
జనియెను రాత్రి యంతటను
జక్క నసూరుఁడు తోఁచెఁ దూర్పునన్

చ॥ పురమున సాయకాసురుఁడు
భూరిబలంబున లెక్కసేయకే
హరివరశౌర్యుఁ డై యలరు

న య్యనిరుద్ధుని నడ్డగించినన్
దురుసగు వేయిబాహువులు
ద్రుంచు మటంచును బంప వచ్చు నా
హారికరచక్రిమో యనఁగ
నంబుజమిత్రుఁడు దోఁచె నంతటన్

వ॥ ఇట్లు సూర్యోదయం బైన యనంతరంబ యా యుషాక
న్యయు నొప్పుమీఱు నొక్క చలువచప్పరంబందుఁ గప్పుర
గంధులుం దానును గొలువై యుండి చిత్రరేఖరాక కెదురు
చూచు నెచ్చెలులతో ని ట్లనెను.

సీ॥ అలవిభుసామంబు నన్వయక్రమమును
నెన్నఁడు నే విన నిందువదన!
వానివమోరూపవర్వై భవంబులు
చూడ నెన్నఁడు నేను శోభనాంగి!
తలఁపున నొకనాఁడు తలఁచని ప్రియుఁ డేల
కలలోన వచ్చెనే కంబుకంఠి
కలగన్న వారికిఁ గాఁకలు రెట్టింప
వలపులు బుట్టునా వన్నెలాఁడి

తే॥ గీ॥ ఇట్టి విరహాంబునిధి దాఁట నేది తేప
చిత్రిరేఖయు రా దాయెఁ జెలిమిమీఱ
నేమి సేయుదుఁ దా నెవ్వ రింకఁదనకు
నిమిష మే డయి తోఁచెను నీరజాక్షి!

వ. అని యుషాకన్య పారంబు లేని విరహభారంబున నెచ్చెలు
లతోడ ముచ్చటలాడుచునుండె నంతకమున్న యక్కడ.

సీ. రాణించు లత్తుకరసమును సంకును
హాళిది కాటుక పచ్చ యాదినైన
వన్నియలను పైఁడిగిన్నియలను నించి
బాగుగా ఘటియించు పటమునందు
సారిదిబంతులు గాఁగ సూత్రముల్ హావణించి
జోకగాఁ గప్పన రేక దీర్చి
యమర నవయ్యొయెడలందు వన్నెలు నించి
యమరదైత్యాదిభావములు వెలయ

తే. గీ. వారివారికి నగు నలంకారములును
వారివారికిఁ దగునట్లు వస్త్రమాల్య
ములును గనుపట్టునట్లు నేర్పున లిఖించెఁ
జిత్రతరలేఖ యైన యా చిత్రరేఖ.

వ. ఇవ్విధంబున

సీ॥ ఆ సఖీమణి సప్తవాసరమ్ములలోన
నట్లన గీర్వాణయక్షవరుల
దనుజముఖ్యులను గంధర్వకిన్నరులను
మహిని బ్రసిద్ధులౌ మనుజపతుల
భావంబు మీఱ గొప్పపటంబునను వ్రాసి
యా పటంబును గొంచు నతిజవమున
నెప్పుడెప్పు డటంచు నెదురుచూచుచు మదిం
గలఁగుచుండెడు నుషాకన్యఁ జేరి

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ. డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

శ్రీ ఏచూరి సీతారామారావుగారు, బి. ఏ.,

---

రిపబ్లిక్ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.